శ్రీ మద్వేదాంతదేశిక ప్రణీత

# యతిరాజ సప్తతి

ఆంధ్ర 'చంద్రికా' వ్యాఖ్యాన సహితము
మరియు
శ్రీ రామానుజాచార్య విరచిత సంస్కృత వ్యాఖ్యాన సహితము



వ్యాఖ్యాత : **కె.వి. రాఘవాచార్యులు**

పరిష్కర్తలు : మహామహోపాధ్యాయ, కవిశాబ్దిక కేసరి, శాస్త్రరత్నాకర
ఉ.వే.శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారు

ప్రకాశకులు : శ్రీయుత మాదాడి కృష్ణారెడ్డి గారు
న్యాయవాదులు, కరీంనగర్, ఆంధ్రప్రదేశ్.

శ్రీ మద్వేదాంతదేశిక ప్రణీత

# యతిరాజ సప్తతి

ఆంధ్ర 'చంద్రికా' వ్యాఖ్యాన సహితము

మరియు

శ్రీ రామానుజాచార్య విరచిత సంస్కృత వ్యాఖ్యాన సహితము



వ్యాఖ్యాత : **కె.వి. రాఘవాచార్యులు**

పరిష్కర్తలు : మహామహోపాధ్యాయ, కవిశాబ్దిక కేసరి, శాస్త్రరత్నాకర
**ఉ.వే.శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారు**

ప్రకాశకులు : **శ్రీయుత మాదాడి కృష్ణారెడ్డి గారు**
న్యాయవాదులు, కరీంనగర్, ఆంధ్రప్రదేశ్.

**యతిరాజ సప్తతి - ఆంధ్ర 'చంద్రికా' వ్యాఖ్యాన సహితము**

వ్యాఖ్యాత : కె.వి. **రాఘవాచార్యులు**



**ప్రథమ ముద్రణ** : పార్థివ సంవత్సర భీష్మైకాదశి, ఫిబ్రవరి 8, 2006

**ప్రతులు** : 1000

**మూల్యము** : 75/-

**ప్రకాశకులు** : శ్రీయుత మాదాడి కృష్ణారెడ్డి గారు (అడ్వకేట్)

ప్రతులకు :

1. శ్రీ నిలయం, ఇ.నెం. 2-10-1181,
   జ్యోతినగర్, కరీంనగర్ - 505 002.
   ఫోన్ : 0878-2262036

2. శ్రీమాలోల గ్రంథమాల, శ్రీ అహోబిల మఠం,
   2-2-20/బి, దుర్గాబాయిదేశ్‌ముఖ్ కాలనీ,
   హైదరాబాదు - 500 013.
   ఫోన్ : 040-27423043

ముద్రణ :

**దీప్తి ప్రింటర్స్**

హనుమకొండ.



రామిడి నారాయణరెడ్డి - ప్రమీల

ముప్పిరితోట గ్రామమున మూర్తిగనిల్చిన వేంకటేశ్వరుం
డొప్పిన రీతి దివ్యముగ నుత్సవముల్ గురు ధర్మ బోధతో
నెప్పుడు చేయు దాసుడని యెంచిన రాఘవరెడ్డి పుత్రుడే
మెప్పుగచేసి విష్ణుపదమే కనెనౌ! 'దొర'యన్న నాతడే!

శ్రీ రామానుజ దాసుడు
నారాయణరెడ్డి నిత్య నైష్ఠికుడు, తదీ
యారాధనచే శ్రీమ
న్నారాయణ శ్రీపదార్చనమునందుండెన్॥

శ్రీమన్నారాయణ రామానుజయతిభ్యో నమః



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు
**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు**
వేద విశ్వవిద్యాలయ ప్రాంగణము
శ్రీరామనగరం, శంషాబాద్, హైదరాబాదు.

తేది : 10-9-2005

జయ శ్రీమన్నారాయణ

# మంగళాశాసనములు

శ్రీ వైష్ణవ సంప్రదాయాన్ని, విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని లోకంలో విస్తృతంగా ప్రవర్తింపజేసినవారు... భగవద్రామానుజులు. వేదములు ప్రతిపాదించిన భేద-అభేద శ్రుతులను, సగుణ-నిర్గుణ శ్రుతులను ఘటకశ్రుతుల ద్వారా సమన్వయపరచి బోధాయన మతానుసారముగా వీరు ప్రవర్తింపజేసిన విశిష్టాద్వైత సిద్ధాంతము సకలజన హితకరంగా విరాజిల్లుతోంది. సకల శ్రుతి సమ్మతమైన ఈ సిద్ధాంతానికి 'శ్రీరామానుజ దర్శన' మనే పేరును సాక్షాత్తు శ్రీరంగనాథుడే అనుగ్రహించినట్లు ఐతిహ్యము.

ఆర్షధర్మ ప్రతిష్ఠాపకులయిన ఆ భగవద్రామానుజులవారి వైభవాన్ని కీర్తిస్తూ శ్రీ వేదాంతదేశికులు అనుగ్రహించిన స్తుతియే... ఈ యతిరాజసప్తతి. శ్రీ దేశికులు తాము రచించిన శాస్త్ర, ప్రబంధ, కావ్య, స్తోత్ర, నాటకాది వాఙ్మయం ద్వారా శ్రీ రామానుజ దర్శనానికి పటిష్ఠమైన రక్షణ కవచాన్ని ఏర్పరచినారు. భగవద్రామానుజులు అనుగ్రహించిన శ్రీభాష్యానికి వ్యాఖ్యానరూపమగు శ్రుతప్రకాశికా గ్రంథాన్ని తురుష్కుల దాడి నుండి ప్రాణాలనొడ్డి కాపాడిన మహోపకారకులు వీరు. వీరికి భగవద్రామానుజుల వారిపై కల అచంచలమైన ప్రతిపత్తికి నిదర్శనమే... ఈ సప్తతి.

యతిరాజులయిన భగవద్రామానుజుల యొక్క వైభవాన్ని, వారు ప్రవర్తింపజేసిన శ్రీ వైష్ణవ సిద్ధాంత వైభవాన్ని ప్రకాశింపజేస్తున్న ఈ స్తోత్రరాజము

ప్రపన్నులందరికీ నిత్యానుసంధేయమై అలరారుచున్నది. విశిష్టాద్వైత సిద్ధాంత రహస్యాలతో, శ్రీ వైష్ణవ సంప్రదాయ విశేషాలతో నిండిన ఈ స్తోత్రానికి గతంలో శ్రీమాన్ 'ఆత్రేయ' రామానుజాచార్యస్వామి వారు సంస్కృతంలోనూ, శ్రీమాన్ సిన్నాము శ్రీరంగనాథాచార్య స్వామివారు మణిప్రవాళశైలిలోను, శ్రీమాన్ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామి వారు తమిళంలోనూ, శ్రీమాన్ డి. రామస్వామి అయ్యంగార్ ఆంగ్లంలోను వ్యాఖ్యాలను వెలయించినట్లు తెలుస్తోంది.

ప్రస్తుతం, శ్రీ 'ఆత్రేయ' రామానుజాచార్యస్వామి యొక్క సంస్కృత వ్యాఖ్యానాన్ని ఆధారంగా చేసుకుని శ్రీమాన్ కె.వి. రాఘవాచార్య స్వామివారు 'చంద్రికా' అనే పేరిట ఆంధ్రవ్యాఖ్యను విపులమైన, విస్పష్టమైన రీతిలో జిజ్ఞాసు లోకానికి అందిస్తున్నారు. గతంలో వీరు, వేదాన్త దేశికులు అనుగ్రహించిన శ్రీపాదుకాసహస్రమనే ఉద్గ్రంథానికి కూడ అపూర్వమైన రీతిలో విపులమైన వ్యాఖ్యానాన్ని అందించారు. వీరి సంప్రదాయసేవ ప్రశంసనీయము.

శ్రియః పతి యొక్క అనుగ్రహంతో వీరు ఇదే విధంగా మరిన్ని సంప్రదాయ గ్రంథాలను ఆంధ్ర లోకానికి అందిస్తూ సంప్రదాయ సేవను ఆచరించగలరని ఆశిస్తూ అనేకానేక మంగళాశాసనాలను చేస్తున్నాము.

శ్రీరామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతాం । అభివర్ధతామ్ ॥

**శ్రీమన్నారాయణ చిన్న జీయర్‌స్వామి**

శ్రీమతే రామానుజాయ నమః



మహామహోపాధ్యాయ, కవిశాబ్దికకేసరి,
శాస్త్రరత్నాకర, ఉభయవేదాన్త మహావిద్వాన్
**శ్రీ న.చ. రఘునాథాచార్యస్వామి వారు**
అధ్యక్షులు, సత్సంప్రదాయ పరిరక్షణసభ
వరంగల్లు.

# ప్రమోదావిష్కరణము

శ్రీ వేదాన్తదేశికులవారు శ్రీవైష్ణవ సంప్రదాయాచార్యులలో మూర్ధన్యులు. "రేఖామాత్రమపి.... న వ్యతీయుః" అన్నట్లు పరమవైదిక సంప్రదాయ పథము నుండి అణుమాత్రమైనను చలించక నిష్కళంక జీవితము సాగించిన ధన్యజీవులు. అసమానము అసామాన్యమునగు ప్రతిభా పాటవముతోవారు ప్రసాదించిన శాస్త్ర ప్రబన్ధములన్నియు భగవద్రామానుజ సిద్ధాన్తమునకు మహోన్నత ప్రాకారము వంటివి, వజ్రకవచము వంటివి. కవితార్కిక కేసరియైన వారు నిబద్ధించిన సర్వార్థసిద్ధి సహితమైన "తత్త్వముక్తాకలాపము" విశిష్టాద్వైత తత్త్వాన్ని సప్రమాణంగా దృఢతర యుక్తి ప్రయుక్తులతో నిర్ధారించిన మహోన్నత గ్రన్థం. అందులో నిర్ధారించిన విధంగా పదార్థతత్త్వాన్ని సుశిక్షిత పద్ధతిలో అధికరించిన విజ్ఞాని సర్వతంత్రస్వతంత్రుడై శుష్కోపన్యాస శిక్షా పటిమగల వైరివిద్వాంసుల మూర్ధభాగాలపై కుట్టాక క్రీడను నిర్వహించగల అష్టాపద కటకాన్ని తన వామపాదమునకు భూషణంగా ధరించగలడు. ఈ వాస్తవాన్ని శ్రీ దేశికులవారే తమ గ్రన్థాన్తంలో ఇలా తెలిపియున్నారు. చూడండి -

**శ్లో॥ స్యాదిత్థం శిక్షితార్థో య ఇహ యతిపతిచ్ఛాత్ర హస్తాగ్రనృత్య**
**న్నారాచన్యాసరేఖాసహచరితమతిః సర్వతంత్రస్వతంత్రః ।**
**శుష్కోపన్యాస శిక్షాపటిమ కటురటద్వైరి విద్వత్కరోటీ**
**కుట్టాకక్రీడం అష్టాపదకటకమసౌ వామపాదే బిభర్తు ॥**

స్తోత్రవాఙ్మయంలో వారి పాదుకాసహస్రం అనర్ఘరత్నం. భగవద్రామానుజులపై వారికి గల భక్తిభావం అసామాన్యం. వారు తమ హృదయ

కుహరంలో పొంగిపొరలుతున్న ఆ భక్తిసుధను యతిరాజసప్తతి అనే స్తోత్రమున ప్రౌఢపద్ధతిలో ఆవిష్కరించారు. "యతీశ్వర సరస్వతీ సురభితాశయానాం సతాం। వహామి చరణాంబుజం ప్రణతిశాలినామౌళినా॥' అని తాము సిద్ధాన్త నిర్వహణ సార్వభౌములైగూడా తమ వినీతభావాన్ని సాదరంగా ఆవిష్కరించుకున్న మహోదారులు వారు.

వివిధ విభాగాలలో శతాధికంగా వారు ప్రసాదించిన గ్రన్థములన్నీ సంస్కృత-ద్రవిడ భాషలలో వ్యాఖ్యాతములైనవి. వారి రచన సహజంగా నారికేళపాకమైనందున వ్యాఖ్యానాలు లేకపోతే సామాన్యులకు అర్థమయ్యేవి కావు. భాషా కాఠిన్యమున్నా మధురమై సారతమమైన తత్త్వం వాటిలో ఇమిడి యున్నందున అవి విద్వాంసులకు అవశ్యోపాదేయమైనవే. అనర్ఘమైన నిధిని వెలికి తీయటం కష్టసాధ్యమని చెప్పి, దానిని వదులుకునేవారుంటారా?

శ్రీ దేశికులవారి స్తోత్రవాఙ్మయాన్ని ఆన్ధ్రభాషలో వ్యాఖ్యానిస్తూ మహోపకారాన్ని చేస్తున్నారు శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యస్వామివారు. పాదుకా సహస్ర వ్యాఖ్యానంతోనే వీరి వైదుష్యం ప్రఖ్యాపితమైనది. అలాగే ఈ వ్యాఖ్య గూడా యథావసరంగా సంస్కృత శ్రుతి స్మృత్యాది ప్రమాణాలను, ఆళ్వారుల దివ్యప్రబన్ధ సూక్తులను ధారాళంగా ఉట్టంకిస్తూ ప్రామాణికతను సంతరించుకున్నది. నేను "కపర్దిమతకర్దమం" మొదలైన కొన్ని శ్లోకాలవద్ద గట్టి పట్టుగల శాస్త్ర విషయాలను ఎలా వివరించారో చూద్దామని పరిశీలించినాను. ఆయా మతాల సారాలను ఆవిష్కరించటంలో శ్రీ భాష్యకారులు చూపిన అతిగంభీర విషయాలను గూడ అవలీలగా వీరు వ్యాఖ్యలో ప్రదర్శించటం నాకు ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించింది.

75కు పైబడిన వయస్సులోగూడా విస్మృతి లేని వీరి ధారణాశక్తి ఇచట ప్రస్ఫుటమై నాకు ఆశ్చర్యప్రదమైనది. అకుంఠితమైన ఉత్సాహంతో బహుగ్రన్థ పరిశీలనం చేస్తూ అనేక సంప్రదాయ గ్రన్థాలను ఆవిష్కరిస్తున్న ఈ స్వామివారి అవిశ్రాంతమైన కృషికి అస్మాదృశులం స్వస్తివాచనం పలకటం తప్ప మరేం చేయగలం? సంస్కృత ప్రబన్ధాలపై శాస్త్రీయ ప్రమాణాలను ఎక్కడెక్కడి నుండియో తెచ్చి ప్రదర్శించే శ్రీ దేశికులవారి వైఖరి వీరికి బాగా అలవడ్డది అనుటలో అతిశయోక్తి లేదు. నిర్మత్సరంగా, హృదయపూర్వకంగా నేనీ మాటలు వ్రాస్తున్నాను.

వీరీ విధంగా చాలా ధన్యజీవులు. పవిత్ర సంప్రదాయ సేవలో వీరి జీవితం పరిణతమైంది.

విశేషమేమంటే - ఇట్టి వీరి రచనలు అముద్రితములై సుప్తప్రాయస్థితిలో నుండి పోకుండా వాటిని లోకానికి అందించటానికి ఉత్తమ కైంకర్యపరులైన శిష్యులు లభించటం జిజ్ఞాసువులైన పాఠకుల భాగ్యవిశేషమే ననక తప్పదు. వీరి శిష్యవర్గంలోనివారైన శ్రీమతి సౌ. సులోచనాదేవి - శ్రీ మాదాడి కృష్ణారెడ్డి (న్యాయవాది) దంపతులు గ్రన్థముద్రణకై తమ ధనాన్ని కైంకర్యబుద్ధితో అర్పించి పవిత్రం చేసుకోవటం అత్యన్త శ్లాఘనీయం. సత్కార్యానికి ద్రవ్యము వినియోగ పడినపుడే గదా సార్థక్యం. వీరిపై ఆచార్యకృప, భగవద్రామానుజుల దివ్య కటాక్షం, శ్రీ శ్రీనివాసుల దివ్యానుగ్రహం ముప్పిరిగా ప్రసరించాలని సమస్త సన్మంగళాలు కలగాలని ఆశిస్తున్నాను.

వ్యాఖ్యాతృస్వామివారికి అంజలిబన్ధం చేస్తూ సెలవు తీసుకుంటాను.

ఇట్లు

మహామహోపాధ్యాయ, కవిశాబ్దికకేసరి, శాస్త్రరత్నాకర

**శ్రీ న.చ. రఘునాథాచార్యులు**

సత్సంప్రదాయ పరిరక్షణ సభాధ్యక్షులు, వరంగల్లు

18-10-2005

శివనగర్, వరంగల్లు

శ్రీమతే రామానుజాయ నమః

ఉ.వే. విద్వాంసులు, మహావ్యాఖ్యాతలు
**డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు**
సాహిత్యోపన్యాసకులు
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాల, తిరుపతి

# హార్దాంజలి

**పుణ్యాంభోజ వికాసాయ పాపధ్వాంతక్షయాయచ ।**
**శ్రీమానావిరభూద్భూమౌ రామానుజదివాకరః ॥**

"ప్రత్యక్షే గురవఃస్తుత్యాః" అనే ప్రసిద్ధ సూక్తి ఆచార్యులు ప్రత్యక్షంలో కీర్తింపదగిన వారనే కర్తవ్యాన్ని బోధిస్తున్నది. "తస్మిన్ రామానుజార్యే గురురితిచ పదంభాతి, నాన్యత్ర" అని శ్లాఘింపబడే రీతిలో ఆచార్య శబ్దానికి ప్రధాన లక్ష్యభూతులైన భగవద్రామానుజులవారి వైభవాన్ని సర్వతోముఖంగా స్తుతించే, 74 విభిన్న వృత్తాల సమాహారమైన, శ్రీ దేశిక కవిసార్వభౌములచే అనుగ్రహింపబడిన స్తోత్రమే శ్రీ యతిరాజ సప్తతి. ఈ స్తుతికి సుగృహీత నామధేయులు, విద్వచ్ఛిరోమణులు, వ్యాఖ్యాతృ చక్రవర్తులు, శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యస్వామివారు సంతరించిన, సమగ్రమైన ఆంధ్ర చంద్రికాఖ్య వాఖ్య ఇప్పుడు ప్రచురింపబడడం అస్మదాదులభాగ్య విశేషం, భాగవత లోకానికి ఆనందదాయకం.

ఆచార్య వైభవాన్ని, ఆ ఆచార్యులు జీవించియుండగానే ప్రబంధరూపంలో మొదటగా సుశ్లోకించినవారు శ్రీ మధురకవులు. వీరు 'కణ్ణినుణ్ శిఱుత్తాంబు" అనే లఘుప్రబంధంగా తమ ఆచార్యులైన శ్రీ నమ్మాళ్వార్ల వైభవాన్ని ఉగ్గడించారు. ఇదేరీతిలో జగదాచార్యులైన శ్రీ రామానుజులవారి వైభవాన్ని, వారు జీవించి ఉండగానే, వారి సమకాలీనులు శ్రీరంగామృతకవి (తిరువరంగత్తముదనార్లు) "ఇరామానుశనూత్తందాది" అనే బృహత్ ప్రబంధంగా ప్రపంచించారు. మధురకవుల "కణ్ణినుణ్ శిఱుత్తాంబు" నాలాయిర దివ్యప్రబంధంలోని మొదటి సహస్రం "ముదలాయిరం"లో చివరి ప్రబంధంగా కూర్చబడగా "ఇరామానుశ నూత్తందాది" ఇయఱ్పా అనే తృతీయ సహస్రంలోని అంతిమ ప్రబంధంగా శ్రీరంగనాథుని దివ్యాజ్ఞచే చేర్చబడింది. భగవానుని మహిమను వర్ణించగలిగే కవివర్యులు శ్రీ శఠకోపులు మాత్రమే. ఆ ఆళ్వార్ల అప్రమేయ వైభవాన్ని కీర్తించగలిగే కవిశేఖరులు మధురకవులు ఒక్కరే. శ్రీ రామానుజుల దివ్య ప్రాభవాన్ని

నుతించగలిగే సమర్థులు తిరువరంగత్త ముదనార్లే, అంటూ పూర్వాచార్యులొకరు "శఠరిపురేక ఏవకమలాపతి దివ్యకవిః మధురకవి ర్యథాచ శఠజిన్ముని ముఖ్యకవిః, యతికుల పుంగవస్య భువి రంగ సుధా కవిరాట్" అని ప్రవచించారు.

శ్రీమానుజుల వారిని స్తుతించే కృతులు ఎన్నో వెలసినా, వానిలో శ్రీ దేశికులవారి శ్రీ యతిరాజసప్తతి, శ్రీ వరవరమునుల యతిరాజవింశతి అగ్రగణ్యాలు. తిరువరంగత్తముదనార్ల ఇరామానుశనూత్తందాది ప్రభావం ఈ రెండింటిపైన ఉన్నదని అభిజ్ఞులైన పూర్వాచార్యుల అభిప్రాయం. శ్రీ పిళ్ళైలోకమ్ జీయర్ ఇరామానుశనూత్తన్దాది వ్యాఖ్యలో పలు సందర్భాలలో శ్రీ యతిరాజ సప్తతి శ్లోకాలను, శ్రీ యతిరాజ వింశతి శ్లోకాలను భావ సంవాదాలకు నిదర్శనాలుగా ఉట్టంకించడం ఈ అంశానికి ప్రబలమైన ప్రమాణం.

శ్రీ యతిరాజసప్తతి విషయంలో ఈ అంశానికి సంబంధించి ఒకటి, రెండు ఉదాహరణలను సంగ్రహంగా విన్నపిస్తాను. "అడైయార్ కమలత్తలర్ మకళ్ కేళ్వన్" (33) అనే పాశురంలో తిరువరంగత్తముదనార్లు భగవద్రామానుజులను భగవానుని పంచాయుధాల అంశగా కీర్తించారు. ఈ భావాన్నే దేశికులు "వవృధే పంచభిరాయు ధైర్మురారేః" (12) అంటూ వెలిబుచ్చారు. పిళ్ళై లోకమ్ జీయర్ పైనూత్తన్దాది పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ -

"ప్రథయన్ విమతేషు తీక్ష్ణభావం
ప్రభురస్మత్పరిరక్షణే యతీంద్రః ।
అపృథన్ ప్రతిపన్నయన్ స్వయత్నైః
వవృధే పంచభిరాయుధైర్మురా రేః॥ (యతిరాజ సప్తతి 12)

ఎన్ఱు ఇవ్వర్థత్తై అభియుక్తరుమ్ అరుళిచ్చెయ్దారిఱే". అంటూ ఇచటి భావసంవాదాన్ని విశదీకరించారు. ఆవిధంగానే "కడలళవాయ్.. (59) అనే పాశుర భావాన్ని దృష్టిలో నుంచుకొని దేశికులు "నిరాలోకే లోకే" (56) అనే శ్లోకాన్ని రచించారనే విషయాన్ని పిళ్ళైలోకమ్ జీయర్ – "నిరాలోకేలోకే నిరుపధి పద స్నేహభరితో యతిక్ష్మాభృద్దీపో యది నకిల జాజ్వల్యత ఇహ। అహంకారధ్వాంతం విజహాతికథంకారమనఘాః కుతర్క వ్యాళౌఘుంకుమతిమత పాతాళకుహరమ్॥ ఎన్ఱు ఇవ్వర్థత్తై అభియుక్తరు మరుళిచ్చెయ్ దారిఱే" అనే వ్యాఖ్యాన సూక్తి ద్వారా తెలియజేశారు. ఇంకా ఈ రీతిలోనే "కూఱుశమ యఙ్గళాఱుమ్‌కులైయ" (46), "తర్కచ్చమణరుమ్" (99) అనే పాశురభావాలను అనుసరిస్తూ "గాథాతాథాగతానామ్" (70) అనే శ్లోకం రచింపబడినది అనేది స్పష్టం. (ఈ వివరాలన్నీ చంద్రికా కారులు కూడా వివరించారు) ఇటువంటి సంవాదాలు ఇంకా చాలా ఉన్నాయి.

ఈవిధంగా యతిరాజ సప్తతిని దేశికులు కొంతవరకు ఇరామానుశ నూత్తందాదిని అనుసరిస్తు రచించినా, ఇందులోని శ్లోకాలన్నీ అనర్ఘ రత్నాలు. ఇవి దేశికుల అద్వితీయ కవితా కౌశలానికి, అసాధారణ పాండితీగరిమకు అద్దం పడుతున్నాయి. దయాశతకంవలె ఈ స్తుతి వేర్వేరు వృత్తాలతో కూర్చబడినది అయినా, చిన్నవృత్తం అనుష్టుభ్‌తో ప్రారంభించి, పెద్ద వృత్తంతో పూర్తిచేసే ఆరోహణక్రమం అందులో గోచరించదు. అనుష్టుభ్, మంజుభాషిణి, ఔపచ్ఛందసికం, వంశస్థం, హరిణి, మందాక్రాంత, నర్కుటకం, పృథ్వి, శిఖరిణి, శార్దూల విక్రీడితం, స్రగ్ధర వంటి విభిన్న వృత్తాల సమాహారమై, శ్రీయతిరాజ పాదాబ్జాలను పరిష్కరించే అపూర్వ, అత్యద్భుత వాఙ్మాలిక ఈ స్తుతి.

మొదటి తొమ్మిది శ్లోకాలలో శ్రీ దేశికులు వరుసగా శ్రీధర, శ్రీదేవి, విష్వక్సేన, శఠకోప, నాథముని, పుండరీకాక్ష, శ్రీరామమిశ్ర, యామున, మహాపూర్ణులను స్తుతించడం ద్వారా గురుపరంపరను అవరోహణక్రమంలో అనుసంధించారు. తర్వాత పదవశ్లోకం నుంచి చివరి వరకు యతిరాజుల వైభవాన్ని విశ్వతోముఖంగా వివరించారు.

భగవద్రామానుజులను సూర్యునిగా, చంద్రునిగా, పర్వతంగా, చక్రవర్తిగా, చిత్రకారునిగా, రాజహంసగా, విషవైద్యునిగా, ఛాయావృక్షంగా, ఇంకా పలు విధాలుగా శ్లేష, విరోధాభాస, రూపకాద్యలంకార ప్రయోగాల ద్వారా రమణీయంగా వర్ణించారు. శ్రీ రామానుజుల దివ్య మంగళ విగ్రహ సౌందర్యాన్ని అభివర్ణించే సందర్భంలో, వారి వ్యాఖ్యాన ముద్రను ప్రస్తుతించడాన్ని బట్టి దేశికులు ఈ స్తుతిని తిరుమలక్షేత్రంలోని భగవద్రామానుజుల అర్చామూర్తిని దృష్టిలో పెట్టుకొని అనుగ్రహించారని కొందఱు పెద్దల అభిప్రాయం.

శ్రీ రామానుజులను విభిన్న రీతుల్లో వర్ణించే అంశాన్ని అనుసంధించే సందర్భంలో ఈ విషయం గమనించతగినది. శ్రీ దేశికులు 27వ శ్లోకంలో శ్రీ రామానుజుల వారిని అగ్ని సోమ సూర్యాత్మకులుగా వర్ణించారు. అహిర్బుధ్న్య సంహిత "సోమ సూర్య దహన ప్రభోజ్జ్వలం చక్రమేత దుదితమ్" అని, సుదర్శన శతకం "త్రేధా భిన్నస్యధామ్నః" అనేకాక, దేశికులు కూడా 'అభీతిస్తవం'లో "దహన సోమ సూర్యాత్మకమ్" అని, 'పరమత భంగం'లోని పాశురంలో "శికి యిరవి మదియ ముమిళ్ తేశున్ద" అని శ్రీ సుదర్శన భగవానుడు అగ్ని సోమ సూర్యాత్మకుడని కీర్తించారు. ప్రస్తుత శ్లోకంలో దేశికులు రామానుజులను దహన సోమసూర్యాత్మకులుగా కీర్తించడం ద్వారా వారి సుదర్శన రూపత్వాన్ని ధ్వనింపజేశారని భావించడంలో విప్రతిపత్తి ఉండదుకదా! పలురీతుల్లో శ్రీ రామానుజుల వారి దివ్యరూపాన్ని, వారి వాగ్వైభవాన్ని, వారి సిద్ధాన్త ప్రభావాన్ని దేశికులు విస్తృతంగా వర్ణించారు.

ఈ స్తుతిలో ప్రసక్తాను ప్రసక్తంగా భగవద్రామానుజుల జీవితానికి చెందిన పలు చారిత్రకాంశాలు, ఐతిహ్యాలు చోటుచేసికొన్నాయి. "కుదృష్టి కుహనాముఖేని పతతః పరబ్రహ్మణః కరగ్రహవిచక్షణో జయతి" అనే సూక్తి తిరుమలలోని భగవన్మూర్తి విష్ణు స్వరూపం కాదని వాదించేవారి కోలాహలాన్ని ఉపశమింపజేసి, ఆమూర్తి విష్ణుస్వరూపమేనన్న సత్యాన్ని నిరూపించిన వృత్తాంతం స్మారితం కాగా, 'ఉద్గృహ్ణాతీ ముపనిషత్సునిగూఢ మర్థం" అనే సూక్తి ఆ క్షేత్రంలోనే శ్రీరామానుజులవారు ఉపనిషదర్థ సమన్వయాన్ని ఉపన్యాసరూపంగా 'వేదార్థ సంగ్రహ'మనే గ్రంథంగా అనుగ్రహించిన ఉదంతాన్ని గుర్తుకు తెస్తున్నది. "అవరోపితవాన్ శ్రుతే రపార్థాన్" అనే ప్రయోగం యాదవప్రకాశుల వద్ద విద్యాభ్యాసం చేసేటప్పుడు రామానుజులవారు 'కప్యాస' శ్రుతికి యాదవ ప్రకాశులు తెలిపిన అపార్థాన్ని నిరాకరించి, యథార్థాన్ని తెలిపిన చారిత్రక ఘటనను గుర్తు చేస్తున్నది. 62వ శ్లోకంలోని "దత్తంయేన దయా సుధాంబు నిధినా పీత్వా విశుద్ధం పయః కాలేనః కరిశైల కృష్ణజలదః కాంక్షాధికం వర్షతి". అనే ప్రయోగం శ్రీ రామానుజులు శ్రీ వరదరాజస్వామికి, పెరుందేవి తాయార్లకు శాలబావి నుంచి తీర్థాన్ని సమర్పించడాన్ని, ఆ దివ్యదంపతుల దాహాన్ని తీర్చిన వృత్తాంతాన్ని గుర్తుకు తెస్తుంది. ఈ రీతిగా అనేక సంఘటనలను సూచించే సూక్తులు ఇంకా చాలా ఉన్నాయి.

దివ్యసూరి వాక్సుధారస గర్భితాలైన శ్లోకాలు ఎన్నో ఈ స్తుతిలో కన్పిస్తాయి. ఉదాహరణకు - "యతీశ్వర సరస్వతీ... తదన్య మత దుర్మద జ్వలిత చేతసాం వాదినాం శిరస్సుని హితం మయా పదమ దక్షిణం లక్ష్యతామ్" - అంటూ దేశికులు పల్కడం, భక్తాంఘ్రిరేణుసూరి 'తిరుమాలై' అనే దివ్యప్రబంధంలోని "నావలిట్టిళి తరుకిన్డోమ్ నమన్తమర్ తలైకళ్ మీదే" అనే సూక్తిని స్మరింపజేస్తున్నది. ఈవిధమైన సాత్త్వికాహంకారం దోషంకాదని, స్వరూపంలోకే చేరుతుందని కదా పెద్దల వివరణం. పెరియాళ్వార్లు సైతం "అభిమానతుంగన్ శెల్వనైప్పోల" అని అన్నారుకదా! ఈవిధమైన ధాటి "ఆశామతంగజ గణానవిషహ్యా... పరేషాంకర్ణే స ఏష కవితార్కిక సింహనాదః"- (72) అనే సూక్తిలో కూడా కన్పిస్తుంది. నాలాయిరంలోని "కణ్ణినుణ్ శిఱుత్తాంబ్బు" ప్రబంధం అష్టాక్షరిలోని 'నమ'శ్శబ్దార్థ తాత్పర్యాన్ని ప్రతిపాదిస్తున్నదని వ్యాఖ్యాతల అభిప్రాయం... "వాయ్‌త్త తిరుమందిరత్తిన్ మద్దిమమామ్ పదమ్ పోల్ శేర్త్త మదురకవి శెయ్‌కలైయై" అని కదా శ్రీమద్వర వరమునుల దివ్యవాక్కు. ఆచార్య వైభవాన్ని తెలిపే ఈ స్తుతి కూడా ఆ రీతిలోనే నమశ్శబ్దార్థ ప్రతిపాదక మని చెప్పడం యుక్తం కదా! కణ్ణినుణ్ శిఱుత్తాంబ్బులోని పాశురాల సంఖ్య 11 అయినట్లే, ఈ స్తుతిలోని శ్లోకాల సంఖ్య కూడా 74 (7+4=11)గా ఉండడం వేరొక విశేషం.

ఇక ఈ స్తోత్రంలోని అర్థగాంభీర్యం ఎంత గొప్పదో ఇదివరకే కొంత ప్రస్తుతమైనా "చాపలాయ ప్రచోదితః" అన్న రీతిలో దీనిలోని అర్థగౌరవాన్ని యత్కించిత్ విన్నపించాలనే చాపల్యంకొద్దీ ఒకటి, రెండు అంశాలను మాత్రం నివేదిస్తాను. "కమప్యాద్యం గురుంవందే" అనే ప్రప్రథమ శ్లోకంలో ఆది గురుపరంపరా క్రమం సంప్రదాయంలో భగవదాదిగానూ, భగవత్పర్యంతంగానూ అవరోహణ, ఆరోహణక్రమాలలో రెండు విధాలుగా ఉన్నది.

"అస్మత్ గురుభ్యోనమః" అని ప్రారంభమయ్యే వాక్య గురుపరంపర స్వాచార్యాది భగవత్పర్యంతం కాగా "లక్ష్మీనాథ సమారంభామ్" అని ప్రారంభమయ్యే శ్లోక గురుపరంపర స్వాచార్యపర్యంతంగా ఉన్నది. ఈ ఆరోహణ, అవరోహణ క్రమాలు రెండు "ఆచార్యాణా మసావసా విత్యాభగవత్తః, సచాచార్య వంశోజ్ఞేయః". అనే 'రహస్యామ్నాయ' సూక్తిలోని 'ఆజ్' ను బట్టి ఏర్పడ్డాయి. "ఆజన్మ శుద్ధానామ్" అన్నప్పుడు జన్మప్రభృతి అని "ఆనాక రథ వర్త్మనామ్" అన్నప్పుడు స్వర్గపర్యంతం అని 'ఆజ్'కు చెప్పే అర్థాలు రెండు "ఆ భగవత్తః" అన్నప్పుడు కూడా చెప్పవచ్చునుకదా! ఈ రెండు క్రమాల స్వారస్యాన్ని శ్రీ పిళ్ళైలోకమ్ జీయర్ 'లక్ష్మీనాథ సమారంభామ్' ఇత్యాది తనియన్ శ్లోక వ్యాఖ్యలో వివరిస్తూ "ఇప్పడి ఆరోహ, అవరోహ క్రమంగళాళిరణ్డాలుమ్ గురుపరంపరైయైయను సంధిక్కక్కుత్తైయిల్లై, ఈశ్వరస్యచ సౌహార్దమ్ - ఇత్యాదియాలే ఎమ్బెరుమాన్ శెయ్ద ఆచార్య సంబంధ పర్యంతమాన ఉపకార పరంపరైయై యనుసంధిత్తాల్ గురుపరంపరైక్కు త్తలైయాన వెమ్బెరుమానై పత్తవదుక్కుమ్. ఆత్మనో హ్యాతినీచస్య - ఇత్యాదియాలుమ్, నారాయణన్ తిరుమాల్ - ఇత్యాదియాలుమ్ ఆచార్యన్ పణ్ణిన భగవత్సంబంధ గౌరవత్తై యను సంధిత్తాల్ 'అస్మద్గురుభ్యోనమః" ఎన్ఱు ఆచార్యనై మున్దుఱ వను సంధిక్క వడుక్కుమ్" అని తెలిపారు.

శ్రీ పరాశర భట్టర్ 'శ్రీరంగ రాజస్తవం' - పూర్వశతకంలోని ప్రమేయం శ్రీ రంగనాథుని స్తుతి కాబట్టి, తదనుగుణంగా స్వాచార్యాది శ్రీధర పర్యంతక్రమం అనుసరిస్తే, దేశికులు ప్రస్తుత ప్రమేయం జగదాచార్య స్తవనం కనుక, తదనుగుణంగా శ్రీధరాదిక్రమాన్ని పాటించారు.

మూడవ శ్లోకంలో దేశికులవారు విష్వక్సేన స్తుతిచేస్తూ "యద్వేత్ర శిఖరస్పందే విశ్వమేతత్ వ్యవస్థితమ్" - అనే ప్రయోగంలోని విశ్వశబ్దం గమనింపదగినది. విష్వక్సేనుని బెత్తంచివర కదలికల్లో ఈ ప్రపంచం మనుగడ అంతా ఆధారపడి ఉన్నదని ఈ సూక్తిలోని భావం. ఇచటి విశ్వశబ్దంచేత కేవల చేతనా చేతనాలు మాత్రమేకాక, భగవానుడు కూడ చెప్పబడుతాడని చెప్పడంలో

కూడా కొంత స్వారస్యం ఉన్నది. తిరువాయ్ మొళి ప్రబంధంలోని "అరుళ్ పెరువార్" (10-6-1) అనే పాశురంలోని "అదునమదు విదివకైయే" అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ నంబిళ్ళై "తథాను జానంతముదార వీక్షణైః - ఇతుక్కు భట్టర్ తామే అరుళిచ్చెయ్య నాన్ కేట్టేన్ - ఎన్ఱు అరుళిచ్చెయ్‌వర్. శేనైముదలియార్ శట్టైయ్యుమ్, మయిర్ కట్టుమ్, కైయుమ్, పిరమ్బుమాయ్‌వన్దు పుకురప్పొక్కవాతే, నాయ్‌చ్చి మారుమ్ సింహాసనత్తి లొరుమూలై యిలే యొతుఙ్గ, తానుమ్ సవినయ మాక విరుక్కుమాయ్‌త్తు, వృద్ధ సామంతరై క్కణ్డ రాజాక్కళై ప్పోలే" - అని సరసంగా అనుగ్రహించిన వివరణాన్ని బట్టి, ఇచటి విశ్వశబ్దానికి పైన తెల్పిన రీతిలో అర్థం చెప్పడంలో ఔచిత్యం లేకపోలేదు కదా!

రసఘనమైన ఈ స్తుతికి పలు భాషలలో ఎన్నో వ్యాఖ్యలు వెలిసినవి. శ్రీ రామానుజార్య కృతమైన సంస్కృత వ్యాఖ్య, అజ్ఞాత కర్తృకమైన వేరొక సంస్కృత వ్యాఖ్యలతో పాటు, మణిప్రవాళ వ్యాఖ్యానం కూడా ఉన్నది. ఆంగ్ల భాషలో దయాశతకాది పలుస్తోత్రాలను వ్యాఖ్యానించిన శ్రీమాన్ డి. రామస్వామి అయ్యంగార్ ఆంగ్ల వ్యాఖ్యానం ఉన్నది. ఇవిగాక, సుప్రసిద్ధ విద్వాంసులు, మహామహోపాధ్యాయ బిరుదాంకితులు, కీర్తిమూర్తులు, ఉ.వే. శ్రీమాన్ నీలమేఘాచార్య స్వామి వారి విస్తృత వ్యాఖ్యానంతో పాటు, దాని అనువాదరూపమైన హిందీ వ్యాఖ్య ఉన్నవి. ఈ మధ్యనే అస్మన్మాతుల పాదులు ఉ.వే. శ్రీమాన్ కే.టి.టి. రామానుజాచార్య స్వామి (నెల్లూరు) వారి ఆంధ్ర టీకా తాత్పర్యాలు ప్రచురింపబడ్డాయి. ఇవన్నీ ఒక ఎత్తు, ఇపుడు ప్రచురింపబడిన చంద్రికా వ్యాఖ్యానం వేరొక ఎత్తు. పూర్వ వ్యాఖ్యానాలలోని విశేషాలను అన్నిటినీ పరిశీలించి, నిగ్గుతేల్చి, వానిని అందివ్వడమేకాక, తమ విశిష్ట ప్రతిభావ్యుత్పత్తులతో ఎన్నో అపూర్వాలైన విశేషాలను తమదైన శైలిలో హార్దంగా, ఆర్ద్రంగా భాగవత లోకానికి అందించిన ఉ.వే. శ్రీమాన్ రాఘవాచార్యస్వామి వారి ఉపకారానికి ప్రత్యుపకారం ఏమున్నది? "తలైయల్లాల్ కైమ్మాఱిలేన్" - అని నమ్మాళ్వార్లు పల్కిన రీతిలో వారి సన్నిధిలో సాష్టాంగ దండ సమర్పణ చేసి, హార్దాంజలిని ఘటించడంకంటే వేరొక ప్రత్యుపకృతి లేదుకదా! సుప్రసిద్ధ విద్వాంసులు, గురువర్యులు, మహామహోపాధ్యాయులు, శాస్త్ర రత్నాకర, కవిశాబ్దిక కేసరి, ఉ.వే.శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామి చరణులచే "సాహిత్య సంప్రదాయాలలో నిష్ణాతులైన శ్రీ కే.వి. రాఘవాచార్యులుగారు" అని ప్రశంసింపబడిన శ్రీ స్వామివారి సామర్థ్యానికి వేరొకరి ప్రమాణపత్రం అవసరం లేదు. పైగా, దాసునివంటి అల్పజ్ఞుల ప్రశస్తి "కట్టురైయాయ్ పుళ్ళైన్ద్ కాట్టుమాల్" అనేరీతిలో అన్వయిస్తుందికూడ. అయినా, దాసునిపై ఉండే అవ్యాజ, అపార

వాత్సల్య విశేషంవల్ల విజ్ఞాపనను చేసి క్రొమ్మన్న వారి ఆజ్ఞను కాదనలేక, ఈ సాహసాన్ని చేశాను. శ్రీ స్వామివారి వ్యాఖ్యాన వైచిత్రీ విశ్వరూపం వ్యాఖ్యలో అడుగడుగునా గోచరం అవుతున్నా "ఉపవీతిన మూర్ధ్వ పుండ్ర హస్తమ్", "గాథా తాథాగతానామ్" ఇత్యాది శ్లోకాల వ్యాఖ్యలలో మరింతగా విజృంభించింది. శ్రీరామానుజా చార్య కృతమైన సంస్కృత వ్యాఖ్యను కూడా చంద్రికావ్యాఖ్యతో చేర్చి ప్రచురించడం వేరొక విశేషం.

ఈ విధంగానే శ్రీమాన్ స్వామివారు చాలాకాలం 'పల్లాణ్డు పల్లాణ్డు'గా వేంచేసియుండి, ఇంకా మరిన్ని దేశిక కృతులను తమ రుచిర వ్యాఖ్యలతో పరిష్కరిస్తారని ఆశిస్తూ, వారిని వేడుకొంటూ, ఆరీతిలో వారిని అనుగ్రహించవలసినదిగా దాసుని శ్రేయోమూలకందమైన శ్రీనివాస ప్రభువు చరణారవిందాలలో, పెద్దల సన్నిధిలో ప్రార్థిస్తూ, దాసునకు ఈ అవకాశాన్ని అనుగ్రహించిన శ్రీమాన్ స్వామివారి సన్నిధిలో పరశ్శతంగా, కార్తజ్ఞ్య పూర్వకంగా ప్రణమిల్లుతున్నాను. శ్రీమాన్ రాఘవాచార్యస్వామివారి శిష్యరత్నమైన కీ.శే. రామిడి నారాయణరెడ్డి గారి దివ్య స్మృతికి చిహ్నంగా భగవద్రామానుజుల వైభవాన్ని కీర్తించే ఈ ప్రబంధాన్ని ముద్రించి ప్రకాశింపచేసిన శ్రీయుత మాదాడి కృష్ణారెడ్డి సులోచనాదేవి దంపతులకు భగవద్భాగవతాచార్యుల కృపచేత ఇతోధికంగా ఇహపరసుఖాలు కలుగాలని హార్దికాశీస్సుమనస్సులనర్పిస్తున్నాను. చివరగా నా ఈ విజ్ఞాపనలోని దోషాలను క్షమించవలసినదిగా వాత్సల్యమూర్తులైన సహృదయులను వేడుకొంటున్నాను.

కవితార్కిక సింహాయ కల్యాణగుణశాలినే ।
శ్రీమతే వేంకటేశాయ వేదాన్త గురవే నమః ॥

భవ్యా సహృదయ భోగ్యా
శ్రీరాఘవసూరివర్య రచితే యమ్ ।
యతిరాట్ సప్తతి వివృతి
ర్జయతుతరాం చంద్రికా నిత్యమ్॥

తిరుపతి
24-8-2005

ఇతి విజ్ఞాపయితా
ఈ.ఏ. శింగరాచార్యః



శ్రీ శోభ వైత్
శ్రీమతే రామానుజాయనమః
శ్రీ నిగమాన్తమహాదేశికాయనమః

# నమ్రనివేదనమ్

**శ్రీభాష్యం సకల శ్రుతి స్మృతిలసత్ సూత్రార్థ నిర్ణాయకం**
**సద్వర్ణాశ్రమ ధర్మిణాం పరపదం విష్ణుః పరంకారణమ్ ।**
**కల్యాణాఖిల సద్గుణః ఫలద ఇత్యర్థాన్ వివృణ్వత్పరం**
**వందే భాష్యకృతిం హరింయతిపతిం సిద్ధాన్త నిర్ధారకమ్ ॥**

శ్రీమన్నారాయణుడు పరమకారుణికుడు, సర్వశేషి. తనకు సహజ కైంకర్య విధులను నిర్వర్తించడం కోసం జీవులందరికి కరచరణాదులతో కూడిన విచిత్రమైన దేహసంపదను కృపజేశాడు. మనమెవరం? పరమాత్మ ఎవరు? ఆయనను పొందడానికి సులభమైన మార్గమేది? పరమాత్మానుభవమెలాంటిది? అనే విషయాలను తెలియజేసే గొప్ప దీపంలాంటి వేద రూపశాస్త్రాన్నీ అనుగ్రహించాడు. వివిధ దశలలో, దిశలలో 'అష్టాక్షరి, ద్వయం, చరమ శ్లోకం' అనే రహస్యత్రయాన్ని ఉపదేశించి చిదచిదీశ్వర తత్త్వాన్ని విశదపరచిన ప్రథమాచార్యుడు కూడా శ్రియః పతియే కదా!

**"పరత్వం వ్యూహ విభవాంతర్యామిత్వంతథైవచ ।**
**అర్చాచార్యావతాశాద్వా షాడ్విధ్యం మేప్రకీర్తితమ్ ॥**

నా పరిపూర్ణ స్వరూపం - పరం, వ్యూహం, విభవం, అంతర్యామి, అర్చారూపం, ఆచార్యావతారం అని - ఆరు విధాలుగా కీర్తింపబడుతున్నదని తన సేనాధిపతికి లక్షణంగా తెల్పినవాడూ లక్ష్మీనాథుడే.

"నాకస్య పృష్ఠిమభి సంవసానో వైష్ణవీం లోక ఇహ మాదయంతామ్" అనే శ్రుతిరీత్యా, సంసారబంధంలో చిక్కి అన్యథా జ్ఞానం, విపరీత జ్ఞానంచేత ప్రవర్తించే సమాజాన్ని విష్ణుభక్తిని కలిగించి తరింపజేయడానికి నిత్యసూరులను ఆళ్వార్లుగానూ, ఆచార్య పురుషులుగానూ అవతరింపజేసిన నియంత కూడా నీరధిజాదయితుడే.

భగవదాజ్ఞచే ఆదిశేషుడు రామానుజాచార్యులుగా అవతరించాడు.

రామానుజాచార్యులు యామునా చార్యులతో కలియ కూడదని సంకల్పించు కొన్నవాడు అర్చారూపియైన శ్రీరంగనాథుడు.

**"రామానుజోయామునశ్చ తావుభౌ మిళితౌయది ।**
**లీలావిభూతి రస్మాకం తదానష్టా భవిష్యతి ॥"**

రామానుజ, యామునార్యుల సమావేశమే జరిగితే లీలావిభూతియే (ఈలోకం) నిత్యవిభూతి (వైకుంఠం) అవుతుందనీ, తత్ఫలితంగా తన జగల్లీలా విలాసాదులకు హాని కలుగుతుందని శ్రీరంగనాథుడు, వీరు వారిని చేరకముందే, యామునార్యులను పరమపదానికి చేర్చుకొన్నాడు. రామానుజులచే జగదాచార్యత్వాన్ని విభూతి ద్వయాధికారాన్ని నిర్వహింపజేయదలచాడు.

1. భగవద్రామానుజులవారు శ్రియఃపతి మొదల్కొని ఆళ్వార్లకు, పూర్వాచార్యులకు సమ్మతమైన విశిష్టాద్వైత తత్త్వాన్ని పూర్ణ విశ్వాసంతో తెలుసుకొని అనుష్ఠానమందు ఉంచుకొన్నారు.
2. ఆ తత్త్వాన్ని సిద్ధాన్తీకరించే గ్రంథాలను నవరంధ్రాన్వితమైన దేహమందు బద్ధుడైన జీవాత్మకూ, జగత్పితయైన పరమాత్మకూ నవవిధ సంబంధాలున్నవని బోధించే తొమ్మిది గ్రంథాలను రచించారు.
3. తమ సిద్ధాంతాన్ని దిగంతాలకు వ్యాపింపజేయడానికి దేశ పర్యటనజేసి ఇతరమతాలను నిరసించి, స్వమతాన్ని స్థాపించారు.
4. విశిష్టాద్వైత సిద్ధాంతం చెదరక స్థిరంగా ఉండడానికి దేవాలయాలలో భగవదారాధనాద్యుత్సవ విధానాలను ఏర్పరచి, దేశంలో డెబ్బది నాల్గు మఠాలను స్థాపించి, ఉద్దండ పండితులైన శిష్యులను మఠసింహాసనాధిపతులుగా నియమించారు.

'పాణిని'కంటె ప్రాచీనాలైన, బాదరాయణుడనే వ్యాస మహర్షి రచించిన బ్రహ్మసూత్రాలకు కొందరు తమ తమ సిద్ధాంతాలకు అనుగుణంగా భాష్యాలను రచించారు.

1. శ్రీ శంకర భగవత్పాదులు (క్రీ.శ. 8 శతాబ్ది) తమకంటె ముందున్న మతవాదులను జయించి, తమ అద్వైత సిద్ధాంతానుగుణంగా 'శంకరభాష్యా'న్ని రచించారు.
2. భాస్కరాచార్యులు (10 శతాబ్ది) ఔపాధిక భేదాభేదమతానుసారంగా 'భాస్కర భాష్యా'న్ని రచించారు.
3. శ్రీమద్రామానుజాచార్యులు (11 శతాబ్ది) విశిష్టాద్వైత సిద్ధాంత పరమైన 'శ్రీభాష్యా'న్ని రచించారు.

4. నింబార్కాచార్యులు (12 శతాబ్ది) స్వాభావిక భేదాభేద మతపరంగా రచించిన భాష్యం "వేదాన్తపారిజాతసౌరభం".

5. శ్రీమధ్వాచార్యులు (13 శతాబ్ది) ద్వైత సిద్ధాంతానుగుణంగా "పూర్ణ ప్రజ్ఞ భాష్యం" రచించారు.

6. శ్రీ కంఠాచార్యులు (13 శతాబ్ది) శైవ విశిష్టాద్వైత మతపరమైన "శైవభాష్యం" రచించారు.

7. శ్రీపతి ఆచార్యులు (14 శతాబ్ది) వీరశైవ విశిష్టాద్వైతపరంగా "శ్రీకర భాష్యం" రచించారు.

8. వల్లభాచార్యులు (15 శతాబ్ది) శుద్ధాద్వైతపరమైన "అణుభాష్యం" రచించారు.

9. విజ్ఞాన భిక్షువు (17 శతాబ్ది) అవిభ ాద్వైతపరంగా "జ్ఞానామృత భాష్యా"న్ని రచించారు.

10. బలదేవుడు (18 శతాబ్ది) అచింత్య భేదాభేద మత పరమైన "గోవింద భాష్యం" రచించాడు.

ఈ పదుగురి భాష్యాలలో భగవద్రామానుజులవారు రచించిన 'శ్రీభాష్యం' బ్రహ్మసూత్రానుసారంగా వేదవేదాన్త శాస్త్ర పురాణేతిహాసాది ప్రమాణాలచేత 'విశిష్టాద్వైత' సిద్ధాంతాన్ని ప్రతిపాదించినందువల్ల - అగ్రగణ్యమై, ముముక్షువులకు మార్గదర్శకమై, దేశవిదేశ భాషలందు అనూదితమై విశ్వవ్యాప్తిని పొందినది.

"శ్రీమద్రామానుజ దర్శన' మనబడే విశిష్టాద్వైత సంప్రదాయమందున్న ముఖ్యాంశాలు : -

1. జగత్తు సత్యమైనది, నిత్యమైనదికాదు.
2. పరబ్రహ్మ అనబడే శ్రియఃపతి ప్రపంచానికి సర్వశేషి.
3. చేతనులు ఈశ్వరునికన్న భిన్నులు.
4. చేతనాచేతన వస్తువులన్నీ పరమాత్మకు శరీరాలు.
5. కర్మజ్ఞానాంగకమైన భక్తిచేతనే ముక్తిపరమపదమందు కలుగుతుంది.
6. పరమపదనాథుడైన శ్రియఃపతి అనుభవమే మోక్షం.

శ్రీ వేంకటేశ్వర ఘంటావతారులైన స్వామి వేదాన్త దేశికులవారు రచించిన శతాధిక గ్రంథాలలో విశిష్టాద్వైత సిద్ధాంతం ప్రబలంగా సమర్థింపబడింది.

1. "గురోః పాదాంబుజంధ్యాయేత్" - ఆచార్యుల పాదపద్మాల యందు మనస్సును లగ్నంచేసి ధ్యానించాలి.

2. "గురో ర్వాక్యాని శ్రావయేత్" - ఆచార్యుల శ్రీసూక్తులను శ్రద్ధతో సంస్మరించడమేకాక, ఇతరులకు ఆసక్తి జనకంగా వినిపించాలి.

3. "గురం ప్రకాశయేత్ ధీమాన్" - ఆచార్యుల నామరూపగుణ శీలాది వైభవాన్ని ప్రాజ్ఞుడు ప్రకాశింపజేయాలి.

4. "గురోరన్యం న భావయేత్"- స్వాచార్యులకంటె వేరొకరిని (మరొకరి మాటలను వింటే ఉభయభ్రష్టుడయ్యే అవకాశం ఉంటుంది, కాబట్టి) మనస్సులో చింతించరాదు. విషయాంతరాలను భావించకూడదని అర్థం.

**"నారాయణో౽పి వికృతిం యాతి గురోఃప్రచ్యుతస్య దుర్బుద్ధేః ।**
**కమలంజలాదపేతం శోషయతి రవిర్నతోషయతి ॥"**

ఆచార్యుల పాదపద్మాలే శరణమని వారి పాదాలను ఆశ్రయించని వ్యక్తిని చూస్తే, నీటి నుంచి వేరైపోయిన తామరపూవును సూర్యుడు శోషింపజేసే రీతిగా, దయామయుడైన సర్వేశ్వరుడు కూడా అనుగ్రహించడు.

"సహి విద్యాతస్తంజనయతి, తత్ శ్రేష్ఠంజన్మ, శరీరమేవ మాతాపితరౌ జనయతః" (ఆపస్తంబసూత్రం) శరీరాన్ని మాత్రం జన్మింపజేసేవారు తల్లిదండ్రులు. శ్రేష్ఠమైన జ్ఞాన జన్మను ప్రసాదించేవాడు గురువు - అని స్మృతి బోధిస్తున్నది. కాబట్టి, "దేవమివ ఆచార్యముపాసీత". గురువును దేవునివలె ఉపాసించాలి. "ఆచార్య దేవో భవ". ఆచార్యుడే దేవుడుగా కలవాడవై ఉండుము, అని వేదవాక్కులు నొక్కి చెబుతున్నాయి.

మనం, వంశపరంపరగా వస్తున్న ఆచార్యులను సమాశ్రయించినప్పటికీ, గురుభావం భగవత్స్వరూపులై, ఆచార్య పదానికి ముఖ్యార్థభూతులైన శ్రీమద్రామానుజయతి రాజులయందే సంక్రమిస్తుంది. "తాపఃపుండ్రస్తథా నామ *మంత్రో యాగస్తు పంచమః*"- అనే పంచ సంస్కారాలలో "రామానుజ దాసః" అనే మూడవదైన నామ సంస్కారానికి అర్థం ఈ సర్వ గురుభావనయే కదా!

శ్రీమద్రామానుజ సిద్ధాంత నిర్ధారణ సార్వభౌములని కీర్తిని పొందిన శ్రీ వేదాంత దేశికులు "యతిరాజ సప్తతి"ని రచించి ఆచార్య వైభవాన్ని అద్భుతంగా ఆవిష్కరించారు. ఈ స్తోత్రప్రబంధంలో 70+4 శ్లోకాలు వేర్వేరు ఛందస్సులలో రచింపబడి యున్నాయి.

మొదటి తొమ్మిది శ్లోకాలలో లక్ష్మీనాథుడు మొదల్కొని గురుపరంపరా వందన మాచరింపబడింది. తర్వాత దేశికులు యతిరాజులైన రామానుజుల

మూర్తిని (స్వరూప స్వభావాలను) వైభవంగా స్తుతించారు. యతీంద్రుల నాశ్రయించినవారి మహిమ హృద్యంగా వర్ణింపబడింది. క్రమంగా, శ్రీభాష్యకారుల శ్రీ సూక్తుల, ప్రబంధాల ప్రభావం వివిధ రీతుల ప్రశంసింప బడింది. యతిరాజులు జగత్తుకూ, పరబ్రహ్మకూ ఎలా ఉపకరించారో ఆయా శ్లోకాలను చదివి, సరస పదార్థాలను ఆస్వాదించిన వ్యక్తులకు, కాదంబరీ రసాన్ని ఆస్వాదించిన వారికి ఆహారం కూడా రుచించదన్నట్లు, ఇతర విషయాలు ఏమాత్రం రుచించవు కదా!

ఉపనిషత్తులకు మంగళ దీపంలాగా ఉన్న ఈ 'యతిరాజ సప్తతి' అనుసంధానం చేసే సాత్త్వికులకు ఉభయవిభూతులను కబళీకరించే ధిషణను కలుగజేస్తుందని చివరినాలుగు శ్లోకాలు చెవులకు చవులూరిస్తున్నాయి.

సరసాలంకార ధ్వని సజ్జితమైన 'యతిరాజ సప్తతి' ప్రబంధానికి తమిళ సంస్కృతాంగ్ల భాషల్లో వ్యాఖ్యానాలున్నాయి. కాని, తెలుగులో మాత్రం లేవని అందరికి తెలిసిన విషయమే. ఆ విధంగా తపనపడుతున్న దాసుని అల్పజ్ఞతను గమనించి అవ్యాజకృపాపూర్ణులైన డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు ఆంగ్ల వ్యాఖ్యానం గల వంద పేజీల జిరాక్స్ కాపిని, మరొక పక్షం రోజుల్లో సంస్కృత వ్యాఖ్యానం గల ప్రాచీన గ్రంథాన్ని సంపాదించి, శ్రమయనక స్వహస్తంతో డెబ్బది పుటలను వ్రాసిన ప్రతినీ, తిరుపతి నుంచి పోస్టు ద్వారా పంపి, దాసుణ్ని కృతార్థుణ్ని చేశారు. వాస్తవంగా నిత్యోత్సాహభరితులైన ఆ స్వామివారు దాసుణ్ణి అధమర్ణునిగా చేసుకొనకపోతే "చంద్రిక' లేకపోయేది.

సంతత భక్తజన సందోహ పరివృతులైన పరమహంస పరివ్రాజకులు, శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ జీయర్ స్వామివారు కృపతో మంగళాశాసనమనుగ్రహించారు. వారి దివ్యచరణ సన్నిధిలో సాష్టాంగ ప్రణామాలర్పిస్తున్నాను. నిర్హేతుక కృపతో ఈ వ్యాఖ్యను పరిశీలించి, తగిన సవరణలతో పరిష్కరించడమేకాక, 'ప్రమోదావిష్కరణ' రూప మంగళాశాసన మనుగ్రహించిన వాత్సల్యమూర్తులు, మహామహోపాధ్యాయ, కవిశాబ్దిక కేసరి, శాస్త్రరత్నాకర, ఉ.వే. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యస్వామి వారి సన్నిధిలో వినయపూర్వకంగా కృతజ్ఞతాంజలులను నివేదించుకొంటున్నాను. సర్వదా నన్ను ప్రోత్సహిస్తూ, అస్మచ్ఛ్రేయోభిలాషులైన విద్వద్వరులు, మహావ్యాఖ్యాతలు డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారి సన్నిధిలో పరశ్శత ప్రణామాలను సప్రశ్రయంగా సమర్పించుకొంటున్నాను. ఈ వ్యాఖ్యాన రచనను సముచితంగా ప్రోత్సహిస్తున్న సాహిత్య పరిశోధకులు, విమర్శకులు, సలక్షణ కవులు ఆచార్య డా॥ కోవెల సంపత్కుమారాచార్యుల (బావ) గారి సన్నిధిలో

నమఃపూర్వక కృతజ్ఞతలు. అభిప్రాయాలను సేకరించడానికి సహాయపడిన శ్రీ ఎ. ఉపేంద్రాచార్యులకు, శ్రీ బి. వేణుగోపాలాచార్యులకు హార్దిక నమస్సుమాంజలులు.

నా రచనా వ్యగ్రతకు సానుకూలంగా స్పందిస్తున్న చి॥ తమ్ములకు, తనయులకు అనేక మంగళాశాసనాలు. చరమ నిష్ఠాగరిష్ఠులుగా కీర్తిశేషులైన (ముప్పిరితోట) శ్రీ రామిడి నారాయణరెడ్డి గారి దివ్యస్మృతి చిహ్నంగా వారి పెద్ద కూతురు, అల్లుడు గారు ఒక గ్రంథాన్ని ముద్రింపదలచారు. కాబట్టి ఈ 'యతిరాజ సప్తతి' ప్రబంధాన్ని ప్రచురించిన ప్రపన్నులు, కరీంనగరవాసులు శ్రీమాన్ మాదాడి కృష్ణారెడ్డి, శ్రీమతి సులోచనాదేవీ దంపతులకు నారాయణరెడ్డి సంతానానికి భగవద్భాగవతాచార్యానుగ్రహం చేత ప్రేయఃశ్రేయస్సులు ప్రాప్తించాలని కృతానేక మంగళాశాసనాలు. అచ్చు తప్పులను సంస్కరించిన ప్రతులను హనుమకొండ శ్రీ డి.వి. శేషాచార్యులకు అందజేయడానికి సహకరించిన మ.రా.శ్రీ మాదాడి మాధవరెడ్డి గారికి, వారి కుటుంబానికి శుభాభ్యుదయికాశీస్సు మనస్సులు.

అచ్చుపనిలో నిర్విరామంగా సహకరించిన శ్రీమాన్ డి.వి. శేషాచార్య స్వామివారికి అనేకాభివందనాలు. అందంగా ముద్రించిన దీప్తి ప్రింటర్స్–వరంగల్ అధినేత శ్రీ ఎం. కృష్ణ, వారి సిబ్బందికి హార్దిక ధన్యవాదాలు.

స్వరూపోచిత వాచిక కైంకర్య రూపమైన 'చంద్రికా' రచనలో వినీతుడెంత వరకు కృతకృత్యుడయ్యాడో ఈ ప్రబంధాధ్యేతలే నిర్ణేతలు.

చకాస్త్వాచార్యకృపయా రాఘవాల్పజ్ఞకల్పితా ।
యతిరాట్ సప్తతే ర్వ్యాఖ్యా సతాంహృద్వ్యోమ్ని 'చంద్రికా' ॥

పార్థివ దీపావళి
1 నవంబర్, 2005

భాగవత చరణరేణువు
కె.వి. రాఘవాచార్యులు

C/o. శ్రీ కె.వి. రమణాచారి, I.A.S.
BH 3/6, IAS Qts,
Road No. 10, Banjara Hills,
Hyderabad - 500 034.
Ph : 040-23350258

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే నిగమాన్త మహాదేశికాయ నమః

# యతిరాజ సప్తతి

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కిక కేసరీ।
వేదాన్తాచార్య వర్యోమే సన్నిధత్తాం సదాహృది ॥

1. కమప్యాద్యం గురుంవందే కమలాగృహమేథినమ్ ।
ప్రవక్తా ఛందసాం వక్తా పంచరాత్రస్య యఃస్వయమ్ ॥

**అర్థం :** యః = ఏ దేవుడు; స్వయం = తానే; ఛందసాం = వేదాల యొక్క; వక్తా = అధ్యాపకుడో; పంచరాత్రస్య = పాంచరాత్ర శాస్త్రం యొక్క ప్రవక్తా = బోధకుడో; కం, అపి = అనిర్వచనీయుడైన; ఆద్యం = ప్రథముడైన; గురుం = ఆచార్యుడైన; కమలాగృహ మేధినం = (లక్ష్మి అనే భార్యతో కూడియుండే) శ్రియః పతినిగురించి; వందే = నమస్కరిస్తున్నాను.

**తాత్పర్యము :** ఏ దేవుడు వేదాలను ప్రవచించాడో, స్వయంగా శ్రీ పాంచరాత్రాగమాన్ని బోధించాడో, అట్టి అనిర్వచనీయుడైన, ఆదిగురువైన శ్రీనివాసునికి ప్రణమిల్లుతున్నాను.

**చంద్రికా వ్యాఖ్య :** గురునమస్క్రియా రూపమైన మంగళాచరణం.

శ్రీమన్నారాయణుడు జగత్తును సృజించడానికి సంకల్పించినప్పుడు అతని నాభి నుంచి కమలం పుట్టింది. దాని నుంచి చతుర్ముఖ బ్రహ్మ ఆవిర్భవించాడు.

**యన్నాభిజాతా దరవింద కోశాత్**
**బ్రహ్మా విరాసీ ద్యత ఏష లోకః**

అతనికి, అండాంతర్వర్తియైన దేవమనుష్యాది సృష్టిని చేసే జ్ఞానం కలుగడానికి, వేదాలను ఉపదేశించాడు శ్రీమన్నారాయణుడు.

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం**
**యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై**

విరించి వేదాలను కోల్పోయి కష్టపడుతున్నప్పుడు, మత్స్య, హంస, హయగ్రీవమూర్తులుగా అవతరించి, వేదాపహర్తలైన దైత్యులను శిక్షించి, వేదాలను ఉద్ధరించి మళ్ళీ అతనికే ఇచ్చి అనుగ్రహించిన ఆచార్యుడు శ్రియఃపతి.

"పీతక వాడై ప్పిరానార్ పిరమ కురువాకి" (పెరియాళ్వారిరుమొళి 5-2.8)

"పీతాంబరధరుడూ, ఉపకారకుడూ అయిన సర్వేశ్వరుడు బ్రహ్మదేవునికి ఆచార్యుడై" అని శ్రీ విష్ణుచిత్తుల శ్రీసూక్తి.

"పరిముక మాయ్ఇశైకొళ్ వేదనూల్ ఎన్నుఇవైపయన్దనవే" (పెరియ తిరుమొళి 5-3.2) అనే తిరుమంగైయాళ్వార్ల శ్రీసూక్తి వ్యాఖ్యలో పెరియవాచ్చాన్ పిళ్ళై "తన్నైత్తాళ్ విట్టు హయగ్రీవనాయ్ నిన్ఱాయిత్తు ఉపదేశిత్తదు, సారథియాయ్ నిన్ఱు ఉపదేశిత్తాప్పోలే యాయిత్తు".

'భగవానుడు తనను తక్కువ చేసుకొని హయగ్రీవుడై ఉపదేశించడం, సారథియై గీతను ఉపదేశించినట్లే అయింది' - అని జ్ఞాన ప్రదానావతార స్థాయిని వివరించారు. అలాగే 'తిరునెడున్దాణ్డక' ప్రబంధంలోని "అన్నమాయ్" (30) అనే సూక్తిని "అపౌరుషేయత్వం కులైయాదపడి హంసరూపియాయ్ ఆరుమఱైయై వెళిప్పదుత్తినాయ్". 'వేదం యొక్క అపౌరుషేయత్వానికి భంగం కలుగకుండడం కోసమే శ్రీమన్నారాయణుడు హంసరూపాన్ని దాల్చాడు' అని వారే వ్యాఖ్యానించారు.

అంతేకాదు. నరనారాయణ రూపాలను దాల్చినప్పుడు సర్వేశ్వరుడు తానే 'నరుడు' అనే శిష్యావతారుడై, నారాయణుడైన తానే ఆచార్యావతారమెత్తుకొని తిరుమంత్రాన్ని బయల్పరచాడు. "తానే శిష్యనుమాయ్, ఆచార్యనుమాయ్ నిన్ఱు తిరుమంత్రత్తైవెళి యిట్టరుళినాన్" (ముముక్షుప్పడి) అని పరమకారుణికులైన పిళ్ళైలోకాచార్యులు విశదీకరించారు. " స ఏష పూర్వేషామపి గురుః కాలేనా నవచ్ఛేదాత్" (యోగదర్శనమ్ 1-26) సృష్ట్యారంభంలో అగ్ని, వాయురాది

త్యాంగీరసులనే ఋషులకు" వేదాలనూ, వేదార్థాలనూ ఉపదేశించడం వల్ల నాటికీ నేటికీ సర్వేశ్వరునికి "గురు" వనే నామం కలిగిందని పతంజలి మహర్షి శిష్యులకు బోధించాడు.

"వక్తా పంచరాత్రస్యయః స్వయమ్" - సాక్షాత్తుగా భగవన్ముఖోద్గతమైనది పాంచరాత్ర శాస్త్రం. "పాంచరాత్రస్య కృత్స్నస్య వక్తా నారాయణః స్వయమ్" అనీ, అది "సాక్షాత్ భగవద్వక్త్రనిస్సృతమ్" అనీ విఖ్యాతిగాంచింది.

"శ్రీ, శేష, శేషాశన, పద్మగర్భ, సేనేశేభ్యః పంచభ్యః పంచభీరాత్రి భిః ని ర్వ్యాఢోఽస్య ఉపదేశ ఇతి 'పాంచరాత్ర' మితి వ్యుత్పత్తి రన్వర్థా". లక్ష్మీదేవికి, శేషునికి, శేషాశనునికి, పద్మగర్భునికి, విష్వక్సేనునుకి - ఈ ఐదుగురికి - ఐదు అహోరాత్రాలు ఉపదేశింపబడినందువల్ల ఈ శాస్త్రానికి 'పాంచరాత్ర' మని పేరు ఏర్పడింది. దీనికే 'ఏకాయన' మనీ, 'భగవచ్ఛాస్త్ర' మనీ, 'దివ్యాగమ' మనీ పేర్లున్నాయి. రామాయణ, భారత, భాగవతాలలో 'పాంచరాత్రం' పేర్కొనబడింది.

శ్రీ యామునాచార్యులు రచించిన 'ఆగమప్రామాణ్య' మనే గ్రంథంలో దీని ప్రాశస్త్యం ప్రకటింపబడింది. భగవద్రామానుజులు శ్రీ భాష్యంలో దీని వైశిష్ట్యాన్ని బహుభంగుల ప్రస్తుతించారు. వేదాంత దేశికులు "పాంచరాత్ర రక్ష" అనే పేరుతో ఒక గ్రంథాన్నే రచించారు.

ఈ శ్లోకంలో మొట్టమొదట "కం, అపి" అనే మాట ప్రయోగింపబడింది. అది 'మాటలకు అందని అనంత మహిమను కలవాడు' అనే అర్థాన్ని తెల్పుతుంది. తర్వాత భగవానుడే "ఆదిగురువు, శ్రియఃపతి, ఛందః ప్రవక్త, పాంచరాత్రశాస్త్రోపదేష్ట" అని ముఖ్యమైన నాలుగు అంశాలు ప్రకటింప బడినాయి. దేశికులవారు దయాశతకంలో 'సర్వలోక విలక్షణుడూ, కరుణావరుణా లయుడైన శ్రీనివాసుని' గూర్చి "కమప్యనవధిం వందే" (9) అని ప్రస్తుతించారు. ఇక్కడ 'కమప్యాద్యం గురుం వందే" అని స్తుతించారు.

భగవద్రామానుజులవారు "బ్రహ్మణి శ్రీనివాసే" అని పరబ్రహ్మను శ్రీనివాసునిగా భావించారు కదా! "ఇరామానుశనూత్తందాది" లో మొదట "పూమన్నుమాదు పొరుందియ మార్బన్"- 'కమల వాసినియైన లక్ష్మీదేవిచే

స్వయం గ్రహాశ్లిష్టమైన వక్షఃస్థలంతో విరాజిల్లేవాడు' అని శ్రియఃపతినే అనుసంధించారు శ్రీ తిరువరంగత్తముదనార్. మణవాళమామునులు తమ 'యతిరాజవింశతి' లో "శ్రీ మాధవాంఘ్రి జలజ ద్వయ నిత్యసేవా" అని మొదటస్తోత్రం చేశారు.

**కమలాగృహమేథినమ్ :** గృహస్థునికి గృహిణి ఉంటేనే కుటుంబ యోగక్షేమాలు చక్కగా సాగుతాయి. జగత్కుటుంబియైన సర్వేశ్వరునికి లక్ష్మీదేవి ఉన్నందువల్లనే - దివ్యదంపతుల నిత్యయోగంతోనే - ప్రపంచయోగక్షేమాలు అద్భుతంగా నిర్వహింపబడుతుంటాయి అని సూచితం.

"ఒండొడియాళ్ తిరుమగళుమ్ నీయుమేని లానిఱ్ప" - 'మెరిసే కంకణాలు గల లక్ష్మీదేవి, నీవు కలిసియుండగా' అన్నట్లు "భవాంస్తు సహవైదేహ్యా - అహంసర్వంకరిష్యామి" - 'నీవు సీతాదేవితో కూడియున్నప్పుడు - నేను సమస్తకైంకర్యాలను (సేవలను) చేస్తాను' అని లక్ష్మణస్వామి ప్రార్థించినట్లు, నిత్యదంపతులైన లక్ష్మీనారాయణులకు సేవచేయడమే జీవుని స్వరూప యోగ్యత కదా!

కవితార్కిక సింహ, సర్వతంత్ర స్వతంత్ర, వేదాన్తాచార్య బిరుదాంచితులైన శ్రీ మద్వేంకటనాథాఖ్య దేశికులు జగదుజ్జీవనకరులైన శ్రీమద్రామానుజాచార్య యతీంద్రులను భక్తితో స్తుతించిన ప్రబంధమే ఈ "యతిరాజ సప్తతి".

'సప్తతి' అంటే (70) డెబ్బయి. నాలుగు (4) శ్లోకాలు ఫలశ్రుతి. మొత్తం (74) డెబ్బై నాలుగు శ్లోకాలున్నస్తోత్రప్రబంధమిది. దీనిలో మొదట గురుపరం పరా వందన రూపంగా పది (10) శ్లోకాలున్నాయి.

"సచ ఆచార్యవంశోజ్ఞేయో భవత్యాచార్యాణా మసావసా విత్యా భగవత్తః" అని శ్రుతి (రహస్యామ్నాయః).

"వేదం వల్లార్కళైక్కొణ్డు విణ్ణోర్ పెరుమాన్ తిరుప్పాదం పణిన్దు". (తి.వా.మొళి 4-6-8)" వేదవిదులైన ఆచార్యులను పురస్కరించుకొని పరమ పదనాథుని పాదాలను ఆశ్రయించి" అని అర్థం.

**భగవద్వందనం కార్యం గురువందన పూర్వకమ్ ।**
**క్షీరం శర్కరయా యుక్తం స్వదతే హి విశేషతః ॥**

"స్వాచార్య వందన పూర్వకంగా భగవంతుని వందనమాచరించాలి. చక్కెరతో కూడిన పాలు బాగా రుచిస్తాయి కదా!" అని అర్థం.

'అస్మత్ గురుభ్యోనమః' మొదల్కొని 'శ్రీధరాయ నమః' అని చివరకు అనుసంధింపబడేవాడు శ్రియఃపతి. నిరపాయమైన సంప్రదాయమిదేకదా! మరి ఈ స్తోత్రప్రబంధంలో గురుపరంపరావందనాన్ని "కవి తార్కిక కేసరి" శ్రియః పతి నుంచి ఆరంభించారేమిటి? అంటే ప్రప్రథమంగా, పరమార్థ చరమార్థ ప్రదాతయైన పద్మనాభుడుతత్త్వోపదేష్ట.

**యోగజ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాది కర్మచ।**
**వేదాః శాస్త్రాణి విజ్ఞానం, ఏ తత్సర్వం జనార్దనాత్ ॥**

అన్నట్లు సకలశాస్త్ర ప్రవర్తకుడూ పరమాత్ముడే కదా! అంతేకాదు; ఆయన "తత్త్వాన్యప్యుపదేష్టు ముత్తమ గురూన్ దత్వాఽనుగృహ్ణాతి నః" అన్నట్లు పాడుగుంటలో పడి పరితపిస్తున్న ప్రజలకు తత్త్వోపదేశం చేయడానికి కృపామాత్ర ప్రసన్నాచార్యులనూ ప్రసాదిస్తున్నాడు. ఆయనే గురుపరంపరానాయకుడు. తాను ముందు నడిచి, తక్కిన వారిని నడిపించేవాడు నాయకుడు కదా! కాబట్టి ఉపదేశప్రాథమ్యం వల్లనూ, స్వాచార్యోపకారకత్వం వల్లనూ, ఉభయ విభూతి నాయకత్వాతిశయం వల్లనూ, ప్రథమ గురు నమస్కారం ప్రథమంగా చేశారు శ్రీమద్వేంకటనాథార్యులు.

"అతత్త్వేభ్యః ఆరాత్ దూరం యాతిబుద్ధిః యస్యసః = ఆర్యః" తత్త్వరహిత విషయాల నుంచి ఎవని బుద్ధి దూరంగా ఉంటుందో అతడు ఆర్యుడు లేదా, "తత్త్వేభ్యః ఆరాత్ సమీపేయాతి బుద్ధిః యస్యసః = ఆర్యః". తత్త్వ విషయాలకు ఎవని బుద్ధి దగ్గరగా ఉంటుందో అతడు ఆర్యుడు, అని వ్యుత్పత్త్యర్థం.

సంశయ విపర్యయాది దోషం లేశమైనా లేని జ్ఞానాన్నీ, నిర్దుష్టమైన ఆచరణనూ కల్గిన వారే ఆర్య శబ్ద వాచ్యులని విశదమవుతున్నది.

భగవద్రామానుజుల వారికి కుడిభుజంగా నిల్చినవారూ, జ్ఞాన భక్తివైరాగ్య సంపన్నులూ అయినా శ్రీవత్సాంక మిశ్రుల సూక్తులు "య దుక్తయస్త్రయీ కంఠే యాంతి మంగళ సూత్రతామ్" – 'శ్రుతికాంత గళంలో మంగళ సూత్రాలైనాయి' అని వారి పుత్రరత్నమైన శ్రీ పరాశరభట్టార్యులే ఆనతిచ్చారు కదా!

ఆ శ్రీ వత్సాంక మిశ్రులు (కూరత్తాళ్వాన్) గురుపరంపరా ప్రారంభంలో

**లక్ష్మీనాథ సమారంభాం, నాథయామున మధ్యమామ్ ।**
**అస్మదాచార్య పర్యంతాం, వందే గురుపరం పరామ్ ॥**

అని కీర్తించారు.

శ్రీ వైకుంఠంలో సర్వేశ్వరుని వద్ద మొట్టమొదట ద్వయ మంత్రాదులను ఉపదేశం పొందింది లక్ష్మీదేవి. ఆమె తన పుత్రప్రాయులైన వారికి తానే ఉపదేశించినందువల్లనూ, భగవంతునితో అనన్య కావడం వల్లనూ, నిరుపాధిక మంగళదేవత కాబట్టి ఆమె చేత భగవంతునికి స్వరూప సత్త కలిగినందువల్లనూ, ఆమెను కూడా చేర్చి "లక్ష్మీనాథ" అని అనుసంధించారు. లక్ష్మీనాథుడు, లక్ష్మీదేవి, విష్వక్సేనుడు, శ్రీ శఠకోపసూరి, శ్రీమన్నాథమునులు, శ్రీ పుండరీకాక్షులు, శ్రీరామమిశ్రులు, శ్రీమద్యామునమునులు, శ్రీ పరాంకుశదాసులు (పెరియనంబి), శ్రీ మద్రామానుజులు అని గురుపరంపరాక్రమం. ఈ ఆచార్యముక్తాహారంలో నాయకమణి స్థానాన్ని శ్రీమన్నాథమునులు, వీరి పౌత్రరత్నమైన శ్రీమద్యామునులు అలంకరింపదగిన వారు కాబట్టి "నాథయామున మధ్యమాం" అని కీర్తించారు. ఇలాగా సుశ్లోకించిన వారికి 'శ్రీమద్రామానుజయతిరాజులే' సాక్షాదాచార్యులైనందువల్ల "అస్మదాచార్య పర్యంతాం" అని అనుసంధించారు. "రామానుజార్య పర్యంతాం" అనలేదు. విశేషమేమి? అంటే భూత భవిష్యద్వర్తమాన కాలికులైన శ్రీ వైష్ణవులకందరికి నిరుపాధికాచార్యావతంసులు శ్రీ రామానుజల వారే అయినందువల్ల, ఆచార్య పురుషులందరూ అంతట 'అస్మదాచార్య' అని నిరుప పదబోధ్యులవుతారనే పరమార్థముంది.

ఈ క్రమాన్ని బట్టి, ఆద్యగురువైన 'కమలాగృహమేధి' మొదట నంతవ్యుడు. పైన చూపిన శ్రుతి వల్ల, గురుపరంపరావందనం అవశ్యమాచరణీయ మనీ,

ఆచార్యవంశం తెలుసుకోదగినదనీ విశదమవుతుంది. "మొదట ఇది, చివర అది" అనే పౌర్వాపర్య క్రమభావం ఆ వాక్యంలో లేదు కదా!

ఇప్పుడు కూడా, ఆచార్య పురుషులు గురుపరంపరను, ఆరోహణక్రమంగా కొందరు, అవరోహణ క్రమంగా మరికొందరు, రెండు విధాలుగా అనుసంధిస్తున్నట్లు కనబడుతున్నది. కాబట్టి మొదట ప్రథమాచార్యులకు నమస్కరించడం ఉప పన్నమే. అనుష్టుప్ ఛందం.

శ్రీరామానుజాచార్య కృత సంస్కృత వ్యాఖ్యానమ్ :-

**కులదైవత మస్మాకం కుర్వేహృది యతీశ్వరమ్ ।**
**యేన సంత్యజతా సర్వం సంగృహీతా వయం పునః ॥**

**కవితార్కిక సింహస్య కల్యాణ గుణవారిధేః ।**
**కలయే శిర సా పాదౌ కలి కల్మషహారిణౌ॥**

**ప్రసీదతు యతీశాన ప్రసాదన పటీయసీ।**
**సప్తతి స్తత్త్వవిచ్చిత్త దత్త హర్షోదయా స్వయమ్॥**

ఇహఖలు భగవాన్ కవితార్కిక సింహః సర్వతంత్ర స్వతంత్రః శ్రీ మద్వేంకటనాథాఖ్యః శ్రీ మద్వేదాన్తాచార్యః "ప్రధానస్తోత వ్యో గురు రితిచ బహ్వ్యః ప్రమితయః" ఇతి వచన శతవిహిత ఏ వాచార్యస్తవే "మౌనద్రుహో ముఖరయంతి గుణాస్త్వదీయాః" ఇతి న్యాయేన తద్గుణ పరవశతయా సముద్యుక్తః ఆచార్యతా విశ్రాంతి పదత్వేన స్వాచార్యభూతం సకలశ్రుతిసూత్ర సామంజస్యాపాదక సమీచీన న్యాయప్రతిపాదక శారీరక భాష్యాది ప్రబంధముఖేన సకల జగదుజ్జీవన కరం శ్రీమద్రామానుజాచార్యం యతిరాజ సప్తత్యాఖ్య ప్రబంధముఖేన ప్రసాదయిష్యన్, గురుపరం పరాంనమస్యన్ ఉపదేశ ప్రాథమ్యాత్ ప్రథమగురు భూతం స్వేష్టదైవతం నమస్యతి (కమపీతి).

(యఃస్వయమ్) స్వాసాధారణాకారేణ, నతు బౌద్ధాది మతవత్తా మస జీవాధిష్ఠాన ద్వారా, తామసగుణాధిష్ఠాన ద్వారావేత్యర్థః. (పంచరాత్రస్య)

స్వరూపానురూపాగమ (పరమ) సాధన విశేష తదుపయుక్తార్థ జాత సువ్యక్త ప్రతిపాదకతయా సకలశ్రుతి స్మృతి జ్యాయసః శ్రీ పాంచరాత్రాగమస్య, (వక్తా ఛందసామ్) తదుపోద్బలకతయా అ (నాది) నిధనావచ్ఛిన్న సంప్రదాయ స్వతః ప్రమాణశ్రుతి గణస్య, (ప్రవక్తా) అధ్యాపకః, (తమ్) "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం, యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" ఇతిశ్రుతేః, ఏవంవిధ మహోపకార విశిష్టమ్. (కమలాగృహమేధినమ్) లక్ష్మ్యాఃపతిమ్, పురుషకారభూత కమలా విశిష్టమ్. "కమలాగృహమేధిన" మితి తత్పురుషత్వాత్ ఉత్తర పదార్థస్యైవ శాబ్దప్రాధాన్యేఽపి విశిష్టస్యైవ సర్వశేషిత్వరూపార్థ ప్రాధాన్యాత్ విశిష్టస్య నమస్కార్యత్వం. (కం, అపి) స్వతస్సిద్ధ కరుణా పరిణాహిత్వేన స్వత ఏవ సకల జనోజ్జీవనోద్యుక్తమ్. (ఆద్యం గురుమ్) ప్రథమోపదేష్టారమ్ (వందే) త్రిభిరపికరణైః ప్రణమామీత్యర్థః.

నను సాక్షాన్మహోపకారకస్వాచార్య నమస్కార ఏవప్రథమం కార్యః, తథాచ సర్వైః ప్రతిబుద్ధైః గురు పరంపరానమస్కారే స్వాచార్య నమస్కార ఏవ ప్రథమం క్రియతే, " అస్మద్గురుభ్యోనమః" ఇతి "అస్మద్గురుపరంపరా" మితిచ. "ఆచార్యాణా మసావసావిత్యా భగవత్తః" ఇతి శ్రుత్యాచ భగవతః ఆచార్య పరంపరా పర్యవసాన విషయత్వమేవ ప్రతిపాద్యతే, తత్కథం ప్రథమగురు నమస్కారః? ఉచ్యతే అత్రప్రథమం ప్రథమ గురునమస్కారః ఉపదేశప్రాథమ్యాత్ స్వాచార్యోప కారత్వాద్యతిశయ వత్త్వాచ్చక్రియతే, ఏవమపి ప్రతిబుద్ధా అనుసంధధతే "లక్ష్మీనాథ సమారంభా" మితి. శ్రుతేస్తు కృత్స్నా యా అప్యాచార్య పరంపరాయా అవశ్యనం తవ్య త్వ ఏవ తాత్పర్యమ్. తథాచోపక్రమేఽభిహితమ్ "సచాచార్యవంశోజ్ఞేయ" ఇతి. తస్మాన్న పౌర్వాపర్యక్రమే తాత్పర్యమ్. అయంచార్థః ఉభయథాఽపి ప్రతిబుద్ధానుసంధానదర్శనాదవగమ్యతే, తస్మా దుపపన్న ఏవ ప్రథమం ప్రథమ గురునమస్కారః. అత్ర (కమలాగృహమేధినమ్) గృహైః దారైః మేధతే సంగచ్ఛత ఇతి గృహమేధీ, గృహస్థ ఇత్యర్థః. కమలయాగృహమేధీ, తం తథోక్త మితి వ్యాఖ్యానాంతరమ్.

2. సహ ధర్మచరీం శౌరేః సమ్మంత్రిత జగద్ధితామ్ ।
అనుగ్రహ మయీం వందే నిత్యమజ్ఞాత నిగ్రహామ్ ॥

**అర్థం :** నిత్యం = ఎల్లప్పుడు; అజ్ఞాత నిగ్రహాం = తెలియని కోపం కలది; అనుగ్రహమయీం = దయయే శరీరంగా కలది; సం, మంత్రిత, జగత్+హితాం = చక్కగా (భగవంతునితో) మంత్రాలోచనచేయబడిన ప్రపంచం యొక్క క్షేమం కలది; శౌరేః = నియంతయైన సర్వేశ్వరునికి; సహధర్మచరీం = పతియొక్క ధర్మానుష్ఠాన మందుతోడుగా ఉండే లక్ష్మీదేవిని; వందే = సేవిస్తున్నాను.

**తాత్పర్యము :** నిగ్రహమెట్టిదో ఎప్పుడూ తెలియనట్టి, అనుగ్రహ స్వరూపయైనట్టి, జగద్రక్షణ కోసం భర్తతో మంత్రాలోచన చేస్తూ, సహ ధర్మచారిణియైన లక్ష్మీదేవికి వందన మాచరిస్తున్నాను.

**చంద్రికా వ్యాఖ్య :** ఆచార్యాణియైన శ్రీదేవికి నమస్కృతి.

పూర్వశ్లోకంలో 'వందేకమలా గృహమేధినం' అని శ్రియఃపతికి నమస్కరించడంతోనే శ్రీదేవికి కూడా నమస్కరించడమయింది కదా! మళ్ళీ ప్రత్యేకంగా శ్రీదేవికి నమస్కరించడమెందుకు?

ఉపదేశ ప్రాధాన్యాన్ని బట్టి శ్రీధరుని తర్వాత శ్రీదేవిని సేవించడం అంటే, గురు పరంపరను ప్రకటించడం ఆవశ్యకం. శ్రీధరుడు శ్రీదేవికి మంత్రోపదేశం చేసి ఆచార్యుడైనట్లే, శ్రీదేవి కూడా విష్వక్ సేనునికి మంత్రం ఉపదేశించి ఆచార్యాణి అయింది. కాబట్టి ఆచార్య పత్నిగానేకాక, స్వయంగా ఆచార్యాణి కావడంవల్ల పరంపరను సేవిస్తూ ప్రణమిల్లడం సంప్రదాయం.

1. అజ్ఞాతనిగ్రహ జగన్మాత. లక్ష్మీదేవికి కోపం కల్గడమూ, తత్ఫలితంగా దండించడమూ అనేవి ఆమె స్వరూపంలోగానీ, స్వభావంలోగానీ లేనే లేవు. లక్ష్మీనాథుడు నిగ్రహానుగ్రహ సమర్థుడు. చేతనులు అనేక అపచారాలను చేస్తుంటారు. అకృత్యకరణం అంటే చేయతగని పనులను చేయడం, కృత్యాకరణం, అంటే చేయవలసిన పనులను చేయకపోవడం లాంటివి సామాన్యాపచారాలు.

భగవదపచారం - భగవంతునికి చేసే అపచారం; భాగవతాపచారం- భగవద్భక్తులకు చేసే అపచారం; అసహ్యాపచారం- పెద్దలకు, గురువులకు, ఆచార్యులకు చేసే అపచారం; ఇలా భగవద్భాగవతాసహ్యారూపమైన త్రివిధాపచారాలను విశేషాపచారాలంటారు విజ్ఞులు. సర్వేశ్వరుడు స్వతంత్రుడు కాబట్టి చేతనుని అపచారాలను సహించక, కోపించి దండించడానికి పూనుకొంటాడు. భగవంతునికి కలిగే కోపాన్ని కూడా (ఆయన యందు) సహించజాలని భగవతి శ్రీదేవి. ఇది ఒకప్పుడే కాదు, నిత్యం - ఎప్పుడూ సహించదు కదా!

**2. అనుగ్రహమయీ:** మూర్తీభవించిన దయయే శ్రీదేవి. అందుకే "శ్రేయసీం శ్రీనివాసస్య కరుణా మివరూపిణీం" - అన్నారు దేశికులు దయాశతకంలో. "జగతః పితరౌ" అన్నట్లు శ్రీశ్రియః పతులిర్వురు జగత్తుకే తల్లిదండ్రులు, తండ్రిహితకారి అయితే తల్లి ప్రియకారిణి. పిల్లల అభ్యుదయాన్నే కోరుకుంటూ తండ్రి వారిదోషాలను గమనించి కఠినాత్ముడై వారికి ఇష్టంకాని రీతిగా సంస్కరించడానికి యత్నిస్తుంటాడు. తల్లిమాత్రం వాత్సల్యాతిశయంతో తన పిల్లలకు ఇష్టమైన రీతిగా ప్రవర్తిస్తూ, వారిని అలుగనీయకుండా, సంతసింపజేస్తుంది. వారు కోరినవన్నీ ఇచ్చే స్వభావం కలది తల్లి. "కు పుత్రో జాయేత క్వచిదపి కుమాతా నభవతి". (కుమారుడు చెడ్డవాడు కావచ్చు కాని ఎప్పుడూ చెడ్డ తల్లి ఉండదు) అనే నానుడి ఉంది కదా!

వాత్సల్యమనే గుణానికి ప్రాచీనులు దోషభోగ్యత్వమనీ, అర్వాచీనులు దోషాదర్శిత్వమనీ అర్థం చెప్పారు. 'దోషభోగ్యత్వం' అంటే దోషం ఉన్నా అది గుణంగానే స్వీకరించడం. 'దోష అదర్శిత్వం' అంటే దోషమే కనబడకపోవడం.

శ్రుతప్రకాశికాకారులైన శ్రీసుదర్శనాచార్యులవారు వాత్సల్యాన్ని ఇలా వివరించారు. "వాత్సల్యం దోషేఽ పి గుణత్వ బుద్ధిః. యథా సద్యఃప్రసూతాయాః ధేనోః వత్సే-". ఇప్పుడే ఈనిన ఆవు, తన దూడ యందలి హేయమైన మాలిన్యాన్ని కూడా మిక్కిలి ప్రీతితో ఆస్వాదించకమానదు. అలాగే, తల్లి పిల్లవానికి ఎంత దోషమున్నా, దాన్ని గుణంగానే స్వీకరిస్తుంది. ఇది క్షమకు పరాకాష్ఠ"

ముఖ్యంగా, ఘటకత్వసిద్ధి గల శ్రీ శబ్దానికి వ్యుత్పత్తి షట్కం చెప్పబడినది.

1. శ్రితా స్యన్యైః సర్వైః 2. శ్రయసి రమణం 3. సంశ్రితగిరః శ్రుణోషి 4. ప్రేయాంసం శ్రిత జనవచః శ్రావయసిచ । 5. శృణాస్యేతద్దోషాన్ జనని! నిఖిలాన్ 6. సర్వజగతీం గుణైః శ్రీణాసి త్వం, తదిహ భవతీం శ్రీ రితి విదుః॥

1. ఇతరు లందరిచేత ఆశ్రయింపబడియున్నావు.
2. ప్రియుడైన విష్ణుమూర్తిని ఆశ్రయిస్తున్నావు.
3. ఆశ్రితుల మాటలను వింటున్నావు.
4. భర్తకు ఆశ్రితజనుల ఆర్తిని వినిపిస్తున్నావు.
5. సమస్త దోషాలను పోగొట్టుతున్నావు.
6. గుణాలతో సర్వజగత్తును ఆశ్రయించి ఉన్నావు.

అందువల్ల నిన్ను 'శ్రీః' అన్నారు.

"శ్రీరిత్యేవచ, నామ తే భగవతి!" ఓ భగవతీ! నీకు 'శ్రీః' అనే పేరు. (కాంతాస్తోత్రం) అన్నారు శ్రీయామునాచార్యులు.

రక్షకత్వాది స్వభావాలను తెలిపే 'అ'కారం సర్వేశ్వరునికి మొదటి పేరు అయినట్లే, పురుషకారాది దయా స్వభావాన్ని తెలిపే శ్రీ శబ్దం లక్ష్మికి ప్రథమ నామధేయం.

ఆరు రకాల వ్యుత్పత్తి గల 'శ్రీ' శబ్దంలో రెండుమాత్రం అత్యంత ప్రధానమైనవి. 1. శ్రీయతే (చైతనైః) ఇతి = శ్రీః. (కర్మార్థక వ్యుత్పత్తి) నిత్య, ముక్త, బద్ధ-త్రివిధ-చేతనుల చేతనులచేత ఆశ్రయింపబడుతున్నది. సాపరాధులైన చేతనుల స్వరూప స్థితి ప్రవృత్తి నివృత్తులు ఈమె యొక్క కటాక్షానికి అధీనమవడంచేత, చేతనులు ఆశ్రయింపదగిన వాత్సల్యాధిక్యం అనే అర్థం ఇందు చెప్పబడింది.

2. శ్రయతే (భగవంతం) ఇతి = శ్రీః (కర్త్రర్థక వ్యుత్పత్తి) తాను భగవంతుణ్ని ఆశ్రయిస్తున్నది. తన స్వరూప స్థితి ప్రవృత్తులు సర్వేశ్వరుని కటాక్షాధీనమవడంచేత, స్వతంత్రుడైన భగవంతుణ్ని ఎడబాయక ఆశ్రయించి యుండడానికి కారణమైన

ప్రియత్వం చెప్పబడింది. కాబట్టి లక్ష్మీదేవికి శేషిత్వం, శేషత్వం రెండూ నిత్యమై వర్తిస్తాయి.

3. సమ్మంత్రిత జగద్ధిత:- "త్వం మాతా సర్వలోకానాం దేవదేవో హరిః పితా॥ త్వయైత ద్విష్ణునాచాంబ! జగద్వ్యాప్తంచరాచరమ్ ।" శ్రీదేవి తల్లి, దేవదేవుడైన విష్ణువు తండ్రి. వారిద్దరిచే చరాచర వ్యాప్తమైన ఈ జగత్తే కుటుంబం.

**"హరిణీ ప్రేక్షణా యత్ర గృహిణీ నవిలోక్యతే ।**
**సేవితం సర్వ సంపద్భి రపి తద్భవనం వనమ్ ॥**

ఎక్కడ లేడి చూపులవంటి చూపులు గల గృహిణి కనుపించదో, సకల సంపదలకు నిలయమైనప్పటికీ ఆభవనం వనతుల్యమే కదా! "నగృహం గృహమిత్యాహుః గృహిణీ గృహముచ్యతే॥" 'కేవలం గృహం గృహం కాదు, గృహిణియే గృహం అనే లోకోక్తి కూడా గృహిణీ ప్రాధాన్యాన్ని చెబుతుంది. కాబట్టి, సర్వేశ్వరునికి ఉపాయత్వం, ఉపేయత్వం అనే రెండు ఆకారాలు కలిగియున్నట్లే, లక్ష్మీదేవికి పురుషకారత్వం, ప్రాప్యత్వం అనే రెండు ఆకారాలు కలవని స్పష్టమవుతున్నది.

"ఇవళ్ తా యాయ్ ఇవర్గళ్ క్లేశం పొరుక్క మాట్టాదే, అవనుక్కు పత్నియాయ్ ఇనియ విషయమాయ్ ఇరుక్కైయాలే కణ్ణషివత్త పురుషకారం". (ద్వయప్రకరణం .13) ఈమె తల్లియై చేతనుల క్లేశాన్ని సహింపలేక, విష్ణువుకు పత్నియై అభిమత విషయమై ఉండడంచేత దోషంలేని పురుషకారం కలది లక్ష్మి.

చేతన కార్యం తన కార్యంగా భావించిన తల్లి, ఈశ్వరుడు ఈమె యొక్క వైలక్షణ్యాన్ని చూచి, వ్యామోహించి చెప్పిన రీతిగా నడుచుకోవడం అభిమత విషయమైనందువల్ల, స్వామిని తనకు స్వాధీన పరచుకొని, జీవేశ్వరులనిద్దరిని జేర్చడానికి అసదృశమైనది పిరాట్టి పురుషకారం. కాబట్టి శ్రీదేవి శ్రియఃపతి ఇర్వురు అన్యోన్యంగా, జగద్ధితం కోసం, చేతనుల ఉజ్జీవనం కోసం, శేషశేషాశనాది నిత్యసూరులను ఈలీలావిభూతి యందు అవతరింప జేసేకార్యాదులను గూర్చి మంత్రాలోచన చేయడం జగత్కుటుంబంకలవారికి అత్యావశ్యకమే.

4. శౌరేః సహధర్మచరి: 'శౌరి' అనే పేరు విష్ణుమూర్తికి గల సహస్ర (అనంత) నామాలలో ఒకటి. అవక్ర విక్రమ పరాక్రమంతో కాలచక్రాన్ని త్రిప్పుతూ, సృజించిన విశ్వాన్ని పాలించే సామర్థ్యం శౌరికి తప్ప మరొకరికి లేదన్న మాట నిర్వివాదం.

శౌరి, లక్ష్మికి పతి యెట్లో, అట్లే లక్ష్మి, ఆయనకు ధర్మపత్ని. పతిపత్నుల ధర్మం పరస్పర నిరూపక తత్త్వం కలది. సీతాదేవి లక్ష్మణుణ్ని 'రామానుజు'డనీ, రాముణ్ని 'లక్ష్మణ పూర్వజు'డనీ సంభావిస్తూ శేష, శేషి సంబంధం విడదీయరానిదని తెలిపిందికదా! అట్లే విష్ణువుకు 'లక్ష్మీపతి' యనే, లక్ష్మికి 'విష్ణుపత్ని' యనే నామవాచకాలు అన్యోన్య నిరూపకాలు కదా! చేతనులను రక్షించడానికి ఉపదేశాదులచేత స్వామికోపాన్ని శమింపజేస్తుంది, కృపను పుట్టిస్తుంది. అఖిల హేయప్రత్యనీక కల్యాణ గుణైకతానుదైన సర్వేశ్వరునికి ప్రధాన మాతృ వాత్సల్యంతో జగద్రక్షణను (స్థితిగా) కల్పించడం కోసం యత్నించే పిరాట్టి పురుషకారాన్ని పురస్కరించుకొనియే శ్రియఃపతిని ఆశ్రయించడం వల్ల పురుషార్థచతుష్టయానికి హాని లేదు అని 'వందే' అనే పదం తెల్పుతున్నది.

ఈ శ్లోకం ముఖ్యంగా ద్వితీయమైనా, అద్వితీయమైన మంత్రరత్నమనే ద్వయమంత్రం యొక్క అర్థాన్నీ అనురణింపజేస్తున్నది.

**సంస్కృత వ్యాఖ్యానమ్ :** కమలాగృహమే ధిన మిత్యత్ర సహనమస్కృతా మపి శ్రియం మాతృత్వప్రయుక్త వాత్సల్యాతిశయద్యోతనార్థం, ఉపదేశ పరంపరా ప్రకటనార్థంచ పృథక్ నమస్కరోతి.

నిత్యం అజ్ఞాత నిగ్రహామ్ - వాత్సల్యాతిశయాత్ అజ్ఞాత నిగ్రహహేతుం, అజ్ఞాతనిగ్రహ స్వరూపమితివా; అనుగ్రహమయీం- అనుకూలస్వరూపాం; అత ఏవ సమ్మంత్రిత జగద్ధితాం - సమిత్యేకీభావే. భగవతా సహ ఏకీభూయ జగద్ధిత విచార జాగరూకాం, అతఏవ శౌరేః సహధర్మచరీం - సర్వదా చేతన రక్షణార్థోపదేశావసర ప్రతీక్షాం, వందే - నమస్కరోమి.

**3. వందే వైకుంఠ సేనాన్యం దేవం సూత్రవతీ సఖమ్ ।**
**యద్వేత్ర శిఖర స్పందే విశ్వమేతత్ వ్యవస్థితమ్ ॥**

**అర్థం :** యత్+వేత్ర శిఖర స్పందే = ఏ విష్వక్‌సేనుల బెత్తం కొన యొక్క చలనమందు; ఏతత్ = ఈ చరాచరమైన; విశ్వం = సమస్త ప్రపంచం; వ్యవస్థితం = తన స్థితి యందు నిలిచి యున్నదో; దేవం = నిత్యసూరియైన; సూత్రవతీ సఖం = సూత్రవతికి భర్తయైన; వైకుంఠ సేనాన్యం = సర్వేశ్వరుని సేనాధిపతికి; వందే = నమస్కరిస్తున్నాను.

**తాత్పర్యము :** ఎవరి చేతి బెత్తం కొన యొక్క చలనమందు ఈ చరాచర ప్రపంచం తన స్థానం నుంచి కదలకుండా నిలిచియున్నదో, అట్టి దివ్య మూర్తియైన, సూత్రవతి అనే దివ్యమహిషికి నాథుడైన, విష్వక్‌సేనుడనే వైకుంఠ సేనాపతికి ప్రణమిల్లుతున్నాను.

**చంద్రికా వ్యాఖ్య :** విష్వక్సేనులను స్తుతించే శ్లోకమిది.

ఉభయ విభూతి నాయకుడైన శ్రియఃపతి, తన జగద్రక్షణ భారాన్ని విష్వక్సేనులనే నిత్య సూరికి అప్పగించి, ఆనంద సామ్రాజ్యాన్ని ఏలుతున్నాడు. శ్రీమద్యామునాచార్యుల వారు "త్వదీయ భుక్తోజ్ఝిత శేషభోజినా త్వయానిసృష్టాత్మ భరేణ యద్యథా। ప్రియేణ సేనాపతినా నివేదితం తథానుజానంత ముదారవీక్షణైః"॥ శ్రియః పతి, శేషభోజియైన సేనాపతియందు ఉభయ విభూతిభారాన్ని నిర్వహించడానికి అనుగ్రహించడంవల్ల ఆయన సకలభువన పాలనకార్యాలను తన ఇష్టప్రకారంగా చేస్తుంటే కటాక్షిస్తూ, శ్రీ విష్వక్సేనుల కైంకర్యసామ్రాజ్య వైభవాన్ని అనుభవిస్తుంటాడు, అన్నారు (స్తో.ర.42)

భగవద్రామానుజులు కూడా "శ్రీమతి విష్వక్సేనేన్యస్త సమస్తాత్మైశ్వర్యమ్" (వైకుంఠగద్య) అన్నారు.

శ్రీ పరాశరభట్టర్ "విశ్వ చిదచిన్నయనాధికారం యోనిర్వహతి"- (రం.స్త.50). బ్రహ్మాండంలోని చరాచర పదార్థాలను నడిపే అధికారాన్ని అవలీలగా నిర్వహించేవారు విష్వక్సేనులని సూచించారు.

**"అశేష విఘ్నశమనం, అనీకేశ్వర మాశ్రయే।
శ్రీమతఃకరుణాంభోధౌ శిక్షాస్రోత ఇవోత్థితమ్॥"** (ద.శ.5)

భగవత్కైంకర్య పరులకు కలిగే సమస్త విఘ్నాలను నశింపజేసి, కైంకర్య ఫలప్రాప్తిని కలిగించే సేనాపతి, భగవత్కృప అనే జలాశయమందు పుట్టి శరణాగతులనే పంట పొలాలకు ప్రవహించే ఒక కాలువ. అంటే, ప్రపన్నులపై భగవద్దయ ప్రవహించడానికి ప్రథమకారణుడు విష్వక్సేనుడు. కాబట్టి ఆయన 'శిక్షాస్రోతస్సు' అని నిరూపితం.

**సేనానీ :** ఇనేన సహవర్తంతే ఇతి = సేనాః (వ్యుత్పత్తి) "ఇనఃసూర్యే నృపే పత్యౌ" (నిఘంటువు) 'ఇన' శబ్దానికి గల నానార్థాలలో 'పతి' అనే అర్థమున్నది కదా! "పతిం విశ్వస్య" అనే శ్రుతిరీత్యా విశ్వానికంతటికీ ప్రభువు పరమాత్మయే. "యస్యాత్మాశరీరం" అనే శ్రుతిని బట్టి పరమాత్మకు జీవాత్మలతో శరీరి శరీర భావసంబంధం ఉంది. జీవులు ఎల్లప్పుడు పరమాత్మతోడనే ఉంటారు కాబట్టి 'సేనా' శబ్దానికి జీవులని అర్థం. "సేవాం నయతి ఇతి = సేనానీ; అనే వ్యుత్పత్తిచేత జీవులను నియమించేవాడని అర్థం.

భగవంతుని విభూతి నిరవధికమైన విస్తృతి కలదికదా! దేవతల యొక్క సేనాని షణ్ముఖుడు - కుమారస్వామి. ఈ భేదాన్ని గమనించడానికే 'వైకుంఠసేనానీ' - వైకుంఠుని సేనాపతి విష్వక్సేనుడు - అనే పదం ప్రయుక్తం. (సేనాన్యం - ద్వితీయావిభక్త్యే కవచనాంతపదం).

**దేవం :** 'దివ్ - క్రీడా విజిగీషా వ్యవహార మోద మద స్వప్నకాంతిగతిషు' అనేధాత్వర్థాన్ని బట్టి 'దేవ'శబ్దానికి ప్రకాశించేవాడని అర్థం. "తం దేవ మాత్మ బుద్ధి ప్రకాశం" (శ్వేతా 6-18) ఉపనిషద్వాక్యం గమనీయం. "తమ్మైయేనాళుమ్ వణంగి త్తొషువార్కుత్తమ్మైయే యొక్క అరుళ్ శెయ్‌వర్" (పెరి.తి.11-3-5) తమ నెల్లప్పుడు కొలిచే వారికి తమతో సామ్యాన్ని కృపజేస్తాడు భగవానుడు. "నిరంజనః పరం సామ్యముపైతి" అని ఉభయ వేదాంత వాక్యాలు. 'స్వయంప్రకాశంగల దేవదేవునికి కైంకర్యం చేసే వారు కూడా స్వయం ప్రకాశం కలవారవుతారని విశదీకరిస్తున్నాయి.

"స్రగ్వస్త్రా భరణైర్యుక్తం స్వానురూపై రనూపమైః ।
చిన్మయైః స్వప్రకాశై శ్చాన్యోన్య రుచిరంజకైః॥" (పౌష్కర సంహిత 10 అ.6)

భగవంతునికి వైకుంఠంలో కైంకర్యంచేయగోరేవారు "స ఏ కధా భవతి ద్విధాభవతి త్రిధాభవతి" (ఛాందోగ్య. 7.26-2) అన్నట్లు అనేక విధాలుగా, అనేక రూపాలను ధరించి చేయగల్గిన శక్తి సామర్థ్యాలను కలవారు. కాబట్టి వైకుంఠునికి అనురూపాలైన హారపీతాంబరాభరణాదులన్నీ జ్ఞాన పూర్ణమై, స్వయం ప్రకాశం కలవియే కదా!

గురువులు అనే హోతలు పరమాత్మ అనే జ్యోతి యందు ఆత్మ హవిస్సును సమర్పిస్తూ ఉజ్జీవిస్తారు. ఇది ప్రపన్నానుష్ఠానం. గురు ప్రపత్తిని చేసిన తర్వాతనే ఆత్మ వస్తువు సత్తను పొందుతుంది.కాబట్టి శ్రీదేవికి నేరుగా శిష్యుడై గురు పరంపరను అనుసంధిస్తూ శ్రీశ్రియఃపతులకు ప్రపదనం చేసే విష్వక్సేనుడు 'దేవ' శబ్దవాచ్యుడు.

**సూత్రవతీ సఖమ్ :** సూత్రవతికి ప్రాణనాథుడు విష్వక్సేనుడు. వేదాంతశాస్త్రం ప్రాణాన్ని సూత్రంగా వ్యవహరించింది. శ్రీ పరాశరభట్టర్ "సైన్యధురీణ ప్రాణసహాయాం సూత్రవతీ మాశిశ్రియమంబామ్" (రం.స్త.51) విష్వక్సేనులను ప్రాణం లాగా నిత్యం అనుసరించేది అని సూత్రవతిని కీర్తించారు.

**యద్వేత్రశిఖరస్పందే - వ్యవస్థితమ్:-** శాంతి భద్రతలను కాపాడే అధికారులు దండధరులై, కల్లోలం, అలజడి జరుగకుండా లోకులను క్రమశిక్షణతో స్థిరంగా ఉండే విధంగా నియమించడం పరిపాటి. విష్వక్సేనుడు తన చేతిలో బెత్తం పట్టుకొని, నోటిమాట పలుకకుండానే, దాని అగ్రభాగాన్ని కదిలిస్తూ, నిత్యసూరులను జగడమాడకుండా, భోగవిభూతుల అధికారులైన దేవతలను సద్దుచేయకుండా, ఉండునట్లు సంకేత పరుస్తాడు.

నిత్యసూరులలోనూ జగడాలుంటాయా? ఎందుకుండవు. ఉంటాయి. "పిణంగి యమరర్ పిదత్తుమ్ గుణమ్కెష కొళ్గైనానే" (తి.వా.మొషి.1.6-4) సర్వేశ్వరుని అనంత కల్యాణగుణాలలో ఒక్కొక్కగుణమే అనంతం. ఏ గుణంచేత ఆకృష్టులైనవారు ఆ గుణమే సర్వశ్రేష్ఠమంటారు నిత్యసూరులు.

"అన్యైరనుభూయమాన మాన గుణంగళిల్‌కాట్టిల్ స్వైరనుభూయ మాన మాన గుణంగళుక్కు పరస్పర వివాదమాక... ప్రీత్యతిశయత్తాలే దైవావిష్టరైప్పోలే అక్రమమాకనిన్ఱాడి యవనైవణంగియడిమై శెయ్యుమిదువే స్వభావమ్. (ఆఱాయిరప్పడి.)

నిత్యసూరులలో ఇతరులనుభవించే భగవద్గుణాలకంటే తామనుభవించే గుణాలకు, ఒకరికొకరు వాదించుకొంటూ, ఉత్కర్షనుప్రతిపాదిస్తుంటారట. హద్దుమీరిన భక్తిచేత క్రమం తప్పి ఆడుతూ భగవంతునికి నమస్కరించి దాస్యం చేయడమే వారి స్వభావం. నిత్యసూరులు జగడమాడడానికి కారణం భగవద్గుణ వైశిష్ట్యమే, అన్నారు.

**"అన్యోన్యం క్షిపతామహంప్రథమికా సంమర్ద కోలాహలం**
**విష్వక్సేన విహారవేత్ర లతికా కంప శ్చిరా ల్లుంపతి ॥"** - (పాదు.స.38)

భగవానుని పాదుకలను తమతలపైన ధరించాలనే ప్రేమతో దేవతలు పరస్పరం త్రోసుకొంటూ అహమహమికాపేక్షతో వస్తుంటారు. ఆ జనసమ్మర్దమూ, ఆ కోలాహలమూ విష్వక్సేనుడు ఎంతోకాలం తన చేతిబెత్తము నాడిస్తే గానీ అణగదు, అన్నారు దేశికులు. కాబట్టి, విశ్వం యొక్క వ్యవస్థ శ్రీ విష్వక్సేనుల వేత్రశిఖర స్పందన మందే ఆధారపడియుంది.

**సంస్కృత వ్యాఖ్యా :** అథావసరప్రాప్తం భగవతోఽ ప్యశేషకార్య నిర్వహణ ధౌరేయం సేనాపతిం నమస్యతి. వందఇతి.

యద్వేత్ర శిఖర స్పందే - యదీయ వేత్రాగ్రచలనే; ఏతత్ - లీలా భోగవిషయభూతం; విశ్వం - కృత్స్నం జగత్; వ్యవస్థితం - తత్పరతంత్రమిత్యర్థః తం-వైకుంఠ సేనాన్యం - వైకుంఠస్యహరేః సేనాన్యం సేనా పతిం; సూత్రవతీ సఖం - సూత్రవత్యాఃపతిం. సూత్రవతీనామ విష్వక్సేన పత్నీ, తం. దేవం వందే.

ఇంత వరకు మూడు శ్లోకాలచే సుశ్లోకితులైన ముగ్గురు గురువులు నిత్య విభూతికి సంబంధించినవారు. ఇక ముందు కీర్తింపబడే గురువులు ఈ లీలా విభూతికి సంబంధించినవారు. శ్రీశఠకోప దివ్యసూరి అనే నమ్మాళ్వార్ పుట్టుకతోనే

మహా యోగి. ఆయనకు ఆకలి, దప్పి లేనే లేదు కాబట్టి ఎన్నడు తినలేదు, త్రాగనూ లేదు. ఎల్లప్పుడు ధ్యాన సమాధిలోనే మగ్నుడైయుండేవాడు. శ్రియః పతి యాజ్ఞచేత విష్వక్సేనులు సమాధిస్థుడైన నమ్మాళ్వార్లకు, ఎవరికి కనబడకుండా, పంచసంస్కారాలను కృపజేసి ఆచార్యులైనారు.

**"సేనేశో స్వయమాగత్య ప్రీత్యా శ్రీనగరీంశుభామ్ ।**
**శఠకోపాయ మున యే తింత్రిణీ మూలవాసినే ॥**
**తాపాది పూర్వకం మంత్రం ద్వయం శ్లోకాదికంక్రమాత్ ॥"**

ఈ ప్రామాణిక వచనాన్ని బట్టి అవరోహణక్రమంగా గురుపరంపరలో నాల్గవ ఆచార్యులై వెలసినవారు శ్రీశఠకోపులు.

**4. యస్య సారస్వతం స్రోతో వకుళామోద వాసితమ్ ।**
**శ్రుతీనాం విశ్రమాయాలం శఠారిం తముపాస్మహే ॥**

**అర్థం :** యస్య = ఏ నమ్మాళ్వార్ల యొక్క, వకుళ+ఆమోద, వాసితం। వకుళ = పొగడ పూల యొక్క; ఆమోద = సుగంధంచేత; వాసితం = పరిమళింప జేయబడిన; సారస్వతం = (సరస్వతీ సంబంధంగల) వాఙ్మయమైన; స్రోతః = ప్రవాహం; శ్రుతీనాం = వేదాల యొక్క; విశ్రమాయ = విశ్రాంతి కోసం; అలం = సమర్థమైనదో; తం = ఆ ప్రసిద్ధుడైన; శఠారిం = నమ్మాళ్వార్లను; ఉపాస్మహే = ఉపాసిస్తుంటాం.

**తాత్పర్యము :** ఎవరి వాక్ప్రవాహం వకుళ పుష్పాల సుగంధంచేత పరిమళం కలిగి యున్నదో, వేదాలకు విశ్రాంతి నీయడానికి చాలినట్టిదో, అట్టి నమ్మాళ్వార్లను ఉపాసిస్తుంటాం.

**వ్యాఖ్య :** శ్రీ శఠకోప దివ్యసూరులను స్తుతించే శ్లోకమిది.

గురుపరంపరా ప్రకారంగా విష్వక్సేనులకు వందన మాచరించిన తర్వాత నమ్మాళ్వార్లను దేశికులు భక్త్యతిశయంతో స్తుతించారు. నమ్మాళ్వార్లు అనుగ్రహించిన దివ్యప్రబంధాల వైశిష్ట్యాన్ని బట్టి ఆళ్వార్లందరిలోను, మొదట జన్మించిన వారుకాకున్నా, ప్రథమగణ్యులుగా కీర్తింపబడుతున్నారు. కాబట్టి, నమ్మాళ్వార్లను కీర్తిస్తే మిగిలిన ఆళ్వార్లందరిని కీర్తించినట్లే అవుతుంది.

**ఉపాస్మహే :** ఇది బహువచనక్రియా రూపం. ఈ ప్రయోగాన్ని బట్టి, దేశికులు తామొక్కరేకాక, తమ ఆశ్రితులతో కలిసి ఆళ్వార్లను ఉపాసించినట్లు భాసిస్తున్నది. నమ్మాళ్వార్లు "శొన్నాల్... ఆగిలుంశొల్లువన్" అని ఏకవచనంగా ఒకచోట చెప్పుకొన్నవారే, మరొకచోట "నాం ఉమక్కు అటియచ్చోన్నోమ్" అని స్వ విషయంలోనే బహువచనాన్ని "ఆత్మని బహువచనం" అన్నట్లు ప్రయోగించు కొన్నారు గదా! సాత్త్వికాహం కారం శ్లాఘనీయమే. కాబట్టి, నమ్మాళ్వార్ల ఆశ్రయణ మనే విశిష్ట సంబంధం కలిగిన దేశికులు తమను బహువచనంలో నిర్దేశించుకొన్నారనీ భావించవచ్చు. ప్రపత్తి చేస్తున్నామని ఈ పదానికి భావం.

**వకుళామోద వాసితం:** వకుళ పుష్పాలు అలంకారంగా కలవారు నమ్మాళ్వార్లు. "నాట్కమష్ మగిష్ మాలై మార్పినన్" – నిత్యం పొగడ పూల మాలను వక్షఃస్థల మందు కలవాడు – అని అర్థం.

**"వకుళా కలితాం మాలా మాద్యః ప్రీతో హరిర్దదౌ।**
**ఇతి తం స్మ శఠారాతిం వకుళా భరణం విదుః ॥"** (దివ్యసూరిచరితం)

నమ్మాళ్వార్లు స్తుతించడం వల్ల సంతోషించిన భగవానుడు తాను ధరించిన వకుళమాలను ఆళ్వార్లకు బహుమతిగా ప్రసాదించినప్పటి నుంచి వారు వకుళాభరణులయ్యారని శ్రీ గరుడవాహన పండితులు వర్ణించారు.

శ్రియః పతికి తులసి ప్రియకరమైనట్లు, ఆళ్వార్లకు పొగడపూవు ప్రియకరం. ఆళ్వార్ల హృదయం సర్వదా వకుళ మాలాభూషితం. వకుళ పుష్పంచిన్నది, తెల్లనిది. అది ఎండిపోయినా దాని వాసన తగ్గదు కదా! ఆళ్వార్ల భావనలన్నీ వారి హృదయం నుంచి ఉద్గమించినవే కాబట్టి, వారి వాఙ్మయమంతా వకుళ పుష్పాలచేత సువాసితమనడం వింతకాదు.

"స్వలక్షణ సరస్వతీ సురభి కేసరశ్లాఘిన్"– (సంకల్పసూర్యోదయం) అని దేశికులు నమ్మాళ్వార్లను స్తుతించారు.

**సారస్వతం స్రోతః :** సరస్వతీ విలాసమంతా సారస్వతం. సరస్వతి అంటే సరస్సులు కలది. బ్రహ్మమనే జలాన్ని ధరించి, దాన్ని సముచితాధికారులకు ప్రవహింపజేసే వేదాలు సరస్సులు. అవి కలది సరస్వతి. 'బ్రహ్మాజలధారణ

ప్రశ్చ్యోతనాభ్యాం వేదాః సరాంసి, తన్మయత్వాత్, త ద్వతీ సరస్వతీ" (యాజ్ఞిక్యుప నిషద్భాష్యం) సర్వత్ర వ్యాప్తి కల్గిన వాగ్దేవత అని అర్థం. భగవత్స్వరూప రూపగుణ విభూతుల అనుభవ పరీవాహ రూపంగా ఆవిర్భవించిన ఆళ్వార్ల దివ్యప్రబంధాలు వేదాలకు ప్రతిరూపాలు. "వేదత్తి నుట్పొరుళ్ నిఱ్కప్పాడి" – సకల వేదశాస్త్రాల తత్త్వార్థాన్ని అందరు తెలుసుకొనే రీతిగా లలితంగా గానం చేసిన వారు నమ్మాళ్వార్లు – అని శ్రీ మధుర కవులు స్తుతించారు కదా!

"వాశత్తడమ్" – "శీతమివహ్రదమ్" – అన్నట్లు సర్వేశ్వరుడే ఒక గొప్ప సరస్సు– ఆ స్వామి ఆళ్వార్ల హృదయంలో స్థిరంగా నిల్చియున్నాడని ఆళ్వార్లే అన్నారు. కాబట్టి నమ్మాళ్వార్ల హృదయమే సరస్వతి. ఆ సరస్వతి నుంచి పెల్లుబికిన అనుభవ పరీవాహ రూపాలైన ప్రబంధాలను సారస్వత స్రోతస్సులనడం మిక్కిలి రమణీయం.

**శ్రుతీనాంవిశ్రమా యాలం:** "బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రతరిష్యతి" అన్నట్లు అల్పజ్ఞుడు కల్పించే అపార్థాలకు వేదం భయపడుతుంది. నమ్మాళ్వార్ల ప్రబంధాలు అవతరించిన తర్వాత ఆ భయంపోయింది, విశ్రాంతి కలిగింది. భగవానుని స్వరూప రూపగుణవిభూతులను వర్ణించడానికి వేదం చాలా శ్రమపడింది. అయినా సాఫల్యాన్ని పొందలేదు. "యతో వాచో నివర్తంతే" అన్నట్లు సర్వేశ్వరుని ఒక్క ఆనందగుణాన్ని లెక్కింపజాలక వేదం వెనుకకు మరలి వచ్చింది. ఆళ్వార్ల ప్రబంధాలలో శ్రీమన్నారాయణుని స్వరూప రూపగుణ విభూతులు స్పష్టంగా తెల్పబడినందువల్ల వేదాలకు శ్రమతీరింది, విశ్రాంతి లభించింది.

**"అధ్యేతవ్యం ద్విజశ్రేష్ఠైః వేదరూప మిదం కృతమ్ ।**
**స్త్రీభిః శూద్రాదిభిశ్చైవ తేషాం ముక్తిః కరేస్థితా ॥"**

అన్నట్లు సర్వకాలాల్లోనూ, సకలజనులకూ, సర్వరసాలతో ఉపజీవ్యంగా ఉండే ఆళ్వార్ల ప్రబంధాలు అవతరించిన వెంటనే వేదాలు విశ్రమించాయి. ఆళ్వార్ల ప్రబంధాలను అనుసంధించిన వారికి మోక్షఫలం కూడా కరతలామలక మయింది.

"యత్తత్ కృత్యం శ్రుతీనాం మునిగణవిహితై స్సేతిహాసైః పురాణైః" అని ద్రవిడోపనిషత్తాత్పర్యరత్నావళిలో దేశికులు అన్నట్లు ఆర్షేతిహాసాలతో కూడిన పురాణాలచేత వేదోపబృంహణకార్యమేదైతే జరిగిందో, ఆకార్యమందు సత్త్వగుణనిధియైన శ్రీ శఠకోపముని యొక్క ద్రావిడీబ్రహ్మ సంహిత మూర్ధాభిషిక్తయై రాణిస్తున్నది.

"ఒణ్ తామరై యాళ్ కేళ్వన్ ఒరువనైయే నోక్కుముణర్వు"-అన్నట్లు ప్రాప్యప్రాపకాలు రెండూ లక్ష్మీనాథుడే, అనే నిజమైన జ్ఞానాన్ని బోధించే దివ్య ప్రబంధాలలో ఆళ్వార్లు అందరికీ గ్రాహ్యమయ్యే విధంగా అనుగ్రహించడం వల్ల, వేదాలకు ఇక మీద దాన్ని బోధించే అవసరం లేకపోయింది. వాటికి విశ్రాంతి సమకూరింది.

"శ్రుతీనాం" అనడం వల్ల స్త్రీలు మనోదేహదార్ఢ్యాలు లేనివారు. మృదుస్వభావలవడం చేత ప్రచండమైన ఎండవల్ల మాడుతూ విశ్రమస్థానంలేక తడబడుతుంటారు. అలాంటి సమయంలో సమీపంలోనే ఉన్న పర్వత వనాల నుంచి పువ్వుల వాసనతో కూడిన కమ్మని పిల్ల తెమ్మెరల ప్రవాహం వస్తే వారికి శ్రమ తీరుతుంది కదా! అలాగే కుదృష్టులు చెప్పిన అపార్థాలవల్ల శ్రుతికాంతలకు కలిగిన శ్రమ శ్రీ శఠకోప దివ్యసూరి యొక్క శ్రుత్యభిమత సూక్తుల వల్ల తీరినదని సూచితం. వీరు అనుగ్రహించిన దివ్యప్రబంధాలు నాలుగు.

1. తిరువిరుత్తమ్: 100 పాశురాలు, ఋగ్వేదసారం. 2. తిరువాశరియమ్: 7 ఏడు పాశురాలు. యజుర్వేదసారం. 3. పెరియ తిరువన్దాది: 87 పాశురాలు. అధర్వవేదసారం. 4. తిరువాయ్‌మొషి : 1102 పాశురాలు. సామవేదసారం. మొత్తం 1296 పాశురాలు. 'శ్రుతి' అనే పదానికి 'చెవి' అనే అర్థాన్ని చెప్పితే నమ్మాళ్వార్ల ప్రబంధాలు చెవులకు విశ్రాంతిని, సుఖాన్నిచేకూర్చడంలో సమర్థమైనవి అని చెప్పవచ్చును. "శెవిక్కినియశెఞ్జొల్" – ఆ ప్రబంధాలు శబ్ద సౌందర్యం చేతనూ, అర్థ పుష్టిచేతనూ చెవులకు చవులూరించేవి అని అర్థం.

"ధత్తే యత్సూక్తి రూపేణ త్రివేదీ సర్వయోగ్యతామ్". (దయాశ-3) దివ్య ప్రబంధరూపాన్ని పొందిన వేదాలు జాత్యాది నియమంలేకుండా అందరు

చదువదగినవి. కాబట్టి 'తిరువాయ్‌మొషి'కి "సర్వీయ శాఖాశ్రుతిః" అని పేరు వచ్చిందని దేశికులన్నారు.

"శెయ్యతమిష్ మాలైకళ్ నామ్ తెళియ ఓదిత్తెళియాదమత్తై నిలంగళ్ తెళిగిన్డోమే". (గురుపరంపరా సారం). వేదాలలో తమకేర్పడిన సందేహాలు ద్రావిడ వేదాల అర్థాన్ని గ్రహించడంవల్ల తీరినవని వారే అన్నారు.

**శఠారి :** శఠ వాయువును నిరోధించడం వల్ల 'శఠారి' అని నమ్మాళ్వార్లకు పేరు వచ్చింది. జన్మించే శిశువును 'శఠ' మనే వాయువు ఆవరించడం వల్ల దాన్ని భరించజాలక ఆ శిశువు బావురుమని ఏడుస్తుంది. పూర్వ జన్మలకు సంబంధించిన జ్ఞానాన్నీ, స్వరూప జ్ఞానాన్నీ ఆ శిశువు మరచిపోతుంది. అజ్ఞానాన్ని పొందుతుంది. ఆళ్వార్లకు మాత్రం వారి స్వరూపజ్ఞానం శఠవాయువుచేత తిరోధానం కాలేదు.

శఠులంటే 'కపటవాదులు' అని కూడా అర్థం. భగవంతునికి రూపం లేదు. గుణాలులేవు అని వాదించే శఠులకు ఆళ్వార్లు శత్రువు. తమ ప్రబంధాల్లో "తిరువుడంబువాన్ శుడర్ శెన్దామరైక్కణ్ణన్ కైకమలమ్" అనీ, "అణల్లన్ పెణ్ణళ్ళన్" అనీ వాది వాదాలనూ నిరసించడం వల్ల 'శఠారి' అనే పేరు కల్గింది. (అజ్ఞానాన్ని కలిగించే వాయువును కోపించడం వల్ల 'శఠకోపులు' అనిపేరు. 'శఠజిత్' అనీ 'శఠరిపు' లనీ పేర్లు కలవు. 'పరాంకుశులు' అంటే, పరులకు – విష్ణుపారమ్యాన్ని అంగీకరించని వారికి వీరు అంకుశం వంటి వారని అర్థం. పరేషాం అంకుశః = పరాంకుశః. "విద్యామదో ధనమదస్తృతీయోఽభిజనమదః– అన్నట్లు విద్యవల్ల, సంపదవల్ల, ఆభిజాత్యం వల్ల కలిగే మూడు విధాలైన మదాలు మానవునికి శత్రువులు – పరులు. వీటిని అణచినందువల్లనూ 'పరాంకుశులు' అని పేరు. 'కారి' అనే భగవద్భక్తుడైన ప్రభువుకు పుత్రుడైనందువల్ల 'కారిసూను'లని పేరు. సంసారుల వలె ప్రవర్తించక, మారినవాడు కాబట్టి వీరికి 'మాఱన్' అని పేరు. పూర్వాచార్యులందరు ముక్తకంఠంతో వీరు (నమ్మె ఆళ్వార్) మనలను ఏలుకొనేవారు అని స్తుతించడం వల్ల నమ్మాళ్వార్ అనే పేరు. ప్రసిద్ధిని పొందింది.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ ప్రపన్న సంతాన కూటస్థం పరాంకుశమునిం నమస్యతి యస్యేతి. యస్య సారస్వతం స్రోతః-వాక్ ప్రవాహః, వకుళామోదవాసితం - వకుళ పరిమళయుక్తం, వకుళామోదవాసిత శఠార్యాశ్ర యత్వేన ఉపచారాత్ తథోక్తిః శ్రుతీనాం-వేదానాం, విశ్రమాయ అలం- స్వవివక్షితైకార్థ ప్రతిపాదనాత్ స్వ సర్వార్థ హేతురిత్యర్థః. తం శఠారిం-శ్రుత్యనభిమ (నభిహి) తార్థ వక్తారః శఠాః, తేషాం అరిం -బాధకం; ఉపాస్మహే- నమస్కుర్మహే. ఆత్మని బహువచనం. విశ్రమ శబ్దేన కుదృష్టి కృతా పార్థ కర్షణశ్రమ నివృత్తిః స్ఫురతి.

**అత్ర వ్యాఖ్యానాంతరం :** యస్య - శ్రీశఠకోపస్య; సారస్వతం - సరస్వత్యాః సంబంధి; శ్రీసూక్తి రూపమిత్యర్థః. స్రోతః - ప్రవాహః. తిరువాయ్ మొషి ప్రబంధ ఇత్యర్థః - శ్రుతీనాం విశ్రమాయ-వేదానాం భేదాపనయనాయ; అలం-శక్తం "అలంభూషణ పర్యాప్తి శక్తి వారణ వాచక" ఇత్యమరః.

**5. నాథేన మునినాతేన భవేయం నాథవానహమ్ ।**
**యస్య నైగమికం తత్త్వం హస్తామలకతాంగతమ్ ॥**

**అర్థం :** నైగమికం = వైదికమైన; తత్త్వం = యథార్థ జ్ఞానం; యస్య = ఎవ(ని)రికి; హస్త+ఆమలకతాం = చేతిలోని ఉసిరికాయవలె సమగ్ర దర్శనీయతను; గతం = పొందినదో; తేన = అట్టి; నాథేన మునినా = నాథముని చేత; అహం = నేను; నాథవాన్ = ఏలిక గలవాడను; భవేయం = అవుతాను. (అగుదునుగాక).

**తాత్పర్యము :** వేద ప్రతిపాద్యమైన తత్త్వం ఎవరికి కరతలామలకమైనదో, అట్టి నాథమునులచేత నేను నాథుడు కలవానిగా అవుతున్నాను.

**వ్యాఖ్య :** శ్రీమన్నాథమునులను స్తుతించే శ్లోకమిది.

శ్రీ విష్వక్సేనులు శ్రీ శఠకోపులకెట్లు ఆచార్యులైనారో, అట్లే శ్రీ శఠకోపులు శ్రీ నాథమునులకు ధ్యాన యోగదశలో ఆచార్యులైనారు. నాథమునుల పూర్తి పేరు శ్రీ రంగనాథమునులు. వీరనారాయణపురమనబడే తిరుక్కోళూర్ (కాట్టు మన్నార్ కోయిల్) నగరమందు ఈశ్వర భట్టార్యులకు (విష్వక్సేనుల మంత్రియైన

గజముఖుడనే కుముదగణేశుని అంశతో క్రీ.శ.906లో) పుత్రులుగా నాథమునులు అవతరించారు. వీరు సకల శాస్త్రపారంగతులు. విష్ణుభక్తి పరాయణులు. నాథమునులు ఉత్తరదేశయాత్రకు సకుటుంబంగా పోయి వచ్చి, దక్షిణ దివ్య దేశాలనుసేవించి తిరిగి తిరుక్కోళూరుకు చేరి అక్కడ రాజగోపాలుని సన్నిధిలో కైంకర్యం చేస్తూ ఉండిరి.

ఒకనాడు ఆ సన్నిధిలో, శ్రీ శార్ఙ్గపాణి (కుంభకోణస్వామి) విషయంగా శ్రీ శఠకోపులు కృపజేసిన "ఆరావముతే" అనే తిరునాయ్ మొషిలోని దశకాన్ని కొందరు శ్రీవైష్ణవులు పారాయణం చేశారు. అందు 'ఓరాయిరత్తుళిప్పత్తు' (ఒక వేయిలో ఈ పదిపాశురాలు) అనే మాటను నాథమునులు విన్నారు. 'మిగిలిన గ్రంథాన్ని పారాయణం చేయండి' అని స్వాములతో నాథముని విజ్ఞాపన చేశాడు. వారు మాకు తెల్యదన్నారు. అక్కడి నుంచి కుంభకోణం వెళ్ళి నాథముని శ్రీశార్ఙ్గపాణిని ప్రార్థించారు. ఆ స్వామి వీరికి స్వప్నంలో సాక్షాత్కరించి, 'కురుకాపురిలో నమ్మాళ్వార్ల అనుగ్రహంచేత మొత్తం దివ్యప్రబంధాన్ని పొందవచ్చు'నని పలికిరి. వెంటనే కురుకాపురికి చేరుకొన్నాడు. అక్కడ ఉన్న స్వాములను 'దివ్యప్రబంధం ఎలా లేకుండా పోయింది?' అని అడిగాడు. "శ్రీ శఠకోపుల దివ్య ప్రబంధం సద్యోమోక్షదాయకం. ఆ ప్రబంధాన్ని చదివితే మరణిస్తారనే భ్రాంతితో అజ్ఞానులు కొందరు దాన్ని తామ్రపర్ణీనదిలో పారవేశారట. దానిలోని పదిపాశురాలున్న పత్రం పైకి తేలితే, పూర్వులు ఆ పత్రాన్ని గ్రహించి ఆదరించారట. ఆ పది గాథలే పరంపరగా మాకు అందడం వల్ల వాటినే అనుసంధానం చేస్తుంటా" మని వారు చెప్పారు. ' ఆ ప్రబంధం లభించే మార్గమే లేదా?' అని ప్రశ్నిస్తే, ఒక వృద్ధవైష్ణవుడు "మధుర కవి యాళ్వార్లు నమ్మాళ్వార్లను ఆచార్యులుగాసేవిస్తూ, వారికంటే వేరేదైవం లేదని స్తుతించిన 'కణ్ణినుణ్శి ఱుత్తాంబు' అనే చిన్న ప్రబంధాన్ని పన్నెండు (12000) వేల పర్యాయాలు నిశ్చలచిత్తంతో జపిస్తే నమ్మాళ్వార్ల అనుగ్రహంవల్ల సర్వార్థసిద్ధి కలుగుతుందని పెద్దలు చెప్పేవారు" అంటూ ఆ చిన్న ప్రబంధాన్ని నాథమునికి ఇచ్చాడు. ఆ స్వామి చెప్పిన రీతిగా, నాథమునులు చింతచెట్టు క్రింద ఉన్న నమ్మాళ్వార్ల అర్చామూర్తి యెదుట కూర్చుండి 'కణ్ణినుణ్శిఱు త్తాంబు'ను ద్వాదశ సహస్ర పర్యాయాలు జపించారు.

నమ్మాళ్వార్లు ప్రత్యక్షమై నాథమునులకు దివ్యచక్షువునిచ్చి, తమవేకాక తక్కిన ఆళ్వార్లందఱు అనుగ్రహించిన దివ్యప్రబంధాలనూ ఉపదేశించారు. రహస్యత్రయాన్ని, వేద ప్రతిపాదితమైన వైష్ణవ సిద్ధాంతాన్ని (తత్వాన్ని) ఉపదేశించి, భవిష్యదాచార్య విగ్రహాన్ని కూడా సంకల్పించి ఇచ్చారు. ఆ ద్రావిడ దివ్యప్రబంధాన్ని పారాయణం చేసినంతనే పరమపదించకుండేటట్లు ప్రార్థించగా, నమ్మాళ్వార్లు, 'మరణమాక్కి' అనే పదాన్ని 'మరణమానాల్' అని సవరించి, దీన్ని అనుసంధించే వారు దేహావసానమందే విష్ణుసాయుజ్యాన్ని పొందుతారని తెలిపారు. నాథమునులకు నైగమిక తత్త్వం కరతలామలకమై కృతార్థులైనారు వారు.

శ్రీమన్నాథమునులు గొప్ప సంగీతపరులు. పాశురాలకు రాగతాళాలను సమకూర్చి, స్వర సమ్మేళనం చేసి, తమమేనల్లుళ్లైన మేలైయకత్తాళ్వాన్, కీషై యకత్తాళ్వాన్ (తమ యింటికి పడమట ఇల్లుగలవారు, తూర్పున ఇల్లుగలవారు) అనబడే స్వాములకు బోధించి, వారిచే శ్రీరంగాది దివ్యదేశాలయందు ద్రావిడ దివ్య ప్రబంధాన్ని (నాలాయిర ప్రబంధాన్ని) అభినయంతోపాటు దేవగానం చేయించి ప్రకాశింపచేశారు. పూర్వం శ్రీరంగంలో తిరుమంగైయాళ్వార్లచే ప్రారంభింపబడిన దివ్యప్రబంధాధ్యయనోత్సవం, మళ్ళీ శ్రీమన్నాథమునులచే దివ్య దేశాలలో జరుపబడి నేటికీ కొనసాగుతున్నది.

నాథమునులు రచించిన గ్రంథాలు : 1. న్యాయతత్త్వ శాస్త్రం. 2. పురుష నిర్ణయం. 3. యోగ రహస్యం.

'ముని' అంటే మననశీలుడు. 'నాథేన, మునినా నాథవాన్' – నాథమునిచే నాథుడు కలవాడను అన్నారు దేశికులు. శ్లేషాలంకారం కలిగిన మాట ఇది. నాథమునులకు పరతంత్రుడనవుతున్నానని భావం.

**హస్తామలకతాం గతం:** అత్యంత స్పష్టమైనదని తాత్పర్యం. నదులు సముద్రంలోకి చేరే విధంగా, వేద ప్రతిపాదిత తత్త్వార్థాలు అప్రయత్నంగా భగవద్ధ్యానపరులైన నాథమునుల సత్పాత్రతను చూచి వారి హృదయంలోకి చేరినాయని సూచించారు.

**నాథవాన్ అహమ్ :** 'నాథమునులు తనకు నాథుడు - రక్షకుడు' అని తన పారతంత్ర్యాన్ని తెలుపుతున్న ఫలితంగా 'తాను నాథమునులకు ప్రణతులర్పిస్తు'న్నట్లు దేశికుల కవితాశయం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ నాథమునిం నమస్యతినాథేనేతి. యస్య - నాథమునేః; నైగమికం - నిగమప్రతిపాద్యం; తత్త్వం - స్వరూప రూపగుణవిభూత్యాది విశిష్టం భగవత్తత్త్వం; హస్తామలకతాం- అత్యంత స్పష్టమిత్యర్థః. గతం-ప్రాప్తం. తేన నాథేనమునినా - నాథమునినా; నాథేనేతి నామైకదేశే నామనిర్దేశః. అహం, నాథవాన్ - పరవాన్. పరతంత్ర ఇత్యర్థః. "పరతంత్రః పరాధీనః పరవాన్నాథవానపి". ఇత్యమరః. అత్రపరతంత్రతోక్త్యా నమస్కారః ఫలితః.

**వ్యాఖ్యానాంతరం :** ముని నాథేన (పాఠాంతరం) - మునయః మనన శీలాః, భగవద్ధ్యాన పరా ఇత్యర్థః. తేషాం నాథేన శ్రేష్ఠేన; నాథేన - నాథనామ్నా మునినా.

**6. నమస్యా మ్యరవిందాక్షం నాథభావే వ్యవస్థితమ్ ।**
**శుద్ధ సత్త్వ మయం శౌరే రవతార మివాపరమ్॥**

**అర్థం :** నాథభావే = లోకనాథ ధర్మమందు; వ్యవస్థితం = స్థిరంగా ఉన్నట్టి; అరవింద + అక్షం = కమలాలవంటి నయనాలు కలిగినట్టి; శుద్ధ సత్త్వమయం = అప్రాకృత సత్త్వమయ విగ్రహంగల; శౌరేః = శ్రీకృష్ణుని యొక్క; అపరం = మరొక; అవతారం, ఇవ = అవతారంవలె ఉన్నట్టి, నాథ భావే = నాథమునుల అభిప్రాయమందు; వ్యవస్థితం = ఎల్లప్పుడు ఉండేవాడైన; శుద్ధసత్త్వమయం = రజస్తమో గుణాలులేని సత్త్వగుణం కలవాడైన; అరవిందాక్షం = పుండరీకాక్షుడనే పేరుగల ఉయ్యక్కొండారును గూర్చి; నమస్యామి = నమస్కరిస్తున్నాను.

**తాత్పర్యము :** స్వామిత్వమందు సర్వదా స్థిరంగా ఉన్న, తామరస నేత్రాలుగల, అప్రాకృత దివ్య మంగళవిగ్రహంగల శ్రీ కృష్ణుని వేరొక అవతారం వలె ఉన్నట్టి - నాథమునుల ఆశయ మందు నిశ్చలితుడై ఉన్న, రజస్తమో గుణాలు కలియని సత్త్వగుణ ప్రాచుర్యం గలవాడైన పుండరీకాక్షుడనే ఆచార్యులకు నమస్కరిస్తున్నాను.

**వ్యాఖ్య :** శౌరి యొక్క అపరావతారంలాగా ఉన్న పుండరీకాక్షులను స్తుతించే శ్లోకం.

**నాథభావే వ్యవస్థితం :** శౌరి అనే పేరు శ్రీ విష్ణుమూర్తికి గల సహస్ర నామాలలోఒకటి. యాదవులలో శూరుడనే వాని వంశంలో అవతరించి నందువల్ల శ్రీకృష్ణునికి శౌరి అని పేరు కలిగింది. వైకుంఠంలోనైనా, ప్రకృతి మండలంలో అవతరించినవాడైనా శౌరికి స్వామిత్వం - ఉభయ విభూతి నాయకత్వం - వ్యవస్థగానే ఉండింది. యయాతి శాపంవల్ల యాదవులకు రాజతికంలేదని ఉగ్రసేనుణ్ని రాజుగా జేసిన శ్రీకృష్ణుడు నాథత్వమందు వ్యవస్థితుడే కదా!

**పుండరీకాక్షపరమైన అర్థం :** 'నల్లార్ తిరువెళ్ళరై' 'శతురర్ కళ్' అని భట్టనాథులనుగ్రహించినట్లు, నేటికి ' ఆది తిరువెళ్ళరై' అని ప్రసిద్ధిని పొందిన 'శ్వేతాద్రిక్షేత్రం'లో ప్రాచీన కాలంలోనే ప్రతిష్ఠింపబడిన శ్రీ పుండరీకాక్షస్వామికి కైంకర్యం చేస్తుండిన పురఃశిఖులైన శ్రీవైష్ణవ కుటుంబంలో జయత్సేనులనబడే దివ్యసూరి అంశతో అవతరించినందువల్ల, తల్లిదండ్రులు తమ పుత్రునికి 'పుండరీకాక్షు'డని పేరు పెట్టారు. ఉపనయన సంస్కారానంతరం పుండరీకాక్షుడు నాథమునిని ఆశ్రయించినందువల్ల, తాను నమ్మాళ్వార్ల నుంచి గ్రహించిన తత్త్వ మంతటినీ తన శిష్యునికి ఉపదేశించారు నాథముని. నాథముని వద్ద రెండు అపూర్వనిధులున్నాయి. 1. భక్తియోగం 2. నాలాయిర దివ్యప్రబంధం. ఆయనకు గల పలువురు శిష్యులలో 'కురుకైకావలప్పన్, పుండరీకాక్షులు ముఖ్యులు. 'కురుకైకావలప్పన్' నాథమునులను 'భక్తియోగాన్ని అనుగ్రహింపు' మని ప్రార్థించి, దాన్ని పొందారు. 'మీరు కూడా భక్తియోగాన్నే అభ్యసింతురా?' అని నాథమునులు

పుండరీకాక్షులను అడిగారు. అప్పుడా స్వామి 'పిణమ్‌కిడక్క పుణర్‌వార్ ఉణ్డో?" – శవం ప్రక్కన ఉండగా పెండ్లి చేసుకొనే వారుంటారా? – అంటూ నర్మగర్భంగా పలికారు. "లోకులెందరో తమ స్వరూపాన్నెరుగక ఆత్మ నాశనాన్ని పొంది, శవప్రాయులై యుండగా, నేనొక్కడనే భక్తియోగాన్ని అభ్యసించి, భగవానునితో ఆత్మ వివాహం చేసుకొని సుఖించడం తగునా?" అని ఆ మాటకు తాత్పర్యం – 'లోకమంతటిని ఉజ్జీవింపజేసే నాలాయిర దివ్యప్రబంధాన్నే దాసునికి ఉపదేశించండి' అని ప్రార్థించారు పుండరీకాక్షులు. ఆహా! లోకంలోని జనులూ, లోకనాథుడైన శ్రీమన్నారాయణుడూ, ఆ స్వామి వైభవాన్ని వర్ణించే దివ్యప్రబంధమూ, దాన్ని అభ్యసించిన నేను కూడా ఉజ్జీవించే రీతిగా, మీరే ఎంతో ఉదారమైన ఆశయాన్ని వెల్లడించారు కదా! ఇక మీద మీ గొప్పదనానికి తగినట్లు 'ఉయ్యక్కొండార్' – (ఉజ్జీవించే విధంగా స్వీకరించినవారు) అనే పేరుతోనే ప్రసిద్ధులవుతారు అని, నాలాయిర దివ్య ప్రబంధాన్ని పుండరీకాక్షులకు ఉపదేశించారు.

పుండరీకాక్షసూరి ఆచార్యులకు వినయవిధేయతలతో సర్వవిధకైంకర్యం చేసేవారు. ఆచార్య రుచిపరిగృహీత విషయాలను అనుష్ఠించేవారు. నాథమునులు తమ కుమారుడైన ఈశ్వరమునికి ఒక పుత్రుడు కలుగగలడని చెప్పినారు. నాథమునులు తమచరమ దశలో పుండరీకాక్షసూరిని పిలిచి, "పుట్టబోయే నా మనుమనికి 'యామునులు' అని పేరు పెట్టండి. నేను మీకు బోధించిన శాస్త్రాలను నా పౌత్రునికి బోధించి, ఆయనను దర్శనస్థాపకునిగా చేయండి. నాకు ఆళ్వార్లు అనుగ్రహించిన ఈ భవిష్యదాచార్య విగ్రహాన్ని మీరు నిత్యం ఆరాధిస్తూ, నా పౌత్రునికి అందజేసి, ఇది నాకు చాలా అభిమతమైన విషయమని తెల్పండి" అని ఆజ్ఞాపించారు.

"నాథో పజ్ఞం ప్రవృత్తమ్" అని దేశికులు తెల్పిన రీతిగా పూర్వాచార్యులందరికి మూలకందమైన శ్రీమన్నాథమునుల ఆదేశానుసారంగా విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని పరిరక్షించి, వృద్ధిచేసి, ప్రచారం చేసినవారు పుండరీకాక్షులు.

**శుద్ధసత్త్వమయం:** ప్రాకృతం కానట్టి శుద్ధసాత్త్వికమైన, పంచోపనిషణ్మయ విగ్రహుడు శౌరి. ప్రకృతిలోనే ఉన్నా, రజస్తమో రహితమైన శుద్ధసత్త్వగుణ సంపన్నులు పుండరీకాక్షులు.

**అరవిందాక్షం :** "శెన్దామరైక్కణ్". పుండరీకాక్షుడు శౌరి. 'పుండరీకాక్ష' నామధేయుడు 'ఉయ్యక్కొణ్డార్'. పుండరీకాక్ష సూరి జీవించియుండగా ఈశ్వరమునులకు సంతానం కలుగలేదు. కాబట్టి పుండరీకాక్షులు తమ ముఖ్య శిష్యులైన శ్రీరామమిశ్రులను పిలిచి, 'భవిష్యదాచార్య విగ్రహాన్ని వారికి ఇచ్చి, "ఇక నా జీవితకాలం పూర్తి కానున్నది. మీరే అవతరించబోయే నాథమునుల పౌత్రునికి యామునులని నామకరణం చేసి, పైతా మహధనంగా ఈ విగ్రహాన్ని అందజేయండి" అని తెల్పి, తత్త్వశాస్త్ర రహస్యార్థాలనన్నిటిని వారికి ఉపదేశించారు.

'తిరుప్పావై' ప్రబంధంలోని "అన్నవయల్ పుదువై", "శూడిక్కొడుత్త" అనే రెండు తనియన్ పాశురాలను కాక, వేరే గ్రంథాలను పుండరీకాక్షులు అనుగ్రహించినట్లు ప్రసిద్ధిలేదు.

"ద్వయ మంత్రం ప్రమాణం. దానికి విషయమైన అర్చావతారమే ప్రమేయం. ద్వయార్థాన్ని శిష్యునికి ఉపదేశించే ఆచార్యుడే ప్రమాత" అనేవి ఉయ్యక్కొణ్డార్ సూక్తులు అని 'వార్తామాల' వల్ల తెలుస్తున్నది. శ్రీమన్నాథమునుల ఆజ్ఞచే సిద్ధాన్త ప్రవర్తకులై శ్రీరంగంలో నూటయైదు (105) సంవత్సరాలు వేంచేసియుండిరి.

**సంస్కృత వ్యాఖ్యా :** అథసంజ్ఞయా విశేషణాభ్యాంచ శౌరే రపరావతార మవస్థితం పుండరీకాక్షం నమస్యతి నమస్యామీతి.

నాథ భావే వ్యవస్థితం - శౌరి పక్షేనాథభావః, నాథత్వం - స్వామిత్వం, తస్మిన్ వ్యవస్థితం, పుండరీకాక్షసూరిస్తు నాథస్య- నాథమునేః, భావే - అభిప్రాయే, వ్యవస్థితః, తం.

శుద్ధసత్త్వమయం - శౌరి పక్షే పంచోపనిషత్ విగ్రహయుక్తత్వం, శుద్ధసత్త్వమయం అస్యతు భగవత్కృపాలబ్ధ రజస్తమోగుణరాహిత్యం.

7. అను జ్ఝిత క్షమాయోగ మపుణ్యజనబాధకమ్ ।
అస్పృష్టమదరాగంతం రామం తుర్య ముపాస్మహే ॥

**అర్థం :** అనుజ్ఝిత క్షమా యోగం = విడువని 'ఓర్పు' అనే గుణ సంబంధం కలిగినట్టి; అపుణ్యజన బాధకం = సజ్జనులకు బాధను కలుగజేయనట్టి; అస్పృష్ట మదరాగం = మదం, రాగం, ద్వేషం మొదలైనవాటి స్పర్శ లేనట్టి; తం= ఆ ప్రసిద్ధుడైన; తుర్యం = నాల్గవ; రామం = రాముడైన శ్రీ రామ మిశ్రులను; ఉపాస్మహే = ఉపాసిస్తున్నాం.

**తాత్పర్యము :** క్షమను విడువని వాడునూ, పుణ్యజనులను బాధించని వాడునూ, మద, రాగ , ద్వేషాలు మచ్చుకైన లేని వాడునూ, నాల్గవ రాముడైన ప్రసిద్ధ శ్రీరామ మిశ్రులను ఆదరంతో సేవిస్తున్నాం.

**వ్యాఖ్య :** శ్రీరామమిశ్రులను స్తుతించే శ్లోకమది.

శ్రీరామమిశ్రులు శ్రీ పుండరీకాక్ష పాదాబ్జ చంచరీకులు. వీరు పుండరీకాక్షులను ఆశ్రయించి సకల శాస్త్రపారంగతులయ్యారు. పుండరీకాక్షుల ధర్మపత్ని పరమపదించినందువల్ల ఆచార్యుల గృహకైంకర్యభారాన్ని వహించి, ఆత్యంత భక్తితో సర్వవిధ సేవలను చేస్తూ పంద్రెండు (12) సంవత్సరాలున్నారు. శ్రీరంగ నగరానికి దగ్గర నున్న 'మణక్కాల్' అనే గ్రామంలో 'కుముదాక్షు'ల అంశతో అవతరించిన శ్రీరామ మిశ్రులకు 'మణక్కాల్‌నంబి' అని (తమిళమున) పేరు ప్రసిద్ధమయింది.

శ్రీ రామమిశ్రుల సహనశక్తి - క్షమాగుణం ప్రశంసనీయమైనది. శ్రీ పుండరీకాక్షుల కుమార్తెలిద్దరు శుభ్రంగాస్నానం చేసి వచ్చే దారిలో బురదతో కూడిన ఒక పిల్లకాలువ అడ్డంగా ఉంది. ఆ బాలికలు ఆ కాలువలోకి దిగక అసహ్యపడుతుంటే వారి వెంటవస్తున్న శ్రీరామమిశ్రులు కాలువకడ్డంగా పడుకొని, తమ వీపు మీది నుంచి వారు నడుచుకొంటూ దాటే రీతిగా చేశారు. ఆ బాలికలు ఈ సంగతిని తమ తండ్రికి తెలిపారు. వారు శ్రీ రామమిశ్రుల క్షమాగుణానికి సంప్రీతులై, మంగళాశాసనం చేశారు.

పరమాచార్యులైన శ్రీమన్నాథమునుల ఆజ్ఞను అక్షరాలా పాటించిన ఆచార్య పురుషులు శ్రీ రామమిశ్రులు. ఇతరుల మనస్సును కూడా నొప్పించక జీవించినవారు. వీరు తమ ఆచార్యులకు 'బ్రహ్మమేధ' సంస్కారం చేసినవారు. సహాధ్యాయులతోకూడి, శ్రీవైష్ణవ సిద్ధాన్తాన్ని వృద్ధి పరస్తూ 105 సం॥లు భూమండలాన వేంచేసియున్న వీరి శిష్యులలో అగ్రగణ్యులు ఆళవందార్ (యామునాచార్యులు).

భగవంతుని అవతారమూర్తులైన పరశురాముడు, శ్రీరాముడు, బలరాముడు అనే ముగ్గురి స్వభావాలకన్న శ్రీరామమిశ్రుల స్వభావం విలక్షణమైనది కాబట్టి ఈ ఆచార్యులను నాల్గవ రాముడని విశేషంగా స్తుతించారు వేదాన్త దేశికులు. మొదట పరశురాముని కంటె గొప్ప మహిమకలవారు శ్రీరామమిశ్రులు అన్నారు.

1. జమదగ్ని కుమారుడు పరశురాముడు. 'జమదగ్ని' శబ్దార్థాన్ని జమదగ్నియే ఇలా చెప్పుకొన్నాడు.

**జాజ మద్య జజానే హం, జిజాహీహాజిజాయషీ ।**
**జమదగ్ని రితిఖ్యాతం, తతో మావిద్ధి శోభనే॥**

"జము-భక్షణే'. ఒకే సమయాన అనేక యజ్ఞాల యందు హవిస్సులను మళ్ళీ మళ్ళీ భక్షిస్తారు. కాబట్టి దేవతలకు 'జాజమంతు' లని పేరు. 'యజం' అంటే అగ్ని. దేవతలు పూజింపబడే అగ్నియందు పుట్టినందు వల్ల తాను 'జిజాహి'. యోగం వల్ల తనను 'జమదగ్ని'గా తెలుసుకొమ్మన్నాడు. (జాజమత్ - ప్రథమాక్షరలోపంచేత 'జమత్+అగ్ని = జమదగ్ని. జాజమంతమైన అగ్ని కలవాడు కాబట్టి. 'జమదగ్నిమంతుడు'. 'మతుప్' లోపించడంవల్ల 'జమదగ్ని' రూపం నిష్పన్నం).

జమదగ్ని భార్య ప్రసేనజిత్తుకూతురైన రేణుక. గాధి మహారాజు కూతురైన సత్యవతి ఋచీక మహర్షిపత్ని. సత్యవతి తన తల్లికీ, తనకూ ఒక పుత్రుని ప్రసాదించుమని తన భర్తను వరమడిగింది. సత్యవతిని ఔదుంబరాన్ని (మేడిచెట్టును), సత్యతల్లిని అశ్వత్థాన్ని (రావిచెట్టును) ఆలింగనం చేసుకొమ్మన్నాడు

ఋచీకుడు. అది విపరీతమయింది అంటే ఆ యిద్దరు ఆ పనిని తారుమారుగా చేశారు. పొరపాటును మన్నించుమని ఇద్దరూ ఋషిని ప్రార్థించారు. సత్యవతికి యజ్ఞ హవిఃపాత్రను, సత్యవతి తల్లికి మంత్రజల కలశాన్ని ఇచ్చి, పూజించి సేవించు మని చెప్పినందువల్ల పూజాగృహంలో వాటిని పూజించారు. కాని వాటిని సేవించడంలో మళ్ళీ పొరపడ్డారు. తత్ఫలితంగా, సత్యవతి తల్లికి మాత్రం, క్షత్రియజాతియైనా, ఔదుంబర, హవిఃప్రభావజనితుడైన విశ్వామిత్రుడు కౌశికీ నదీ తీరంలో బ్రహర్షిత్వాన్ని పొందాడు. సత్యవతికి క్షత్రియ స్వభావుడైన పుత్రుడు జన్మిస్తాడని చెప్పితే అయ్యో! ఆ స్వభావం పౌత్రునికి కలిగే విధంగా అనుగ్రహించు మని ప్రార్థించింది. "తథాஉస్తు" అన్నాడు ఋచీకుడు. ఇతని పుత్రుడే జమదగ్ని. విశ్వామిత్రుని మేనల్లుడైన జమదగ్ని వల్ల 'రేణుక' యందు రుమణ్వంతుడు, సుహోత్రుడు, వసు, విశ్వావసు, పరశురాముడు అనే ఐదు గురు పుత్రులు ఉద్భవించారు. క్షత్రియస్వభావులు. తండ్రిమాటను పాటించినందువల్ల పరశురాముడు జమదగ్నికి ప్రియ పుత్రుడయ్యాడు. (భారతం-వనపర్వం) పరశురాముడు తన తండ్రిని చంపిన హైహయ రాజవంశీయులనే కాక, ఇరవై యొక్క సార్లు భూమిపై సంచరిస్తూ అనేక క్షత్రియ రాజులను సంహరించినవాడు. కోపాగ్నికి ప్రసిద్ధుడు. కాబట్టి దయాశతకంలో దేశికులు పరశురాముణ్ని సహనంలేనివాడు (అసహనముని) అని వర్ణించారు. క్షమా 'శబ్దానికి సహన మనీ, భూమి అనీ నానార్థాలున్నాయి. పరశురాముడు, క్షత్రియవధ చేసి గ్రహించిన భూమిని-క్షమను-కశ్యపప్రజాపతికి దానంగా వదిలివేశాడు. కాబట్టి పరశురాముడు "ఉజ్ఝితక్షమాయోగుడు". శ్రీరామమిశ్రులు మాత్రం జీవితంలో క్షమాగుణాన్ని వీడనందువల్ల "అనుజ్ఝితక్షమాయోగుడు".

2. దశరథ పుత్రుడైన శ్రీరాముడు రాక్షసులనెందరినో సంహరించాడు. పుణ్యజనులు అంటే సాధువులు, రాక్షసులు అనే అర్థాలున్నాయి.

"యాతుధానః పుణ్యజనః" (అమరనిఘంటువు). శ్రీరాముడు సత్త్వగుణ ప్రధానులైన సాధువులను బాధించే పుణ్యజనులను అంటే రాక్షసులను అంతం చేయడం దోషం కాదు. అయినా 'పుణ్యజన' శబ్దార్థశ్లేషతో - పుణ్యజనుల

(సాధుజనుల)ను బాధపెట్టనివాడు శ్రీరామమిశ్రులు అని - వీరిపట్ల 'అ పుణ్యజనబాధకు'డని ఆదరాతిశయంతో పలికారు దేశికులు.

3. శ్రీకృష్ణుని అగ్రజుడైన బలరాముడు మదంకలవాడు. రాగం కలవాడు. 'మదరాగం' అనే చోట 'మదిరాగంధం' అనే పాఠాంతరమూ ఉంది. క్షత్రియ వర్ణాచారాన్ని బట్టి బలభద్రుడు మద్యపానం చేసేవాడు. అందువల్ల మదమత్తుడై కన్నుల్లో ఎరుపువన్నెకల వాడని వర్ణింపబడినాడు. మద్యంవాసన కలవాడని అర్థం.

"మదచ్ఛల పరిచ్యుత ప్రణత దుష్కృతప్రేక్షితైః" (దయాశతకం. 88)

మద్యపానం వల్ల ఏర్పడిన మద మనే వ్యాజం చేత ఆశ్రితుల దుశ్చరితాలను బలదేవుడు గమనించేవాడు కాదన్నారు దేశికులు. శ్రీ రామమిశ్రులకు అలాంటి దురాచారాలేమీ లేవు. కాబట్టి ఈ ఆచార్య పురుషుడు 'అస్పృష్టమదరాగు'డు.

మదరాగాలు మచ్చుకైనా లేని శ్రీరామమిశ్రులు ఆచార్యుల ఆజ్ఞానుసారంగా శ్రీరంగం నుంచి వీరనారాయణపురం వేంచేశారు. అక్కడ శ్రీమన్నాథమునుల పుత్రుడైన ఈశ్వరమునులకు పత్నియైన శ్రీరంగనాయకియందు శ్రీమన్నారాయణుని సింహాసనాంశతో ఉద్భవించిన కుమారునికి యామునాచార్యులని నామకరణం చేయించారు. ఉపనయనానంతరం చతుర్వేదాలను సాంగోపాంగంగా అధ్యయనం చేయించారు. ఈశ్వరమునులు మహాభాష్యభట్టరు వద్ద యామునాచార్యులను చదివించి, సర్వశాస్త్ర పండితుణ్ని చేశారు.

చోళభూపతి పురోహితుడైన అక్కియాళ్వాన్ ప్రతి సంవత్సరం పండితుల నుంచి కప్పం తీసుకొనే వాడు. మహా భాష్యభట్టర్ ఆ సుంకాన్ని చెల్లించనందువల్ల రాజభటులు వచ్చారు.

'మూడు సంవత్సరాల నుంచి కప్పం చెల్లించలేదు. చెల్లించాలని రాజశాసనం' అన్నారు రాజభటులు. 'పండితులనవమానింపజేసే మీ యజమానులకు మర్యాద తెలిసినట్లు లేదే' అని యామునాచార్యులు

రూక్షస్వరంతో పలికారు. 'మీరు కవులా? పండితులా?' అని రాజభటులా బాలుణ్ణి అడిగారు.

**"నవయం కవయస్తు కేవలం నవయం కేవల తంత్రపారగాః**
**అపితు ప్రతివాది వారణప్రకటాటోపనివారణక్షమాః ॥**

'మేము కవులముకాము. కేవలం మంత్రతంత్రవేత్తలమూ కాము. కాని ప్రతివాదులనే ఏనుగులగర్వాన్ని నిర్మూలించే సమర్థుల' మని వ్రాసి ఇచ్చి పంపారు యామునులు.

కోలాహలుడనే అక్కియాళ్వాన్, ఆ పత్రికను చూచుకొని కోపంతో 'రాజాజ్ఞను ఉల్లంఘించిన మహాభాష్యభట్టర్ శిష్యుడైన ఆ పండ్రెండేండ్ల బాలుణ్ణి రప్పించి శిక్షింపు' మని రాజునుకోరాడు. బుద్ధిమంతుడైన ఆ బాలుణ్ణి మర్యాదగా రప్పించదలచాడు రాజు. పల్లకిని పంపాడు. యామునులు రాజ పల్లకిని అధిరోహించి, రాజసభకు వచ్చారు. పండితగోష్ఠిలో ప్రవేశించిన ఆ బాలుణ్ణి చూచి, ఆ రాజ పురోహితుడు 'నీవేమి చదివినా' వని ప్రశ్నించాడు.

**"ఆ శైలా దద్రి కన్యాచరణకిసలయ న్యాస ధన్యో పకంఠా**
**దా రక్షో నీత సీతాముఖకమల సముల్లాసహేతో శ్చసేతోః**
**ఆచ ప్రాచ్యప్రతీచ్య క్షితిధరయుగళా చ్చంద్ర సూర్యావతం సాత్**
**మీ మాంసా శాస్త్రయుగ్మశ్రమ విమలమనా మృగ్యతాంమాదృశోన్యః"**

"పర్వత పుత్రియైన పార్వతీదేవి చిగురుల వంటి పాదాలచే సంచరించడం వల్ల ధన్యమైన ప్రాంతంగల హిమవత్పర్వతం మొదల్కొని రావణునిచే తీసుకొనిపోబడిన సీతాదేవి ముఖకమల వికాసానికి హేతువైన సేతువు వరకును; తూర్పు పడమరలో నున్న సూర్యచంద్రులను, ఉదయాస్తమయాలలో తనకు శిరోభూషణంగా ధరించే ఉదయాద్రి మొదలు అస్తాద్రి వరకును, పూర్వోత్తర మీమాంసాశాస్త్రాలలో నాలాగా పరిశ్రమచేసిన పండితుడెవడైనా మరొకడు ఉంటే వెదకి తెమ్ము" అనే అర్థం గల శ్లోకాన్ని ఆశువుగా చెప్పి, సమాధానమిచ్చారు యామునులు.

అక్కియాళ్వాన్ ఈ ప్రతిజ్ఞా వాక్యాన్ని విని క్రుద్ధుడై యామునులను వాదానికి ఆహ్వానించాడు. పండిత సభనేర్పరచాడు రాజు.

రాణిగారు యాములుల బ్రహ్మవర్చస్సును చూచి, ఈ బాలుడే విజేత అవుతాడన్నది. రాజుగారు మన ఆస్థాన పండితుడే గెలుస్తాడన్నాడు. "ఈ బాలుడే ఓడిపోతే వేటకుక్కలకాహారంపెడుతూ నేను నీచవృత్తి నాచరిస్తా' నన్నది పట్టపురాణి. 'పురోహితుడైన పండితుడే జయించకపోతే నేను ఆ బాలునికి అర్ధరాజ్యమిస్తా' నన్నాడు రాజుగారు.

అక్కియాళ్వాన్ యాములులతో "నీవు బాలుడవు. శాస్త్రవాదం తర్వాతచేతాం. ముందుగా, లౌకికంగా మూడు ప్రశ్నలను అడుగు, నేను ఆరు తప్పులు పడుతాను. లేదా, నేనారు మాటలను చెబుతాను. నీవు మూడు తప్పులు పట్టు. ఓడిన వాని తలను గెల్చిన వాడు తన్నవచ్చును" అన్నాడు.

యాములులు పురోహితుని చూచి

1. అవంధ్యాకిల తేమాతా - నిన్ను గన్న తల్లి గొడ్రాలు కాదు.
2. రాజపత్నీ పతివ్రతా - రాజు భార్య పతివ్రత
3. ఏషరాజాచధర్మజ్ఞః - ఈ రాజు ధర్మాతుడు.

ఈ మూడు మాటలకు కాదని సమాధానం చెప్పు మన్నాడు.

ఆ కోలాహలుడు సిగ్గుపడి నిరుత్తరుడయ్యాడు.

యామునార్యా! ఈ మూడు మాటలను రాజపురోహితుడే అడిగితే, నీవేమి సమాధానం చెబుతావు? అని పండితులడిగారు.

1. పండితలోకానికి కంటకుడు కాబట్టి ఈ పురోహితుని కన్నతల్లి బిడ్డలు లేనిదే. ఏక పుత్రుని కనడం వల్ల కదళీవంధ్య అనబడే గొడ్రాలుకదా!
2. ఏకాంతంగానైనా భర్తతో వాదించడం వల్ల ఈ రాజు భార్య పతివ్రత కాదు.
3. పండితులను అవమానించే వ్యక్తిని పురోహితునిగా అంగీకరించడం వల్ల ఈ రాజు ధర్మాత్ముడు కాదు.

రాజు, పండితులు అందరు యుక్తి యుక్తమైన సమాధానములను చెప్పిన

యామునార్యులను మెచ్చుకొన్నారు. "రాజపురోహితుడవు, వయోవృద్ధుడవై నందువల్ల ఓడిన వారి తలను తన్నవలెననే ప్రతిజ్ఞను మానుకొన్నాను. పండితులను ఇక ముందు నీవు సుంకం చెల్లించుమనడం మానుమని చెప్పి ఒప్పించాడు యామునులు.

వాదాన్ని విన్న రాజపత్ని తెరచాటునుంచి పరుగునవచ్చి "ఎన్నై ఆళవన్దారే" - నన్ను రక్షింపవచ్చిన వారే! అంటూ యామునబాలుణ్ని ఎత్తుకొని మురిసిపోయింది. అప్పటి నుంచి యామునార్యులకు 'ఆళవన్దార్, అనే ప్రసిద్ధనామమేర్పడింది.

రాజుగారు అర్ధరాజ్యాన్ని సమర్పించారు. యామునార్యులు రాజ్యమేలుతూ, యుక్తవయస్కులైరి. వివాహమాడిరి. "వర రంగాచార్యులు, శొట్టైనంబి" అనే ఇద్దరు పుత్రులతో సుఖంగా కాలం గడపుతున్నప్పుడు శ్రీరామమిశ్రులు రాజభవనానికి వచ్చారు. ద్వారపాలకులు అడ్డగించారు. యామునులకు ఇష్టమైన అలర్కశాకం (ఉస్తెయాకుకూరను) తెచ్చి వంటస్వామికి ఇస్తుండిరి. అయినా యామునులు వీరిని గూర్చి విచారించలేదు. నాలుగు దినాలు కూరను తెచ్చియివ్వడం మానుకొని అయిదవరోజు మళ్ళీ తెచ్చాయిచ్చారు శ్రీరామమిశ్రులు. "నాలుగు రోజులు కూరలేనికారణమేమి?" అని వంటస్వామిని యామున ప్రభువడిగాడు. ఆరునెలల నుంచి కూర తెచ్చియిస్తూ, నాలుగు రోజులు మానుకొన్నవారే నేడు మళ్ళీ తెచ్చి యిచ్చారన్నాడు. 'అయితే రేపువారు రాగానే నాకు తెల్పు' మన్నాడు యామున ప్రభువు.

మరునాడు శ్రీరామమిశ్రులు వచ్చిన వెంటనే వంటస్వామి తెల్పాడు. ఆళవందార్ త్వరగా వచ్చి నమస్కార పూర్వకంగా స్వాగతం పలికి సుఖాసీనుల చేశారు. "అలర్కశాకం మీరు తెచ్చి ఇవ్వడానికి కారణమేమి? మీకేం కావాలి? అని అడిగారు. "నేను మీ నుంచి తీసుకోవడానికిరాలేదు. మీ తాతగారైన నాథమునులు దాచిన నిధిని మీకీయడానికి వచ్చాను. మీరు దాన్ని తీసుకొనే దాకా నన్ను మీ వద్దకు రావడానికి అనుమతినీయవలసిన"దని శ్రీరామమిశ్రులు పలికారు. ఆళవందార్ అంగీకరించారు.

శ్రీరామమిశ్రులు సకలోపనిషత్సారభూతమై తత్త్వార్థబోధకమైన శ్రీమద్భగవద్గీతార్థాన్ని ప్రతిదినం ఉపదేశించారు. చరమశ్లోకార్థాన్ని విన్నంతనే యామునార్యులకు పరమాత్మునియందురక్తి, సంసారమందు విరక్తి కలిగింది.

**న చజ్ఞానస్య సంకోచః న చైవాయమ గోచరః ।**
**తస్మాద్రంగం మహాపుణ్యం కోనసే వేతబుద్ధిమాన్ ॥**

అన్నట్లూ, జ్ఞానానికి సంకోచం కలిగించనిదై, పుణ్యవర్థకంగా ప్రసిద్ధిని పొందిన శ్రీరంగక్షేత్రానికి యామునాచార్యులను తీసుకొనిపోయి "ఇదే మీ పెద్దలు దాచి ఉంచిన నిధి" అని శ్రీ రంగనాథుణ్ని దర్శింపజేశారు. వ్యర్థంగా గడచిన కాలానికి చింతించి, వెంటనే యామునాచార్యులు సన్యాసాశ్రమాన్ని స్వీకరించి, శ్రీ రంగనాథునికి సర్వవిధకైంకర్యాలను చేస్తూ అక్కడనే ఉన్నప్పుడు శ్రీరామమిశ్రులు సకల సంప్రదాయ రహస్యార్థాలను బోధించారు.

"స్వప్రవృత్తి నివృత్త్యంశః ప్రపత్తిరితిలక్షితః" తన రక్షణ కోసం తానేమీ చేయక, ఆత్మ రక్షణభారాన్ని శ్రియఃపతిపైన ఉంచడమే "ప్రపత్తి" అని శ్రీరామమిశ్రులచే నిర్వచింపబడింది.

'కురుకైక్కావలప్పన్' అనే నాథమునుల శిష్యునివద్ద అష్టాంగయోగ రహస్యాన్ని పొందవలసిందని యామునాచార్యులకు చెప్పగా, వారు, ఆ రహస్యం మీకెందుకు లభించలేదని ప్రశ్నించారు. "మా ఆచార్యులు పుండరీకాక్షులు" పిణమ్‌కిదక్క వుణర్‌వార్ ఉణ్ణో?– పీనుగ ప్రక్కన ఉంటె పెండ్లి చేసుకొనే వారుంటారా? అని పొందలేదు. అందువల్ల ఆ రహస్యం మాకూ లభింప లేదన్నారు. శ్రీరామమిశ్రులు ఆళవందారులతో 'నాథమునులతో రెండు సంబంధాలున్న మీరు వారి పాదాలే ప్రాప్యప్రాపకాలని నమ్ముతూ, మీ వలె ఒక దర్శన ప్రవర్తకులను ఏర్పరచి శ్రీరంగక్షేత్రాన్ని విడువక ఉండు' మని ఆజ్ఞాపించారు. శ్రీరామమిశ్రులు తమ ఆచార్యుల తిరువడిని చేరుకోగానే, ఆళవన్దార్ తమ ఆచార్యులకు బ్రహ్మమేధ సంస్కారాలను జరిపారు.

ఎంతో ఓర్పూ-నేర్పూ కలిగి, సత్పథాచార పురుషులను సిద్ధంచేయడంలో విద్యాభిజనమదరాగాలులేకుండా, కేవలం స్వాచార్యాజ్ఞను పాటించి ఎలా పరిశ్రమించారో శ్రీరామమిశ్రుల చరిత్ర వల్ల స్పష్టంగా తెలుస్తున్నది కదా!

**సంస్కృత వ్యాఖ్యా :** అథ రామమిశ్రార్యం రామత్రయోత్కర్ష వర్ణన పూర్వకం నమస్యతి, అనుజ్ఝితేతి. అనుజ్ఝిత క్షమాయోగం - పరశురామస్తు అసహనమునిత్వాత్ ఉజ్ఝిత క్షమాగుణయోగః, కాశ్యపాయదత్త కృత్స్నభూమిత్వాత్ ఉజ్ఝితభూమియోగఇతివా, అసౌతుక్షమావాన్, తమ్. అపుణ్యజనబాధకం - దశరథ రామస్తుపుణ్యజనబాధకః, పుణ్యజనాః-యాతుధానాః. "యాతుధానః పుణ్యజన" ఇత్యమరః, తేషాం బాధకః - అసౌతు పుణ్యజనానాం - సాధూనాం, అబాధకః - ఆనందకర ఇతియావత్. యద్వా అపుణ్యజనానాం - శంకరాది కుదృష్టీనాం. బాధకః తమ్. అస్పృష్టమదరాగం - బలరామస్తు స్పృష్టమదరాగః అసౌతు రాగద్వేష మదాదికైః అస్పృష్టః, తమ్. తస్మాత్త్రేభ్యోప్యుత్కృష్టం; తుర్యం తం రామం - శ్రీరామ మిశ్రార్యం. ఉపాస్మహే - నమస్కుర్మహే.

8. **విగాహే యామునం తీర్థం సాధుబృందావనే స్థితమ్ ॥**
**నిరస్త జిహ్మగస్పర్శే యత్ర కృష్ణః కృతాదరః ॥**

**అర్థం 1 :** నిరస్త జిహ్మగ స్పర్శే । నిరస్త = నిరసింపబడిన, జిహ్మగ = వక్రమైన, క్రూరమైన బుద్ధి యొక్క; స్పర్శే = స్పర్శ (తగులం) కలిగిన; యత్ర = ఏ యామునాచార్యులయందు, కృష్ణః = భూమికి ఆనందం కలిగించే పరమాత్ముడు; కృత+ఆదరః = చేయబడిన ఆదరం (గౌరవం) కలవాడో; (తం=అట్టి) సాధు బృంద+అవనే = సాత్త్విక జన సమూహం యొక్క రక్షణ మందు; స్థితం = ఉన్నట్టి; యామునం =యామునాచార్య విషయమైన; తీర్థం = పవిత్రమైన శేషత్వానుసంధానాన్ని; విగాహే = అవగాహిస్తున్నాను.

**అర్థం 2 :** నిరస్త = తొలగింపబడిన; జిహ్మగ = కుటిలగమనం కల కాళియ సర్పం యొక్క; స్పర్శే = స్పర్శ కలిగిన; యత్ర = ఏయమునానది యందు; కృష్ణః = శ్రీగోపాలకృష్ణుడు; కృత+ఆదరః = చేయబడిన ఆదరం

కలవాడో; (అట్టి) సాధు బృందావనే = చక్కని బృందారణ్యమందు; స్థితం = ఉన్నట్టి; యామునం = యమునా నదికి సంబంధించిన; తీర్థం = రేవునందలి జలమున; విగాహే = మునుగుతున్నాను - స్నానం చేస్తున్నాను.

**తాత్పర్యము :** 1) యామునా చార్యులకు కుటిలబుద్ధిలేదు. ఆయన రాగద్వేషాలు లేనివాడు.

2) యమునా నదీ తీర్థానికి కాళియ సర్పస్పర్శలేదు. అది అవగాహింప దగినది.

1) యామునాచార్యుల యందు శ్రీ కృష్ణపరమాత్మకు ఆదరం ఉంది.
2) యమునానదీ తీర్థమందు గోపాలకృష్ణునికి ఆదరం ఉంది.
1) యామునాచార్యులు సాత్త్విక జను ఃబృందాన్ని కాపాడడమందు ఉద్యుక్తుడు
2) యమునా నదీ తీర్థం సాధు బృందారణ్యమందు ప్రవహిస్తుంది.
1) యామునాచార్యులపట్ల శేషత్వాను సంధానం చేస్తున్నాను.
2) యమునానదీ తీర్థమందు అవగాహిస్తున్నాను.

**వ్యాఖ్య :** యామునాచార్యులకు దేశికులు చేసే శేషత్వానుసంధాన రూపమైన నమస్కృతిని వర్ణించే శ్లోకం. శ్లేషాలంకృతం.

శ్రీరామమిశ్రులు, శ్రీమన్నాథమునులనే తమ పరమాచార్యుల నియమనానుసారంగా ఎంతో శ్రమపడి, అనాదిసిద్ధమైన శ్రీవైష్ణవానికి కొంత క్లిష్టదశ ఏర్పడిన సమయంలో, పాండిత్య ప్రతిభాపాటవాలతో కోలాహలుని జయించి, 'ఆళవందా'రని పేరును పొంది, రాజ్యమేలుతున్న యామునా చార్యులను, ఆయన తాతగారి ఆధ్యాత్మికమైన పెన్నిధికి వారసులను చేశారు. వేదాంత శాస్త్రాదుల బోధించి, నాథమునుల తర్వాత శ్రీ వైష్ణవ ధర్మస్థాపకులయ్యే యోగ్యతను కల్పించారు. మంత్రోపదేశం చేత యామునాచార్యులు ప్రాపంచిక విషయాలయందు విరక్తుడై. పరమాత్మునియందు రక్తి కలిగి అనన్య భక్తులయ్యారు. సన్యాసాశ్రమాన్ని స్వీకరించి శ్రీరంగంలోనే నివసించారు. శ్రీరంగనాథుని కైంకర్యం చేస్తూ, శ్రీ పరాంకుశదాసన్ (పెరియనంబి) మొదలైన శిష్యులకెందరికో విశిష్టాద్వైత సంప్రదాయార్థాలను బోధించారు శ్రీయామునాచార్యులు. వీరి కృతులు ఆరు.

**మానత్వం భగవన్మతస్య మహతః పుంసస్తథా నిర్ణయః**
**తిస్రః సిద్ధయ ఆత్మసంవిదఖిలాధీశాన తత్త్వాశ్రయాః ।**
**గీతార్థస్యచ సంగ్రహః స్తుతియుగం శ్రీశ్రీశయోరిత్యమూ**
**న్సద్గ్రంథా ననుసందధే యతిపతిస్తం యామునేయం భజే॥**

అనే ప్రామాణిక శ్లోకాన్ని శ్రీ వేదాన్త దేశికులు రచించారు.

1. **పురుష నిర్ణయం :** విష్ణుపరత్వాన్ని ప్రతిపాదించే గ్రంథమిది.

2. **సిద్ధిత్రయమ్ :** 'ఆత్మసిద్ధి, ఈశ్వరసిద్ధి, సంవిత్సిద్ధి' అనే మూడు భాగాలుగల ఈ గ్రంథంలో చిదచిదీశ్వర తత్త్వాలు సత్యాలని, సప్రమాణంగా ఇతర మతనిరసన పూర్వకంగా ప్రస్తుతింపబడినాయి.

3. **ఆగమప్రామాణ్యమ్ :** పాంచరాత్రాగమం వైదికం, అపౌరుషేయమనీ, పరవాసుదేవుని ఉచ్ఛ్వాస, నిశ్వాసరూపమనీ సాధింపబడింది.

4. **చతుఃశ్లోకి :** నాల్గుశ్లోకాలున్న ఈ గ్రంథంలో లక్ష్మీనారాయణుల అన్యోన్య సంబంధం, జీవుణ్ని దేవుని సన్నిధికిచేర్చే లక్ష్మీపురుషకారత్వం వర్ణింపబడింది.

5. **స్తోత్రరత్నమ్ :** దీనికే 'ఆళవన్దార్‌స్తోత్ర' మని (నామాంతరం) పేరు. ఇది విశిష్టాద్వైత మత సిద్ధాంతాలను, ప్రపత్తి యొక్క ప్రాధాన్యాన్ని విశదీకరిస్తుంది. ఇందు 67 శ్లోకాలు ఉన్నాయి.

6. **గీతార్థ సంగ్రహం:** ఇందు 32 శ్లోకాలు ఉన్నాయి. భగవద్గీతలోని పద్దెనిమిది అధ్యాయాలను మూడు షట్కాలుగా విభజించి, వేదాన్త సంప్రదాయ రీతిగా గీతాసారార్థం సంగ్రహింపబడింది.

యామునా చార్యులు రచించిన ఈ ఆరు గ్రంథాల చేత భగవద్రామానుజులు చాలా ప్రభావితులయ్యారు.

ఈ శ్లోకంలో యామునాచార్యులను యమునానదితో పోల్చిస్తుతించారు దేశికులు.

1. నిరస్త జిహ్మగ స్పర్శకలది యమునానది. కాళియుడనే కృష్ణ సర్ప స్పర్శచేత యమునా నదీ తీర్థమంతా విషమయమైనది. విషజ్వాలలకు పైన ఎగిరే పక్షులు కూడా మాడిపోయి ఆ మడుగులో పడిచచ్చిపోయేవి. గోవుల, గోపాలకుల దప్పితీర్చలేని ఆ జలాన్ని పరిశుద్ధం చేయడానికి శ్రీకృష్ణుడు కదంబవృక్షమెక్కి ఆహ్రదంలోకి దూకాడు. కాళియుడు సహించలేక కృష్ణుని శరీరాన్ని కరుస్తూ, తన శరీరంతో చుట్టి వేశాడు. పరవశుడైనట్లు నటించిన కృష్ణుడు ఆ పాము బంధాన్ని దులుపుకొని పైకి లేచాడు. విషాగ్నినివెలిగ్రక్కుతూ పైకి విప్పిలేచిన కాళియుని నూటఒక్క పడగలమీదికి ఎక్కి, మందహాస సుందర వదనార విందుడైన గోవిందుడు చిత్రతాండవంతో నాట్యమాడాడు. ఒక పడగను తొక్కగానే మరొకపడగనెత్తేవాడు కాళియుడు. విశ్వంభరుడైన శ్రీ కృష్ణుని పాదప్రహారాలతో కాళియుని ఫణాలు, శరీరం శిథిలమయినాయి. శ్రీ కృష్ణుడే శరణమని కాళియుడు, అతని పత్నులు వేడుకొన్నారు. గరుత్మంతునికి భయపడిన నీవు, పూర్వం సౌభరి, తనకుప్రియమైన 'ఈ మడుగులోని చేపలనుమ్రింగితే గరుడుడు చస్తా' డని శాపమిచ్చినందువల్ల, గరుడుడు ప్రవేశించలేని ఈ హ్రదమందు చేరి నీటిని విషదూషితం చేశావు కదా! నా పాదలాంఛనాన్ని చూచి గరుడుడు ఇక నిన్నుహింసించడు. ఇక్కడి నుంచి వెళ్ళిపో! పూర్వం నీవు ఉన్న రమణకద్వీపానికి చేరుకొమ్మని శ్రీకృష్ణుడు కాళియుణ్ణి ఆజ్ఞాపించి పంపాడు. కాబట్టి, అప్పటి నుంచి యమునా నదీజలం, సర్ప స్పర్శ లేశమైనాలేకుండా, శ్రీ కృష్ణుని పాదస్పర్శచేత పరిశుద్ధమై స్నాన పానాదులకు యోగ్యమైనది.

నిరస్త జిహ్మగ స్పర్శకలవాడు యామునముని. "జిహ్మగాః క్రూర బుద్ధయః" అన్నట్లు 'జిహ్మగ' శబ్దానికి 'సర్పం, కుటిలమైన క్రూరమైన బుద్ధికల వ్యక్తి' అనే అర్థాలున్నాయి. స్పర్శకైనా కపటవర్తనం, రాగద్వేషాది గుణాలు లేనివాడు యామునులు. రజస్తమోగుణాలు కలియని స్వచ్ఛమైన సత్త్వగుణం కలవాడు. పరమైకాంతభక్తుడు. మహాజ్ఞాని. తన ప్రామాణికగ్రంథాల ద్వారా కుబుద్ధుల, కుదృష్టుల అపసిద్ధాంతాలను ఖండించి, విశిష్టాద్వైత సిద్ధాంతాలను ఉద్ధరించిన గరీయః ప్రతిభావంతుడు యామునాచార్యులు.

శ్రీకృష్ణుని ఆదరం కలది యమునానది. మొట్టమొదట వసుదేవుని నెత్తిన ఎక్కిన శ్రీకృష్ణుడు నందగోకులానికి పోవడానికి తన దగ్గరికి వచ్చాడని పొంగిపొరలే యమున "జానుమాత్రోదకో యయౌ" - మోకాళ్ళబంటి నీళ్ళున్న మార్గాన్ని వసుదేవునికి కల్పించింది. ఆదరించి, ఆదరింపబడింది. "వల్లవీ వదనోచ్ఛిష్ట పవిత్రాధర విద్రుమః" అన్నట్లు శ్రీకృష్ణుడు గోపికలతో జలక్రీడల సలిపినప్పుడు, తమగండూషణ స్నానాదులచేత యమునను అతిపవిత్రం చేశాడు.

"తూయ పెరునీర్ యమునైతుఱైవనై" - శుద్ధమైన మహాజలప్రవాహం గల యమునా నది యొక్క తీరాన నివసించేవాడు శ్రీకృష్ణుడని గోదమ్మ కీర్తించింది. "కృష్ణాన్వయేన దధతీం యమునానుభావం" - యమునానదికి శ్రీకృష్ణునితో సంబంధమున్న వైభవాన్ని దేశికులు 'గోదాస్తుతి' లో వర్ణించారు కదా! అంతేకాదు; ఇసుకతిన్నెల మీద గోపికలతో కూడి తన యౌవన వైభవాభియోగానికి యమునను సాక్షిణిగానూ నిల్పి, ఆదరించినవాడు శ్రీకృష్ణుడు.

అలాగే శ్రీకృష్ణునికి యామునాచార్యులయందెంత ఆదరంకలదో! అని తెలిపే ఐతిహ్యం ఉంది. ఆచార్యులైన శ్రీరామమిశ్రుల ఆజ్ఞానుసారంగా యామున మునులు కురుకావలప్పన్ సన్నిధికి యోగరహస్యోపదేశాన్ని పొందడానికి చేరుకొన్నాడు. ఆ సమయాన అప్పన్‌స్వామి సమాధిష్ఠుడై యున్నాడు. స్వామికి యోగ భంగంకాకుండా ఆయన వెనుకవైపు యామునులు నిశ్శబ్దంగా నిలచియున్నాడు. సమాధి యోగంలో ఉన్న కురుకావలప్పన్ హఠాత్తుగా వెనకకుతిరిగి "ఇక్కడికి శొట్ట కులం వారెవరైనా వచ్చారా?" అని అడిగాడు. "అయ్యా! యామునదాసుడను. శ్రీరామమిశ్రులవారు పంపించగా దేవరవారిని సేవించడానికి దాసుడు వచ్చా"డని విన్నవించాడు. 'వెనుకవైపున ఉన్న దాసుడు వచ్చినట్లు దేవరవారికి ఎలా తెలిసింది'? అని యామునులు అడిగాడు. "ఇంతసేపు నా ముఖాన్నే చూచిన శ్రి యః పతి ఇప్పుడు నా వెనుక కున్న మీ ముఖాన్నే చూస్తున్నాడు. నాథమునుల యందున్న ప్రీత్యతిశయంచేత సర్వేశ్వరుడు చూడగల్గేది, వారి వంశస్థులైన శొట్ట కులం వారివైపే. కాబట్టి నేను అలాగా చెప్పగలిగాను" అన్నారు అప్పన్ స్వామి.

శొట్ట కులంవారికి శ్రీ కృష్ణభగవానుడు ఇలువేల్పు. శ్రీ కృష్ణుడు తన అవతారాన్ని ముగించే ముందు యామునాచార్యుల వంశంలోని పూర్వాచార్యులలో ఒకరికి తన అర్చారూప(కృష్ణ) విగ్రహాన్ని తానే ఇచ్చాడట. అప్పటి నుంచి ఆ వంశంలోని వారందరు, యామునాచార్యులు కూడా ఆ కృష్ణ విగ్రహానికి తిరువారాధనను సమర్పిస్తూ ఉండేవారట. కాబట్టి, యామునాచార్యుల యందు శ్రీకృష్ణునికి అత్యంతాదరం ఉంది.

దివ్య ప్రబంధాలకు వ్యాఖ్యానం రచించిన శ్రీకృష్ణసూరి – పెరియవాచ్చాన్ పిళ్ళై – వ్యాఖ్యాతృచక్రవర్తి అనే ప్రసిద్ధిని పొందిన ఆచార్యపురుషులు. వీరు మొట్టమొదట యామునాచార్యుల స్తోత్రరత్నానికి వ్యాఖ్యానం వ్రాశారు. కాబట్టి శ్రీ కృష్ణసూరికి ఆళవన్దార్ పట్ల అదరాతిశయం కలదనీ, దేశికులు పెరియ వాచ్చాన్ పిళ్ళై విషయంలో గురుత్వాన్ని ప్రకటిస్తూ, వారిని ప్రశంసిస్తున్నారనీ శ్లోకంలోని 'కృష్ణఃకృతాదరః' అనే ప్రయోగం వల్ల సూచితార్థమన్నారు విజ్ఞులు.

"శుభేన మనసాధ్యాతం" – పల్లేరుముండ్లతో నిండియున్న బృందారణ్యం, గోవులను గోపాలకులను అక్కడికి మార్చాలనే శుభ సంకల్పం ఐదేండ్ల బాలుడైన శ్రీకృష్ణునిలో కలిగిన వెంటనే, లేత పచ్చికతో నిండి పచ్చని తివాచీలు పరిచినట్లు శోభించింది. రమణీయ పర్వతాలతో, తరుగుల్మలతాదులతో, యమునా తీరంలో, ఇసుక తిన్నెలతో శోభిస్తూ, "బృందావనం స్వపదరమణం"– బృందావనం, శ్రీకృష్ణుడు అడుగుపెట్టగానే, దాని రామణీయకత మరెంతో పెరిగి, వ్రజవాసులకు వాసయోగ్యమై ఆనందభరితంగా ఉంది. ఇట్టి సాధు బృందావనంలోనే స్వాదుతీర్థపూర్ణమై యమునా నది హృదయావర్జకంగా ప్రవహిస్తున్నది.

యామునాచార్యుల పరంగా 'బృంద+అవనే' అని సభంగపదం ప్రయుక్తం. ఈ ఆచార్యులనాశ్రయించిన సాధుజనులెందరో లెక్కకు మిక్కిలిగా ఉన్నారు. వీరిచే మంత్రోపదిష్టులై శ్రీ వైష్ణవ సిద్ధాన్తప్రవర్తకులైన పెరియనంబి, తిరుక్కోట్యూర్ నంబి, పెరియ తిరుమలనంబి, మారనేర్నంబి, తిరుక్కచ్చినంబి, ఆళవందారాళ్వాన్, తిరుమాలైయాండాన్, వానమామలై యాండాన్, తైవవారి యాండాన్, ఈశనాండాన్, తిరుక్కురుకూరప్పన్ మొదలైన సాధుబృందాన్ని రక్షించి, వీరి జ్ఞానగంధవిలసిత హృదయసుమాలతో మానవతా పరిమళాన్ని వ్యాపింపజేసిన మహోదయులు శ్రీమద్యామునమునులు.

'తీర్థ' శబ్దానికి అనేకార్థాలున్నాయి. వాటిలో ఋషులు సేవించే జలాశయం, రేవు, గురువు అనే అర్థాలు ఇక్కడ ముఖ్యమైనవి.

"నిపానాగమయోస్తీర్థ మృషిజుష్టజలే గురౌ" - (అమరం)

"తీర్థం శ(స్త్రాధ్వర క్షేత్రోపాయోపాధ్యాయ మం(త్రిషు ।

అవతారర్షి జుష్టాంభః (స్త్రీ రజస్సుచ॥" (విశ్వః)

"తీర్థం స(త్రిణి పా(త్రేచ" (స్వామీ)

"తౄా-ప్లవన తరణయోః" అని ధాత్వర్థం. "తరంతి అనేన ఇతి = తీర్థం. 'దీనిచేత తరిస్తారు' అని వ్యుత్పత్త్యర్థం.

అట్టి పవి(త్రమైన యమునానదీ తీర్థమందు స్నానం చేస్తున్నాను అన్నారు దేశికులు. యామునం తీర్థం విగాహే: యామునాచార్యులు అనే తీర్థమందు (గురువునందు, గురువుబోధించిన శాస్త్రమందు, జలాశయమందు) తలమును కలిడుతాను.

తాపశాంతిని పొందదలచిన వ్యక్తి (తాపార్తుడు) రేవు మార్గాన దిగి(ప్రవాహ మందు స్నానం చేస్తే, తన కోరిక (తాపం) తీరుతుంది. అలాగే (శ్రేయస్సును పొందదలచిన సంసారతాపార్తుడు భగవంతుని ఆదరానికి (ప్రాతుడైన ఆచార్యులు అనే రేవు మార్గాననే దిగవలసి ఉంటుంది. దేశికులు సహజమైన స్వీయ కవితాశైలితో, యామునాచార్యుల మహిమను దాసభావంతో కీర్తిస్తూ, వారు చూపిన ఉభయవేదాన్త మార్గాన్నే అనుసరిస్తానన్నారు.

**సంస్కృత వ్యాఖ్య :** అథ యామునాచార్యం నమస్యతి విగాహ ఇతి. నిరస్త జిహ్మగస్పర్శే - జిహ్మగాః వ(క్రబుద్ధయః, కుదృష్టయః - నిరస్తకుదృష్టిస్పర్శే. యమునా పక్షేతు, జిహ్మగః - కాళియః. య(త్రకృష్ణః కృతాదరః - "జ్ఞానీత్వాత్మైవమేమతమ్" ఇత్యత్యంతాదర యుక్తః. సాధు బృందావనే స్థితం - సాధూనాం- ఆస్తికానాం బృందస్య, ఆవనే - రక్షణే, స్థితం; సాధూనాం- ఆస్తికానాం బృందస్య, ఆవనే-రక్షణే, స్థితం; యమునాతు కృష్ణ పరిగృహీతత్వాత్ సాధుబృందావనే స్థితా- తన్నామకారణ్యేస్థితా. యామునం తీర్థం - యమునా సంబంధి తీర్థం, యామునాచార్యం. విగాహే - త చ్ఛేషోభవామీత్యర్థః॥ అనెన శేషత్వానుసంధానేన నమస్కారః ఫలితః.

9 దయానిఘ్నం యతీంద్రస్య దేశికం పూర్ణమాశ్రయే ।
యేన విశ్వసృజో విష్ణో ర పూర్యత మనోరథః ॥

అర్థం : విశ్వసృజః = ప్రపంచాన్ని సృజించే; విష్ణోః = శ్రీ విష్ణుమూర్తి యొక్క; మనోరథః = సంకల్పం; యేన = ఎవరిచేత; అపూర్యత = పూర్తిచేయబడిందో; దయా నిఘ్నం = దయచే పూర్ణులైన; యతి+ఇంద్రస్య = యతి రాజు యొక్క; దేశికం (అతఏవ) = ఆచార్యులు కావున; పూర్ణం = మహా పూర్ణులను; ఆశ్రయే = ఆశ్రయిస్తున్నాను.

**తాత్పర్యము :** సృష్టికర్తయైన శ్రీమన్నారాయణుని సంకల్పాన్ని నెరవేర్చినట్టి, దయాపరతంత్రులైనట్టి, శ్రీమద్రామానుజయతీంద్రులకు ఆచార్యులైన మహాపూర్ణులనే పెరియనమ్బిని ఆశ్రయిస్తున్నాను.

**వ్యాఖ్య :** పెరియనంబిగారిని స్తుతించేశ్లోకం.

గురు పరంపరలో నిత్యం అనుసంధించుకోదగిన శ్రీ పరాంకుశ దాస నామధేయులే మహాపూర్ణులు, పూర్ణార్యులు అనే నామాంతరాలు కలవారు. వీరు 'కుముదు' డనే నిత్యసూరి అంశతో జన్మించారని సంప్రదాయంలో ప్రసిద్ధి. వీరు భారద్వాజగోత్రులు, యజుశ్శాఖీయులు. తల్లిదండ్రులు వీరికి 'పరాంకశదాసులు' అని నామకరణం చేయడం వల్ల. ఆ నామమే గురుపరంపరలో అనుసంధింపబడుతున్నది. వీరి జన్మస్థలం శ్రీరంగం. వీరే 'పెరియనంబి' అనే సంప్రదాయనామంతో ప్రసిద్ధిచెందిన వారు. యామునా చార్యుల ముఖ్యశిష్యులలో ఐదుగురు, భగవద్రామానుజులవారికి 'పంచాచార్యు'లని ప్రసిద్ధిని పొందిన వారున్నారు. ఆ అయిదుగురిలోనూ పెరియనంబి అనే మహాపూర్ణులే అగ్రగణ్యులు. 'పెరియ, పూర్ణ' శబ్దాల వల్ల ఈ ఆచార్యులు గుణపరిపూర్ణులనిస్ఫురిస్తుంది.

దయానిఘ్నం యతీంద్రస్య - యతి రాజులపట్ల నిండు దయకలవారు కాబట్టి శిష్యుని (రామానుజులను) వెదుక్కోవడానికి శ్రీ రంగం నుంచి బయల్దేరారు.

యతీంద్రస్య దేశికమ్ - భగవద్రామానుజులకు ఆచార్యులు కావడమే వీరికీర్తికి పతాకయై, మహాపూర్ణులనే పేరు అన్వర్థమయింది. శ్రీమద్రామానుజుల వారికి ఆచార్యులుగా ప్రసిద్ధులైన ఇతరులు కూడా 'పూర్ణ' శబ్దవాచ్యులే.

గోష్ఠీ పూర్ణులు - (తిరుక్కోట్టియూర్‌నమ్బి)

శ్రీశైల పూర్ణులు - (తిరుమలైనమ్బి)

కాంచీపూర్ణులు - (తిరుక్కచ్చినమ్బి)

ఈ ఆచార్యులను రామానుజులవారే స్వయంగా ఆశ్రయించడానికి ఎన్నుకొన్నారు. కాని మహాపూర్ణులు మాత్రం రామానుజులనే అన్వేషించుకొంటూపోయి, వారికి ఆచార్యులవడమే మహాపూర్ణత్వ లక్షణాన్ని సూచిస్తుంది కదా! మహాపూర్ణులు గృహస్థులైనా, తర్వాత అచిరకాలంలోనే యతికేకాదు, ఒక యతీంద్రులైన వారికే గురువు కావడం మహత్త్వం పూర్ణమయింది.

మహాపూర్ణుల ఆచార్యత్వం విశ్వస్రష్టయైన భగవానుని సంకల్పాన్ని సంపూర్ణంగా నిర్వహించింది. యాదవప్రకాశులు వేదాన్త వాక్యాలకు అపార్థాలను బోధించడమే కాక, తనపైన అసూయను పెంచుకున్న ఆచార్యుడుగా రామానుజులకు గోచరించాడు. ఈర్ష్యాళువైన యాదవప్రకాశుల శాఠ్యాన్ని గమనించి - కాశీయాత్రనెపంతో తనను గంగలో ముంచివేయ తలచినాడని గోవింద మిశ్రుల ద్వారా తెలుసుకొని - వింధ్యాటవిలో పయనిస్తున్న వారి నుంచి చీకట్లో తాను తప్పించుకొని, తిరుగుదారి దొరకక, అడవిలో బడలికతో నిద్రపోయాడు. ఉదయాన లేచే సరికి కోయదంపతులిద్దరు కంచికి పోతున్నామని చెప్పి, రామానుజులను తమ వెంట తీసుకొని వచ్చారు. నగర సమీపంలో ఉన్న 'శాలక్కిణర్' అనే దిగుడుబావి నుంచి నీరుదెచ్చి మా దప్పినితీర్చుమని ఆ దంపతులు రామానుజులను పంపారు. ఆయన తామరాకుదొన్నెలో నీరు తెచ్చేసరికి ఆ కోయదంపతులు కనబడలేదు. ఆ దంపతులు తనను కాపాడడానికి వచ్చిన పెరుందేవీ సహిత వరదరాజస్వామియే తప్ప వేరెవ్వరో కారని దృఢమైన అధ్యవసాయంతో, నాటి నుంచి ఆ బావి నుంచి తీర్థం తెచ్చి ఆ వరదరాజుల కర్పించుచుండిరి రామానుజులు.

తనకు వేదాన్త శాస్త్రార్థాన్ని చక్కగా బోధించే ఆచార్యులు ఎక్కడ లభిస్తారో కదా! అనే విచారగ్రస్తుడైన రామానుజులకు కాంచీపూర్ణుల (తిరుక్కచ్చినంబి) దర్శనం లభించింది. 'స్వామీ! మీరు శ్రీవరదరాజస్వామితో నేరుగా

మాటాడుతారు గదా! దాసుడు అడిగే షడ్వార్తలను వారికి విన్నవించి, వారిచ్చిన సమాధానాలతో సందేహాలను తీర్చగలరని రామానుజులు నమ్రతతో ప్రార్థించారు. ఆ నంబిగారు అలాగే చేసి, రామానుజులకు తెల్పిన ఆరువార్తలిలాగా ఉన్నాయి.

1) పరతత్త్వం నేను 2) జీవేశ్వర భేదం నిత్యం 3) శరణాగతియే నన్ను పొందడానికి సులభోపాయం 4) శరణాగతునికి అంతిమస్మృతి అక్కర్లేదు. 5) ప్రపన్నునికి దేహావసానంలో మోక్షమే. 6) పెరియనంబి శ్రీ పాదాలనే ఆశ్రయించు. రామానుజులు కృతార్థులయ్యారు. శ్రీ వరదరాజస్వామి ఆజ్ఞను పొంది రామానుజులు మహాపూర్ణులు (పెరియనమ్బి) వేంచేసి యున్న శ్రీరంగక్షేత్రానికి పయనమయ్యారు. ఆ సమయంలోనే శ్రీ రంగనాథుడు మహాపూర్ణులకు స్వప్నంలో సాక్షాత్కరించి ' రామానుజులకు మీరు ఆచార్యులై శాస్త్రార్థాలను బోధించవలెను' అని ఆజ్ఞాపించారు. ఆ విషయాన్ని యామునాచార్యులకు విన్నవించారు. తాను కంచికి పోయినప్పుడు, విద్యార్థి బృందంలో ఉన్న శ్రీవైష్ణవ వర్చస్సుగల ఒక బాలుణ్ని దూరం నుంచి చూచి 'భవిష్యదా'చార్యులు వీరే, అని మంగళాశాసనం చేసిన ఆ రామానుజులను ఇక్కడికి తీసుకొని రమ్మని యామునమునులు మహాపూర్ణులను ఆదేశించగా, వారు శ్రీ రంగం నుంచి కంచికి ప్రయాణమయ్యారు.

ఇలాగా వీరిద్దరు పరస్పరాభిముఖంగా పయనిస్తూ, మధ్యే మార్గాన మధురాంతకంలో, ఇతరేతరాన్వేషణలో సంచరించే ఆవు మరియు దూడలాగా, ఒకరిని మరొకరు కలుసుకొన్నారు.

“శరీరం క్షణభంగురం. ఆలస్యాన్ని సహించలేను. దాసుణ్ని ఉద్ధరించండి” అని రామానుజులు మహాపూర్ణుల శ్రీపాదాలను ఆశ్రయించారు. మధురాంతక నగరంలో 'ఏరి కాత్తన్ రామన్' – శ్రీ కోదండరామ దేవాలయం ఉంది. 'ఏరి' అంటే సరోవరం (Reservoir) పెద్దవాన కురిసినా ఆ సరస్సులోని నీరు బయటకు ప్రవహించకుండా దాని ఎల్లలను కాపాడిన దేవుడని ప్రసిద్ధి. ఆ సన్నిధిలోనే వటవృక్షం క్రింద మహాపూర్ణులు (శ్రీపరాంకుశదాసన్, పెరియనమ్బి) రామానుజులకు పంచసంస్కారాలను కృపజేశారు. సాంగోపాంగంగా

మంత్రరత్నాన్ని ఉపదేశించారు. మీరు యామునమునులనే మీ ఆచార్యులుగా భావించండి. నమ్మాళ్వార్లు మిమ్ములనే కటాక్షించి 'కలియుమ్ కెడుమ్ కణ్డుకొణ్మిన్" – కలికూడా నశిస్తుంది, చూడండి – అని అనుగ్రహించారు కదా! సర్వోత్తారకులు మీరే? అని మహాపూర్ణులు రామానుజులకు తమ ఉదాత్త భావాలను ప్రకటించారు.

ఏరికాత్తరామన్ సన్నిధి ఇప్పుడు జ్ఞాననిధిని (రామానుజులను) కాపాడిందన్న కొత్తపేరును సంపాదించుకొన్నది కదా!

భగవానుడు ఎన్ని అవతారాలెత్తినా, ఆళ్వార్ల ద్వారా బద్ధచేతనులను జనన మరణ చక్రం నుంచి విడిపించి మోక్షం పొందదానికి ఎంత ప్రయత్నించినా ఫలించనందువల్ల , రామానుజులు పెరియనంబి తిరువడిగళ్ళనాశ్రయించి, చేతనోజ్జీవనం చేయగలిగిన వారవడంచేత, పెరియనంబి శ్రియఃపతి యొక్క మనోరథాన్ని పూర్తిచేసినవారయ్యారని మహాపూర్ణులను కీర్తించారు దేశికులవారు.

**సంస్కృత వ్యాఖ్యా** : అథ జగద్రక్షణ దక్షాధికారి విశేషం గవేషమాణస్య భగవతః తాదృశాధికారి సంపాదనేన మనోరథపూరకం పూర్ణాచార్యం నమస్కరోతి దయేతి. విశ్వసృజః– "విచిత్రాదేహసంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్" ఇతి న్యాయేన స్వచరణకమల సమాశ్రయణేన సముజ్జీవయితుం ఆత్మవర్గం సృజతః; విష్ణోః–శ్రీమన్నారాయణస్య; మనోరథః, యేన – మహాపూర్ణేన జగద్రక్షణ దక్షిణ యతీంద్రాకారేణ, అ పూర్యత – పూరితః; తం యతీంద్రస్య దేశికం, దయానిఘ్నం – దయా పరతంత్రం, పూర్ణం – పూర్ణాచార్యం; ఆశ్రయే.

**10. ప్రణామం లక్ష్మణమునిః ప్రతిగృహ్ణాతు మామకమ్ ।**
**ప్రసాధయతి యత్సూక్తిః స్వాధీన పతికాం శ్రుతిమ్ ॥**

**అర్థం** : యత్సూక్తిః = ఎవరి శ్రీసూక్తి; స్వ+అధీన పతికాం = తనకు వశుడైన భర్తను కలిగియున్న; శ్రుతిం = వేదం అనే కాంతను; ప్రసాధయతి = అలంకరిస్తున్నదో; (సః = అట్టి) లక్ష్మణ మునిః = లక్ష్మణార్యులు అనే ముని; (భగవద్రామానుజముని). మామకం = నా దైన; ప్రణామం = నమస్కృతిని; ప్రతిగృహ్ణాతు = స్వీకరించుగాక.

**తాత్పర్యము :** ఎవరి శ్రీ సూక్తి స్వాధీన పతికయైన శ్రుతి సీమంతినిని అలంకరిస్తున్నదో అట్టి లక్ష్మణమూర్తి నా ప్రణతిని ప్రతిగ్రహించుగాక.

**వ్యాఖ్య :** దేశికులు భగవద్రామానుజులకు దండం సమర్పించేరీతి వర్ణితం.

శ్రీ పెరుంబూదూరులో హారీతవంశ్యులైన ఆసూరి కేశవయజ్వ, కాంతిమతి అనే పుణ్యదంపతులకు శేషాంశచే క్రీ.శ. 1017లో పింగళి నామసంవత్సరం, మేషమాసమందు, ఆర్ద్రానక్షత్రాన ఉద్భవించిన సుపుత్రులు భగవద్రామానుజులు. తల్లిదండ్రులు, మేనమామగారైన పెరియ తిరుమలనంబిగారు (శ్రీశైలపూర్ణులు)ను ఈ శిశువు సర్వలక్షణ సంపన్నుడని గ్రహించి, లక్ష్మణాచార్యులని నామకరణం చేశారు.

లక్ష్మణుడు రామానుజుడేకదా! లక్ష్మణార్యులు ఉపనయనానంతరం వేద వేదాంగాలను అధికరించి మహాజ్ఞానులైనందువల్ల లక్ష్మణమునులుగా లబ్ధ ప్రతిష్ఠులయ్యారు. యామున మునులను సందర్శించడానికి లక్ష్మణమునులు శ్రీరంగం వెళ్ళినప్పుడు, మూడువ్రేళ్ళు ముడుచుకొని యున్న యామునాచార్యుల పార్థివశరీరాన్ని మాత్రమే సేవించి, వారు జీవించయుండగా సందర్శించే భాగ్యం తమకు కలుగలేదుకదా! అని చాలా చింతించారు. వారి కోరికలను పూర్తిచేయడానికి ప్రతిజ్ఞ చేశారు.

**1. అహంవిష్ణు పదేస్థిత్వా జనానజ్ఞాన మోహితాన్ ।**
**పంచసంస్కార సంపన్నాన్ ద్రావిడామ్నాయపారగాన్ ।**
**ప్రపత్తి ధర్మనిరతాన్ కృత్వా రక్షామి సర్వదా ॥**

"నేను విష్ణు మార్గాన ప్రవర్తిస్తూ, ప్రజలను పంచసంస్కార సంపన్నులు గానూ, దివ్యప్రబంధాధ్యయన పరులుగానూ చేసి, వారితో శరణాగత ధర్మాన్ని అనుష్ఠింపజేస్తూ కాపాడుతాను" - అని లక్ష్మణమునులు ప్రతిజ్ఞను చేయగానే యామునుల యొక్క ఒక్కవ్రేలు తెరచుకొని చక్కగా సాగింది.

**2. సంగృహ్యా విపులానర్థాన్ తత్త్వ జ్ఞాన పరంశుభమ్ ।**
**శ్రీ భాష్యంచ కరిష్యామి జనరక్షణ హేతునా ॥**

"సకల తత్త్వార్థాలను సంగ్రహించి, యథార్థజ్ఞానాన్ని ప్రసాదించే శ్రీ

భాష్యమనే గ్రంథాన్ని చేతనో జ్జీవనం కోసం రచిస్తాను" అనగానే రెండవ వ్రేలు చక్కనయింది.

**3. పురాణరత్నం సంచక్రే మునివర్యః కృపానిధిః ।**
**తస్యనామ్నా మహాప్రాజ్ఞ! వైష్ణవ స్యచ కస్యచిత్ ।**
**అభిధానం కరిష్యామి నిష్క్రియార్థం మునే రహమ్ ॥**

"విష్ణుపురాణమనే పురాణరత్నం రచించిన శ్రీ పరాశరముని యొక్క పేరును ఒక వైష్ణవునికి పెట్టి ఆ ముని ఋణాన్ని తీర్చుకొంటాను" అని మూడవ ప్రతిజ్ఞతో మూడవవ్రేలు కూడా తెరచుకొని సరిగా అయింది.

యామునాచార్యులకు కావేరీ తీరాన బ్రహ్మమేధ సంస్కారాన్ని లక్ష్మణమునులు నిర్వర్తింపజేశారు. తర్వాత కంచివరదరాజ సన్నిధిలో లక్ష్మణాచార్యులు శాస్త్రోక్తవిధిగా సన్యసించారు. గోష్ఠీపూర్ణులు (తిరుక్కోట్యూర్ నమ్బిగారు) లక్ష్మణార్యులకు మంత్రోపదేశం చేసి, నమ్మాళ్వార్లు అనుగ్రహించిన, తనకు ఆచార్య పరంపరగా సంక్రమించిన, భవిష్యదాచార్య విగ్రహాన్ని వారికి ప్రసాదించాలని చూడగా, ఆ విగ్రహం అదృశ్యమయింది. ఆహా! భగవద్రామానుజులే భవిష్యదాచార్య స్వరూపులనీ, వీరి సంబంధం వల్లనే అందరికి మోక్షం లభించగలదని విశ్వసించారు. సగోత్రులైన శ్రీవత్సాంకమిశ్రులు (కూరత్తాళ్వాన్) మరెందరో భాగవతోత్తములునూ శ్రీయతిరాజులనాశ్రయించారు.

శ్రీరంగనాథస్వామి (పెరియ పెరుమాళ్) వీరి జ్ఞానానుష్ఠాన వైభవాలను తిలకించి నిత్యవిభూతి, లీలావిభూతులకు పట్టాభిషిక్తులుగా జేసి 'ఉడైయవర్లు' (జగత్స్వామి) అని బిరుదును ప్రసాదించారు. వీరు విశిష్టాద్వైత సిద్ధాంత స్థాపకులయ్యారు.

వీరి పేర్లు : లక్ష్మణమునులు, ఇళైయాళ్వార్, రామానుజులు, ఉడైయ వరులు, ఎంబెరుమానార్, యతిరాజులు, పంచాచార్యపదాశ్రయులు, శ్రీభాష్యకారులు అని వీరు వ్యపదేశించపబడినారు.

**ఏకాన్తిభిర్ద్వాదశభిః సహస్రైః, పీఠైశ్చతుస్సప్తతిభిః సమేతః ।**
**అన్యైరనంతైరపి విష్ణుభక్తైః, శ్రీరంగఆస్తే యతి సార్వభౌమః॥**

అన్నట్లు ఏకాంతులు పంద్రెండు వేలు (12000), సింహాసనస్థులైన ఆచార్య పురుషులు డెబ్బైనల్గురు (74), జియ్యంగార్లు ఏడువందలు (700) ఇంక వీరిని ఆశ్రయించిన శిష్యులెందరో ఉన్నారు.

భగవద్రామానుజులు అనుగ్రహించిన గ్రంథాలు :

1. శ్రీభాష్యం 2. వేదాంతసారం 3. వేదాంత దీపం 4. వేదార్థ సంగ్రహం 5. శరణాగతి గద్య 6. శ్రీవైకుంఠ గద్య 7. శ్రీ రంగ గద్య (గద్యత్రయం) 8. గీతాభాష్యం 9. నిత్యగ్రంథం.

యతిరాజులు, తమ జీవితంలో ఆరువై (60) సంవత్సరాలు శ్రీరంగంలోనే నివసించి శ్రీరంగనాథుని సేవచేశారు. చరమదశలో శిష్యులకు డెబ్బైనాలుగు (74) సూత్రాల (వార్తల)ను ఉపదేశించారు. తమ విగ్రహాన్ని సిద్ధంచేయించి, అందులో తమ దివ్యశక్తులను సంక్రమింపజేసి, శ్రీరంగంలో ప్రతిష్ఠింపజేశారు. పూర్ణాయుష్కులై, భగవద్రామానుజ దివాకరులు (1137 సం. మాఘశుద్ధ దశమి శనివారం వరకు) నూట ఇరువై సంవత్సరాలు మహావైభవంగా ప్రకాశించారు.

"యతిరాజ సప్తతి" అనే ఈ స్తోత్ర ప్రబంధంలో దేశికులు ఇంత వరకు క్రమంగా గురుపరంపరా స్తుతి చేస్తూ "వందే, ఉపాస్మహే, విగాహే, ఆశ్రయే" ఇత్యాది క్రియా పదాలచేత తమ నమ్రతను క్రమంగా ప్రకటించారు. ఈ పదవ (10) శ్లోకంలో మొట్టమొదట లక్ష్మణమునులు తమ ప్రణామాన్ని స్వీకరించడానికి అంగీకరించవలెనని భక్తితో ప్రార్థిస్తున్నారు. ప్రణామం చేసే విధానం ఆర్జవగుణశోభితం. "వచస్యేకం మనస్యేకం కర్మణ్యేకం మహాత్మనామ్" వాఙ్మనః కాయాలనే కరణత్రయం ఋజువుగా ప్రవర్తిస్తే ఆర్జవగుణం శోభిస్తుంది. "వాచానమ ఇతిప్రోచ్యవపుషామనసాచయత్। తన్నమః పూర్ణముద్దిష్టమ్" అన్నట్లు 'నమః' అని నోటితో పలుకుతూ, ఉరమూ, శిరమూ నేలనుతాకే రీతిగా దేహాన్ని కట్టెలాగా పడవేయాలి. మనస్సులో ధ్యేయమూర్తిని అనుభవిస్తుండాలి. ఇది పూర్ణంగా ప్రణామ లక్షణం. అందువల్ల 'సంకల్పచింతామణయః ప్రణామాః' అన్నారు విజ్ఞులు. ప్రాకృతిక పదార్థాలయందు విరక్తినీ, పారమార్థిక చింతన యందు రక్తినీ పెంచడమేకాక, సర్వ పాపాలను ధ్వంసంచేసే ధ్యేయమూర్తి యొక్క దయను వర్షింపజేసేది ప్రణామం.

ప్రణామాన్ని ప్రతిగ్రహించే మహిమాన్వితులు లక్ష్మణమునులు. లక్ష్మణమునులనే నామాంతరంగల భగవద్రామానుజులవారి శ్రీసూక్తులు తత్త్వహిత పురుషార్థాలను ప్రకాశింపజేస్తాయి. జీవ, దేవ, ప్రకృతుల స్వరూప స్వభావాలను, ఉన్నది ఉన్నట్లు తెలిపేది వేదాన్తశాస్త్రం. జీవ ప్రకృతులతో కూడియున్న శ్రీమన్నారాయణుని అస్తిత్వానికి - ఉనికికి - శ్రుతియే ఆధారం.

"శాస్త్ర యోనిత్వాత్" (బ్ర.సూ. 1-1-3), పరబ్రహస్వరూప స్వభావాలను 'వేదాన్తశాస్త్రమే ప్రమాణమవడం వల్ల' యథార్థంగా అది బోధిస్తున్నది.

'ప్రమాణం' అంటే, యథార్థజ్ఞానాన్ని కలిగించేది. శ్రుతి - వేదం.

'ప్రమేయం' అంటే, యథార్థజ్ఞాన విషయమైన పదార్థం. విష్ణువు.

'ప్రమాత' అంటే, యథార్థజ్ఞానానుభవం కలవాడు.

**మేయం విష్ణు ర్వేద వాదాశ్చమానం**
**మాతారశ్చ బ్రాహ్మణాః సత్త్వనిష్ఠాః॥**
**ఇత్థంతేషా మైకరాశ్యం ప్రతీమః**
**కీటప్రాయై ర్దుర్విదగ్ధైః కిమన్యైః ॥ (సం.సూ.)**

"వేదం ప్రమాణం, విష్ణు భగవానుడు ప్రమేయం. బ్రహ్మజ్ఞాన నిరతులైన సుజనులు ప్రమాతలు. కొలిచేవాడు, కొలువబడేవాడు, కొలిచే శబ్దరూపమైన సాధనం- ఈ మూడింటిని ఒకే రాశిగా భావిస్తున్నాం. వేరే కుదృష్టులతో ఏమి ప్రయోజనం" అని శ్లోకార్థం. వేదార్థం విష్ణుపారమ్యాన్ని ప్రతిపాదించే దర్శనాల్లో యతిరాజుల దర్శనమే అజ్ఞానాంధకారాన్ని చీల్చి వెలుగుతుంది. "యతీంద్రైరి దమఖిల తమః కర్శనం దర్శనం నః" అని దేశికులు రామానుజ సిద్ధాన్తాన్ని నిర్ధారణ చేసి లోకానికి చాటినారు. వాస్తవంగా యతిరాజ శ్రీసూక్తి లేకపోతే వేదార్థం యథార్థంగా ప్రకటితం కాక, అపార్థాలను చెప్పిన కుదృష్టులకు వేదం భయపడి వారి అధీనమైయుండేది.

"వేదైశ్చ సర్వైరహమేవవేద్యః" అన్నట్లు వేద ప్రతిపాద్యుడు శ్రియఃపతి. కాబట్టి శ్రుతికాంత 'స్వాధీన పతిక', "ప్రియోపలాలితా నిత్యం స్వాధీన పతికా

మతా". తన ప్రియుని చేత ఎల్లప్పుడు లాలింపబడే నాయిక 'స్వాధీనపతిక' అనబడుతుంది. అలంకారశాస్త్రం స్వాధీన పతిక, వాసవసజ్జిక, విరహోత్కంఠిత, ఖండిత, కలహాంతరిత, విప్రలబ్ధ, ప్రోషిత భర్తృక, అభిసారిక అనే అష్టవిధనాయికలను లక్షణంగా పేర్కొన్నది. ఈ ఎనమండుగురునాయికలలో 'స్వాధీనపతిక' అగ్రగణ్య. భగవద్రామానుజుల శ్రీసూక్తులు – శ్రీభాష్యాదికృతులు – భేదశ్రుతులను అవిశిష్ట విషయంగానూ, అభేదశ్రుతులను విశిష్టవిషయంగానూ; సగుణశ్రుతులను కల్యాణగుణసహిత విషయంగానూ, నిర్గుణశ్రుతులను హేయగుణరహిత విషయంగానూ బోధిస్తున్నాయి. పరత్వ విషయకమైన రుద్రేంద్రాది సాధారణశబ్దాలూ అసాధారణ శబ్దమైన 'నారాయణ' శబ్దమందే పర్యవసిస్తాయనీ, ఇదే సర్వోపనిషత్సారమని నొక్కి వక్కాణిస్తున్నాయి.

"యః శ్రుతిస్మృతి సూత్రాణాం అంతర్జ్వర మశీశమత్"

కుదృష్టులు కల్పించిన పెడర్థాలవల్ల శ్రుతులకు, స్మృతులకు, బ్రహ్మసూత్రాలకు 'లో జర్వం' పుట్టింది. నాటువైద్యమట్టిదే కదా! యతిరాజసూక్తి–వాస్తవ పదార్థాల కల్పనవల్ల – శ్రుతిస్మృతి సూత్రాలకు పట్టిన అంతర్జ్వరాన్ని శమింపజేసింది. అంతేకాదు, సైరంధ్రి పట్టపురాణిని వస్త్రాభరణతిలకాదులచే అలంకరించే రీతిగా నిగమకాంతను సింగారించి దాని అంతరంగాన్ని రసతరంగితం చేసింది. ఇతర మత నిరసన పూర్వకంగా స్వమతస్థాపన చేసింది. "చిదచిద్విశిష్టుడు శ్రీమన్నారాయణుడు" అని విష్ణుపారమ్యాన్ని ప్రబోధించిందని అర్థం.

"ఆ కల్ప వేషౌ నైపథ్యం ప్రతికర్మ ప్రసాధనమ్". (అమరం)

'ప్రసాధనం' అంటే, అంగాలంకరణ మని అర్థం.

ఈ (10) పది శ్లోకాలు అనుష్టుప ఛందస్సులో రచింపబడినాయి.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ భేదా భేదశ్రుత్యోః అవిశిష్ట విశిష్ట విషయత్వేన సగుణ నిర్గుణశ్రుత్యోఃసదసద్గుణ విషయత్వేన పరతత్త్వ విషయ శబ్దభేద ప్రతీతౌ సాధారణ శబ్దానా మసాధారణశబ్ద పర్యవసానేనచ, ఏవమాదీనాం సకల

శ్రుతిగణానాం సామంజస్యాపాదనం ప్రకృత ప్రబంధ విషయభూతం శ్రీరామానుజాచార్యం నమస్యతి ప్రణామమితి. యత్సూక్తిః- శ్రీభాష్యాదిరూపా; శ్రుతిం-కృత్స్నం వేదం; స్వాధీన పతికాం - స్వాధీనభర్తృకాం యథోక్తం దశరూపకే - "అస్యామష్టావవస్థాస్స్యుః స్వాధీన పతికాదయః" స్వాధీన పతికా, వాసవ సజ్జికా, విరహోత్కంఠితా, ఖండితా, కలహాంతరితా, విప్రలబ్ధా, ప్రోషితభర్తృకా, అభిసారికా ఇత్యష్టౌ. తత్ర "ఆసన్నాయత్తరమణాహృష్టా స్వాధీనభర్తృకా" ఇతి. అనేన సర్వోపనిషదాం సమన్వితత్వ ప్రతిపాదనేన ఆసన్నరమణత్వం, కుదృష్టిభి రనభిమతార్థకల్పనేన హృష్టాత్వం చ సూచ్యతే. యథోక్తమ్:- "యఃశ్రుతి స్మృతి సూత్రాణామంతర్జ్వర మశీశమ"దితి. ప్రసాధయతి - ఏవం విధాం ప్రకల్పయతిభాష్యాది ప్రణయనేనేత్యర్థః. యద్వా, అలంకరోతి. సః లక్ష్మణ మునిః మామకం ప్రణామం - విషయానుగుణప్రేమ పూర్వకత్వేనాకృత మపీత్యర్థః ప్రతిగృహ్ణాతు - అంగీకరోతు.

11. ఉపవీతిన మూర్ధ్వ పుండ్రవంతం
త్రిజగత్పుణ్యఫలం త్రిదండ హస్తమ్।
శరణాగత సార్థవాహమీడే
శిఖయా శేఖరిణం పతిం యతీనామ్॥

**అర్థం :** ఉపవీతినం = యజ్ఞోపవీతం కలిగినట్టి; ఊర్ధ్వ పుండ్రవంతం = ఊర్ధ్వపుండ్రాలు కలిగినట్టి; త్రిజగత్ పుణ్యఫలం = మూడు లోకాలలో ఉన్న జనుల యొక్క సుకృత పరిపాకమైనట్టి; త్రిదండహస్తం = చేతి యందు త్రిదండం కలిగినట్టి; శిఖయా = శిఖచేత; శేఖరిణం = అలంకరింపబడినట్టి; శరణాగత సార్థవాహం = ప్రపన్నజనసమూహాన్ని కాపాడునట్టి; యతీనాం = సన్యాసులకు; పతిం = నాయకుడైన శ్రీభాష్యకారులను; ఈడే = స్తోత్రం చేస్తున్నాను.

**తాత్పర్యము :** యజ్ఞోపవీతం కలిగి, ఊర్ధ్వపుండ్రాలనుధరించి, త్రిదండాన్ని చేతదాల్చి, శిఖాలంకృతులై, లోకత్రయవాసుల పుణ్యఫలంవంటి వారైన, ప్రపన్నజన సమూహ నిర్వాహకులైన యతీంద్రులను స్తుతిస్తున్నాను.

**వ్యాఖ్య : యతిరాజుల దివ్యమంగళ విగ్రహం వర్ణితం.**

శ్రియఃపతి మొదల్కొని శ్రీభాష్యకారుల వరకున్న ఆచార్యపరంపరను స్తుతించి, ప్రణతులర్పించి, దేశికులు ప్రారంభింపగోరిన స్తోత్రమందలి ఏకాదశ శ్లోకమందు, ఈ ప్రబంధ వస్తు స్వరూపాన్ని వర్ణిస్తున్నారు.

ఏకాదశేంద్రియమైన మనస్సుకు లగ్నమయ్యే రీతిగా, "విగ్రహాలోకన పరస్తస్యచాజ్ఞాప్రతీక్షకః" అన్నట్లు ధ్యేయమూర్తిని గోచరింపజేసే ఔచిత్యం సముదాత్తమైనది.

**ఉపవీతినం:** పవిత్రమైన తెల్లని జన్నిదం మేన శోభించేవారు యతిరాజులు. "ఉపవీతం యజ్ఞసూత్రం ప్రోద్ధృతేదక్షిణేకరే" – (అమరం) సర్వకర్మ సమారాధ్యుడైన భగవానుని పూజించడానికి సమర్థమై, కుడిచేయి తొడగబడి ఎడమభుజం నుంచి వక్షఃస్థలాన్ని ఆవరించే ఉపవీతాన్ని ధరించినవ్యక్తిని తెలిపే శబ్దం 'ఉపవీతిన్' ఆ శబ్దం యొక్క ద్వితీయా విభక్త్యేకవచనాంతం 'ఉపవీతినం' అవుతుంది. యజ్ఞ సూత్రధారణం ద్విజత్వచిహ్నం. వేదాధ్యయన శీలమైన బ్రాహ్మణ్య లక్షణం. సర్వాశ్రమప్రాశస్త్యం కలది.

**బ్రహ్మసూత్ర పరిత్యాగాత్ బ్రహ్మచారీ గృహీవనీ ।**
**పరివ్రాట్ చాపి పతిత స్తస్మాత్తన్న పరిత్యజేత్ ॥**

బ్రహ్మచారిగానీ, గృహస్థుడుగానీ, వానప్రస్థుడుగానీ, సన్యాసిగానీ, యజ్ఞోపవీతాన్ని పరిత్యజిస్తే పతితుడవుతాడని శాస్త్రం. వైష్ణవేతర సన్యాసుల వలె బ్రాహ్మణ్యాపాదకమైన యజ్ఞోపవీతాన్ని తీసిపారవేసినవారు కారు లక్ష్మణ యతీంద్రులని సూచిస్తున్న పదం–'ఉపవీతినం' – మొట్టమొదట సుశ్లోకితం.

"మిన్ను నూలుమ్ కూ డై వషుమ్" అని భగవద్విగ్రహసౌందర్యాన్ని అనుభవించిన నమ్మాళ్వార్లవలె, బ్రహ్మసూత్రంచేత యతిరాజుల రూపవైభవానికి వేదాంతదేశికుల స్నిగ్ధహృదయం ముగ్ధమైనది కదా!

**ఊర్ధ్వ పుండ్రవంతం = ఊర్ధ్వ పుండ్రాలు కలవారు యతిరాజులు.**

"హరేః పాదాకృతి మాత్మనోహితాయ మధ్యేఛిద్రమూర్ధ్వ పుండ్రం

యోవిదధాతి స పరస్యపుంసః ప్రియోభవతి, స ముక్తి భాగ్భవతి" – భగవత్పాదాలరూపమైన ఊర్ధ్వపుంద్రాలను ధరించిన వ్యక్తి శ్రేయస్సును పొందుతాడు, భగవత్ప్రేమకుపాత్రుడూ అవుతాడు, ముక్తినీ పొందుతాడు' – అని అధర్వవేదవాణి.

**"శ్రౌత స్మార్తక్రియాః సర్వాః ఊర్ధ్వపుంద్రమకుర్వతామ్।**
**జాయంతే నిష్ఫలా బ్రహ్మన్ ! బాధితాశ్చభవంతితాః॥"**

"ఊర్ధ్వపుంద్రాలను ధరించకుండా శ్రుతులూ, స్మృతులూ చెప్పిన విధంగా కర్మకలాపాలను శ్రద్ధతో చేసినా, అవి ఫలమీయలేవు; శబ్దశక్తితో కూడిన ఆ కర్మలన్నీ తిరిగి బాధించకమానవు" – అన్నది బ్రహ్మాండపురాణం.

**"ఊర్ధ్వ పుంద్రస్యమధ్యేతు విశాలేఽతిమనోహరే।**
**లక్ష్మ్యాసార్థం సమాసీనో రమేఽహం తత్రనిర్వృతః ॥"** (సచ్చరిత్రరక్ష)

'తిరుమణి' అంటే అమంగళాన్ని తొలగించే తెల్లమట్టితో ధరించిన ఊర్ధ్వపుంద్రాల మధ్యన శ్రీ చూర్ణరేఖతో శోభించే ముఖమండలం శ్రీ వైష్ణవ స్వరూపం.

"అంగుష్ఠేన బ్రహ్మచారీ" బ్రహ్మచారి బొటనవ్రేలితో ఊర్ధ్వపుంద్రాలను ధరించాలి.

**"అనామికా గృహస్థస్య, వనస్థస్యతు మధ్యమా ।**
**తర్జనీ భిక్షుకస్యైవ –**

గృహస్థుడు ఉంగరపు వ్రేలితో; వానప్రస్థుడు పెద్ద (నడిమి) వ్రేలితో, సన్యాసి చూపుడువ్రేలితో ఊర్ధ్వపుంద్రాలను ధరించాలి.

"ఊర్ధ్వపుంద్రస్య కరణే నిషిద్ధా మధ్యమాంగుళిః" – గృహస్థుడు మాత్రం ఊర్ధ్వ పుంద్రధారణకు నడిమివ్రేలును వాడకూడదు. ముఖమందు శ్రీ చూర్ణరేఖను దీపశిఖాకారంగా ధరించాలి.

"భూయాత్ భూయో విభూత్యైమమ భువనపతేర్ భ్రూలతా ద్వంద్వ మధ్యాత్, ఉత్థం తత్పుంద్రమూర్ధ్వం జనిమరణ తమః ఖండనం మండనం నః"– (పాదాదికేశాంతస్తోత్రం).

"జగన్నాథుని కనుబొమల నడుమ మొదల్కొని పైకి ఎగసియున్న ఊర్ధ్వపుండ్రం, మాకు అలంకారంగా ఉంటూ, సర్వసంపదలను కలిగిస్తూ, పునర్జన్మ లేకుండా చేస్తుంది" – అని శ్రీ శంకరభగవత్పాదులు శ్రీరంగనాథుని ఊర్ధ్వపుండ్రశోభను స్తుతించారు.

"ఉద్ధరత్యుపరిభక్తజనాని త్యూర్ధ్వతాశ్రయణసూచితశక్తిమ్"–

ఊర్ధ్వగతిని – సద్గతిని – కలిగించేశక్తిని సూచించే ఊర్ధ్వపుండ్ర తిలకం, భక్తులను ఉద్ధరిస్తుంది – సద్గతిని కోరే ఊర్ధ్వపుండ్రధారి సాయుజ్యాన్ని తప్పకపొందుతాడు – అని శ్రీవత్సాంకమిశ్రులు శ్రీ వరదరాజ స్తుతిలో, వేదాన్తదేశికులు 'సచ్చరిత్ర రక్ష'లో స్పష్ట పరచారు.

"భగవద్భక్త్యోర్ధ్వపుండ్రీ వశిష్ఠఃకశ్యపోఽ త్రి రగస్త్యః జామదగ్ని ర్విశ్వామిత్రో యమోవ్యాసః పరాశర స్సనక సనందన శ్శుకోవామదేవః సబ్రహ్మణోభవతి". – (శతపథబ్రాహ్మణమ్) 'వసిష్ఠుడు, కశ్యపుడు మొదలైన ఋషులు ఊర్ధ్వపుండ్రధారులై వైకుంఠుణ్నిసేవించి తరించారు' అని వేదవాక్కు.

'తిరుమణికాప్పు' – ఊర్ధ్వపుండ్రాలను – ముఖ్యంగా లలాటాన, ఉదర, వక్షఃస్థల, కంఠ, భుజప్రదేశాలలోనూ, మెడమీదనూ, కేశవ, నారాయణ మాధవ, ఇత్యాది ద్వాదశనామాలను అనుసంధానంచేస్తూ, ద్వాదశోర్ధ్వ పుండ్రాలను ధరించడం శ్రీవైష్ణవుల లక్షణం. కాబట్టి, ఊర్ధ్వపుండ్రాలకు 'నామాలు' అనే పేరు కలిగింది. నామధారణానికి రాగి, వెండి పుల్లలనూ ఉపయోగించవచ్చు. ఊర్ధ్వపుండ్రధారణం సర్వాశ్రమాల వారికి సాధారణమే.

అద్వైత సన్యాసులు విభూతిని – భస్మాన్ని – తిర్యక్‌పుండ్రంగా ధరిస్తారు. కాబట్టి ప్రత్యేకంగా, ఉద్యద్దినేశనిభమై ఉల్లసిల్లే ఊర్ధ్వపుండ్రాలుగల శ్రీరామానుజయతిరాజుల స్వరూప మహిమను అగ్గలంగా ఉగ్గడించారు వేదాంతదేశికులు.

**త్రిదండ హస్తం :** వాఙ్మనః కాయ దండనంలాగా త్రిదండాన్ని హస్తకమల మందు ధరించినవారు యతిరాజులు. ఏకదండి, ద్విదండి సన్యాసుల వంటి

వారుకారు. శ్రీవైష్ణవ సన్యాసికి 'త్రిదండి' అని పేరు. చిదచిదీశ్వర తత్త్వచిహ్నం త్రిదండం. మూడు దండా (కఱ్ఱ)లను కలిపి, ఒక్కదండం (కఱ్ఱ)గా ఏర్పరచబడినదే 'త్రిదండ' రూపం.

**శిఖయా శేఖరిణం :** రాజులు కిరీటాన్ని ధరించే విధంగా, యతిరాజులు శిఖను శిరోభూషణంగా ధరించారు. వైష్ణవేతర యతులకు శిఖ ఉండదు. పూర్తిగా శిరోముండనమే అద్వైత యతిధర్మం.

**"ఉపవీతం త్రిదండంచ పాత్రం జలపవిత్రకమ్ ।**
**కౌపీనం కటి సూత్రం చ నత్యాజ్యం యావదాయుషమ్॥"**

యజ్ఞోపవీతం, త్రిదండం, కమండలువును, జలపవిత్రం, కౌపీనం మొలత్రాడును, సర్వసంగపరిత్యాగియైన సన్యాసి ఆయువున్నంతవరకు విడువరాదు.

**త్రిజగత్ పుణ్యఫలం :** మూడు లోకాలలో నివసించిన వారి యొక్క సత్కర్మలవలని ఫలమే మూర్తీభవించిన వారు యతిరాజులు.

"ద్రవంతి దైత్యాః ప్రణమంతి దేవతాః"- అన్నట్లు భగవద్గుణావిష్టులను చూచి రాక్షసులు పారిపోతారు. మానవులూ, దేవతలూ ఉజ్జీవిస్తారని తాత్పర్యం. "సర్వధర్మాన్ పరిత్యజ్య" అనే మాటకు కొందరు స్వరూపత్యాగమని అర్థాన్ని బోధించారు. అందువల్ల హవ్యకవ్యాది భుక్కులైన దేవతలు ఆహారం లభించదని బెంగపడడం సహజమేకదా! భగద్రామానుజులు శ్రీభాష్యాదిగ్రంథాల ద్వారా ముముక్షువులకు ఫలసంగకర్తృత్వత్యాగమేకాని స్వరూప త్యాగంకాదు- అని ప్రతిపాదించినందువల్ల దేవతలూ ఉజ్జీవించారని సూక్తివైచిత్రి.

"సుచరిత పరిపాకుడు" శ్రీరంగనాథుడని 'పాదుకాసహస్రం'లో శ్రీవేదాంత దేశికులు స్తుతించారు. "యథా దేవే తథా గురౌ" అన్నట్లు దేవునియందెట్లో, అట్లే ఆచార్యులయందుకూడా దేశికులు భక్తి - ప్రపత్తులు కలవారు. అంతకంటెనూ అధికమైన ఆదరణను ఆచార్యులయందు ప్రదర్శించారు.

**శరణాగతసార్థవాహం :** నమ్మాళ్వార్లను "ప్రపన్నజనకూటస్థులు" అన్నట్లే దేశికులు యతిరాజులను 'శరణాగతసార్థవాహులు' అని సంస్తుతించారు. "ఆచార్యదేవోభవ" అన్నట్లు దేశికులు భగవానుని పాదాబ్జాలయందు ఎట్లో, అట్లే యతిరాజుల శ్రీచరణ కమలయుగళియందు ప్రపత్తిని అనుష్ఠించారు.

ఈ శ్లోకం ఔపచ్ఛందసికం (అర్ధసమవృత్తం) అనే ఛందస్సులో విరచితం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథప్రారీప్సితస్తోత్ర మారభమాణః "విగ్రహో లోకనపరస్త స్యచాజ్ఞాత్రీక్షకః" ఇతి వచనాదాచార్య విగ్రహ సన్నివేశస్త్యేవ శిష్యాణాం సదానుభావ్యత్వేన తత్సన్నివేశ విశిష్టం రామానుజాచార్యంస్తౌతి, ఉపవీతిన మితి.

"ఉపవీతిన" మిత్యనేన "బ్రహ్మసూత్రపరిత్యాగాత్ బ్రహ్మచారీ గృహీ వనీ। పరివ్రాట్ చాపి పతిత స్తస్మాత్తన్నపరిత్యజేత్॥"

**"యతీనాం త్రీణిశుద్ధాని సంగ్రాహ్యాణి స దైవతు।**
**యజ్ఞోపవీతం దండాశ్చ, తథా జంతు నివారణమ్॥"**

ఇత్యాది వచన విహితానుష్ఠాన మస్త్యేవ, తదన్యేషాంతు విహిత యజ్ఞోపవీతాది పరిత్యాగాత్ పాతిత్యం సూచ్యతే.

"ఊర్ధ్వపుండ్రవంత" మిత్యనేన ఉపవీతవ దూర్ధ్వ పుండ్రాదీనాం సర్వాశ్రమ సాధారణ్యం సూచ్యతే. ఊర్ధ్వ పుండ్రస్య ఉపవీతతుల్యత్వంచ.

"త్రిజగత్పుణ్య ఫలం" – త్రిజగదుజ్జీవనకరం. లోకాంతరస్థానామప్యేత త్సంజ్ఞావైభవాద్యనుసంధానేనోజ్జీవనం భవతీత్యర్థః. "త్రిదండహస్త" మిత్యనేన వాఙ్మనఃకాయదండవత్ త్రిదండ హస్తత్వమపి. "బ్రహ్మసూత్రం త్రిదండంచ వస్త్రం జంతు నివారణం; త్రిదండముపవీతం" చేత్యాది వచనానుసారా దావశ్యకమితి జ్ఞాప్యతే.

"శరణాగతసార్థవాహం" – శరణాగత సమూహాపేక్షిత నిర్వాహకమ్. "శిఖయా శేఖరిణం" – శిఖయా శేఖరిత శిరస్కమ్. అనేన "వక్షోపస్థ శిఖావర్జం ముండయేత శిరోయతిః పౌర్ణమాస్యాం శిఖావర్జమ్". ఇత్యాది వచనానుసారశ్చ సూచ్యతే. యతీనాం పతింయతిరాజం. ఈడే – స్తౌమి.

2. సంకల్పసూర్యోదయ టిప్పణ్యామ్ :

ఉపవీతిన మితి : సర్వత్రప్రాశస్త్యేమతుప్. ఏకదండ్యాదిభ్యోవ్యావృత్త్యర్థం విశేషణాని శరణాగత సార్థానాంవాహకం - నిర్వాహకమ్.

3. 'ప్రభావళీ' నామ్న్యాః సంకల్ప సూర్యోదయ వ్యాఖ్యాయా ఉద్ధృతా:- 'ఉపవీతిన'మితి ఏకదండ్యాదిభ్యోవ్యావృత్తి రుచ్యతే. ఉపవీతం- యజ్ఞసూత్రం, తద్వాన్ సచ్ఛిద్రోర్ధ్వ పుండ్రవంతమ్. త్రిజగతాం పుణ్యస్య పరిపాకరూపమ్. త్రీణి దండాని త్రిదండంహస్తే యస్య తమ్. శరణాగత సార్థవాహరూపమ్ - శరణాగతానాం సార్థః సమూహః రక్షణభరోవా తస్య నిర్వాహకమ్. శిఖయాహేతునా శిరోభూషణవంతమ్. శేఖరం - శిరోమాల్యం, తేనశాలితుం శీల మస్య ఇతి తచ్ఛా లినమ్.

4. ప్రభావిలాసా దుద్ధృతః వ్యాఖ్యానభాగః -

ఉపవీతిన మితి. అత్రప్రాశస్త్యే మతుప్. సార్థం సమూహః.

**వ్యాఖ్యానాంతరం :** యుగాంతర యత్య పేక్షయాఽ స్యయతీంద్రస్య విశేషమాహశరణేతి:- శరణాగతాన్ సార్థాన్ సంఘాన్ వాహయతి వర్ధయతీతి తాదృశమ్. శిఖయాశేఖరిణం, పతిం యతీనామితి యతిరాజసప్తతిపాఠః. య తీశ మీడే ఇత్యపి క్రియేత యది యతిరాజ సప్తతౌ ఇవఅత్ర స్తోత్రార్థ ప్రవృత్తిః స్యాత్. అత్రతు జయ సిద్ధ్యర్థం సేవనమ్.

**12.** **ప్రథయన్ విమతేషు తీక్ష్ణ భావం**
**ప్రభురస్మత్ పరిరక్షణే యతీంద్రః ।**
**అపృథక్ ప్రతిపన్న యన్మయత్వై**
**ర్వవృధే పంచభిరాయుధైర్మురారేః॥**

**అర్థం :** అపృథక్ ప్రతిపన్న, యన్మయత్వైః = వేరుగా పొందని, లక్ష్మణముని స్వరూపం కలిగినట్టి; మురారేః = మురుడనే అసురునికి శత్రువైన శ్రీవిష్ణు భగవానుని యొక్క; పంచభిః = అయిదైన; ఆయుధైః = ఆయుధాలచేత; వ

వృధే = వృద్ధినిపొందినాడు; (అతః=కావుననే). విమతేషు = ప్రతిపక్షుల విషయమై; తీక్ష్ణభావం = క్రూరభావాన్ని; ప్రథయన్ = ప్రకాశింపజేస్తూ; యతి+ఇంద్రః = యతిరాజు; అస్మత్ పరిరక్షణే = మనలాంటివారలను అన్ని విధాలా రక్షించడమందు; ప్రభుః = సమర్థుడు.

**తాత్పర్యము** : యతిరాజులకంటె వేరే రూపాన్ని పొందనట్టి, మురహరి యొక్క పంచాయుధాలచేత వృద్ధిని పొందినారో అన్నట్లు ప్రతిపక్షుల యందు తీక్ష్ణభావాన్ని వెల్లడిస్తూ, యతిరాజులు అస్మదాదులను అన్ని విధాలా రక్షించడమందు సమర్థులైయున్నారు.

**వ్యాఖ్య** : పంచాయుధాలు సాముదాయకంగా రామానుజులై అవతరించెనని హేతూత్ప్రేక్ష.

సుదర్శనాది దేవతా సమూహాల అభిమానం, ఆనుగుణ్యం ఉన్నందువల్లనే భగవద్రామానుజులు స్వపక్షరక్షణమూ, ప్రతిపక్షవిక్షేపణమూ చేయగలిగినారు. శ్రీవిష్ణుపురాణంలో అస్త్రభూషణాధ్యాయమందు, శ్రీమన్నారాయణుని దివ్య హస్తపద్మాల యందు నిత్య చైతన్యంగా శోభించే చక్రాది పంచాయుధాలు, మనస్సు మొదలైన వానికి అభిమానదేవతలుగా అభివర్ణింపబడినాయి.

1. మనస్తత్త్వాభిమానదేవత సుదర్శనమనే చక్రం.
2. పంచభూతాలకు కారణమైన తామసాహంకారాభిమాన దేవత పాంచజన్యమనే శంఖం.
3. బుద్ధికి అభిమానదేవత కౌమోదకి అనే గదాయుధం.
4. జ్ఞానానికి అభిమానదేవత నందకమనే ఖడ్గం.
5. సకలేంద్రియాలకు కారణమైన సాత్త్వికాహంకారానికి అభిమాన దేవత శార్ఙ్గమనే ధనుస్సు

ఈ పంచాయుధాలు యతిరాజుల స్వరూపానికి భిన్నరూపాలు కలవికావు. అంటే, సుదర్శనాధ్యాయుధ పంచకమే శ్రీయతి సార్వభౌములుగా అవతరించెనని సారార్థం.

మురారి ఆయుధాలు చేసే పనులు రెండు రకాలు.

1. శత్రువులను నశింపజేయడం. 2. ఆశ్రితులను పరిరక్షించడం. తీక్ష్ణభావం అంటె వాడిగా - పదునుగా ఉండడం ఆయుధలక్షణం. అలాగే యతీంద్రులకు తీక్ష్ణభావం ఉంది.

"సమోஉహం సర్వభూతేషు" భగవానుడు అన్ని ప్రాణుల యందు సమభావం కలవాడు. "నమే ద్వేష్యోஉస్తి న ప్రియః" - నాకు ఎవరి యందు ప్రేమగానీ, ద్వేషంగానీ ఉండదు అన్నాడు గీతాచార్యుడు. అయితే భగవానునికి, తన భక్తులను బాధించేవారే శత్రువులుగా పరిగణింపబడుతారు. అలాగే రామానుజులకు స్వయంగా శత్రువులు ఎవరూ లేరు. వేదబాహ్యులు అంటే వేదాలను గౌరవించనివారు, కుదృష్టులు అంటే వేదశబ్దరాశికి సరియైన అర్థాన్ని పరిశీలించిచూడక అపార్థాలను బోధించిన వారు యతీంద్రులకు ప్రతిపక్షులు - విమతులు.

పరంధాముని పంచాయుధాలు భక్తులను, ఆపదల నుంచి రక్షిస్తాయి. అలాగే, యతి సార్వభౌములు విపక్ష ప్రతిక్షేపణం చేసి, అంటే అపసిద్ధాంతాలను తొలగించి, స్వపక్షరక్షణం అంటే విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని తమ శ్రీసూక్తుల - శరణాగతి గద్య శ్రీభాష్యాదికృతుల ద్వారా ప్రపత్తి మార్గాన్ని బోధించి, చేతనులను ఉజ్జీవింపజేశారు. కాబట్టి ప్రభువు-రాజు; సర్వశక్తి సామర్థ్యాలు కలవారు శ్రీభాష్యకారులని దేశికులు కీర్తించారు.

ఆళ్వార్లలో కొందరు భగవానుని ఒక్కొక్క ఆయుధాంశచే అవతరించారు. కాని, రామానుజయతీంద్రులు భగవానుని పంచాయుధి యొక్క అవతారమని సంభావింపబడినారు. పంచాయుధికి కృపాప్రసన్నాచార్యులైన భగవద్రా మానుజులకు భేదమేలేదనీ, ఆ స్వరూపమే అనీ "అపృధక్ ప్రతిపన్న యన్మయత్వ" శబ్దప్రయోగం చేత సూచింపబడింది.

ముఖ్యంగా యతిరాజులు ఆదిశేషావతారులని ప్రసిద్ధికదా! కాని, శ్రీ వేదాన్తదేశికులు ఇక్కడ వీరిని మూర్తీభవించిన పంచాయుధిగా స్తోత్రంచేశారు.

దీని 'మాతృక' 'తిరువరంగత్తముదనార్లు' ప్రసాదించిన 'ఇరామానుశ నూత్తందాది'లోని పాశురం.

**అడైయార్ కమలత్తు అలర్మగళ్ కేళ్వన్ కైయాషియెన్నుమ్**
**పడైయోడు నా న్దగముం పడర్ తణ్డుం ఒణ్‌శార్‌ఙ్గ విల్లుమ్।**
**పుడైయార్ పురిశంగముం ఇన్దప్పూదలం కాప్పతత్కెన్ఱు**
**ఇడైయే ఇరామానుశముని యాయిన ఇన్నిలత్తే ॥-33**

**అర్థం** : అడై= ఆకులచేత; ఆర్ = నిండియున్న; కమలత్తు అలర్ = తామరపూవునే వాసస్థానంగా గల; మగళ్ = (స్త్రీకి) శ్రీమహాలక్ష్మికి; కేళ్వన్ = నాథుడైన నారాయణుని యొక్క; కై = హస్తమందున్న; ఆషి ఎన్నుమ్ = చక్రం అనే; పడైయోడు = ఆయుధంతో కూడా; నాన్దగముమ్ = నందకమనే ఖడ్గమూ; పడర్ = విరోధులను నిరసింప సమర్థమైన; తణ్డుమ్= కౌమోదకి అనే గదాయుధమూ; ఒణ్ = విలక్షణమైన; శార్‌ఙ్గ విల్లుమ్ = శార్‌ఙ్గమనే చాపమూ; పుడై= శూన్యస్థలంచేత; ఆర్ = పూర్ణమై; పురి= సుడిగల; శఙ్గముమ్ = పాంచజన్యమనే శంఖమూ; ఇంద = ఈ; పూదలమ్ = భూతలాన్ని; కాప్పతర్కు = రక్షించడానికే, ఎన్ఱు = అని; ఇన్నిలత్తే = ఈ భూలోకమందే; ఇరామానుశముని ఇడైయే =రామానుజముని స్వరూపంగానే; ఆయిన = అయినవి.

**తాత్పర్యము** : లక్ష్మీనాథుని శ్రీహస్తాలయందు విరాజిల్లే చక్రశంఖ గదా ఖడ్గ చాపాయుధ మూర్తులైదుకూడి, జగద్రక్షణార్థమై ఈ భూలోకాన శ్రీ రామానుజయతిరాజుగా అవతరించాయి.

వృత్తం - ఔపచ్ఛందసికం.

**సంస్కృత వ్యాఖ్యా** : స్వపక్షరక్షణాత్ విపక్షప్రతిక్షేపాచ్చ పంచాయుధీ రామానుజాచార్య తయా అవతీర్ణేతి వదతి ప్రథయన్నితి.

యతీంద్రః, విమతేషు - ప్రతివాదిషు, తీక్ష్ణభావం, ప్రథయన్-అత్యంత బాధకత్వం ప్రకాశయన్; అస్మత్ పరిరక్షణే, ప్రభుః-సమర్థః, అతః, మురారేః అపృథక్ ప్రతిపన్నయన్మయత్వైః-నవిద్యతే దివ్య స్వరూపాత్ పృథక్ ప్రతిపన్న యన్మయత్వం, యత్ స్వరూపత్వం యేషాంతాని, అపృథక్ ప్రతిపన్న యన్మయత్వాని, తైః; పంచభిరాయుధై ర్వవృధే - అభివృద్ధః.

**అత్ర వ్యాఖ్యానాంతరం :** అపృథక్ ప్రతిపన్నయన్మయత్వైః – పృథక్ – పృథగ్భావః, భిన్నభావః, తం ప్రతిపన్నం – ప్రాప్తం, త న్నభవతీతి అపృథక్ ప్రతిపన్నం. యస్యమునేః రూపం యన్మయం, యన్మయస్యభావః – యన్మయత్వం. అపృథక్ ప్రతి పన్నత్వం యన్మయత్వం యేషాంతే, తథోక్తైః..

**13. శమితో దయ శంకరాది గర్వః**
**స్వబలా దుద్ధృత యాదవ ప్రకాశః।**
**అవరోపిత వాన్ శ్రుతే రపార్థాన్**
**ననురామావరజ స్స ఏషభూయః॥**

**అర్థం :** శ మిత+ఉదయ, శంకర+ఆది గర్వః= నిరసింపబడిన ఆవిర్భావం గల, రుద్ర బ్రహ్మేంద్రాదుల గర్వం కలిగినట్టి; స్వబలాత్ = తన బలం వల్ల; ఉద్ధృత యాదవప్రకాశః = మళ్ళీ ప్రతిష్ఠింపబడిన యాదవ వంశీయుల తేజస్సును కలిగినట్టి; అపార్థాన్ = పార్థునికంటె భిన్నులైన దుర్యోధనాదులను; శ్రుతేః = చెవి నుంచి; అవరోపితవాన్ = దించినట్టి; సః = ఆ ప్రసిద్ధుడైన; రామ+అవర జః = బలరాముని తమ్ముడైన శ్రీ కృష్ణ భగవానుడే –

శమితో దయ శంకర, ఆదిగర్వః = పోగొట్టబడిన ఆవిర్భావం గల శంకర, భాస్కరాదుల గర్వం కలిగినట్టి; స్వబలాత్ = తన జ్ఞాన బలం వల్ల; ఉద్ధృత యాదవ ప్రకాశః = ఉద్ధరింపబడిన యాదవ ప్రకాశ మిశ్రులు కలిగినట్టి; శ్రుతేః = వేదం యొక్క, అప+అర్థాన్ = అసంగతార్థాలను; అవరోపితవాన్ = నిరసించినట్టి; ఏషః = ఈ; రామావరజః = లక్ష్మణమునిగా; భూయః,నను = మళ్ళీ అవతరించాడన్నట్లున్నాడు.

**తాత్పర్యము :** రుద్ర బ్రహ్మేంద్రులకు కలిగిన గర్వాన్ని అణచినట్టి, తనశక్తి వల్ల యాదవులకు మళ్ళీ తేజస్సును కలిగించినట్టి, దుర్యోధనాదులను ఎవరి చెవియందు పడకుండా చేసినట్టి ఆ ప్రసిద్ధ బలరామానుజన్ముడైన శ్రీకృష్ణుడే-

శంకరాదులకు కలిగిన గర్వాన్ని తొలగించినట్టి, తన జ్ఞాన మహిమవల్ల యాదవ ప్రకాశమిశ్రులను సంరక్షించినట్టి, వేదం యొక్క అపార్థాలను నిరసించినట్టి ఈ రామానుజులుగా మళ్ళీ అవతరించాడన్నట్లున్నాడు కదా!

**వ్యాఖ్య :** శ్రీ కృష్ణుడు లక్ష్మణమునిగా అవతరించాడని శ్లేషానుప్రాణితమైన ఉత్ప్రేక్ష.

శ్రీ రంగత్తముదనార్లు వర్ణించిన దానికంటే విశేషంగా దేశికులు పంచాయుధాల అవతారం రామానుజులనియే కాక, స్వయంగా శ్రీకృష్ణ భగవానుని అవతారమే రామానుజులని వర్ణించారు. 'రామావరజ' అనే అర్థశ్లేషగల శబ్ద చమత్కృతితో వారిద్దరి యందు ధర్మైక్యం వర్ణితం.

'రామావరజుడు' అంటే బలరాముని తమ్ముడు శ్రీ కృష్ణుడనీ, శ్రీ రాముని తమ్ముడు లక్ష్మడనీ అర్థశ్లేష. ఈ శబ్దం 'లక్ష్మణముని' అనబడే రామానుజ యతిరాజును కూడా బోధిస్తుంది.

**1. శమితో దయశంకరాది గర్వః :-**

శ్రీ కృష్ణుడు బాణాసురుణ్ని రక్షించడానికి తనతో యుద్ధంచేసిన శంకరు (శివదేవు) ణ్ని జృంభణాస్త్రం ప్రయోగించి, ఆవలింతలతో నిద్రాపరవశునిగాజేసి అతని గర్వాన్ని అణచివేశాడు. గో, వత్సహరణం చేసిన బ్రహ్మాకూ, గోవర్ధనోద్ధరణతో ఇంద్రునికీ శ్రీకృష్ణుడు గర్వభంగం చేశాడు.

శ్రీ రామానుజ యతిరాజులు శంకరాచార్యుల మాయావాదాన్ని - పూర్వపక్షంగా చేసి - తమ జ్ఞానగరిమచే ప్రబల ప్రమాణయుక్త్యాదులను ప్రదర్శించి, అలాగే భాస్కరాదులు కల్పించిన అర్థాలనూ ఖండించి, వారి ఆఖర్వగర్వాన్ని అక్షరాలా అపనయించారు.

**2. ఉద్ధృత యాదవ ప్రకాశః :-**

శ్రీకృష్ణుడు తన అవతారకాలాన యాదవ వంశీయుల గత వైభవాన్ని పునః ప్రతిష్ఠించాడు.

శ్రీ భాష్యకారులు "కప్యాసం పుండరీకమేవ మక్షిణీ" అనే ఛాందోగ్యో పనిషద్వాక్యానికి "భగవానుడు కోతిపిఱ్ఱలవంటి ఎఱ్ఱని కన్నులు కలవాడు" అని అపార్థాన్ని బోధించిన 'యాదవప్రకాశులు' అనే తమ గురువుగారికి

"గంభీరాంభస్సముద్భూత సుమృష్ట నాళరవికర వికసిత పుండరీక దళా మలాయతే క్షణః" అనే విపులమైన అర్థాన్ని చెప్పినందువల్ల అతనికి గర్వభంగమయింది. ఆయన పాండిత్యం ప్రకాశించక, తమనాశ్రయించినప్పుడు యాదవ ప్రకాశులను శ్రీ వైష్ణవునిగా తీర్చిదిద్ది కాపాడినవారు యతిరాజులు.

**3. అవరోపితవాన్ శ్రుతే రపార్థాన్ :-**

'శ్రుతి' అంటే చెవ్వు, వేదమని అర్థాలున్నాయి. అపార్థాన్ = పాండవులు కానివారిని (పార్థః = అర్జునుడు) పృథా పుత్రులు కాని వారిని కౌరవులనబడే దుర్యోధనాదులను, వారి పేరునూ ఎవరి చెవినిబడకుండా, అంటే ఎవరూ తలచకుండా వారిని నాశనం చేయించినవాడు శ్రీ కృష్ణుడు.

శ్రీ రాయానుజ యతిసార్వభౌములు, తమ అపూర్వ, అద్భుతపాండితీ ప్రతిభాపాటవంచేత శ్రుతికి (అప+అర్థాన్) అపార్థాలనుబోధించిన వారిని నిరసించి, వాస్తవార్థాలను ప్రామాణికంగా బోధించి, చేతనులను ఉజ్జీవింప చేసినవారు.

సః ఏషః భూయః (ఉత్తీర్ణః) నను = ఆ శ్రీ కృష్ణుడే ఈ రామానుజులుగా మళ్ళీ ఈ భూలోకంలో అవతరించాడనడం వాస్తవం కాదా? ముఖ్యంగా ఈ శ్లోకంలో ఆ శ్రీకృష్ణభగవానుడే - బలరామానుజుడే - "ఆచార్యః సహరిః సాక్షాత్" అన్నట్లు ఈ సంసారులను ఉద్ధరించడానికి రామానుజ యతిరాజులుగా అవతరించాడని ఉత్ప్రేక్షించి, నిర్ధారించారు శ్రీ వేదాన్తదేశికులు. శ్రీ కృష్ణునికీ, యతిరాజులకూ లక్షణ సాదృశ్యాన్ని ప్రపంచించిన వేదాన్త దేశికుల యొక్క "ఆచార్యులను మించిన వేరొక దైవం లేదు" అనే మాటను ధ్రఢీకరిస్తున్నది. వాస్తవంగా దేశికులు రామానుజ సిద్ధాన్త నిర్ధారణ సార్వభౌములుకదా!

వృత్తం - ఔపచ్ఛంద సికం

**సంస్కృత వ్యాఖ్యా :** అథ సంజ్ఞ యా వ్యాపారేణచ కృష్ణఏవ రామానుజాచార్య ఇతి వదతి శమితేతి. ఏషః- తచ్ఛబ్ద బలాదేతచ్ఛబ్ద లాభః.

శమితోదయ శంకరాది గర్వః స్వబలాదుద్ధృతయాదవ ప్రకాశః శ్రుతేరపార్థాన్ అవరోపితవాన్ – తత్, స ఏవ రామానుజః కృష్ణ ఏవ భూయోఽ ప్యవతీర్ణ ఇత్యర్థః. నన్వితిసంభావనాయామ్.

**రామానుజాచార్యపక్షే :–** శమితోదయ శంకరాది గర్వః – శమితో దయః శంకర భాస్కరా దీనాం గర్వః యేన సః –

**కృష్ణపక్షే :–** శంకరః–రుద్రః, ఆ దయః–బ్రహ్మేంద్రాదయః–స్వబలాత్– జ్ఞాన భక్త్యాది బలేన; ఉద్ధృత యాదవ ప్రకాశః– ఉద్ధృతః – పునఃప్రతిష్ఠాపితః, యాదవానాం ప్రకాశః – తేజః యేనే త్యర్థః.

శ్రుతే రపార్థాన్ – వేదస్య కుదృష్టి కల్పితాన్ అసంగతార్థాన్; అవరో పితవాన్ – త్యాజితవాన్, కృష్ణపక్షేతు:– అపార్థాన్ – పార్థవిరుద్ధాన్ దుర్యోధనాదీన్; శ్రుతేః – శ్రవణాత్, అవరోపితవాన్– తద్వినాశాదేవ తచ్ఛ్రవణ మపి నశ్యతీత్యర్థః

**వ్యాఖ్యానాంతరం :** ఉద్ధృత యాదవ ప్రకాశః – ఉద్ధృతః ఉత్పాటితః, యాదవ ప్రకాశోనామ పరవాదీ యేన సః ఇతి.

**14.** **అబహుశ్రుత సంభవం శ్రుతీనాం**
**జరతీనా మయథాయథ ప్రచారమ్ ।**
**వినివర్తయితుం యతీశ్వరోక్తి**
**ర్వి దధే తాఃస్థిర నీతి పంజరస్థాః ॥**

**అర్థం :** యతి+ఈశ్వర+ఉక్తిః= యతిరాజుల శ్రీసూక్తి; జరతీనాం = జీర్ణత్వాన్ని (ముదిమిని) పొందుతున్న; శ్రుతీనాం=వేదాలకు (ఉపనిషత్తులకు); అ బహుశ్రుత సంభవం = అల్పజ్ఞుల వల్ల కలిగిన; అయథాయథప్రచారం = యథార్థంకానట్టి, అపార్థాల ప్రచారాన్ని; వినివర్తయితుం = నివారించడానికి; తాః = ఆ, ఉపనిషత్తులు అనబడే పక్షులను; స్థిర నీతి పంజరస్థాః = చలించని, దృఢమైన, మీమాంసా, న్యాయశాస్త్ర రూపమైన పంజరాలలో ఉండునట్లుగా, విదధే = చేసెను.

**తాత్పర్యము :** వేదాలు చాలా పాతబడుతున్నాయి. అల్పజ్ఞులు కల్పించిన అపార్థాలవల్ల కుంటుబడిన వాటి (సం)ప్రచారాన్ని నిరసించడంకోసం, ఆ వేద పక్షులను దృఢమైన నీతిశాస్త్రరూపమైన పంజరాలలో ఉంచి, శ్రీ భాష్యకారులసూక్తి రక్షించింది.

**వ్యాఖ్య :** యతీశ్వర శ్రీసూక్తి వేదార్థాలను ప్రామాణికంగా ప్రచారం చేస్తున్నది.

వేదాలను ప్రాబల్కులు, తొలి పలుకులు అంటారు. అల్పజ్ఞులు వేదాలకు అపార్థాలను కల్పించడం వల్ల – పరవాదుల ప్రాబల్యం వల్ల – అవి క్షీణిస్తున్నాయి. వాటి ప్రచారం యథార్థంగా సాగడం లేదు.

గత శ్లోకంలోని "అవరోపితవాన్ శ్రుతేరపార్థాన్" అనే విషయాన్ని ఈ శ్లోకంలో వివరించారు దేశికులు. శ్రుతులు – వేదోపనిషత్తులు, ముసలి పక్షులు–చిలుకలు–తో పోల్చబడినాయి. పరిణతబుద్ధులుకానివారు, పిల్లలు ఆ పక్షుల రెక్కలకు హాని కలిగిస్తుంటే అవి స్వేచ్ఛగా ఎగురలేకపోతున్నాయి. వేద పక్షులు బ్రహ్మ మనే ఆకాశమందు స్థిరంగా సంచరించలేకపోతున్నాయి. ధార్మికులు ఆ పక్షుల స్థితినిజూచి ప్రేమతో వాటిని పంజరాలలో బంధించి, ఇతరులవల్ల వాటికి హాని కల్గకుండా రక్షిస్తారుకదా! అలాగే, శ్రీభాష్యకారులు క్షీణతను పొందుతున్న శ్రుతులను ప్రతిపక్షులవాదాలచేత చలనం పొందని మీమాంసా న్యాయశాస్త్రాలు అనే పంజరాలలో ఉంచి రక్షించారు.

**అయథాయథప్రచారమ్ :** వాస్తవం కానట్టి, అపవిత్రమైన నడవడి అని అర్థం. 'నీతి' అంటే ఋజువర్తనం, పవిత్రమైన నడవడి. శ్రుతి అంటే నిగమ కాంత. (స్త్రీలింగ పదమది). శ్రుతి పతి ఉభయవిభూతి నాయకుడైన శ్రియః పతి. యతిరాజసూక్తులు, ముఖ్యంగా శ్రీ భాష్యం, శ్రుతిని ఇతర దైవతాలతో వ్యవహరించకుండా నిరోధిస్తున్నాయని భావం.

**అబ్రహ్మశ్రుత సంభవమ్ :** భేదశ్రుతులు, అభేదశ్రుతులు, భేదాభేద శ్రుతులనేవి వేదబోధితాలే. వీటినన్నిటినీ సమన్వయ పరచి సమర్థించాయి యతిరాజసూక్తులు.

**భేదశ్రుతులు :** విశేషణాలను వేర్వేరుగా తెలిపేవి భేదశ్రుతులు.

**అభేదశ్రుతులు:** విశిష్టమొక్కటే అని తెలిపేవి అభేదశ్రుతులు

**ఘటకశ్రుతులు :** వేదంలో విరుద్ధంగాతోచే రెండు వాక్యాలకు విరోధాన్ని పరిహరించే వాక్యాలు ఘటకశ్రుతులనబడుతాయి. ఉదా: "తత్త్వమసి", "అహంబ్రహ్మాస్మి" – ఆ పరబ్రహవునీవే; నేనే పరబ్రహ్మాను, అని ఆ వాక్యాలకు అర్థం. (తత్=ఆ పరబ్రహ్మ; త్వం=జీవుడవైన నీవు; అసి=ఉన్నావు. అహం=జీవుడనైన నేను; బ్రహ్మ+అస్మి = పరబ్రహ్మాను). కించిత్‌జ్ఞుడైన జీవునికీ, సర్వజ్ఞుడైన పరబ్రహ్మాకూ స్వరూపైక్యాన్ని బోధిస్తున్నదంటారు. ఇది అల్పజ్ఞులు కల్పించిన అర్థం. జీవబ్రహ్మలకు అభేదమంటారు కదా! ఇదే మోక్షసాధన మని కూడా అంటారు. కాని, ఇలా భ్రమింపరాదు.

"అంతః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా". అనే శ్రుతి వాక్యం పరమాత్మ జీవాత్మలో ప్రవేశించి శాసకుడై ఉంటాడని బోధిస్తుంది. జీవుడు బ్రహ్మాకు శరీరం. అంటే, బ్రహ్మకు ప్రకారభూతుడు జీవుడని భావం. 'సర్వాత్మ' అంటే సర్వానికి ఆత్మయైనవాడు పరమాత్ముడు. సర్వం పరమాత్మకు శరీరమే. ఈ భావాన్నే "య ఆత్మని తిష్ఠన్ ఆత్మనో న్తరోయమాత్మానవేద, యస్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమయతి స ఆత్మా న్తర్యామ్యమృతః"– ఎవడు ఆత్మలో పలున్నాడో ఆ పరమాత్మను జీవాత్మ తెలుసుకోవడం లేదు. పరమాత్మకు జీవాత్మ శరీరం. అతడు జీవాత్మను లోపల ఉండి నియమిస్తున్నాడు. ఆ, అంతర్యామి అమృత స్వరూపుడు" అని శ్రుతులు స్పష్టంగా బోధిస్తున్నాయి కదా! జీవ ప్రకారకమైన పరబ్రహ్మాను బోధించడం వల్ల ఇక్కడ భేదమే భాసిస్తున్నది కదా!

"పృథగాత్మానం ప్రేరితారంచమత్వా జుష్టస్తతస్తే నా మృతత్వ మేతి" అని ఈ భేద జ్ఞానమే మోక్ష సాధనమని తెల్పబడినది.

'తత్త్వమసీ' త్యాది వాక్యాలు సామానాధికరణ్య వాక్యాలు. కాబట్టి శరీరాత్మల వలె విడదీయడానికి వీలులేని సంబంధంచేత పరబ్రహ్మాచేతనా చేతనాలతో కూడి యుండడం వల్ల అభేదశ్రుతి వాక్యాలు సమన్వయింప బడుతున్నాయి.

బ్రహ్మ మొక్కటే నానావిధ చేతనాచేతనాలను శరీరంగా పొంది, నానా రూపాలుగా గోచరించడంవల్ల భేదాభేదశ్రుతి వాక్యాలు సమన్వితమవుతున్నాయి.

చిద చిదీశ్వరుల స్వరూప స్వభావాలు కలిసియున్నప్పటికీ, పలు రకాల తంతువులచే నిర్మితమైన వస్త్రంలో వలె తమ తమ స్వభావాలు పరస్పరం అసంకీర్ణంగానే ఉంటాయి. కాబట్టి భేదశ్రుతి వాక్యాలు సమన్వయమవుతున్నాయి.

**నిర్గుణశ్రుతులు :**

"నిరవద్యం నిరంజనం నిష్కలం నిష్క్రియం, శాంతమ్"

"నేహనానాస్తికించన" "సదేవసోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయం"- ఇత్యాది వాక్యాలు (గుణం, విగ్రహం, విభూతి ఏదీ లేవని) పరబ్రహ్మ నిర్గుణమని బోధిస్తున్నాయి.

**సగుణశ్రుతులు :**

"య స్సర్వజ్ఞః సర్వవిత్" "యస్యజ్ఞాన మయంతపః" "తదైక్షత" "పరాస్యశక్తిర్వి వివిధైవశ్రూయతే, స్వాభావికీజ్ఞానబలక్రియాచ" "ఆనందం బ్రహ్మణో విద్వాన్". "సర్వస్యవశీ సర్వస్యేశానః" మొదలైన వాక్యాలు పరబ్రహ్మ సగుణమని బోధిస్తున్నాయి.

పరస్పర విరుద్ధంగా భాషించే ఈ శ్రుతివాక్యాల సమన్వయ విధానం ఇలా ఉంటుంది.

నిర్గుణశ్రుతులు పరబ్రహ్మకు ఏ గుణాలూలేవని చెప్పడంలేదు. ప్రకృతి సిద్ధమైన హేయ గుణాలు (దుర్గుణాలు) మనయందున్నట్లు పరబ్రహ్మయందు లేవని మాత్రమే అవి బోధిస్తున్నాయి. అలా కాకుంటే, సగుణశ్రుతులు "సర్వజ్ఞత్వాన్నీ, ఈ క్షణాత్వాన్నీ ఎందుకు బోధిస్తున్నాయి? పరబ్రహ్మ వివిధ విచిత్ర శక్తిశాలియనీ, జ్ఞాన బలక్రియాదులు ఆయనకు స్వభావసిద్ధమైనవని బోధిస్తున్నాయి కదా!

నిర్గుణశ్రుతులకు ప్రాబల్యాన్ని చెప్పిన సగుణశ్రుతులకు బాధ్యత్వాన్ని చెప్పినట్లైతే, ప్రమాణోత్తమమైన వేదభాగానికి అప్రామాణ్యం చెప్పినట్లవుతుంది. కాబట్టి, రెండు విధాలుగా ఉన్న శ్రుతులకు సరళంగా సమన్వయంచేయాలి. శాస్త్ర విధాన మదే కదా!

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనేది శోధక వాక్యం. "శోధక వాక్యం" అంటే పరబ్రహ్మ జగత్కారణమని చెప్పగానే, లోకంలో, కారణ వస్తువులకు ఉండే దోషాలు పరబ్రహ్మకు ఎందుకు లేవు? అని అడిగేవానికి సమాధానం చెప్పేమాట. 'సత్యం, జ్ఞానం' అనే వాక్యం జగత్కారణునికి, లోకం కంటె వైలక్షణ్యాన్ని బోధించి, ఆ దోషాలు లేకుండడానికి ఈ వైలక్షణ్యమే కారణం అని విశదపరుస్తుంది.

"ఏషఆత్మా అపహతపాప్మా విజరోవిమృత్యుర్విశోకో విజిఘిత్సు రపిపాసః సత్యకామః సత్య సంకల్పః" - అనేది ఘటకశ్రుతి. ఈ వాక్యం పరమాత్మకు పాపం, ముదిమి, చావు, దుఃఖం, ఆకలిదప్పులు అనే హేయగుణాలులేవనీ; సత్యకామత్వం, సత్యసంకల్పం అనే కల్యాణ గుణాలు ఉన్నాయని ఒకే వాక్యంలో స్పష్టంగా బోధిస్తూ విరోధాన్ని పరిహరిస్తున్నది కదా!

శ్రుతులలో స్థూలదృష్టికి కనిపించే విరోధాలను అవి విరోధాలుకావనీ, ప్రమాణభూతార్థాలనే శ్రుతులన్నీ బోధిస్తున్నాయని శ్రీ భాష్యకారులైన భగవద్రామానుజులవారు వివరంగా బోధించారు.

యతిరాజసూక్తులు వేదపక్షులను, వాటి క్షీణతను పోగొట్టడానికి, స్థిరనీతి పంజరాలలో ఉంచి రక్షించాయి, అని రూపకాలంకృతమయినదీశ్లోకం. పక్షులని వాచ్యంగా లేకున్నా, పంజర శబ్ద ప్రయోగంచేత శ్రుతులు పక్షులని అభివ్యక్తమే.

వృత్తం - ఔపచ్ఛందసికం

**సంస్కృత వ్యాఖ్యా :** అథ రామానుజాచార్యో క్తేః త్రయ్యంత సంరక్ష త్వం వక్తి, అబహ్వీతి. యతీశ్వరోక్తిః జరతీనాం శ్రుతీనామ్- ఉపనిషదాం; అబహుశ్రుత సంభవమ్ - అల్పశ్రుతకల్పితం; అయథాయథ ప్రచారం -

అనభిప్రేతార్థవర్ణనం; వినివర్తయితుం, తాః - ఉపనిషదః; స్థిరనీతి పంజరస్థాః - స్థిరనీతయః ఆవిచాల్య న్యాయాః త ఏవ పంజరాణి, తేషుతిష్ఠంతీతి తత్స్థాః; అవిచాల్య న్యాయోపేతతయా ప్రతిష్ఠితార్థాః; విదధే-శ్రీభాష్యాది ప్రణయనేన సంరక్షితవతీ త్యర్థః. లోకే బాలిశాదిభి రుపప్లవమానానాం వృద్ధ పక్షిణాం ధార్మికాః తన్ని వారకం పంజరం కల్పయంతీతి స్ఫురతి.

**అత్ర వ్యాఖ్యానాంతరం :** యతీశ్వరోక్తిః యతిరాజ శ్రీసూక్తిః; జరతీనాం- పరవాది ప్రాబల్యాత్ క్షీణానాం; శ్రుతీనాం - వేదానాం; అయథాయథప్రచారం - యథాయథంన భవతీ త్యయథాయథం, అయథార్థః, సచాసౌప్రచారః; సంచారః, తం; అబహుశ్రుతసంభవమ్ - బహుశ్రుతానభవంతీత్య బహుశ్రుతాః , అల్పశ్రుతాః, తేభ్యః సంభవః యస్య తం ఇతి.

**15. అమునా తపనాతిశాయి భూమ్నా**
**యతిరాజేన నిబద్ధ నాయక శ్రీః।**
**మహతీగురు పంక్తి హారయష్టిః**
**విబుధానాం హృదయంగమా విభాతి ॥**

**అర్థం :** తపన+అతిశాయి, భూమ్నా = సూర్యుని మించిన తేజస్సుగల, అమునా = ఈ; యతి రాజేన = యతి చంద్రునిచేత; నిబద్ధ నాయక శ్రీః = కూర్చబడిన నాయక రత్నం యొక్క శోభగల; మహతీ = గొప్పదైన; గురుపంక్తిహార యష్టిః = గురు పరంపర అనే ముత్యాలహారం; విబుధానాం = విద్వాంసులకు; జ్ఞానులకు; హృదయంగమా = మనోజ్ఞమై; విభాతి = ప్రకాశిస్తున్నది.

**తాత్పర్యము :** మౌక్తిక మాల ఉజ్జ్వలమైన నాయక మణిచేత శోభించే రీతిగా, గురుపరంపర అనే మౌక్తిక మాల, యతిరాజు (చంద్రుడు) అనే నాయక రత్నం చేత మహనీయమైన తేజస్సును పొంది జ్ఞానులైన విద్వాంసులకు మనోహరంగా భాసిస్తున్నది.

**వ్యాఖ్య :** గురుపరంపరలో రామానుజాచార్యుల స్థానం అనితర సామాన్యమైనదని ఉపమారూపకాలంకారాలచే వర్ణితం.

గురు పరంపర ఒక రత్నహారం. ఆ రత్నాలహారంలో శ్రీమద్రామానుజా చార్యులు మధ్యనాయకమణిగా శోభిస్తున్నారు. యతిరాజులకంటె ముందు నవరత్నాల వంటి తొమ్మండుగురు ఆచార్యులను – శ్రీధరుని నుంచి శ్రీపరాంకుశదాసుని వరకు – దేశికులు (ఇందు) తొమ్మిది శ్లోకాలలో వైభవంగా వర్ణించారు కదా!

**"పత్యుః సంయమినాం ప్రణమ్యచరణౌ తత్పాదకోటీరయోః।**
**సంబంధేన సమిద్ధమాన విభవాన్ ధన్యాంస్తథాఽన్యాన్గురూన్ ॥**

('న్యాయ పరిశుద్ధి' అనే గ్రంథంలోని మంగళశ్లోకమిది)

యతులకు పతియైన రామానుజాచార్యుల పాదాలకు దండవత్ ప్రణామాలను ఆచరించిన ఆచార్యులు, పాదసంబంధం చేత ధన్యులు. రామానుజాచార్యులు తమ ప్రాచార్యుల పాదాలను శిరస్సున వహించడంచేత వారూ, రామానుజ శిరస్సంబంధంచేత ధన్యులు. భగవద్రామానుజుల తిరుముడి సంబంధంవల్ల తత్పూర్వాచార్యులూ, తిరువడి సంబంధంవల్ల తదనంతరీయులైన ఆచార్యులూ, అందరూ అత్యుజ్జ్వలంగా ప్రకాశిస్తున్నారని తాత్పర్యం.

ఆ భావాన్నే ఈ శ్లోకంలోనూ దేశికులు స్ఫురింపజేస్తూ, అమోఘంగా వర్ణించారు.

**తపనాతిశాయిభూమ్నా :** సూర్యుని కంటె మించిన కాంతి కలది యతిరాజు అనే నాయకమణికాంతి. ఈ నాయక మణిని ముక్తా హారానికి మధ్యన కూర్చడంవల్ల అది తనకిరువైపుల ఉన్న ముత్యాలకు అధిక శోభను కలిగిస్తూ, తానూ అత్యుజ్జ్వలంగా ప్రకాశిస్తుంది. కాబట్టి ఈ మౌక్తిక మాల (మహతీ) మహనీయ అనబడింది. యతిరాజ నిబద్ధనాయక శ్రీ, బాహ్యా తమస్సును – బయట ఉన్న చీకటిని తొలగిస్తుంది. కాబట్టి సూర్యకాంతితో సమానమైనది. లోపలి అజ్ఞానమనే అంధకారాన్ని – ఆంతర తమస్సును –

కూడా పోగొట్టుతుంది. కాబట్టి సూర్యుని తేజస్సుకన్న మిన్నయైనది. ఆ మహిమను తెలుసుకొన్న జ్ఞానానుష్ఠాన పరులు ఈ గురుపరంపరా ముక్తాహారాన్ని తమ కంఠాన ధరించగా యతిచంద్ర నాయకమణికి వారి హృదయం పీఠమై శోభిస్తుంది. "చంద్రమా మనసోజాతః" అన్నట్లు మనస్సుకూ చంద్రునికీ ఘనిష్ఠ సంబంధం ఉంది కదా! 'రాజన్' శబ్దం చంద్రవాచి. అందువల్ల, ఈ మణిప్రభ సూర్యతేజస్సులాగా తాపాన్నికలిగించక, చంద్రమహస్సులాగా హృదయంగమంగా – ఆహ్లాదాన్ని కలిగిస్తుందన్న అర్థమూ ఉంది.

తపనునికి – సూర్యునికి గ్రహరాజత్వమెలా స్వాభావికమో, అలాగా శ్రీమద్రామానుజాచార్యులకు యతిరాజత్వం స్వాభావికమని ధ్వనిస్తున్నది. గురుపరంపరలోని తమ పూర్వోత్తరాచార్యులను వైభవంగా భాసింపజేస్తూ, ముక్తాహారంలోని నాయకమణిలాగా, యతిరాజు సర్వాచార్యాతిశయిత భూమత్వం చేత అద్భుతంగా వెలుగుతున్నాడని అనురణిస్తున్నదీశ్లోకం.

11వ శ్లోకం నుంచి 15వ శ్లోకం వరకు, 5 శ్లోకాలు ఔపచ్ఛంద సికాలు అనబడే అర్ధసమవృత్తాలు. ససజగగ – సభరయ, గణాలు పూర్వార్థంలో ఉన్నట్లే, ఉత్తరార్థంలోనూ ఉంటాయి. మొదటిపాదంలోనూ మూడవపాదంలోనూ పదొకండక్షరాలు, రెండవ మరియు నాల్గవపాదంలో పంద్రెండక్షరాలుంటాయి.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ రామానుజాచార్యస్య పూర్వోక్త గురుపరంపరాతిశ యావహకత్వేన, గురుపరంపరాం హారత్వేన, ఏనంచనాయకత్వేన నిరూపయతి అమునేతి. తపనాతి శాయిభూమ్నా – తమోనివారకత్వాత్ త త్సామ్యం, అంతరస్యాపి తమసోనివర్తకత్వాత్తదాధిక్యంచోచ్యతే. అమునా యతిరాజేన నిబద్ధనాయకశ్రీః – సంజాతనాయకరత్నశోభా; మహతీ – మహనీయా; గురుపంక్తిహార యష్టిః – గురుపరంపరా రూప మౌక్తికమాలా; విబుధానాం– జ్ఞాతౄణాం; హృదయంగమా విభూతి–మనోరమా విరాజతే. "తపనాతిశాయి భూమ్నే" తి తపనాత్ అతిశయితభూమ్నేత్యపివక్తుం శక్యతే. తపనస్య యథా సర్వగ్రహాతిశయితభూ మత్వం స్వాభావికం, తథా అస్యాపి సర్వగుర్వతిశయిత భూమత్వం స్వాభావిక మిత్యర్థః

16. **అలూన పక్షస్య యతిక్షమాభృతో**
**విభాతి వంశే హరితత్వ మక్షతమ్।**
**యదుద్భవాః శుద్ధ సువృత్తశీతలా**
**భవంతి ముక్తావళి భూషణం భువః॥**

**అర్థం** : అలూన పక్షస్య = ఖండింపబడని తన సిద్ధాన్తంగల; యతి క్షమాభృతః = యతిరాజుయొక్క; వంశే = సంప్రదాయ (కుల) మందు; హరితత్వం = భగవత్తత్వం; అక్షతం = కొదువలేకుండా (కొట్టుబడకుండా); విభాతి-ప్రకాశిస్తున్నది. యత్+ఉద్భవాః = సిద్ధాంత (సంప్రదాయ) మందు ఉదయించినవారు; శుద్ధ సువృత్త శీతలాః = పరిశుద్ధమైన, చక్కని నడవడి, చల్లని హృదయం కలవారై; భువః = భూమికి; ముక్తా+ఆవళి, భూషణం = ముత్యాల సరంలాగా నగయై; భవంతి = ఉన్నారు, ఉంటారు.

**అర్థాంతరం** : అలూన పక్షస్య = తెగ నరుకబడని రెక్కలుగల; యతిక్షమాభృతః = నియమంగల పర్వతం యొక్క; వంశే = వెదురు బొంగునందు; హరితత్వం = పచ్చదనం; అక్షతం = చెదరక, చెనకబడక; విభాతి = ప్రకాశిస్తున్నది. యత్ + ఉద్భవాః = ఏ వెదురుబొంగులలో నుంచి పుట్టిన ముత్యాలు; శుద్ధ సువృత్త శీతలాః = స్వచ్ఛమైనవై, గుండ్రనివై, చల్లనివై; భువః =భూలోక జనానికి; ముక్తా+ఆవళి, భూషణం= ముత్యాలహార రూపమైన భూషణంగా; భవంతి=అవుతున్నవి. అవుతుంటాయి.

**తాత్పర్యము** : దేవేంద్రుని వజ్రాయుధంచేత రెక్కలు తెగగొట్టబడని మైనాక పర్వతం విలక్షణమైన పర్వతం. అలాగే కుదృష్టుల వాదంచేత ఖండింపబడక దృఢంగా నిల్చియున్న సిద్ధాన్తం యతిరాజసిద్ధాన్తం. సారవంతమైన పర్వత భూమిపైన పెరిగే వెదురుబొంగులు పచ్చగానూ, పొడువుగానూ, లావుగానూ ఎదిగి, వాటిలో నుంచి పుట్టే ముత్యాలు పరిశుద్ధంగానూ, వర్తులాకారంగానూ, చల్లదనంకలవిగానూ ఉంటాయి. అదే రీతిగా, రసఘనమైన యతిరాజ సంప్రదాయమందు ఉద్భవించే శ్రీ వైష్ణవులు భగవత్తత్వంతో విలసిల్లుతూ, పారిశుద్ధ్యమూ, సమ్యక్ జ్ఞానమూ, దయారసమూ కలవారుగా ఉంటారు.

భూలోకవాసులకు, వెదురు ముత్యాలహారం ఆభరణమైనట్లే, శ్రీ వైష్ణవ సమూహం జ్ఞానానుష్ఠానాలతో విశదతమంగా, నిర్లిప్తంగా, ముక్తాహారభూషణంగా శోభిస్తుంది.

**వ్యాఖ్య :** శ్రీమద్యతిరాజసిద్ధాన్త మహిమను ప్రకటించే శ్లోకమిది.

**యతిక్ష్మాభృత్ :** ఈ పదానికి యతిరాజు అని అర్థం. క్షమాంబిభర్తీతి = క్షమాభృత్. భూమిని భరించడ మనే వ్యుత్పత్త్యర్థంచేత 'రాజు' అనీ, పర్వతమనీ రెండర్థాలుగల పదమిది. "డు భృఞ్+ధారణపోషణయోః" అని ధాత్వర్థం. "మహీధ్రశిఖరిక్ష్మాభృత్" - "రాజ్ఞిరాట్పార్థివ క్ష్మాభృన్నృప భూప మహీక్షితః" - అనీ ఉభయత్ర అమరకోశం. శ్లేష వల్ల ఈ శ్లోకం పర్వతాన్నీ, యతిరాజునూ వర్ణిస్తున్నది.

పూర్వం పర్వతాలకు రెక్కలుండడంవల్ల అవి గ్రామ, నగరాల యందు వ్రాలితే జనులు నశించే ప్రమాదమున్నదని దేవేంద్రుడు తన వజ్రాయుధంచేత పర్వతాల రెక్కలను ఖండించాడు. ఆ సమయాన వాయుదేవుడు తన శక్తిచేత చిమ్మివేయడం వల్ల మైనాక మనే పర్వతం లవణసముద్రంలోపడి, రెక్కల అందంచెడకుండా అందులో దాగియుండి, ఇంద్రునిబారి నుంచి తప్పించుకొన్నది. ఈ సంగతిని హనుమంతునితో తానే చెప్పుకొన్నాడు.

**తతో౽హం సహసాక్షిప్తః శ్వసనేన మహాత్మనా।**
**అస్మిన్ లవణతోయే చ ప్రక్షిప్తః ప్లవగోత్తమ ।**
**గుప్త పక్ష స మగ్రశ్చ తవపిత్రా౽భి రక్షితః॥** (రామా.సుం.1-127)

రామకార్యార్థమై వాయుపుత్రుడైన హనుమంతుడు సముద్రందాటుతున్న సమయాన సముద్రప్రేరణచేత ఆతిథ్యమీయడానికి పైకితేలిన మైనాకుని ప్రార్థనను మన్నించి, 'అన్నరసం కంటె ఆదరణరసంమేలు' అంటూ నీ 'ప్రియోక్తులచేతనే ఆతిథ్యాన్ని స్వీకరించి సంతోషించాను. తొందర ఉన్న'దని హనుమంతుడు, మైనాకుని తలను తనచేతితో స్పృశించి ముందుకు సాగిపోయాడు. దేవతలు సంతోషించారు. దేవరాజు మైనాకునికి 'ఇక నీవు మనస్సునందైనా భయపడక, సుఖంగా ఉండు'మని అభయమిచ్చాడు.

**హిరణ్యనాభ! శైలేంద్ర! పరితుష్టోఽ స్మితే భృశమ్ ।**
**అభయంతే ప్రయచ్ఛామి తిష్ఠసౌమ్య! యథాసుఖమ్॥**
**సవైదత్తవరః శైలో బభూవావస్థితస్తదా॥** (రా.సుం. 1-1431/2)

ఇలా దృఢంగా నిల్చింది. కాబట్టి అలూన పక్ష పర్వతం - మైనాకం - పర్వతాలన్నిటికంటె విలక్షణమైనది. ఇక సముద్రంలో దాగక పైననే నిర్భయంగా ఉన్నది.

పర్వతాలు సాధారణంగా పచ్చని వృక్షసంపదకు ప్రసిద్ధమైనవి. అందు వంశ తరువులు హరితత్వానికి ప్రఖ్యాతిని పొందినవే కదా! 'వంశ' పదంశ్లిష్టం. వంశశబ్దానికి 'వెదురుబొంగు (కంక)చెట్టు, కులం' అనీ అనేకార్థాలున్నాయి. వన్యతే, ఇతి=వంశః. 'వన షణ సంభక్తౌ' - ఆశ్రయింపబడేది, అనిధాత్వర్థం. "పృష్ఠాస్థిగేహోర్ధ్వకాష్ఠే వంశే వేణౌ గణే కులే" అని విశ్వప్రకాశనిఘంటువు.

వెదురు బొంగులకు ప్రక్కరెమ్మలు కొట్టి వేసినకొద్ది అవి ఏపుగా, నిలువుగా, లావుగా ఎదుగుతుంటాయి. కాని పచ్చదనం తగ్గుతుంది. వెదురునందు రెమ్మలు కొట్టి వేయబడనందువల్ల హరితత్వం - పచ్చదనం, (అక్షతం) చెక్కుచెదరక వైభవంగా శోభిస్తున్నది.

ముత్యాలు (వేణు) వెదురుబొంగు కణపులలోనూ లభిస్తాయి. ముత్యాలు పుట్టే ప్రదేశాలు ఎనిమిది, ఉన్నాయని అగస్త్యుడు చెప్పాడట.

**"జీమూత కరి మత్స్యాహి వంశ శంఖ వరాహజాః ।**
**శుక్త్యుద్భవాశ్చ విజ్ఞేయా అష్టౌ మౌక్తికయోనయః ॥"**

"మేఘం, ఏనుగు, చేప, సర్పం, వెదురుబొంగు, శంఖం, వరాహం, ముత్తెపుచిప్ప"- వీటి నుంచి ముత్యాలను పొందవచ్చునంటుంది శాస్త్రం.

కరీంద్ర జీమూత వరాహ శంఖ మత్స్యాహి శుక్త్యుద్భవ వేణుజాని"

పర్వతాలపైన ఏపుగా పెరిగి, నిండు పచ్చదనంతో ప్రకాశించే వెదురు బొంగుల్లోంచి పుట్టిన ముత్యాలు, పంక్తులుగా ఉండి స్వచ్ఛగాశోభిస్తూ, భూతలానికి అలంకారంగా ఉన్నాయి. ఉంటాయి.

**యతిరాజపరమైన అర్థం:** భగవద్రామానుజ సిద్ధాన్తం నిర్దుష్టమైనది. అలూన పక్షమంటె ప్రతివాదులచేత యతిరాజుల వాదాలు ఖండింపబడని మహిమగలవి. 'పక్షం' అంటే వాదమని అర్థం. 'వంశం' అంటే కులం, సంప్రదాయం.

**హరితత్త్వం :** ఇతరుల సంప్రదాయంలో భగవంతునికి పేరు లేదు. విగ్రహంలేదు. ఉనికి ఉన్నా లక్ష్మిలేని ఉనికి ఆయనది అని కొందరి సిద్ధాంతం. కాని, యతిరాజ సిద్ధాంతంలో మాత్రం శ్రియఃపతి స్వరూప, రూప, గుణ, విభూతులను కలిగి, సపరివారంగా దివ్యావయవ సౌందర్యవిశిష్టుడై (అక్షతం) సంపూర్ణంగా విరాజమానుడు. అది చిదచిదీశ్వరతత్త్వం.

**యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతేశ్రూయతేఽ పివా।**
**అంతర్బ హిశ్చ త త్సర్వం వ్యాప్యనారాయణః స్థితః ॥**

**"తే నేదం పూర్ణం పురుషేణ సర్వ మ్"**

**"హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ".** "తస్యధీరాః పరిజానంతియోనిమ్". ఇత్యాది శ్రుతులచే ప్రతిపాదితమైనది యతిరాజసిద్ధాంతం. కాబట్టి అది అక్షతమై స్థిరంగా భాసిస్తున్నది.

యతిరాజ మతావలంబులైన శ్రీ వైష్ణవులు, మోక్షఫలాన్ని పొందగోరి, సంసారాన్ని ప్రతిబంధకంగా భావించి, నిర్లిప్తులై ప్రవర్తిస్తుంటారు. రామానుజుల వారు ఉపదేశించిన శరణాగతి విధానంతో భరన్యాసంచేసి శ్రియఃపతి కృపకు పాత్రులవుతుంటారు. ఇది యతిరాజులు మానవులకు ప్రసాదించిన పారితోషికం. కాబట్టి "ముత్తి తరుమ్ యతిరాశర్" ముక్తినిచ్చేవాడు భగవంతుడు కాడు. యతిరాజులే ముక్తినిచ్చే సమర్థులన్నారు దేశికులు. ముక్తపురుషులకేర్పడే పరమాత్మానుభవాన్ని ఇక్కడ లభించే రీతిగా - భగవద్దయను ఈ లోకానికి తీసుకొని వచ్చి మానవులు శ్రేయస్సును పొందే రీతిగా – చేసినట్టిది రామానుజ సిద్ధాన్తమే. "భగవద్రామానుజులు మొదలైన ఆచార్యులు అవతరించిన వెంటనే ఈ ప్రపంచంలో ప్రపన్నులు ఎక్కువయ్యారు" అని దేశికులు 'నిక్షేపరక్ష' అనే గ్రంథంలో అనుగ్రహించారుకదా!

"పరమాత్మనియోరక్తః విరక్తోஉపరమాత్మని" అన్నట్లు యతిరాజులు స్వయంగా శరణాగతి చేసి, ఆశ్రితులకూ అలాగే చేయాలని (తాము ఆచరించి) బోధించడంవల్ల, వారి అనుయాయులూ, ఆశ్రితులూ ప్రాకృత విషయాలయందు పరమవిరక్తాగ్రేసరులైనారు. అవుతున్నారు. అవుతారు కూడా. కాబట్టి "ముక్త+ఆవళి భూషణం భువః"- ముక్త పురుషులుగా శోభించే శ్రీవైష్ణవ సమూహమే భూలోకానికి భూషణంగా అవుతుంది.

భగవదనుగ్రహంచేత భక్తి రూపాపన్న జ్ఞానులైన శ్రీవకుళాభరణులు - నమ్మాళ్వార్లు, కొన్ని శతాబ్దుల తర్వాత భవిష్యదాచార్యులుగా రామానుజులవారు అవతరించి తమ సిద్ధాంతాన్ని ప్రవర్తింపజేస్తారని (తిరువాయిమొషి $5-2-1$) మంగళాశాసనం కృపజేశారు.

**పొలిగ పొలిగ పొలిగ పోయిత్తు వల్లుయిర్ చాపమ్**
**నలియుమ్ నరకముమ్నైన్ద నమనుక్కింగు యాదొన్రుమిల్లై**
**కలియుమ్ కెడుమ్ కణ్డుకొణ్మిన్ కడల్వణ్ణన్ పూదఙ్గళ్ మణ్మేల్**
**మలియ ప్పుగున్దిశైపాడి యాడి యుషితర క్క ణ్డోమ్॥**

**తాత్పర్యము :** సముద్రంలాగా గంభీర స్వభావంగల శ్రీమన్నారాయణునికి దాసులైన శ్రీ వైష్ణవులు భూ లోకమందు గుంపుగాచేరి భగవద్గుణాలను పాడి, పరవశులై ఇష్టం వచ్చినట్లు సంచరించే రీతిని చూచాము. కాబట్టి చేతనుల పాపాలు నశించాయి. నరకబాధనశించింది. యమునికి ఏ పనియూ లేదు. కలియుగం పోయి కృతయుగంగా ఉన్నది. చూడండి. సమృద్ధి కలుగుగాక".

పై శ్లోకంలోని ముక్త+ఆవళి' - ముక్తుల గుంపును వివరించిన పాశురమిది. ముక్తాత్మలు వైకుంఠంలో ఉంటారుకాని ఇక్కడెందుకున్నారు? అంటే ఆళ్వారు యొక్క శ్రీ వైష్ణవ ధర్మసంపదను చూడాలనే ఆనందంతో నిత్యసూరులూ, ముక్త పురుషులూ నిత్యవిభూతి నుంచి లీలావిభూతికి వచ్చారు కాబట్టి ఆ సమృద్ధిని చూచి ఆళ్వార్లు మంగళాశాసనం చేశారని ఆళవందార్ అభిప్రాయపడినారట. "మణ్మేల్" - భూమి మీదనే; శ్రీ వైష్ణవ ధర్మం ఆళ్వార్ల ఉపదేశంచేత వ్యాప్తిచెందినందువల్ల విష్ణుభక్తులు గుంపులు గుంపులుగా చేరి, పరలోకమా

ఇది భూలోకమా అనే భేదం తెలియని విధంగా నిండి ఉన్నారు. కాబట్టి "ఓమ్ శాంతిః శాంతిః శాంతిః" అన్నట్లూ ముక్తావళిగా ఉన్న భాగవతగోష్ఠికి 'సమృద్ధికలుగుగాక' అని ఆళ్వార్లు మూడుసార్లు మంగళాశాసనం చేశారని వ్యాఖ్యాతలు వెల్లడించారు.

శ్రీ వైష్ణవులు ముక్తులు అనడానికి మూడు విశేషణపదాలున్నాయి. హరితత్త్వం ప్రకాశించే రామానుజ సంప్రదాయ వంశమందు జనించిన శ్రీ వైష్ణవులు 1. పరిశుద్ధులు. అంటే పవిత్రులు. పంచసంస్కారపరులు. హరిని తప్ప ఎవరినుంచి ఏమీ కోరనివారు. హరి నుంచి కూడా హరినే తప్ప మరేమీ కోరనివారు. 2. సువృత్తులు - చక్కని నడవడికలవారు. వారి అనుష్ఠానం జ్ఞానపూర్ణమైనది. వారి స్థితిగతులన్నీ భగవదధీనమని విశ్వసిస్తూ జీవించేవారు. తత్త్వం, హితం, పురుషార్థం అన్నింటిలోనూ వారికి శ్రియః పతియే భాసిస్తాడు. 3. శీతలాః - చల్లనివారు. ముత్యాలహారంలాగా హృదయంగమంగా శోభించేవారు. కృపాప్రసన్నులు. వారితో సహవాసంచేయడం అభ్యుదయకరం, ఆహ్లాదకరం. కాబట్టి "ముక్తావళి భూషణం భువః". భూమికి ముత్యాలసరమనే ఆభరణం శ్రీ వైష్ణవ సమూహం అని ప్రయుక్తం.

'భూమికి భూషణం' అనే వాక్యం 'మంచాఃక్రోశంతి' అనే వాక్యం లాంటిది. 'మంచెలు అరుస్తున్నాయి' అనేచోట మంచెలు అచేతనం కాబట్టి ఆ శబ్దం స్వార్థాన్ని విడిచి "మంచెల మీద ఉన్న వ్యక్తులు అరుస్తున్నారు" తన సంబంధంగల అర్థాన్ని గ్రహిస్తుంది. అలాగే 'జగత్తు సంతసించింది' అనేది భూమి అచేతనమైనందున ఆ పదం తన అర్థాన్ని విడిచి, వాచ్యార్థ సంబంధంగల అర్థాన్ని సాహిత్యశాస్త్రంలో 'జహదర్థ, వాచ్యార్థ సంబంధలక్షణ' వాక్యమని దీనికి పేరు.

'హరి' తత్త్వం' - 'హరి' శబ్దానికి 'సింహం' అనే అర్థమూ ఉంది. రామానుజ సంప్రదాయంలో 'కవితార్కిక సింహ' అనే బిరుదాంచితుడైన వేదాన్త దేశికులు శోభిస్తున్నారనీ వ్యంజితం.

**హరితత్వం** :- రామానుజ వంశమందు - ఆ సంప్రదాయమందున్న వారు కూడా, రామానుజుల వారిది 'హరిత' గోత్రంకాబట్టి, మా వంటి వారు కూడా హరిత గోత్రంతో విరాజిల్లుతుంటారు. 'హరిత' గోత్రం గల వంశమూ భాసిస్తుంది. శ్లేషానుప్రాణితో పమానరూపకాలంకారాలచే సజ్జితం ఈ శ్లోకం.

ఈ శ్లోకం 'వంశే' అనడం వల్ల 'వంశస్థవృత్త' మందున్నదని సూచితం. ఈ గ్రంథంలో ఒక్క శ్లోకమే ఈ వృత్తమందు  భాసిస్తున్నదని అర్థం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ రామానుజాచార్య మతే భగవతః సమస్త కల్యాణ గుణవిగ్రహాది పరిపూర్తిం, తన్మతస్థానాం భూతలాలంకారత్వంచ వదతి, అలూనేతి. అలూన పక్షస్య - ప్రతివాదిభిరఖండనీయస్వపక్షస్య; యతిరాజ క్షమాభృతః - యతిరాజస్య; వంశే - సంప్రదాయే; హరి తత్త్వం - హరేః తత్త్వం ప్రమాణ సిద్ధ దివ్యమంగళ విగ్రహ కల్యాణ గుణ, శరీర శరీరిభావాది రూపం; అక్షతం - క్షతిరహితం, విభాతి - విరాజతే. యదుద్భవాః - యద్వంశోద్భవాః శుద్ధసువృత్తశీతలాః - శుద్ధాః - పరిశుద్ధ బాహ్యాంతః కరణాః; సువృత్తాః-శుభాచారాః; శీతలాః-దయార్ద్రాశ్చ సంతః; భువః- భూమే; ముక్తావళి భూషణం - ముక్తావళివత్, ముక్తా సుమూహవత్, మౌక్తిక మాలావద్వా, భూషణం; భవంతి. తస్యయతిరాజస్యేతి పూర్వత్రాన్వయః. "క్షమాభృత్" పదేన పర్వతశ్చస్ఫురతి. తత్ర అలూన పక్షత్వం అఖండ గరుత్త్వం, పక్షచ్ఛేదేహి పార్శ్వవర్తినామపి వేణూనాం విచ్ఛేద సంభవాత్, ఛిన్నానాంచ శోషణాత్శ్యామత్వ మపైతి. తదభావే హరితత్వం - శ్యామత్వంఅక్షతం భవతి. యదుద్భవాః - యద్వంశోద్భవాః, వంశోఽత్రవేణుః; భువః- భూలోకస్థితానాం జనానాం; "మంచాః క్రోశం" తీతివత్; ముక్తావళి భూషణం - ముక్తావళిః హారః, తజ్జననేన, వంశపర్వణి మౌక్తికాని జాయంత ఇతి ప్రసిద్ధిః భూషణం భవంతీతి స్ఫురతి.

**వ్యాఖ్యానాంతరం :** భువః-భూమేః; ముక్తావళి భూషణం-ముక్తానాం, ఆవళేః-పంక్తేః, భూషణం-అలంకారః భవంతి. అన్యత్ర ముక్తావళీతి భూషణం భవంతి, ఇతి.

17. **అనపాయ విష్ణుపద సంశ్రయం భజే**
**కలయా కయాఽపి కలయాఽప్యనుజ్ఝితమ్ ।**
**అకళంక యోగ మజడాశయో దయం**
**యతిరాజ చంద్ర ముపరాగ దూరగమ్ ॥**

**అర్థం :** అనపాయ విష్ణుపద సంశ్రయం = అపాయంలేని శ్రీ విష్ణువు యొక్క చరణాలను ఆశ్రయించినట్టి; కయా+ అపి = ఒక విధమైన; కలయా=విద్యచేత; కలయా+అపి = కొంచెమైననూ; అనుజ్ఝితం= విడువబడనట్టి; అకళంక యోగం = ఎట్టి దోషంలేనట్టి; అ జడాశయోదయం =అజడ = జడత్వం లేని ధీరుల యొక్క; ఆశయ = హృదయమందు; ఉదయం = ఉదయించు - నివసించునట్టి; ఉపరాగ దూరగం = ఉపరాగ = రాగాది దోషాలకు (దోషాలుగలవారికి); దూరగం = దూరంగా ఉన్నటి; యతిరాజచంద్రం = యతీంద్ర చంద్రుణ్ణి; భజే = సేవింతును.

**తాత్పర్యము :** నిరపాయమైన శ్రీమన్నారాయణుని పాదాల నాశ్రయించినట్టి, సర్వవిధ విద్యలతో సంపూర్ణుడైనట్టి, నిష్కళంకుడైనట్టి, సుధీమణుల స్వాంత మందు నివసించునట్టి, రాగాది దోషాలకు దూరంగా ఉన్నట్టి, యతిరాజ చంద్రుణ్ణి సేవిస్తుంటాను.

**వ్యాఖ్య :** యతిరాజును చంద్రునితో పోల్చి, చంద్రుని కంటె యతిరాజ చంద్రుడు అధికుడని వర్ణించే శ్లోకం.

ఈ శ్లోకంలో యతిరాజు చంద్రుడుగా వర్ణింపబడుతూ, చంద్రునికంటె ఐదు విధాలుగా విలక్షణుడని వర్ణితుడు. ప్రకృతిలో మనం చూచే చంద్రుడు దోషాకరుడు. యతిరాజచంద్రుడు దోషరహితుడు.

1. **అనపాయ విష్ణు పదసంశ్రయం :** విష్ణుపదం శ్లిష్టం. ఈశబ్దానికి ఆకాశమనీ, విష్ణుచరణ మనీ రెండు అర్థాలున్నాయి. "వియద్విష్ణుపదం వాఽపి" (అమరం) ఆకాశాన్ని ఆశ్రయించిన చంద్రుడు ఉదయిస్తాడు, అస్తమిస్తాడు. చంద్రునికి ఆ స్థానం శాశ్వతమైనదికాదు. చంద్రునికి ఆకాశాన్నివిడిచి అస్తమించడం ఆజానజం కదా! వాస్తవంగా ఆకాశం

సా పాయమే. "ఆ భూత సంప్లవే ప్రాప్తే ప్రలీనే ప్రకృతౌ మహాన్" అన్నట్లు ప్రపంచ ప్రళయంలో ఆకాశం కూడా లయం - నాశనమవుతుంది. కాబట్టి అది 'సాపాయవిష్ణు పదం'. యతిరాజచంద్రుడు ఆశ్రయించింది 'అనపాయవిష్ణుపదం'. శ్రీ మహావిష్ణుపదం నాశరహితమైనది. శ్రియః పతిచరణారవిందాలతో శ్రీమద్రామానుజుల సంబంధం - సంశ్రయం నిరపాయమైనది, శాశ్వతమైనది.

2. **కలయా కయా-పి కలయాప్యనుజ్ఝితం** : 'కళా' శబ్దానికి ఉన్న నానార్థాలలో ఇక్కడ చంద్రకళ అనీ, విద్య అనీ రెండర్థాలు గ్రహింపదగినవి. 'కలాశిల్పేకాలభేదే' (అమరం). 'అంశమాత్రే మూలవృద్ధౌ సుషమా విద్యయోస్తథా! తత్తదాగమసి ద్ధాసు గురుణిస్త్రీరజస్యపి। కలం శుక్రే వాచ్యలింగ మవ్యక్తమధురధ్వనౌ (శేషనిఘంటువు).

చంద్రుడు పున్నమనాడే పూర్ణకళలతో ప్రకాశిస్తాడు. ఇతర తిథులలో కళలచేత హెచ్చు తగ్గులు కలవాడుకదా! అమావాస్యనాడు కళయే ఉండదు.

యతిరాజచంద్రుడు ఎన్నడూ ఒక్క కళనైనా విడిచి యుండడు. 'కళా' శబ్దం శ్లిష్టం. ఇక్కడ విద్య అని అర్థం. సర్వదేశ సర్వకాలాలలో సకల కళల - విద్యలతో సంపూర్ణుడై ఉండేవాడు.

3. **అకళంక యోగం** : చంద్రుడు కళంకం కలవాడు. 'కళంకోఽజ్కాపవాదయోః' (అమరం) 'కళంక' శబ్దానికి మచ్చ, గుర్తు, నింద, దోషం అనే అర్థాలున్నాయి. యతిరాజచంద్రుడు మాత్రం నిష్కళంకుడు, దోషరహితుడు.

4. **అజడాశయోదయం** : చంద్రుడు సముద్రమందు ఉదయించినవాడు. 'డ, ల' లకు అభేదం. అంటే 'జడ' శబ్దాన్ని 'జల' శబ్దంగా మార్చవచ్చు. జలాశయ మంటే సముద్రం. సముద్ర జలమందు ఉదయించినందువల్ల చంద్రునికి 'అబ్జః' అని పేరు కలిగింది. "అబ్జోజైవాతృకః సోమః" (అమరం)

యతిరాజచంద్రుడు అజడుల - జడత్వంలేని - మందబుద్ధులు కానట్టి ధీరుల - జ్ఞానుల హృదయమందు ఉదయించేవాడు. ఆశ్రితులైన జ్ఞానులకు ధ్యానగమ్యుడు యతీంద్ర చంద్రుడు. కాబట్టి, 'రంగేశభక్తజన మానస రాజహంస'గా రామానుజ యతిరాజులను దేశికులు మరొకచోట స్తుతించారు.

5. **ఉపరాగ దూరగం :** చంద్రుడు రాహుకేతువులచేత గ్రహింపబడుతాడు. 'ఉపరాగోగ్రహః'. ఉపరాగమంటె గ్రహణమని అర్థం. (అమరం) గ్రహణ మందు చంద్రుడు తమో యుక్తుడవుతాడు కదా! యతీంద్రచంద్రుడు రాగద్వేషాలు లేనివాడు. "అవిద్య, అస్మిత, రాగం, ద్వేషం, అభినివేశం" (క్లేశపంచకం) అనే చిత్తమలినాలు అంటనివాడు. ఆశ్రితులకాహ్లాదం కలిగించే యతిరాజు చంద్రుడే కదా! చంద్రునికి యతిరాజ చంద్రునికీ పోలికలో భేదాన్నిచూపి, చంద్రునికంటె యతిరాజచంద్రుడు శ్రేష్ఠుడని, దేశికులు శ్లేషోత్థిత వ్యతిరేకాలంకారంగా వర్ణించారు.

ఈ శ్లోకం మంజు భాషిణీ వృత్త రచితం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథైనం చంద్ర త్వేన రూపయన్, చంద్రాదాధిక్యం వదతి అనపాయేతి. అనపాయ విష్ణుపదసంశ్రయం - అనపాయం- అపాయరహితం, విష్ణుపదం - హరిచరణం, సంశ్రయః యస్యసః తమ్ చంద్రస్తుసాపాయ విష్ణుపదసంశ్రయ ఇత్యర్థః. తత్ర విష్ణుపదం ఆకాశమ్ "వియ ద్విష్ణుపదంవాఽపి" ఇత్యమరః. అసౌతు యతీంద్రచంద్రః కయాఽపి కలయా - విద్యయా, కలయాఽపి ఏకదేశేనా పి అనుజ్ఝితః - అపరిత్యక్తః, సర్వవిద్యా సంపూర్ణ ఇత్యర్థః చంద్రస్తు కలాభిః స్వాంశైరుజ్ఝితోభవతి. ఆ కళంకయోగం - కళంకోదోషః, తద్రహిత ఇత్యర్థః. చంద్రుస్తు కళంకవాన్.

అజడాశయోదయం - అజడః - ధీరః, ఆశయః - హృదయం, తత్రఉదయః యస్యసః, తమ్. యద్వా, ఆజడానాం -ధీరాణాం, ఆశయే - మనసి, ఉదయః- వాసః యస్య తమ్. చంద్రస్తుజడాశయే-సముద్రే, ఉదితః. ఉపరాగదూరగం- ఉపరాగాః-రాగాదిదోషాః, తేషాందూరగం-దూరస్థితః- చంద్రస్తు ఉపరాగః-గ్రహః తద్యుక్తః. యతిరాజ చంద్రం భజే.

**వ్యాఖ్యానాంతరమ్ :** అజడాశయోదయం – నవిద్యతే జడస్య – మందస్య, ఆశయస్య – అభిప్రాయస్య, ఉదయః జన్మ యస్యతమ్, చంద్రస్తుజడాశయోదయః లడయో రభేదః. జలాశయే సముద్రే ఉదయఃయస్యేత్యర్థః. ఉపరాగదూరగం – ఉపగతానాం రాగాణాం – మాత్సర్యాణాం, దూరగం; చంద్రస్తూపరాగ యుక్త ఇత్యర్థః–ఇతి.

**18. అభిగమ్య సమ్యగనఘాః సుమేధసో**
**యతి చక్రవర్తి పద పద్మ పత్తనమ్।**
**హరి భక్తదా స్యరసికాః పరస్పరం**
**క్రయ విక్రయార్హ దశయా సమింధతే ॥**

**అర్థం :** సుమేధసః = మంచిబుద్ధిగల; అనఘాః = పాపరహితులైన జనులు; యతి చక్రవర్తి పదపద్మపత్తనం = యతి చక్రవర్తి = యతిసార్వభౌముడైన శ్రీరామానుజుల యొక్క; పద పద్మ = పాదకమలాలు అనే; పత్తనం = పట్టణాన్ని; సమ్యక్ = బాగుగా; అభిగమ్య = పొంది; ఆశ్రయించి; హరి భక్తదాస్య రసికాః = భగవద్భక్తులకు సేవచేయడమందు ప్రీతిగలవారై; పరస్పరం = ఒకరికొకరు; క్రయ విక్రయ+అర్హ దశయా= కొనడానికి, అమ్మడానికి తగిన దశచేత; సం+ఇంధతే = బాగుగా ప్రకాశిస్తున్నారు.

**తాత్పర్యము :** మంచి బుద్ధిగల పుణ్యాత్ములు యతి చక్రవర్తి పాదపద్మాలనే పట్టణానికి చేరుకొని, భాగవత కైంకర్యరసజ్ఞులై ఒకరికొకరు స్వేచ్ఛగా వినియోగించుకోవడానికి తగిన వృత్తిచేత బాగుగా ప్రకాశిస్తున్నారు.

**వ్యాఖ్య :** యతీంద్రుల చరణారవిందాలనాశ్రయించిన ప్రపన్న జనుల మహిమను ప్రశంసించే శ్లోకమిది.

కల్లకపట మెరుగని చక్కని బుద్ధిగల వారుకాబట్టి ఏ పాపం చేయనివారు పల్లెలలో కాపురంచేసే జనులు. దారిద్ర్య పీడితులై దైనందిన జీవితంగడిపే పల్లె జీవులు రాజధానీ నగరానికి వెళ్ళిధన్యజీవులనాశ్రయించి, ద్రవ్యవ్యాపారం చేస్తూ

సుఖజీవనం గడుపుతుండడంలోక పరిపాటి. అలాగే సద్బుద్ధిని కలిగి పవిత్ర జీవనం గడిపే బద్ధజీవులు యతి సార్వభౌముల చరణకమలాలను ఆశ్రయించి, వారి కృపాకటాక్షం లభించడంవల్ల శేషత్వమే – దాస్యమే (ఆత్మ) తమ స్వరూపమనే జ్ఞాన సంపద కలవారవుతారు. భగవచ్ఛేషత్వానికి చరమావధి భాగవతశేషత్వమని తెలుసుకొంటారు. ఇది శ్రీ వైష్ణవులకు– విశిష్టాద్వైత సిద్ధాంతపరులకు – పురుషార్థ పరాకాష్ఠగా భావింపబడుతుంది.

**అనఘాః :–** 'ప్రథమపర్వనిష్ఠ' అంటే భగవచ్ఛేషత్వం – భగవద్దాస్యం. 'చరమ పర్వనిష్ఠ' అంటే భగవద్దాస్యం వరకే ఆగక, భగవద్దాస్యానికి సీమాభూమియైన భాగవత దాస్యాన్నీ తెలిసి ఆచరించడం. హరిదాస్యం మాత్రమే అంగీకరించి ఆచరించి, ఆగిపోవడం అఘం–పాపం. అట్టి అఘం – పాపం–లేని వారు అనఘులు. హరిభక్తులకు కూడా దాస్యం చేయువారని భావం.

**గచ్ఛతా మాతుల కులం భరతేన తదాஉనఘః।**
**శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నః నీతఃప్రీతి పురస్కృతః ॥**

యుధాజిత్తు అనే మామగారింటికి వెళ్ళుతున్న భరతునిచేత పాపరహితుడైన, జితేంద్రియుడైన, ప్రేమగల శత్రుఘ్నుడు తీసుకొనిపోబడినాడు, అని శ్లోకార్థం. వాల్మీకి శత్రుఘ్నుణ్ణి అనఘుడు అన్నాడు. "యావన్న చరణౌ భ్రాతుః పార్థివవ్యంజనాన్వితౌ। శిరసాధారయిష్యామి" – "శ్రీరాముడు (అన్నయ్య) రాజై, కిరీటాన్ని ధరించి, రాజచిహ్నితాలైన ఆయన పాదద్వయిని తన తలమీద (కిరీటంగా) ధరించనంత వరకు తన తాపం తీరదు" అన్నంత రామభక్తి భరితుడు భరతుడు. అట్టి పారతంత్ర్య సంపద గల భరతుడు భాగవతోత్తముడు. శ్రీరాముని యందు శత్రుఘ్నునికి భక్తిలేదనికాదు. కాని, రాముని సౌందర్యం తన మనస్సునుహరించి, అక్కడే ఆపివేస్తుందని ఇంద్రియనిగ్రహుడై, రాముణ్ణి ప్రేమించే భరతుని యందే ప్రేమను నిల్పినవాడు శత్రుఘ్నుడు. భాగవత శేషత్వాన నిల్చిన వారికి మరొక వైపు మనస్సును పోనీయక, తన యందే నిల్పుకొనే భగవద్భక్తి కూడా విరోధియే అవుతుంది. అట్టి పాపంలేనివాడు శత్రుఘ్నుడు – అనఘుడుకదా! భగవదీయులైన వారిని భక్తితో సేవిస్తే భగవద్భక్తికి విరోధంకాదు. భగవద్భక్తి భాగవత భక్తికి అంగమే అని శ్రీ వైష్ణవ ధర్మం. "నాహం స్వపిమి

జాగర్మి తమేవార్యం విచింతయన్" "నాకుదైవమైన భరతునికి దైవమైన శ్రీరామచంద్రస్వామిని స్మరిస్తూ నేను మేల్కొనే ఉంటాను. నిద్రపోను" అన్నాడు కదా! శత్రుఘ్నుడు. భగవత్ప్రీతి కోసం భగవద్భకులను ఉపాసించడం, భగవదీయులప్రీతి కోసం భగవంతుణ్ని ఉపాసించడం భాగవత శేషత్వధర్మం.

సుమేధసః - సద్బుద్ధి గలవారు. భాగవతదాస్య మందు ఆసక్తికలవారు.

**సిద్ధిర్భవతివా నేతి సంశయోఽచ్యుతసేవినామ్ ।**
**నసంశయోఽత్ర తద్భక్త పరిచర్యా రతాత్మనామ్ ॥ (శాండిల్యస్మృతి)**

భగవంతుణ్ని సేవించేవారికి ఫలం లభిస్తుందో లేదో అనే సంశయం ఉంటుంది. భగవద్భక్తులను సేవించేవారికి మాత్రం అవశ్యంగా ఫలం లభిస్తుంది. సంశయమే లేదు కదా!

"ఎమ్మాన్ తన్నె తాళుమ్‌తడక్కై యుమ్‌కూప్పి ప్పణియుమవర్ కణ్డీర్" - (తి.వా.మొ.షి. 3-7-2) కాళ్ళను జోడించి అనన్యగతిత్వాన్ని - రక్షకులువేరే ఎవరూలేరని - తెల్పుతూ, చేతులనుజోడించి ఆకించన్యాన్ని - ఏమిచేయలేని దాసుణ్ని అని - సూచిస్తూ శ్రియఃపతివద్ద శరణాగతి చేసే- భాగవతోత్తములు మన దాస్యాన్ని స్వీకరించి, మనకు మళ్ళీ జన్మ లేకుండా రక్షించే ప్రభువులు అని నొక్కిచెప్పారు కదా శ్రీ పరాంకుశులు (నమ్మాళ్వార్లు).

**హరిభక్త దాస్యరసికాః** : భాగవతార్చన "భగవతః పూజా విధేరుత్తమం" భగవదారాధన కన్న మిన్న, "తేవు మత్తఱియేన్" - "వేరొన్రుమ్‌నానఱియేన్". ఈశ్వరత్వం, గురుత్వం - రెండు ఆచార్యుల యందు ఉండడంవల్ల శ్రీ మధుర కవియాళ్వార్లు, నమ్మాళ్వార్లకంటె వేరెదైవాన్ని నేనెరుగనన్నారు. శత్రుఘ్నుని వంటివాడే మధురకవి ఆళ్వార్లు. భగవత్కైంకర్యం కంటె భగవద్భక్తులకు చేసే కైంకర్యం - సేవ మిక్కిలి భోగ్యమైనది, మధురతరమైనదని భావిస్తారు దాస్యరసజ్ఞులు. "భృత్యస్య భృత్య పరిచారకభృత్య భృత్య భృత్యస్య భృత్య ఇతి మాంస్మరలోకనాథ!" అనీ "త్వద్దాసదాసగణనా చరమావధౌయ స్తద్దాసతైకరసతాఽ విరతామమాస్తు"- అన్నట్లు భగవత్కైంకర్యం చేసే వారిలో తలపాల మధిష్ఠించినవారు తమకు స్వాములని, వారికే సకలకైంకర్యం సర్వదా చేసే భాగ్యం తమకు సిద్ధింపవలెనని ప్రార్థిస్తుంటారు.

"భవతి వృషాచలేశ పద పత్తన నిత్యధనీ" (దయాశతకం 51 శ్లో)

పరమదరిద్రుడు సంపత్తుకాశపడి సముద్రాన్ని దాటి, పర్వతప్రాంతంలో ఉన్న పెద్ద పట్టణానికి చేరి అక్కడ క్రయవిక్రయాది వ్యాపారం చేత గొప్ప ఐశ్వర్యాన్ని పొంది సుఖించే రీతిగా, అకించనుడు సంసారసముద్రాన్ని దాటి తిరుమల వేంకటేశ్వరుని పాదాలు అనే పట్టణాన్ని ఆశ్రయిస్తే, ఆ దయాదేవి వల్ల శాశ్వతమైన సంపత్తును పొంది సుఖపడుతాడు అని, ఆచార్యకటాక్షంచేత కలిగే ప్రపత్త్యధికారాన్ని ప్రశంసించారు దేశికులు.

అక్కడ 'పద పత్తన' మన్నారు. ఇక్కడ "యతి చక్రవర్తి పద పద్మ పత్తన" మన్నారు. భగవత్పాదాల యందున్న భక్తికంటె దేశికులకు భగవద్రామానుజుల పాద పద్మాలయందు అధికభక్తి కలదని విశదవుతున్నది కదా!

**క్రయవిక్రయార్హ దశ :** పెరియాళ్వార్లు (విష్ణుచిత్తులు) అనబడే భట్టనాథులు "పేశువారడియార్‌కళ్ ఎన్దమ్మై విఱ్కవుమ్ పెరువార్ కళే" (పెరియాళ్వార్ తిరుమొళి. 4-410) కేశవా! పురుషోత్తమా! అని భగవద్గుణాలను అనుసంధించే (తిరుక్కోట్టియూర్) హరిభక్తులు మనలను విక్రయించడానికి (అమ్మివేయడానికి) అర్హులని ప్రశంసించారు. దేశికులవారు ఆ భావాన్నే ఇక్కడ విశేషంగా ప్రకటించారు. 'క్రయ' మంటే కొనుక్కోవడం, 'విక్రయ' మంటే అమ్మడం. భాగవతశేషత్వం - హరిభక్త దాస్యం-అంటే స్వాములు దాసుణ్ని అమ్ముకోవచ్చు, కొనుక్కోవచ్చు. సర్వవిధాలా భగవదీయులకు పరతంత్రుడై యుండడమన్న మాట.

**పరస్పరం :** ఈ దాస్యం శ్రీవైష్ణవులలో సహజ ధర్మమై ప్రకాశిస్తుంది. అంటే ఇరువురు వ్యక్తులు కలిసినపుడు ఒకరికొకరు దండవత్ ప్రణామంచేస్తారు. ఆ ఇద్దరూ, తనకెదుట నున్న వ్యక్తి స్వామి - శేషి-అనీ, తాను అతనికి దాసుడు - శేషభూతుడు- అనీ ప్రకటించుకొంటారు. ఒకరికొకరు పరతంత్రులుగా భావిస్తారు. అలాగా చేయకపోతే దాసత్వం - శేషత్వం జీవించదు. శ్రీ వైష్ణవులు శేషశేషిభావంతోనే ప్రకాశిస్తుంటారు. భక్త దాస్యరసికత్వమన్నా, లేదా భాగవతపారతంత్ర్యమన్నా అర్థం ఒక్కటే.

"స్వామీ! అడియేన్, రామానుజదాసుణ్ని, మీరేమి విచారపడవద్దు. దాసుణ్ని విక్రయించి (అమ్మివేసి) మీకు కావలసిన పదార్థాలను సంశయించక సమకూర్చుకొనండి" అని ప్రతివైష్ణవుడు తనను భాగవతోత్తములకు విన్నవించి, ప్రవర్తించే రీతిని 'క్రయ విక్రయార్హదశ' అంటారు.

ఇందు అతిశయోక్తి లేదు. రూపకాలంకారంతోకూడిన స్వభావోక్తియే భాసిస్తున్నది. ఇది కూడా 'మంజుభాషిణి' వృత్తమే.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ యతిసార్వభౌమ చరణారవింద సంశ్రయిణాం వైభవం వదతి అభిగమ్యేతి. అనఘాః – అపాపా అతఏవ ఈశ్వరసౌహార్ద ప్రభృతి తత్సంగ పర్యంత మహాతిశయయుక్తాః, అతఏవ సుమేధసః – సద్బుద్ధయః; యతిచక్రవర్తి పద పద్మవర్తనమ్ – యతిచక్రవర్తినః– యతిరాజస్య, పదపద్మపత్తనం – పద పద్మమేవ నిరపాయస్థితి హేతుం; సమ్యగభిమ్య – తదేక రక్షకత్వ బుద్ధిపూర్వకం సమ్యక్ సంశ్రిత్య, అతఏవ హరిభక్తదాస్య రసికాః – దాస్యే అత్యంతం ప్రీతియుక్తాః; పరస్పరం – అన్యోన్యం; క్రయ విక్రయార్హా దశయా–యథేష్టవినియో గార్హదశయా; సమింధతే – విరాజంత ఇత్యర్థః. పత్తనగతానాం దరిద్రాణా మపి సంపత్ భవతి. తథాచక్రయవిక్రయార్హా వ్యవహారశ్చసంభవతీ తిస్ఫురతి.

**వ్యాఖ్యానాంతరమ్ :** క్రయ విక్రయార్హదశయా – క్రయవిక్రయస్య అర్హయా–ఉచితయా, దశయా–అవస్థయా; "అన్యోన్యవందనపరా" ఇత్యుక్త లక్షణయోగ్య ఇత్యర్థః – సమింధతే – దీవ్యంతే.

**19.** **పరుషాతివాద పరివాద పైశున**
**ప్రభృతి ప్రభూత పతనీయ పంకిలా।**
**స్వదతే మమాద్య సుభగా సరస్వతీ**
**యతిరాజకీర్తి కతకైర్విశోధితా॥**

**అర్థం :** పరుషాతివాద – పంకిలా। పరుష = క్రూరమైన: అతివాద =

బహుభాషణమూ; పరివాద = పరులను నిందించడమూ; పైశున = చాడీలు చెప్పడమూ; ప్రభృతి = మొదలైన, ప్రభూత = గొప్పవైన; పతనీయ= పడగొట్టదగిన పాపహేతువుల చేత; పంకిలా = మలినమైన; మమ= నా యొక్క; సరస్వతీ = వాక్కు; యతిరాజకీర్తి కతకైః = శ్రీభాష్యకారులకీర్తి అనే చిల్లగింజల (పొడి) చేత; విశోధితా = శోధింపబడినదై; సుభగా = భాగ్యవంతమైనదై; అద్య = ఇప్పుడు; స్వదతే = రుచిగా ఉన్నది.

**తాత్పర్యము :** కఠోరమైన, బహుజల్పమూ, పరనిందకథనమూ, చాడీలు చెప్పడమూ మొదలైన పాతిత్య హేతువుల చేత బాగా మలినమైన నా వాక్కు, యతిరాజుల కీర్తి కథన రూపమైన చిల్లగింజల (చూర్ణం) చేత నిర్మలమై, రమణీయమై ఇప్పుడు రుచిగా ఉంటున్నది.

**వ్యాఖ్య : యతిరాజులను కీర్తించడం చేత కవి వాక్కు, నిర్మలమై సర్వశ్రుతిపేయమైనదని వర్ణితం.**

ఈ శ్లోకంలోని పూర్వార్థం యతిరాజవైభవాన్ని కీర్తించడం కంటె ముందున్న కవి యొక్క భాషాస్థితిని వర్ణిస్తున్నది. ఉత్తరార్థం తత్కీర్తి కథనాంతరం కవి భాష పరిణమించిన చందాన్ని అందంగా వివరిస్తున్నది.

'సరస్వతి' అంటే వాక్కు, భాష అని అర్థం. "బ్రాహ్మీతుభారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ" (అమరం). మొదట దేశికుల వాక్కు కర్దమం-బురదతో కూడియున్న నీరులాగా మలినమై యుండినదని తెలుస్తున్నది. దానికి నాలుగు దోషాలు ముఖ్యహేతువులుగా చెప్పబడినవి.

1. **పరుషం :** నిష్ఠురమైన, కఠినమైన మాట. పరుషవాక్కు వినేవానికి కర్ణకఠోరంగా ఉంటుంది.

2. **అతివాదం :** అవసరానికి మించిన, అప్రియమైన వాక్కు, బహుజల్పనం సత్యదూరమై ఉంటుంది.

3. **పరివాదం :** నిందించడం, నిందార్థకమైన వాక్కు

4. పైశునం : చాడీలు, కొండెములు చెప్పడం. సామాన్యంగా వ్యక్తి ఎదుటలేనప్పుడు వాని చాటుకు ఇతరుల చెవిలో పడే విధంగా చెప్పే అసంగతమైన వాక్కు.

ఇవేకాక ఇంకా కొన్ని హృదయంగమంగా లేని మాటలు పలుకడం పతనీయం. అంటే నరకంలో పడవేయదగినమాట. కాబట్టి ఇట్టి పాతిత్యహేతువుల చేత వాక్కు పంకిలమవుతుంది.

'పంకం' అంటే బురద, పాపం. "అస్త్రీ పంకం పుమాన్పాప్మా" (అమరం) పంకంతో కూడినది కాబట్టి 'పంకిలా' అని 'సరస్వతీ' అనే విశేష్య పదానికి విశేషణపదంగా వాడబడింది. మలినమైనవాక్కు అని అర్థం. 'సజంబాలస్తు పంకిలః" (అమరం)

సరస్వతీ : బ్రహ్మమనే జలాన్ని ధరించడం చేతనూ, ప్రసరించడం చేతనూ వేదాలకు సరస్సులని పేరు. (అట్టి) సరస్సులు కలది. 'సరస్వతి'

"మేధాదేవీ సరస్వతీ" – "సారస్వతీ రపోగృహ్ణాతి" – అనేవి వేద వాక్కులు.

నీటికీ, వాక్కుకూ ప్రసరించే గుణం నైసర్గికం కదా।

మొదట మలినమై యున్న కవియొక్క సరస్వతి ఇప్పుడు నిర్మలమై రమణీయంగా ఉన్నదట. మురికి నీరు – కర్దమజలం స్వచ్ఛజలంగా ఎలా మారింది? చిల్లగింజ సంబంధంచేత మలినజలం శుద్ధజలంగా మారుతుంది కదా! 'కతకం' అంటె, చిల్లగింజను (దానిపొడిని) నీటిలోవేస్తే, నీటిలో ఉన్న మలినం– అడుసు–అణగిపోయి, తేటనీరు ఏర్పడుతుంది. నీటిని శుద్ధి చేస్తుంది. అలాగే భగవద్రామానుజులను కీర్తించిన వెంటనే వేదాన్త దేశికుల సరస్వతి – వాక్కులో పూర్వమున్న పరుషాతి వాదాది దోషాలు తొలగిపోయినాయి. రామానుజకీర్తి అనే కతకం చేత వాక్కు శోధింపబడడమే కాక, అది స్వచ్ఛంగానూ, స్వాదువుగానూ శోభించింది.

**"అకర్దమ మిదంతీర్థం భరద్వాజనిశామయ।**
**రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనోయథా" ॥** (రామా. బా. 2స)

తమసానదీ జలం దివ్య పురుషుని మనస్సులాగా అకర్దమం - బురదలేనిదై, ప్రసన్నంగానూ, రమణీయంగానూ ఉన్నదని వాల్మీకిమహర్షి అన్నాడు. జలం 'అకర్దమం, ప్రసన్నం, రమణీయం' అని మూడు విశేషణ పదాలు ప్రయుక్తమైనాయి. ఇక్కడ, వాక్కు "విశోధితా, సుభగా, స్వదతే" అని క్రమంగా పదత్రయంతో శోభిస్తున్నది.

"జిహ్వామే మధు మత్తమా" - బ్రహ్మ జ్ఞానం చేత నా జిహ్వ (వాక్కు) అమృతంలాగా గరిష్ఠమైన మధురిమను పొందుతున్నదని ఉపనిషద్వాణి. పరమభాగవతోత్తములైన తిరువరంగత్తముదనార్లు "రామానుశనూత్తందాది"లో "శురక్కుం తిరువుముణర్వుం శొలప్పుగిల్ వాయముదం పరక్కుమ్, ఇరువినై పత్తఅవోడుమ్" (43) "రామానుజ చతురక్షరీమంత్రాన్ని పరమభక్తితో అనుసంధించండి. పంచమహాపాతకాలు నశిస్తాయి. భక్తి జ్ఞానైశ్వర్యాలు వృద్ధిని పొందుతాయి. యతిరాజులను కీర్తించడానికి ఆరంభించగానే వాక్కునందు అమృతంనిండుగా ప్రవహిస్తుంటుంది" అని తమ అనుభవాన్ని ప్రబోధించారు.

'రహస్యత్రయసారం'లో "తన్నాభినాళికినీ నాళీక స్పృహణీయ సౌరభముచా వాచా" - దేశికులవారు, తమ వాక్కు పద్మనాభుని నాభీ కమలంకంటె అధికంగా పరిమళిస్తుందన్నారు. "వైరాగ్య పంచకం"లోనూ "సాయం సంఫుల్ల మల్లిమతల్లికా పరిమళముచా వాచా" - సాయం సమయంలో వికసించిన మల్లెపూలనుమించి పరిమళించే తమ వాక్కుచే నరేంద్రులను స్తుతించలేనని దేశికులు లేఖను వ్రాసి శ్రీ విద్యారణ్యస్వామివారికి పంపించారు.

ఇక్కడ, యతీంద్రుల వైభవాన్ని కీర్తిస్తుంటే కవితార్కికకేసరివాక్కు పరిశుద్ధమై, భాగ్యవంతమై అమృతంలాగా భోగ్యంగా ఉన్నదని విశదం చేశారు.

'మనోజ్ఞమైన భాషకలది' అనే అర్థమున్న 'మంజుభాషిణీ' వృత్త రచన ఇక్కడ గమనీయం.

భాషకు బహిఃప్రాణం వ్యాకరణం, అంతఃప్రాణం సాహిత్యం. వ్యాకరణం శబ్దశుద్ధినిబోధిస్తే సాహిత్యం శబ్దార్థ రామణీయకాన్ని బోధిస్తుంది. వాక్కు మలినమవడానికి హేతువును పూర్వార్థం తెల్పుతున్నది. అదే వాక్కు 'స్వదతే'

రుచిస్తున్నదనే క్రియకు హేతువును ఉత్తరార్థం బోధిస్తున్నది. ఇలా పరిణమించడానికి ఆశ్రయమైన శబ్దం "యతిరాజ కీర్తి కతకైః" అంటే, ప్రకృత వస్తువైన యతిరాజకీర్తి యందు అప్రకృత వస్తువైన (కతక) చిల్లగింజ యొక్క ధర్మం తాద్రూప్యరంజనంగా ఆరోపింపబడినది. వస్తువుకప్పి వేయబడలేదు. ('తాద్రూప్యరంజనం' అంటే కీర్తి తెల్లనిది. ఆ తెల్లనిరంగు మాత్రమే (కతకధర్మం) మరొక రంగుచేత కప్పివేయబడినదన్నమాట. కాబట్టి ఏకదేశవివర్తి రూపకాలంకారప్రాణితమైన హేత్వలంకారంగల శ్లోకమిది.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ యతిరాజ దివ్యసూక్తి పరిచయాతిరేకాత్ స్వసూక్త్యతిశయమాహ, పరుషేతి, పరుషాతివాద పరివాదపైశున ప్రభృత పతనీయ పంకిలా - పరుషాణి క్రూరతరాణి, అతివాదః - బహుభాషణం, పరివాదః- పరాపవాద కథనం, పై శునం - పిశునత్వం, ఏతత్ప్రభృతిభిః, ప్రభూతైః- బహుభిః, పతనీయైః - పాతిత్యహేతుభిః పంకిలా - అత్యంతమలినా; మమ సరస్వత్యపి, యతిరాజకీర్తి కతకైః - యతిరాజకీర్తిమయ కతకరజోభిః, విశోధితా - నిర్మలీకృతా; సుభగా అద్యస్వదతే - స్వస్వ భావం విహాయ అత్యంత స్వాదూ భవతీత్యర్థః.

**20.** **అనుకల్పభూత మురభిత్పదం సతాం**
**అజహత్ త్రివర్గ మపవర్గవైభవమ్ ।**
**చలచిత్తవృత్తి వినివర్తనౌషధం**
**శరణం యతీంద్ర చరణం వృణీమహే ॥**

**అర్థం :** సతాం = సాత్త్వికులకు; అనుకల్పభూతమురభిత్‌పదం అనుకల్పభూత = అముఖ్యమైన; మురభిత్ = మురారి (సర్వేశ్వరుని) యొక్క; పదం = చరణాలు కల్గినట్టి; అజహత్ త్రివర్గం = విడువని ధర్మార్థకామాలను కల్గినట్టి; అపవర్గ వైభవం = మోక్షసంపదకల్గినట్టి; చల-నౌషధం। చల = చంచలమైన; చిత్త వృత్తి - మనోవ్యాపారాన్ని; వినివర్తన = మరల్చడానికి; ఔషధం = మందు వంటిదైన; యతి+ఇంద్ర, చరణం = యతి రాజుల పాదాలను; శరణం = రక్షకంగా; వృణీమహే = వరిస్తున్నాం.

**తాత్పర్యము :** సత్పురుషులకు సర్వేశ్వరుని పాదాలు ముఖ్యం కానట్టి. ధర్మార్థ కామాలను విడువకుండా మోక్ష సంపద కలిగినట్టి, చపలమైన చిత్తవృత్తిని త్రిప్పడానికి ఔషధమైనట్టి యతీంద్ర చరణయుగళిని శరణంగా ఆశ్రయిస్తున్నాం.

**వ్యాఖ్య :** యతిరాజ పాదారవిందాలను స్తుతించే శ్లోకం.

భగవద్రామానుజాచార్యుల పాదకమలాలే సజ్జనులు ఆశ్రయించడానికి ముఖ్యమైనవి, కాని సర్వేశ్వరుని చరణారవిందాలను ఆశ్రయించడం అప్రధానం. "ముఖ్యఃస్యాత్ ప్రథమః కల్పః, అనుకల్పస్తథోఽ ధమః". (అమరం) ముఖ్యమంటే ప్రధానవిధి. మొదట శాస్త్రం చెప్పిన విధిని ప్రథమ – ఆద్య – కల్పమంటారు. తర్వాత చెప్పిన విధికి 'అనుకల్ప' మని పేరు. "కుశాభావే కాశావలంబనం. దర్భ దొరకకుంటే (కాశ) రెల్లుగరుకతోనైనా కర్మను ఆచరించవచ్చునని విధించబడింది. 'వడ్లతో వేల్చడం' ముఖ్యకల్పం. అవి లభించకపోతే నీవారధాన్యం (దూసవరి)తో వేల్చడం అనుకల్పం.

**"సర్వత్రా జ్ఞానభూయిష్ఠే ప్రపంచేఽ స్మిన్ స్థితోఽ పిసన్।**
**యః సదానంద భరితః స సదా చార్య ఉచ్యతే ॥"**

గొప్ప అజ్ఞానంతో కూడియున్న ప్రపంచమందు ఉన్నప్పటికీ, ఎల్లప్పుడు పూర్ణానందంతో ఉండేవారు సదాచార్యులు.

**"ఆచినోతిహిశాస్త్రార్థా నాచారే స్థాపయత్య పి।**
**స్వయ మాచరతేయస్మాత్ స్మాదాచార్య ఉచ్యతే॥"**

తాను సంగ్రహించిన శాస్త్రార్థాలను ఇతరులకుబోధించడమే కాక స్వయంగా ఆచరించేవాడు ఆచార్యుడు. ఇట్టి ఆచార్యులను ఆశ్రయించేవారికి, భగవద్విషయపరులకు భగవద్విషయం కంటె విషయాంతరం హేయం (విడువదగినది) అయినట్లే, భగవంతుణ్ని ఆశ్రయించడం కూడా హేయకోటిలోనే చేరుతుంది. ఇదే శాస్త్రార్థమైతే అందరు భగద్విషయాన్ని మానకున్నారెందుకు? అంటే, ఆచార్యముఖోల్లాసంకోసమే భగవంతుని మీదభక్తి కలుగడం వల్ల, అది ఈ అధికారికి దోషంకాజాలదు. "శత్రుఘ్నశ్ఛత్ర మాదదే" భరతునికి శ్రీరామచంద్రస్వామికి కైంకర్యం చేయడమే ఉద్దేశ్యమైనందువల్ల శత్రుఘ్నుడు

కూడా స్వామికి ఛత్రం పట్టినాడుకదా! 'వేరేదైవాన్ని ఎరుగను' అని దృఢాధ్యవసాయంతో ఉన్నప్పటికీ, మధురకవియాళ్వార్లు "కణ్ణినుణ్ శిఱుత్తాంబినాల్ కట్టుణ్ణప్పణ్ణియ పెరుమాయన్"–"కర్కశమై ముళ్ళుకలిగియున్న చిన్న త్రాటిచే సులభంగా కట్టుబడిన శ్రీకృష్ణ పరమాత్ముడు" అని అభివర్ణించాడు. ఎందుకు? "ఉరలినోడిణైన్దిరున్దేంగియవెళివు" – తల్లియశోద అచేతనమైనరోటిని కట్టి వేసినట్లే తననూ కట్టివేసినందువల్ల వెక్కివెక్కి ఏడ్చినస్వామి సౌశీల్యసౌలభ్యాది కల్యాణగుణాలను తలచుకొంటూ ఆరు నెలలు మోహపరవశుడైన నమ్మాళ్వార్ల ముఖప్రీతికోసం అభివర్ణించాడు. "పెరియవణ్ కురుకూర్ నగర్నంబిక్కు, ఆళురియనాయ్ అడియేన్ పెత్తనన్మైయే" – "చాలా ఉదారులైన, తిరునగరి యందున్న తన ఆచార్యులకు – నమ్మాళ్వార్లక దాసుడనైనందువల్ల పొందిన భగవల్లాభమిది" అని మధుర కవులు ఆశ్చర్యపడినారు. ఆచార్య రుచి పరిగృహీతమైన అర్థమే సత్పురుషులకు ఆశ్రయణీయమని స్పష్టమవుతున్నది కదా! కాబట్టి సాత్త్వికులకు యతిరాజుల చరణారవిందాలనాశ్రయించడమే ముఖ్యకల్పమనీ, భగవత్పదకమలాలనాశ్రయించడం అనుకల్పమని దేశికులు బోధించారు.

అయితే యతిరాజులు అవతరించకముందు భక్తులు శ్రియః పతిని ఆశ్రయించితరించారు కదా! అనేప్రశ్నకు 'సతాం' అనేది సమాధానం. "విద్వాన్ విపశ్చిద్దోషజ్ఞః సన్ సుధీః" – అనీ, "సత్యేసాధౌవిద్యమానే ప్రశస్తేఽభ్యర్హితే చ సత్" అనీ, భవాన్యాంతు సతీ స్త్రీ స్యాన్నక్షత్రేతు నపుంసకమ్" – (నిఘంటువులు) బాగా తెలిసిన వ్యక్తులకు, రామానుజుల వారు శ్రీరంగనాథుని సన్నిధిలో శరణాగతి, చేసినందువల్ల "ఇహరంగరాజః వశ్యస్సదాభవతితే యతిరాజ"– ఆ రంగనాథుడు ఎల్లప్పుడు యతిరాజులకు విధేయుడైయున్నాడని తెలుసుకదా!

**"సాచ త్వయైవ కమలారమణేఽర్థితా యత్**
**క్షేమ స్స ఏవ హి యతీంద్ర భవచ్ఛ్రితానామ్ ॥"**

పాపాలన్నీ భగవత్కృపవల్లనే తొలగుతాయికదా! ఆ కృపనే యతిరాజులు ప్రార్థించి పొందినారు. వారి ప్రార్థనయే వారిని ఆశ్రయించిన వారికీ ప్రేయః శ్రేయస్సులను కలిగిస్తాయి.

"ఉమక్కుమ్ ఉమ్ముడైయ సంబంధ సంబంధమ్ పెత్తవర్ కళుక్కుమ్ ఒరుకుఱైయిల్లైకాణుమ్" గద్యత్రయాన్ని అనుసంధించినప్పుడు శ్రీరంగనాథుడు "మీకూ, మీ సంబంధాన్ని పొందిన వారికీ కొరత ఉండదు" అని మోక్షమిచ్చే వరమిచ్చాడు యతిరాజులకు.

కాబట్టి 'అజహత్త్రివర్గమ్, అపవర్గవైభవమ్' అన్నారు దేశికులు. సామాన్యంగా సంసారులు కోరే (త్రివర్గం) ధర్మార్థకామాలనూ యతీంద్రుల పాదపద్మాలు ప్రసాదిస్తాయి. త్రివర్గంతోపాటు మోక్షానందాన్నీ కలిగిస్తాయి. "ఆయురారోగ్యమర్థాంశ్చభోగాం శ్చైవానుషంగికాన్ । దదాతిధ్యాయినాం నిత్య మపవర్గ ప్రదోహరిః। భగవంతుడు తన భక్తులకు ఆయురారోగ్యైశ్వర్యాది ప్రాపంచికభోగాలతో పాటు మోక్షసామ్రాజ్యాన్ని ప్రసాదిస్తాడుకదా।

"అకించననిధిం సూతిమపవర్గత్రివర్గయోః" (దయాశతకం. 10) అంజనాద్రీశ్వరుని దయ అకించనులకు నిధిగా ఉండి, అపవర్గత్రివర్గాలను అంటే చతుర్విధ పురుషార్థాలను ప్రసాదిస్తుంది అన్నారు దేశికులు.

అలాగే, యతీంద్రచరణం త్రివర్గాపవర్గాలనూ ప్రసాదిస్తుంది అన్నారిక్కడ. "త్రివర్గో ధర్మకామార్థైః, చతుర్వర్గస్సమోక్షకైః" ధర్మార్థకామాలసమూహాన్ని త్రివర్గమంటారు. మోక్షంతో కూడిన ధర్మార్థ కామాలను చతుర్వర్గమంటారు. "మోక్షోఽపవర్గః (ఉభయత్ర అమరం).

తిరునారాయణపురంలో వేంచేసి యున్న భగవానుని పేరు 'శెల్వపిళ్ళై' – సంపత్కుమారస్వామి. అక్కడ ఒక పరమభాగవతోత్తముడు భక్తితో గానం చేస్తుంటే స్వామి గానలోలుడై నర్తించేవాడు. ఒకనాడు భగవద్రామానుజులను చూచి కూడా, నిర్లక్ష్యంగా వారి ప్రక్కనుంచే ఆ భాగవతుడు వెళ్ళిపోయాడు. మరునాడు అలాగే వెళ్ళుతున్న ఆ భాగవతుని దగ్గరికి రామానుజులవారు పోయి "స్వామీ! మీకు దేవుడు ప్రత్యక్షం, కాబట్టి దాసునికి మోక్షం కలదా? అని అడిగిచెప్పండి" అని కోరగా 'అదెంతభాగ్యం, అడుగుతా' నన్నాడాయన. దేవుని సన్నిధికి ఆ వ్యక్తిపోయి కీర్తన పాడుతుండగా నర్తనంచేస్తున్న స్వామిని "రామానుజులకు మోక్షంకలదా?" అని అడిగాడు. భగవానుడు 'రామానుజులకూ'

రామానుజులిచ్చిన వారికీ మోక్షం కలదు' అని చెప్పిన మాటను తెల్పగానే "దేవరవారికి మోక్షంకలదా?" అని కూడా తెలుసుకొమ్మని రామానుజులు ఆ భాగవతుణ్ని కోరినాడు. "దేవుడే నా ముందు ఆడుతుంటే నాకు కొరత ఉంటుందా?" అన్నాడు ఆయన. "అయినా, అడుగవచ్చుకదా!" అని పురమాయించాడు రామానుజులవారు. ఆ భాగవతుడట్లే అడుగగా భగవానుడు "నీకు మోక్షంలేదు" అని పలికాడు. అదేమిటి? "నేనుపాడుతున్నాను కదా"! అని ఆయన వాదించగా, భగవానుడు "నేను ఆడుతున్నాను కదా"! అని వివరించాడు. అయితే 'నాకు మోక్షమెప్పుడు కలుగుతుంది?" అని ఆయన అడిగితే "రామానుజుల నాశ్రయిస్తే నీకు మోక్షం కలుగుతుంది" అన్నాడు భగవానుడు. అప్పుడా భాగవతుడు రామానుజులవారిని ఆశ్రయించి కృతకృత్యుడయ్యాడనే ఐతిహ్యాన్ని విజ్ఞులు చెబుతుంటారు. "ఆచార్య సూక్తి ముక్తావళి"లో ఇది సింహాచల క్షేత్రంలో జరిగిందని వర్ణితం.

విషయ లంపటంలో పడి విభ్రమించే చిత్తవృత్తిని స్వరూపానురూప విషయంలో వర్తించే రీతిగా మలచడానికి యతీంద్రచరణమే ఔషధం. 'చరణం' అని ఏకవచనమున్నా, ద్వివచనంగా భావించడం శాస్త్రోక్తమే. ఒక్క పాదాన్ని ఆశ్రయించినా, భగవంతుని రెండు పాదాలను ఆశ్రయించినంత ఫలాన్ని పొందవచ్చునని చెప్పడం స్వారస్యమని కొందరంటారు. ముఖ్యంగా "యథాదేవే తథాగురౌ" - గురువును దేవునిగా పూజించవలెనంటుంది శాస్త్రం. "పలకలయోర్ తామ్మన్నవన్దవి రామానుశన్ శరణారవిందమ్" ఎన్ని కళలను - విద్యలను - నేర్చినా యతిరాజుల పాదారవిందాలను ఆశ్రయించనివారికి మోక్షానందం గగనకుసుమమే. ఆశ్రయించినవారికి అది కరబదరమే. యతీంద్రపద సమాశ్రయణం ఇహపరతారకం. భగవత్పాదమిచ్చే పురుషార్థాలను యతిరాజచరణమిస్తున్నందువల్ల అది అముఖ్యమనడం ప్రతీపాలంకార లక్షణం. 'ఔషధం' అనడం వల్ల గమ్యోత్ప్రేక్షాలంకారం. మంజుభాషిణీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథయతీంద్రపాదారవిందంస్తౌతి, అనుకల్పేతి అనుకల్పభూతమురజిత్పదం-స్వసదృశదృష్టాంతాభావాత్ అముఖ్య దృష్టాంత

భూత హరిచరణారవిందం; సతాం-జ్ఞాతౄణాం; అజహత్‌త్రివర్గం అపవర్గవైభవం - చతుర్విధపురుషార్థభూతం; చలచిత్తవృత్తి వినివర్తనౌషధం - తత్త్వ హితవిషయే చలాయాః - చంచలాయాః చిత్తవృత్తేః వినివర్తనౌషధం- నివర్తన సుకరోపాయం; యతీంద్రచరణం-యతీంద్రపాదాంబుజం; శరణం-రక్షకం; వృణీమహే - ఆశ్రయామః.

**వ్యాఖ్యానాంతరమ్ :** సతాం-సంజాతానాం; అనుకల్పభూతమురజిత్ పదం-అనుకల్పభూతం మురజిత్పదంయేనతత్; సజ్జనానాంయతీంద్రచరణమేవ సమాశ్రయణే ముఖ్యం, భగవచ్చరణంతు ఏ తద పేక్షయా అముఖ్యమిత్యర్థః -"ముఖ్యఃస్యాత్ ప్రథమః కల్పోఽ ను కల్పస్తు తతోఽ ధమః "ఇత్యమరః. అజహత్ త్రివర్గం - అజహత్ త్రయాణాం ధర్మార్థకామానాం వర్గః సమూహః యేనతత్, ఇతి.

**21.** **శ్వసితావధూత పరవాది వైభవాః**
**నిగమాంత నీతిజలధే స్తలస్పృశః ।**
**ప్రతిపాదయంతి గతి మాప వర్గికీం**
**యతి సార్వభౌమ పదసాత్కృతాశయాః ॥**

**అర్థం :** యతి సార్వ - శయాః। యతిసార్వభౌమ = యతి సమ్రాట్టైన శ్రీభాష్యకారుల యొక్క, పద = చరణాలకు; సాత్కృత = అధీనం చేయబడిన; ఆశయాః = మనస్సుకలవారు. నిగమ+అంత, నీతి జలధేః = వేదాంతశాస్త్రమనే సముద్రం యొక్క; తల స్పృశః = అట్టడుగు భాగాన్ని స్పర్శించినవారు కావుననే; శ్వసిత+అవధూత, పరవాది వైభవాః (సంతః) = నిట్టూర్పు చేత, వణికించబడిన, ప్రతివాదుల వైభవం కలవారవుతూ; ఆపవర్గికీం - మోక్షసంబంధమైన; గతిం = గతిని; ప్రతిపాదయంతి = ఇస్తున్నారు.

**తాత్పర్యము :** యతీంద్ర పాదకమలాలయందు తమ మనస్సును లీనం చేసిన మహానుభావులు వేదాన్తశాస్త్రమందలి సూక్ష్మార్థాలను తెలిసినవారు కాబట్టి తమ శ్వాసచేతనే ప్రత్యర్థుల-ప్రతివాదుల శక్తిని సన్నగిల్లచేస్తూ, తమ నాశ్రయించిన వారికి మోక్షమార్గాన్ని కల్పిస్తున్నారు.

వ్యాఖ్య : యతీంద్రుల పాదాలను ఆశ్రయించిన మహానుభావులను వర్ణించే శ్లోకం.

శ్రీమద్రామానుజులను ఆశ్రయించిన భక్తులు తమ చిత్తాన్ని రామానుజుల పాదారవిందాలయందే లగ్నం చేస్తారు. ఆ పాదపద్మాలయందున్న అమోఘమైన శక్తిని వారు పొందుతారు.

"పేఱొన్రుమత్తిల్లైనిన్ శరణన్రి, యప్పేఱళిత్తఱ్కాఱొన్రుమిల్లైమత్తచ్చరణన్రి" – (రా.నూత్తందాది. 45) "ఓరామానుజా! మీ చరణాలు తప్ప వేరే పురుషార్థమేదీ లేదు. ఆ పురుషార్థాలను (పాప్యప్రాకాలను) ప్రసాదించే సర్వపదార్థాలలో మీ శ్రీ చరణ యుగ్మం తప్ప వేరొక ఉపాయం ముఖ్యంకాదు". అనే దృఢాధ్యవసాయం కలిగిన మహాజ్ఞానులు రామానుజపదారవిందాలనాశ్రయించినవారు.

**"తృణీకృత విరించాది నిరంకుశవిభూతయః ।**
**రామానుజపదాంభోజ సమాశ్రయణశాలినః ॥"**

రామానుజపదాంభోజాలను సమాశ్రయించిన మహానుభావులు బ్రహ్మాదుల ఐశ్వర్యాన్ని కూడా తృణీకరించే నిరంకుశమైన భగవద్భాగవతాచార్యకైంకర్య మనే సిరి గలవారు సుమా!

**"అనిశంభజతా మనన్యభాజాం చరణాంభోరుహమాదరేణపుంసామ్।**
**వితర న్నిభృతం విభూతి యుగ్మం, జయరామానుజ రంగధామ్నినిత్యమ్॥"**

ఇతర విషయ పరిత్యాగపూర్వకంగా సర్వదా శ్రీభాష్యకారుల చరణ కమలయుగళిని ధ్యానించే పరమైకాంతులకు ఆ పాదయుగళి ఉభయవిభూతులను –ఇహపరలోక సంపత్తులను – అనుగ్రహిస్తుంది. కాబట్టి, వారు వేదాన్త శాస్త్ర పారీణులూ అవుతారు. వేదాన్తశాస్త్రం ఒక మహాసముద్రం. అందులో నీటి ఉపరితలాన తేలిఈదులాడే వారికి అనర్ఘరత్నాలు దొరకవుకదా! యతిరాజుల శిష్యులకు వేదాన్తశాస్త్ర సముద్రంలోమునిగి అట్టడుగును తాకి వెదకే నైపుణ్యం కల్గినందువల్ల వారు ఆ శాస్త్ర సముద్రమందలి పదార్థ ధర్మాలనూ, మర్మాలనూ సమగ్రంగా తెలుసుకొని వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థులయ్యారు, అవుతారు.

**తొణ్ణర్ కులావు మిరామానుశనై, తొగ్గై యిఱన్ద**
**పణ్ణరు వేదంగల్ పార్మేల్ నిలవిడప్పొర్తరుళుమ్**
**కొణ్ణలై మేవిత్తొళుమ్, కుడి యామెంగళ్ కోక్కుడియే**-(రామా.నూత్తన్దాది. 55)

ఉదాత్తానుదాత్త స్వరితాలనే స్వరభేదంతో ప్రకాశించే అనన్తవేదాలు భూమి యందు విస్తరించేవిధంగా పరిశీలించి, వాటిమీద ప్రామాణికబుద్ధిని అందఱికీ కలిగించిన మేఘంవంటి ఉదారులు భగవద్రామానుజులు. దాసులచే స్తుతింపబడే ఆ జగదాచార్యులను ఆశ్రయించి భజించేవారి వంశమే మనలను పాలించే వంశం" అన్నారు తిరువరంగత్తముదనార్లు.

**ప్రాయో దయే! త్వదనుభావ మహాంబురాశౌ**
**ప్రాచేతస ప్రభృతయోఽపి పరంతటస్థాః ।**
**తత్రా వ తీర్ణ మతల స్పృశ మాప్లుతం మాం**
**పద్మావతేః ప్రహసనోచిత మాద్రియేథాః** - (దయాశ.103)

"ఓ దయాదేవీ! నీ మహిమ అనే మహాసముద్రమందు వాల్మీక్యాది మహర్షులు కూడా దిగక గట్టుమీదనే నిలిచారు. (భగవద్గుణాలను వర్ణించారే కాని ప్రధానగుణమైన దయామహిమను వర్ణించలేదని భావం. దయాసముద్రానికి గట్టు భగవానుడే) ఆ సముద్రంలోకి సాహసంతో దిగి మునిగినప్పటికీ అడుగునేలను కనిపెట్టలేకబాధపడుతున్నాను. (ఆతలస్పృశం, ఆప్లుతం) తలస్పర్శకోసం మునుగుతున్నాకొద్దీ తేలిపోతున్నాను. ఇట్టి నా మునుకల స్థితిని చూచి దివ్యదంపతులు నవ్వుతున్నారుకదా! శ్రీ, శ్రీనివాసులకు వినోదరసాన్ని కలిగించే నీ కైంకర్యపరుడనైనన్ను నీవే ఆదరించాలి! దేవీ!" అని దేశికులు, ప్రార్థించే వ్యాజంతో తమనైచ్యాన్ని, దయాదేవికున్న గంభీరప్రభావాన్నీ విస్పష్టం చేశారు.

శ్రీమద్రామానుజ సమాశ్రయణశాలురు వేదాన్తశాస్త్రజలధియందు తల స్పృశులు కావుననే, వారి శ్వాస వాయువుకే ప్రతివాదుల పూర్వపక్షాలు, ప్రతిభా పాటవాలు నిల్వలేకకొట్టుకపోతాయి. "మిక్కనాన్మఱైయిన్ శుడరొళియా లవ్విరుళైత్తురన్దిలనే లుయిరై యుడైయవన్, నారణనెన్ఱఱివారిల్లై యుత్తణర్న్దే" (రా.నూ.59) ఈ కలికాలంలో అట్టి అజ్ఞానాంధకారాన్ని సర్వోత్కృష్టమైన

చతుర్వేదాల తేజస్సుతో తరుమగొట్టియుండకపోతే 'సర్వజీవాత్మలనుకలవాడు శ్రీమన్నారాయణుడే' అనే వాస్తవార్థాన్ని లోకులు తెలిసికోవడానికి అవకాశం కలిగి యుండేదికాదు కదా!

"పిరమనన్నైన్నోది మత్తెల్లా వుయిరుమః౹దు, ఎన్నుయిర్గళ్‌మెయ్‌విట్టు ఆది పరనోడొన్నామెన్నుశొల్లు యవ్వల్ల లెల్లామ్‌వాదిల్‌వెన్ను" - (రా.నూ. 58) పరబ్రహ్మ స్వరూపమే సత్యమైనది, విలక్షణమైనదని చెబుతూనే "జీవాత్మలన్నీ ఆ పరబ్రహ్మమే; జీవాత్మలు దేహాన్ని విడిచినప్పుడే ఆ పరబ్రహ్మతో ఏకీభవిస్తాయి" అని పలుకడం, పరవాదులకోలాహలం. జ్ఞాన సాగరంలో తలస్పృశులైన రామానుజులూ, వారి శిష్యులూ, "జీవాత్మలు పరమాత్మతో కలిసిపోవు; ఏకీభవించవు".

"సోఽశ్నుతే సర్వాన్ కామాంత్సహబ్రహ్మణావిపశ్చితా"- (ఆనందవల్లి) అనే వేదాన్త శాస్త్ర వాక్య ప్రమాణానుసారంగా జీవాత్మలు అంటే, ముక్తాత్మలు పరబ్రహ్మతోకూడి, ఆయన కల్యాణగుణాలను అనుభవిస్తూ ఆనందిస్తారు. తోడకూడి యుండడమే (సయుక్) సాయుజ్య"మని సిద్ధాంత పరచి, పరవాద కోలాహలాన్ని అణచివేసి, వారిని జయిస్తారు. అంతేకాదు. ముముక్షువులకు - మోక్షంకోరే ప్రపన్నులకు మోక్ష మార్గాన్నీ (ఆపవర్గికీం గతిం ప్రతిపాదయంతి) చూపి, అనుగ్రహిస్తారు, మోక్షంపొందదానికి అధికారులుగా చేస్తారు.

**"పశుర్మనుష్యః పక్షీవా యేచ వైష్ణవ సంశ్రయాః।**
**తేనైవతే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమంపదమ్ ॥"**

మనుష్యులుగానీ పశు పక్ష్యాదులుగానీ శ్రీమహావిష్ణు సంబంధమైన ధర్మాన్ని అవలంబించడంవల్లనే వైకుంఠుని స్థానానికి చేరుకొంటారు.

శ్రీ నంబిళ్ళగారికి ఒక భక్తురాలు కొంతభూమిని దానం చేసింది. కాబట్టి ఆ స్వామి, ఆ భక్తురాలికి మోక్షమివ్వాలని భగవానునికి పత్రం వ్రాసి ఆమెకు ఇచ్చాడట. ఆ పత్రం వ్రాసి యిచ్చిన నాడే ఆమెకు మోక్షం లభించిందట. ('ఆచార్యసూక్తి ముక్తావళి'లో ఈ కథ ప్రసిద్ధం) పరమసాత్త్వికులు తమను ఆశ్రయించిన వారిని మోక్షాధికారులుగా చేయడం ఆశ్చర్యం కాదు. వాక్యార్థహేతుక కావ్యలింగా లంకారం. శ్లో 17 నుంచి 21 వరకు 'మంజుభాషిణీ' వృత్తాలు (5).

**సంస్కృత వ్యాఖ్యా :** అథ యతీంద్ర పాదాంబుజ సమాశ్రయిణాం వైభవంవదతి, శ్వసితేతి. యతిసార్వభౌమ పదసాత్కృతాశయాః- యతీంద్రచరణారవిందయోః ఆయత్తీ కృతమనస్కాః; నిగమాంత నీతి జలధేః తల స్పృశః- వేదాన్తన్యాయ సముద్రపారగాః; అత ఏవ, శ్వసితా వధూతపరవాది వైభవాః - అనాయాస నిరస్తపరవా ద్యతిశయాశ్చసంతః; స్వసంబంధినాం అనాయాసేన, ఆపవర్గికీం గతిం - నిఃశ్రేయసగతిం; ప్రతిపాదయంతి - ప్రయచ్ఛంతి.

**22. మూలేనివిశ్య మహతాం నిగమద్రుమాణాం**
**ముష్ణన్ ప్రతారక భయం ధృతనైకదండః ।**
**రంగేశ భక్త జన మానస రాజహంసో**
**రామానుజః శరణ మస్తు మునిః స్వయం నః॥**

**అర్థం :** మహతాం = గొప్పవైన; నిగమద్రుమాణాం = వేదాలు అనే వృక్షాల యొక్క; మూలే = అడుగున, మొదటి భాగమందు; నివిశ్య = ప్రవేశించి, కూర్చొని; ప్రతారక భయం = వంచకుల - కుదృష్టుల - వలని భయాన్ని; ముష్ణన్ = హరిస్తూ; తొలగిస్తూ; ధృతనైక దండః = ధరింపబడిన త్రిదండం కలిగినట్టి; రంగేశ-హంసః॥ రంగేశ = రంగనాథుని యొక్క; భక్తజన = భక్తులైన జనులయొక్క; మానస = మనస్సు అనే మానస సరస్సునకు; రాజహంసః = రాజహంస వంటివారైన; మునిః = వాఙ్నియమం కలిగినట్టి; రామానుజః = ఉదయవరులు; నః = మనకు; స్వయం = తమంతతామే; శరణం = రక్షకంగా; అస్తు = (ఉండును) ఉందురుగాక.

**తాత్పర్యము :** వేదాలు అనే గొప్పవృక్షాల మూలభాగాన ప్రవేశించి మోసగాళ్ళ వల్ల కలిగే భయాన్ని నివారిస్తూ త్రిదండధారియైనట్టి, శ్రీరంగనాథుని భక్తుల మనస్సుకు - మానస నరస్సుకు రాజహంసవంటి వాడైన రామానుజముని మాకు స్వయంగా రక్షకుడై యుండుగాక.

**వ్యాఖ్య :** రామానుజ యతిరాజును రాజహంసతో పోల్చి స్తుతించే శ్లోకం.

'రాజహంస' అంటే, హంసలలో శ్రేష్ఠమైనది.

**హంసాస్తు శ్వేతగరుత శ్చక్రాంగా మానసౌకసః ।**

**రాజహంసాస్తు తే చంచు చరణైర్లోహితైస్సితాః** (అమరం)

హన హింసా గత్యోః' అనే ధాత్వర్థం వల్ల "హంతి (గచ్ఛతి) ఇతిహంసః" చరించేది హంస. సామాన్యంగా హంసలు తెల్లనిరెక్కలూ, గుండ్రని అంగమూ, మానస సరస్సు నివసించేస్థానమూ కలిగిఉండే పక్షులు. ముక్కూ, కాళ్ళూ ఎఱ్ఱగా ఉండి, శరీరమంతా తెల్లగా ఉండే హంసలు 'రాజహంసలు'.

"న బధ్నాతి రతింహంసః కదాచిత్ కర్దమాంభసి" - అన్నట్లు హంస బురద నీటిలో (మడ్డిలో) ఉండదు. అలాగే రామానుజులు కూడా "పిఱప్పామ్ పొల్లా వరువినై మాయవన్ శేత్తళ్ళల్ పొయ్న్నిలత్తే అషుందార్" (తిరువిరుత్తమ్. 100) అన్నట్లు సంసార కర్దమంలో ఉండలేక పరమహంస పరివ్రాజకులయ్యారు.

"హంసోయథాక్షీర మివాంబుమిశ్రమ్". అన్నట్లు హంస నీటిని పాలను విడదీస్తుంది. యతిరాజులు సారాసార మిశ్రమైన శాస్త్రాలను విడదీస్తారు.

"అన్నమదాయిరున్దు అఙ్గఅనూలురైత్త" - అనీ "అన్నమాయ్నూల్ పయన్దాన్" అని చెప్పినట్లు భగవానుని అవతారమైన హంసవేదశాస్త్రాలను ప్రకటించింది. యతీంద్రులు శిష్యులకు శాస్త్రాలను బోధిస్తారు. "పెడైయోడన్నమ్ పెయ్వళైయార్దమ్ పిన్శెన్టు నడైయోడియలి" (తిరుమొషి. 6-5-5) తిరునరయూర్‌లోని హంసలు పడుచు పడతుల నడకలను అనుకరించే నడకలు కలవని తిరుమంగైయాళ్వార్‌గానం చేశారు. అంటే లక్ష్మీదేవికిప్రధానకృత్యమైన పురుషకారాన్ని అనుకరించే హంసల నడక ప్రశంసనీయమని భావం. లక్ష్మీదేవి పురుషకారం లేకపోతే భగవానుడుమోక్షఫలాన్ని ప్రసాదించడుకదా! అలాగే యతిరాజులు పురుషకారం చేయకుంటే, భగవానుడు మోక్ష మునీయజాలడని సారాంశం. కాబట్టి "దత్తేరంగీనిజమపిపదం దేశికాదేశకాంక్షీ" అన్నారు దేశికులు. 'ఆచార్యుల ఆదేశాన్ని కోరే రంగనాథుడు తన పరమపదాన్ని అనుగ్రహిస్తా" డన్నమాట. ఇలాగా, రాజహంస స్వభావాలన్నీ యతిరాజుల యందు గోచరిస్తుంటాయి. ఇక్కడ దేశికులు ప్రదర్శించిన రాజహంస(ల) స్వభావాలు ఇంక విశేషంగా ఉన్నాయి.

'నిగమ' మంటే పట్టణం, వ్యాపారస్థలం, వేద మనినానార్థాలున్నాయి. "వణిక్పథః పురం వేదో నిగమః" (అమరం) 'ద్రుమ' మంటే చెట్టు. "సాలః పలాశ్రీద్రు ద్రుమాగమాః" (అమరం) అఖిల ధర్మాలకు మూలం వేదం. ఆవేదమే ఒక వృక్షం. రాజహంస ఒక పెద్ద చెట్టు మొదట్లో (వృక్షమూలంలో) గూడు నేర్పరచుకొని గాలి, వాన, ఎండ మొదలైన వాటివల్ల కలిగే భయం లేకుండా అందు ప్రవేశించి యుంటుంది. వేదమూలమంటే ఓంకారం. యద్వేదా దౌ స్వరః ప్రోక్తః వేదాన్తేచ ప్రతిష్ఠితః" (శ్రుతి). "ఓంకార ప్రభవా వేదాః" (స్మృతి). అలాగా, శ్రీ భాష్యకారులు వేదశాస్త్రాల మూలందాకాపోయి- తలస్పర్శచేసి, దురూహవేదశాస్త్రాల సూక్ష్మార్థాలను తెలుసుకొని, వాటికి అపార్థాలను కలిగించే వంచకులవలన కలిగే భయాన్ని తొలగిస్తూ, "తస్యవాచకః ప్రణవః"-అన్నట్లు భగవన్నామమైన ప్రణవాన్ని ఉపాసన చేస్తుంటారు.

**ధృతనైకదండః** - త్రిదండం ధరించిన వారని అర్థం. 'నైక' పదం, అనేక పదం ఒకే అర్థాన్నిస్తుంది. న+ఏకః = అనేకః. ఇది నఞ్ తత్పురుషసమాసపదం. న+ఏకః = నైకః. ఇది వృద్ధిసంధి కలిగిన పదం. నైకదండః = ఒక దండంకాదు. చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అని సూచించే మూడు దండాలను ఒక్కటిగా నేర్పరచిన దండమే త్రిదండం. 'త్రిదండి' అంటే మనోవాక్కాయాలు అనే త్రికరణాలను స్వాధీనంలో ఉంచుకొన్నవాడని కూడా అర్థం. దండశబ్దం చెట్టుకొమ్మనూ సూచిస్తుంది. రాజహంస వానాకాలంలో కాక, వసంత కాలంలో చెట్టు కొమ్మలలోనూ సంచరిస్తుంది.

**ప్రతారకభయంముష్ణన్** : దారిదోపిడిగాండ్రు చెట్లకొమ్మల్లో దాగియుండి, బాటసారులను దోచుకొంటారు. 'వేద వృక్షశాఖలు' అంటే ఉపనిషత్తులు. వేదాంతశాస్త్రాగ్రంథాలని అర్థం. వేద, వేదాన్త వాక్యాలకు అపార్థాలను బోధించేవారు ప్రతారకులు. వీరివల్ల వేదమార్గ ప్రవర్తకులకు భయం కలుగుతుంది. వేదవృక్షమూలంలోనే కాక రాజహంసలాగా, శ్రీ భాష్యకారులు వేదశాఖలలోనూ సంచరిస్తూ ప్రతారకుల వల్ల వేదమార్గ ప్రవర్తకులకు కలిగే భయాన్ని తొలగిస్తూ ఉంటారు. ప్రతిపక్షుల వాదాన్ని నిరసించి, వేదాన్తశాస్త్రం యొక్క ఆద్యంతాలకు సునిశ్చితార్థమైన తత్త్వాన్నిబోధించేవారు రామానుజయతీంద్రులు.

**త్రాతాఽఽపది స్థితి పదం భరణం ప్రరోహః**
**ఛాయా కరీశ! సరసాని ఫలాని చ త్వమ్ ।**
**శాఖాగత త్రిదశ బృందశకుంతకానాం**
**కింనామనాసి మహతాం నిగమద్రుమాణామ్॥** (వరదరాజ పంచాశత్ -14)

ఓ హస్తి గిరీశా! దేవరాజా! శాఖలయందున్న దేవగణాలు అనే పక్షులుగల గొప్ప వేదవృక్షాలను ఆపత్తులో రక్షించేవాడవు నీవే. వాటి యొక్క మూలమూ, పోషణమూ, సారమూ, నీడ, ఫలాలు కూడా నీవే. నీవేది కావు? వాటి కున్న వన్నీ నీవే" అని కంచిలో వేంచేసియున్న వేల్పులదొరను దేశికులు స్తోత్రం చేశారు.

రాజహంస వల్ల మానససరస్సుకు ఎంతో శోభ కలుగుతుంది. శ్రీరంగనాథుని భక్తులకు యతిరాజును మనస్సులో ధ్యానంచేయడంవల్ల అత్యంతానందం కలుగుతుంది. భగద్భక్తులడెందంలో ఆనందాన్ని చిందించే శ్రీమద్రామానుజముని, కృపాప్రసన్నాచార్యులు. కాబట్టి, వారు దాసులమైన మనలను స్వయంగా అంటే నిర్హేతుకమైన కృపచేత కటాక్షిస్తారన్నారు శ్రీవేదాన్త దేశికులు.

ఉపమా రూపకాలంకారాలతో భక్తుల హృదయ పీఠమందు  వెలసిన యతిరాజుల ప్రభావాన్ని వర్ణించడానికి దేశికులు ఛందస్సును మార్చడం గమనీయం.

హిమాలయ పర్వతాలలో ఉన్న మానససరస్సు నుంచి హంసలు పీఠభూములలోకి తిరిగి వచ్చే కాలం వసన్తర్తువు.  రంగేశభక్తజన మానసరాజహంస 'వసన్తతిలకా' వృత్తంతో సుశ్లోకితం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ యతీంద్రంస్తౌతి, మూలఇతి. మహతాం, నిగమద్రుమాణాం, మూలే - ఆదౌ, కులాయే; అనేన తలస్పృక్త్వం లక్ష్యతే. తతశ్చ అంతః, నివేశ్య - ప్రభూతతరాన్ నిగమాన్ సమ్యగాలోచ్యేత్యర్థో లభ్యతే. "యద్వే దాదౌ స్వరఃప్రోక్తః". ఇతి నిగమాది భూత ప్రణవార్థనిష్ఠాత ఇతివా. ప్రతారకభయం-ప్రతారకైః - కుదృష్టిభిః అపార్థకల్పనేన కృతం భయం; ముష్ణన్ - చోరయన్, నిశ్శేష మ పనుదన్నిత్యర్థః. ధృతనైక దండః - ధృతత్రిదండః;

రంగేశ భక్తజన మానస రాజహంసః - రంగనాథజనమానసోల్లాసకః; స రామానుజ మునిః, నః - అస్మాకం; స్వయం - స్వకృపయైవ, శరణ మస్తు - రక్షకోஉస్తు. అత్ర హంస సమాధిశ్చస్ఫురతి.

హంసాః ప్రభూతానాం ద్రుమాణాం సావకాశేషు మూలేషు సుకుమారత్వాత్ వర్ష హిమ వాతాదిభీత్యా కులాయాన్ కల్పయంతీతి ప్రసిద్ధిః. దివాచ ప్రతారక భయాత్ వృక్షాగ్రేషు, శాఖాసు తత్ర సంచరం తీతి "ధృతనైకదండ" ఇత్యనేన లక్ష్యతే. దండశబ్దేన శాఖాలక్ష్యతే.

**23.** **సన్మంత్రవిత్ క్షిపతి సంయమినాం నరేంద్రః**
**సంసార జిహ్మగ ముఖైః సముపస్థితం నః ।**
**విష్వక్తతం విషయలోభవిషం నిజాభి**
**ర్గాధానుభావ గరుడధ్వజ భావనాభిః ॥**

**అర్థం :** సత్+మంత్రవిత్ = శ్రేష్ఠమైన మంత్రాన్ని తెలిసినట్టి; సంయమినాం = సన్న్యాసులకు; నరేంద్రః = రాజైన రామానుజాచార్యులు; (నరేంద్రః = అహితుండికుడు - సర్పముఖంచే బ్రతికేవాడు) నః = మాకు; సంసారజిహ్మగముఖైః = సంసారము అనే సర్పం యొక్క ముఖాలచేత; సం+ఉపస్థితం = సంప్రాప్తించిన; విష్వక్ + తతం = అంతట వ్యాపించియున్న; విషయలోభ విషం = శబ్దాది విషయాల యందలి ఆశ అనే విషాన్ని; నిజాభిః = ఆత్మీయమైన; గాధా - నాభిః । గాధ = ధృడమైన; అనుభావ = ప్రభావంగల; గరుడధ్వజ = గరుడ పక్షి టెక్కెంగా గల శ్రీమహావిష్ణువు యొక్క; భావనాభిః = చింతనల చేత; క్షిపతి = పోగొడుతున్నాడు.

**తాత్పర్యము :** మంచి మంత్రవేత్తయైన సర్పశిక్షకుడు, పాముకాటు వేసినందువల్ల శరీరమంతట వ్యాపించిన విషంచే చావ నున్న వ్యక్తిని తన మంత్ర ప్రభావంచేత సర్పవిషాన్ని దిగజార్చి జీవింపచేస్తాడు. అలాగే, శ్రీమద్రామాను జయతీంద్రుడు సన్మంత్రవేత్త కాబట్టి, శబ్దాది విషయ భోగలాలసచే బాధపడుతున్న వ్యక్తుల యందు వ్యాపించియున్న సర్ప విషాన్ని గరుడధ్వజుని మంత్ర ధ్యాన

మహిత చేత దిగజార్చివారిని ఉజ్జీవింపచేస్తాడు.

**వ్యాఖ్య :** యతిరాజు సంసార సర్పదష్టులను ఉజ్జీవింపజేసే నరేంద్రుడని వర్ణన.

సంసారమే సర్పం. సర్పాల ముఖాల యందు విషం ఉంటుంది. పాముకాటు వేస్తే విషమెక్కుతుంది. సంసారం ప్రధానమైన విషయాలు కలది. సర్ప ముఖాలలాగా విషయాలుక్రూరమైనవి. విషయలోభమే విషం. విషం అనుభవించిన వానినే చంపుతుంది. విషయాలను తలచినంత మాత్రాననే మానవుడు నశిస్తాడు. శబ్దం, రూపం, రసం, గంథం, స్పర్శ అనేవి విషయాలు. వీటికే ఇంద్రియార్థాలని పేరు. విసిన్వంతి ఇంద్రియాణీతి విషయాః - ఇంద్రియాలను బంధించేవి అని అర్థం. ఇంద్రియాలచే కోరబడేవి కాబట్టి వీటిని ఇంద్రియార్థాలంటారు.

చెవి, కన్ను, నాలుక, ముక్కు, త్వక్కు (చర్మం) అనేవి జ్ఞానేంద్రియాలు ఐదు. "రూపంశబ్దోగంధరస స్పర్శాశ్చ విషయా అమీ గోచరా ఇంద్రియార్థాశ్చ" "హృషీకం విషయింద్రియమ్" (అమరం) విషయం కలది 'విషయి'. 'విషయి' అంటే ఇంద్రియం. కర్ణేంద్రియానికి శబ్దం విషయం. కంటికి విషయం రూపం. ఇట్టి విషయాలను తలచినా కొద్ది తగులం - సంగం - కలుగుతుంది. తనకు విషయాలపైన మనసుపడితే - పొందాలనే కోరిక కలిగితే, దాన్ని 'ఆశ' అంటాం.

**గిరే ర్మహాన్ గిరేరబ్ధి రబ్దేరపి నభో మహాన్ ।**
**నభసోஉపి పరబ్రహ్మ తతోஉప్యాశా మహీయసీ ॥**

పర్వతమే గొప్పది. దానికంటె సముద్రం గొప్పది. సముద్రం కంటె కూడా ఆకాశం గొప్పది. దాని కంటె పరబ్రహ్మ గొప్ప. అంతకంటె మించిన గొప్ప తనం కలది ఆశ. తెంపులేని ఆశకే లోభమని పేరు. (లుభగార్థ్యే). ఫలసాధనకు మానవుడు ఆశపడడం మంచిదే. అది మితిమీరితే విషయలోభమవుతుంది. విషయలోభమే విషం. విషయలుబ్ధుడు చేయరాని పనులను చేస్తాడు. చేయదగిన పనులను చేయడు. వివేకం తగ్గి, వ్యామోహవశుడై నశిస్తాడు. ఒక్కొక్క ఇంద్రియం తప్పుగా ప్రవర్తిస్తే చావుదాపరిస్తుంది. శలభం - దీపపు పురుగు - రూపానికి,

లేడి పాటకు, ఏనుగు స్పర్శకు, చేపరుచికి, తుమ్మెద వాసనకు లొంగిపోయి నశిస్తుంటాయి కదా!

> రాత్రిర్గమిష్యతి, భవిష్యతి సుప్రభాతం
> భాస్వానుదేష్యతి, హసిష్యతి పంకజశ్రీః ।
> ఇత్థంవిచింతయతి పద్మగతే ద్విరేఫే
> హా హన్త హన్త నళినీం గజ ఉజ్జహార ॥

ఒక కొలనులో తామరపూవు మీద తుమ్మెద వ్రాలింది. సూర్యుడు అస్తమించాడు. కమలపుష్పం ముడుచుకుపోయింది. ఆ కమలంలోనే రాత్రి అంతా ఉంటూ ఆ తుమ్మెద ఇలా అనుకొంటున్నది – "రాత్రి గడచిపోతుంది. తెల్లవారుతుంది. పొద్దు పొడుస్తుంది. కమలం వికసిస్తుంది. నేను బయటికి పోయి హాయిగా విహరిస్తాను" – అని అనుకొంటుండగానే తటాలున, ఒక ఏనుగు కొలనులోకి వచ్చి ఆ తామర పువ్వును కాడతో కూడ త్రుంచివేసి గట్టున పారవేసింది. ముకుళిత పద్మంలోనే చిక్కిపోయిన ఆ తుమ్మెద స్రుక్కి విలవిలలాడి నశించింది.

ఒక్కొక్క ప్రాణి ఒక్కొక్క విషయానికి లొంగిపోతే, మానవుడు అన్నింటికీ లొంగి పోతుంటాడు కదా!

'నరేంద్రుడు' అంటే 'పాములనాడిస్తూ జీవించేవాడు పాముమంత్రగాడు' 'రాజు' అనే అర్థాలున్నాయి.

పాముకాటుకు గురియైన వ్యక్తికి విషం శరీరమంతా (విష్వక్తతం) వ్యాపించినా, నరేంద్రుడు – మంత్రవాది తన మంత్రసిద్ధి కలిమి చేత విషాన్నిదించి ఆ వ్యక్తిని బ్రతికిస్తాడు. మంత్రశాస్త్రంలో అనేక మంత్రాలుంటాయి. వాటిలో సర్పవిషానికి విరుగుడు మంత్రంగా ప్రసిద్ధినిపొందింది గరుడ మంత్రం. గరుడ పక్షి శ్రీవిష్ణు భగవానునికి వాహనం, ధ్వజం కూడా.

గరుత్మంతుడు పాములకు పగవాడని ప్రసిద్ధి. "నాగాంతకుడు" అని గరుడునికి పర్యాయనామం.

ఇంద్రజిత్తు యొక్క నాగాస్త్రాలచే బద్ధులైన రామలక్ష్మణులకు సహాయ పడడానికి వచ్చిన గరుత్మంతుణ్ని చూచినవెంటనే -

**తమాగత మభిప్రేక్ష్య నాగాస్తే విప్రదుద్రువుః ।**
**యై స్తౌ సత్పురుషౌబద్ధౌ శరభూతై ర్మహాబలౌ॥**
**వైనతేయేన సంస్పృష్టౌ స్తయో స్సంరురు హుర్వ్రణాః ।**
**సువర్ణేచ తనూస్నిగ్ధే తయోరాశుబభూవతుః ॥** (రా.యు.50.స37 & 39)

పాములన్నీ పారిపోయాయి. నాగపాశవిముక్తులైన రామలక్ష్మణులను గరుత్మంతుడు స్పృశించగానే వారిగాయాలన్నీ మానిపోయాయి. ఆ వీరుల శరీరాలు కూడా చాలా తేజోవంతంగా ప్రకాశించాయి - అని వాల్మీకి భగవానుడు విశదపరచాడు.

**సన్మంత్రవిత్ :** సత్ అంటే ఎల్లప్పుడు ఉండేది "ఓమ్, తత్, సత్" ఈ మూడు పదాలు 'జగత్కారణుడైన పరమాత్ముడు' అనే ఒక్క అర్థాన్నిస్తాయి. 'మంత్రం' అంటే మననం - పునశ్చరణ - చేసే వారిని రక్షించేది. తత్త్వ హిత పురుషార్థాలను ఇచ్చే తిరుమంత్రమే సన్మంత్రం. ఇది ఉపనిషత్తులు ప్రతిపాదించిన మంత్రం. అష్టాక్షరాలున్న నారాయణమంత్రం. ప్రేయస్సునూ, శ్రేయస్సునూ కలిగించే ఈ సన్మంత్రాన్నీ, మంత్రార్థాన్నీ గురువు(ల) వద్ద ఉపదేశంపొంది, మంత్ర మందు, మంత్రదైవమైన గరుడధ్వజుని యందు, మంత్రోపదేశం చేసిన ఆచార్యుల యందు మహా విశ్వాసాన్ని కలిగియుండి, ఏకాగ్రతతో జపించి మంత్రసిద్ధిని పొందిన మహానుభావుడు యతిరాజు. కాబట్టి, "సంయమినాం నరేంద్రః" - యతులకు రాజు.

ఈ సన్మంత్రవాది సంసార సర్పదష్టులకెక్కిన విషయలోభ విషాన్ని దింపి, స్థిరమైన మేలును సమకూర్చుతాడు. సంసార సర్పవిషమెక్కిన వ్యక్తికి దృష్టి మారుతుంది. సృష్టిలోని సర్వవస్తువులు తనవిగానే కనబడుతాయి. దేహమే ఆత్మ అనుకొంటాడు. అహంకారానికి మేరయుండదు. ఇంద్రియాలు ఇంద్రియార్థాలతో కలియడంవల్ల రాగద్వేషాలు పెల్లుబుకుతాయి. పరోపకార భావన నచ్చదు. ఇట్టి ఆశీవిష విషదోషాలచే నశించకుండా చేసే మంత్ర

ప్రభావశాలి యతిరాజు. యతిరాజు అర్చామూర్తి కూడా బద్ధాంజలియై సన్మంత్రాను సంధానంచేస్తున్నట్లు గోచరిస్తుందికదా! ఆ మూర్తిని భక్తితో సేవిస్తే కూడా సంసార సర్పవిషం దిగిపోతుంది. మనస్సును ఇంద్రియాలతో చేరనీయకుండా జాగ్రతగా ప్రవర్తిస్తాడు. బుద్ధిని దిద్దుకొని జీవిస్తాడు.

**మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః।**
**బంధాయ విషయాసంగి ముక్త్యై నిర్విషయం మనః ॥**

"మనష్యులకు కలిగే బంధమోక్షాలకు మనస్సేకారణం. విషయాలపైన మనస్సు తగులుకొంటే బంధమేర్పడుతుంది. విషయాలను విడిచిమనస్సు భగవానునికి అభిముఖమై యుంటే ముక్తి కలుగుతుంది" అని తెలిసి ప్రవర్తిస్తాడు. 'నేను నా కొరకు కాదు, పరుని కొరకే' అనే అధ్యవసాయంతో మాధవుణ్ని సర్వదాస్మరిస్తూ, మానవసేవను చేస్తూ చివరకు జనన మరణ చక్రంలో పడకుండా చేసే భగవదనుగ్రహానికి పాత్రుడవుతాడు. ఇలా సంసారమందు కుటిలమార్గ ప్రవర్తనచే సంప్రాప్తమైన విషయలోభవిషాన్ని చిమ్మిపారద్రోలే మహోపకారులు యతిరాజులు. "జిహ్మస్తు కుటిలేఽలసే" – "భోగీజిహ్మగః పవనాశనః" – (అమరం)

'నరేంద్రః' అనే పదం సాభిప్రాయం. కాబట్టి పరికరాలంకారం. వసన్త తిలకా వృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ యతీంద్రకృతం స్వవిషయోపకారం, విషయా పకరణంచ వదతి, సన్మంత్ర విదితి. నన్మన్త్రవిత్–సచ్చాసౌమంత్రశ్చ సన్మంత్రః. శ్రీమదష్టాక్షరోమంత్రః, తత్పరిజ్ఞాతా. తత్త్వ హితపురుషార్థాన్ స్పష్టం ప్రతిపాదయతః శ్రీమదష్టాక్షరాదీన్ మంత్రాన్ సమ్యక్వేత్తా. సంయమినాం నరేంద్రః – యతిరాజః. నః – అస్మాకం; సంసార జిహ్మగ ముఖైః – సంసార ఏవ జిహ్మగః సర్పః, తస్యముఖైః – సంసారే కుటిలమార్గాణాం సహవాసేన, సముపస్థితం – సంప్రాప్తం; విష్వక్ తతం – సర్వతః – వ్యాప్తం; విషయలోభ విషం – విషయేషు స్రక్ చందనా దిషులోభ ఏవ విషం; నిజాభిః – స్వకీయాభిః; గాఢా నుభావ గరుడధ్వజ భావనాభిః – అప్రకంప్యానుభావ భగవద్ధ్యానైః; క్షిపతి – అపనుదతి.

నరేంద్ర శబ్దాత్ వ్యాళగ్రాహీచ స్ఫురతి. సచ సమీచీన విషహరణ మంత్రవిత్. గరుడ భావనయా-గరుడ ధ్యానేన, జిహ్మగ ముఖైః - సర్పాదిభిః, ఉపస్థితం విషం క్షిపతి.

**వ్యాఖానాంతరం :** సన్మంత్రవిత్ - సమ్యక్ మంత్రం వేత్తీతి సన్మంత్రవిత్.

**సంసార జిహ్మగముఖై :** సంసారే సంశ్రితానాం జిహ్మగానాం - కుటిల వర్త్మనాం, ముఖైః - వదనైః; గాఢానుభావ గరుడధ్వజ భావనాభిః - గాఢాను భావస్య - దృఢ సామర్థ్యస్య, గరుడ ధ్వజస్య భగవతః; అన్యత్ర గరుడ ఏవధ్వజః, తస్య భావనాభిః - ధ్యానైః; ఇతి.

**24.** **నాథ స్స ఏష యమినాం నఖరశ్మిజాలై**
**రంత ర్నిలీన మపనీయ తమోమదీయమ్ ।**
**విజ్ఞాన చిత్ర మనఘం లిఖతీవచిత్తే**
**వ్యాఖ్యాన కేళిరసికేన కరాంబుజేన ॥**

**అర్థం :** సః = అట్టి; ఏషః = ఈ; యమినాం = యోగులలో; నాథః = శ్రేష్ఠుడైన శ్రీమద్రామానుజులు; నఖరశ్మి జాలైః = గోళ్ళకాంతి సమూహాలచే; అంతః = మనస్సులో; నిలీనం = దాగుకొని యున్న; మదీయం = నాకు సంబంధించిన; తమః = అజ్ఞానాంధకారాన్ని; అపనీయ= తొలగించి; అనఘం = నిర్దుష్టమైన; విజ్ఞాన చిత్రం = విశేషజ్ఞానమనే పటాన్ని; వ్యాఖ్యానకేళి రసికేన = వ్యాఖ్యాన లీలారసికమైన; కరాంబుజేన = హస్తకమలంచేత; చిత్తే = మనస్సునందు; లిఖతి+ఇవ = వ్రాస్తున్నట్లున్నారు.

**తాత్పర్యము :** యోగిశ్రేష్ఠుడైన యతిరాజు తన చేతిగోళ్ళకాంతులచే హృదయమందు లీనమైన నా అజ్ఞాన తమస్సును పోగొట్టి, హృదయమందు దోష రహితమైన విజ్ఞాన చిత్ర పటాన్ని వ్యాఖ్యాన క్రీడయందు రాసిక్యంగల స్వీయ కరకమలంచేత లిఖిస్తునట్లుగా భాసిస్తున్నారు.

**వ్యాఖ్య : జ్ఞానముద్రాంకితమైన యతిరాజశ్రీ హస్తకమల వర్ణన.**

శ్రీమద్వేదాన్తదేశికులు "రామానుజఃశరణమస్తు". (22శ్లో) అని శరణాగతిని చేసిన ఫలితంగా "యతీంద్రుల సాంసారిక విషయ వ్యామోహాన్ని తొలగించా"రని (23శ్లో) వర్ణించారు. ఈ (24) శ్లోకంలో, చిత్రకారుడుగోడ మీద ఉన్న మాలిన్యాన్ని తుడిచివేసి, తెల్లని రంగు పూసి, దానియందు తన హస్తకౌశలం చేత రమ్యమైన చిత్రపటాన్ని వ్రాసినట్లుగా రామానుజులు శోభిస్తున్నారు.

శ్రీమద్రామానుజులు యోగీశ్వరులు. వారు కళా ప్రపూర్ణులు. పరబ్రహ్మస్వరూపాన్ని సాక్షాత్కరింపచేయడమే కళ. (కంలాతీతి=కళా) చిత్తమేభిత్తి (గోడ). భిత్తిలోని మాలిన్యమే చిత్తంలోని లీనమైన తమస్సు. తమస్సు అంటే అవిద్య-అజ్ఞానం. అది సంశయవిపర్యయ రూపంగా ఉంటుంది. అది స్వస్వరూపాన్నీ, పరస్వరూపాన్నీ తెలియనీయదు. అవిద్యాహం మతిః" (అమరం) స్వతంత్రుడను అనే అహంకారబుద్ధి. సూర్యుడు బాహ్యతమస్సును మాత్రమే తొలగిస్తాడు కదా! యోగీశ్వరుడు చిత్తంలోని మాలిన్యాన్ని కూడా అపనయిస్తాడు.

**పుణ్యాంభోజ వికాసాయ పాపధ్వాంత క్షయాయచ ।**
**శ్రీమానావిరభూద్భూమౌ రామానుజదివాకరః ॥**

'పాప మనే చీకటి నశించడానికీ, పుణ్యం-ధర్మం-అనే కమలం వికసించడానికీ, కాంతిమంతుడైన రామానుజుడనే సూర్యుడు భూమియందు అవతరించాడు' అని శ్లోకార్థం.

రామానుజ యతీంద్రులు దేశికుల హృదయంలోని చీకటిని - నైల్యాన్ని తొలగించడానికి చంద్రాకృతిలాగా తెల్లగా ప్రకాశించే తమ గోళ్ళకాంతులను ఉపయోగించారు. అంటే, చిత్తాన్ని శుద్ధిచేసి, ధవళంగా ప్రకాశింపచేశారు. ఇదొక లాభం.

రెండవ లాభం ఏమిటంటే, చిత్రపటం వ్రాయడం. వ్యాఖ్యాన మంటే ఒక పదార్థాన్ని రోగం కుదుర్చడానికి సూదిమందులాగా సూటిగా చిత్తానికి ఎక్కించడం. వివరంగా బోధించడమే. పద్మంవంటి వారి శ్రీహస్తం వ్యాఖ్యాన

క్రీడ యందు అరితేరింది. సరసంగా వివరించి బోధ చేయడం భారం కాదు. అదొకలీల.

అట్టి శ్రీహస్తం చేత దేశికుల ధవళ చిత్తభిత్తియందు సంశయోచ్ఛేదియై, జీవకళ ఉట్టిపడే విజ్ఞాన మనే చిత్రపటాన్ని వ్రాస్తున్నట్లు యతిరాజులు గోచరిస్తున్నారు. "విజ్ఞానం శిల్పశాస్త్రయోః" (అమరం)

'విజ్ఞాన' శబ్దానికి శిల్పమనీ, శాస్త్రమనీ అర్థం. 'జ్ఞానం' అంటె మోక్షసాధనమైన బుద్ధి. "సంజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం జానదభిజానత్" శ్రుతి. 1. సంజ్ఞానం = ఆత్మ, పరమాత్మసాక్షాత్కారమైన బుద్ధి. 2. విజ్ఞానం = పదార్థ రూప ధర్మాలను గ్రహించే తెలివి. 3. ప్రజ్ఞానం = నిత్యనూతనంగా స్ఫురించేబుద్ధి. 4. జ్ఞానం = మంచి చెడ్డలను అనుశీలించే తెలివి. 5. అభిజ్ఞానం = గుర్తుపట్టే తెలివి.

ఈ శ్లోకంలో "వ్యాఖ్యానకేళిరసికేన, కరాంబుజేన, నఖరశ్మిజాలైః" - అనే పదాలచే 'జ్ఞాన ముద్ర' లేదా 'ఉపదేశ ముద్ర' అభివ్యక్త మవుతున్నది. ఆచార్యుడు జ్ఞానముద్రను ప్రదర్శిస్తూ శిష్యునికి అజ్ఞానాన్ని తొలగించి, జ్ఞానాన్ని బోధించే పద్ధతి ఇది.

విజ్ఞాన చిత్రాన్ని యతిరాజు మన హృదయాలలో చిత్రించడమనేది గమనార్హం కదా!

**హృదిముగ్ధ శిఖండమండనో లిఖితఃకేన మమైష శిల్పినా।**
**మదనాతురవల్లవాంగనా వదనాంభోజ దివాకరోయువా ॥** (గోపాలవింశతి-14)

"నెమిలి పింఛంతో అలంకరించిన సుందరమైన జుట్టుముడి కలిగిన, కామాతురలైన గోపికల ముఖపద్మాలకు సూర్యుడైన చిన్న వయస్సు గల ఈ శ్రీ కృష్ణుడు నా హృదయమందు ఏ శిల్పిచే చిత్రించబడినాడు?" అని దేశికులు భావించిన ప్రశ్నకు యతిరాజసప్తతిలోని ఈ శ్లోకమే సమాధానం. "ఆ శిల్పి యతిరాజులే" The two slokas have to be enjoyed as supplementary and complementary to each other అంటారు డి. రామస్వామి అయ్యంగార్.

ఈ యతిరాజుల హృదయాన్నే కళాత్మకంగా చిత్రించిన శ్రీనివాస భగవానుడే మహాశిల్పి. ఈ విజ్ఞాన చిత్రలేఖన మందలి వర్ణం (రంగు) దయాదేవియే, అని దేశికులు 'దయాశతకం'లో వర్ణించాడు.

**త్వదుదయ తూలికాభి రమునా వృషశైలజుషా**
**స్థిర చరశిల్పినైవ పరికల్పిత చిత్రధియః ।**
**యతి పతి యా మునప్రభృతయః ప్రథయంతి దయే**
**జగతి హితం న నస్త్వయి భరన్యసనాదధికమ్** (59)

"చరాచర ప్రపంచ నిర్మాతయైన ఉత్తమ శిల్పి దయ అనే వర్ణమందు ముంచిన సంకల్పాలనే కుంచికలచే వ్రాయబడిన చిత్రాలే. భగవానుని యందు భరన్యాసం (శరణాగతి) కంటె మించిన గొప్ప హితంలేదని ప్రకాశపరచే యతిరాజుల, యామునాచార్యుల విజ్ఞానాలు. కుంచికలు కనబడకపోయినా, చిత్రమందలి వర్ణం కనబడుతున్నట్లే, భగవద్దయయే ఆచార్యుల యొక్క జ్ఞానమందు నిలిచి, వారి శ్రీసూక్తుల యందు ప్రవహిస్తున్నది" అని శ్లోకసారార్థం.

ఉత్తమశిల్పియైన, చరమార్థ ప్రదాతయైన భగవానుని చిత్రాన్నే ఆచార్యులు తమ శిష్యుల హృదయాలయందు చిత్రించి నిల్పుతారని అవధేయం. ఉత్ప్రేక్షాలంకారం. వసంత తిలకావృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ వ్యాఖ్యానముద్రాంకితం కరముత్ప్రేక్ష్యతే, నాథ ఇతి, యమినాం నాథః - యతీంద్రః; వ్యాఖ్యాన కేళిరసికేన - వ్యాఖ్యాన ముద్రాంకితేన; కరాంబుజేన, నఖరశ్మిజాలైః – నఖకిరణజాలైః; అంతర్నిలీనం మదీయం తమః-మనసిలగ్నం మామకం అజ్ఞానం అపనీయ, చిత్తే – మనసి; అనఘం-సంశయవిపర్యయరహితం; విజ్ఞాన చిత్రం – సమ్యక్జ్ఞాన రూపం చిత్రం; లిఖతీవ – చిత్రలేఖకాశ్చ మలీమసభిత్త్యాదికంధవళీకృత్యలిఖంతీతి స్ఫురతి.

**25.** ఉద్గృహ్ణతీ ముపనిషత్సునిగూఢమర్థం
చిత్తే నివేశయితు మల్పధియాం స్వయంనః ।
పశ్యేమ లక్ష్మణ మునేః ప్రతిపన్నహస్తా
మున్నిద్ర పద్మ సుభగా ముపదేశముద్రామ్ ॥

**అర్థం :** ఉపనిషత్సు = ఉపనిషత్తుల యందు; నిగూఢం = చాలా రహస్యంగా ఉన్న; అర్థం = అర్థాన్ని; అల్పధియాం = మందమతులమైన; నః = మన యొక్క; చిత్తే= మనస్సులో; స్వయం = తానే; నివేశయితుం = ప్రవేశపెట్టడానికి; ఉత్+గృహ్ణతీం = పైకి ఎత్తి పట్టబడిన; ఉన్నిద్ర పద్మసుభగాం = వికసించిన కమలం వలె మనోజ్ఞమైన; లక్ష్మణమునేః = లక్ష్మణముని యొక్క; ప్రతిపన్నహస్తాం = పొందబడిన చేతిని కలిగియున్న; ఉపదేశముద్రాం = వ్యాఖ్యాన ముద్రను; పశ్యేమ = చూస్తున్నాం - అనుభవిస్తున్నాం.

**తాత్పర్యము :** ఉపనిషద్రహస్యార్థాలను అల్పబుద్ధులమైన మన మనస్సున తానే ప్రవేశపెట్టడానికి పైకెత్తిపట్టబడిన, వికసించిన తామర పూవులాగా మనోహరమైన శ్రీమద్రామానుజ ముని యొక్క చేతి యందుపొందియున్న ఉపదేశముద్రను కంటితో అనుభవిస్తున్నాం.

**వ్యాఖ్య :** యతిరాజుల ఉపదేశముద్రను మనోజ్ఞంగా వర్ణించే శ్లోకం.

పూర్వశ్లోకంలోని వ్యాఖ్యాన ముద్రను భంగ్యంతరంగా దేశికులు వర్ణించారు. పూర్వశ్లోకంలో కవి హృదయాన విజ్ఞానచిత్రాన్ని వ్రాసినట్లు ఉత్ప్రేక్షితం. ఈ శ్లోకంలో లోకులందరికీ వేదాంతశాస్త్రమందలి సూక్ష్మార్థాలను ఉపదేశించడానికి కుడిచేతిని ఎత్తి, పుష్పించిన పద్మం లాగా ప్రదర్శితమైన ఉపదేశముద్ర వర్ణితం.

లక్ష్మణాచార్యులు అని (కాంతి మతి, కేశవాచార్యులు అనే) తల్లిదండ్రులు పెట్టిన పేరు. రామానుజాచార్యులకిది పర్యాయనామం. 'ముని' అంటే మనన శీలుడని అర్థం. ఉపనిషత్తుల సారార్థం పైపై చదువులకు పట్టుబడదు. పాలకడలిని మథించగా మథించగా, ఉద్ధరించబడిన అమృతం లాంటిది ఉపనిషదర్థం. ఉపనిషత్తులు చాలా ఉన్నాయి. వాటినన్నిటిని ఏకాగ్రతతో పరిశోధించగా, వాటిలో

నిగూఢంగా ఉన్న పరాపరతత్త్వం గ్రాహ్యమవుతుంది. శ్రియః పతియే పరతత్త్వం. బ్రహ్మరుద్రేంద్రాదులు శ్రియఃపతి కంటే అవరులు, (తక్కువవారు). జీవాత్మకు శరీరమెట్టిదో, అట్లే పరమాత్మకూ బ్రహాండమందలి చరాచర వస్తువులన్నీ శరీరాలే. అంటే, ఇతరజాతికీ శ్రియఃపతికీ శరీర శరీరి సంబంధం ఉంది, అనే విషయం రహస్యార్థం. ఇట్టి సూక్ష్మార్థాన్ని మన చిత్తమందు నిక్షేపించదానికి యతిరాజులు, మనం ప్రార్థించకున్నా తామే కృపతో ప్రయత్నించి సఫలులైనారు. ఎక్కడో ఉన్న ద్రవ్యనిధిని మనకు అధీనమైన చోట ఉంచితే యథేష్టంగా ఉపయోగించు కోవచ్చును కదా! అలాగే, నిగూఢార్థాలను మనమనస్సుకు నాటితే, వాటిని మనమెక్కడైనా, ఎప్పుడైనా అనుభవించవచ్చును. లేకపోతే,

**పుస్తకేషుచ యావిద్యా, పరహస్తే షు యద్ధనమ్।**
**సమయే న పరిప్రాప్తే, నసా విద్యా న తద్ధనమ్ ॥** (చాణక్యనీతి)

కంఠస్థం కాక, పుస్తకాలయందున్న చదువు, పరులచేతిలో నున్న ధనం సమయానికి అక్కరకురాదు. అట్టి దానిని చదువు (విద్య) అనరు, ధన మనరు కదా!

**అనువ్రతానాం శిష్యాణాం పుత్రాణాంచ ద్విజోత్తమ।**
**అనాపృష్టమపి బ్రూయుర్గురవో దీన వత్సలాః** (భాగవతం 3-7-36)

"నా పృష్టః కస్య చిత్ బ్రూయాత్" - "అడుగబడని వాడు ఎవరికీ చెప్పకూడదు" అంటారు. కాని దీనులయందు, అల్పబుద్ధికలవారియందు వాత్సల్యమున్న ఆచార్యులు తమనాశ్రయించిన శిష్యులకూ, పుత్రులకూ, వారు అడుగకున్నా జ్ఞానాన్ని బోధిస్తారు. జ్ఞానబోధనే 'శిక్షణ' అంటారు.

పశుపక్ష్యాదులకు శిక్షణనిచ్చేవారు పడునట్టి శ్రమకంటెను మనుష్యుణ్ని మనుష్యునిగా ప్రవర్తించకలిగే రీతిగా శిక్షణ నివ్వడంలో ఆచార్యులు పడేశ్రమ చాలా గొప్పది. పశుపక్ష్యాది శిక్షణకేవలం బాహ్య వ్యాపారాలకు సంబంధించింది. మానవునికిచ్చే శిక్షణలో బాహ్యప్రవర్తనలతోపాటు వాని ఆత్మహితానికి ఆవశ్యకాలైన అభ్యంతర ప్రవృత్తులు కూడా అంతర్భవించి ఉంటాయి. కాబట్టి మానవులకు జ్ఞానబోధచేసే మహనీయులైన ఆచార్యులకు మాటలతో చెప్పరాని మహత్త్వం కలదని గుర్తించవచ్చు. జ్ఞానబోధ చేయడం ఆచార్యులకు శ్రమకాదు.

అది వారికి ఒక ఆటలాగా ఆనందాన్ని కలిగిస్తుంది. ఆచార్యత్వ పరిపూర్తికి పట్టం కడుతుంది.

జ్ఞాన బోధచేస్తున్నప్పుడు గురువు ఆనందంతో, అనుకోకుండా అకస్మాత్తుగా, తన కుడిచేతిని పైకి ఎత్తి ఉపదేశముద్రను ప్రదర్శిస్తాడు. అందువల్లనే కదా, ఆ చేతిని 'వ్యాఖ్యానకేళిరసిక' మన్నారు. 'ముద్ర' అంటె ఒక ఆకారానికి చిహ్నం. కొందరు దీపకాంతిలో చేతివ్రేళ్ళను మెలికలువేస్తూ, మల్చుతూ ఆ నీడను గోడమీదగానీ, తెరమీదగానీ పదేరీతిగా చేస్తే ఆ నీడ, పక్షి లేదా లేడి ఆకారంగానో కనబడుతుంది కదా! ఈ 'కరాంగుళి విన్యాస' మే ముద్ర అనబడుతుంది.

ఉపదేశముద్ర ఉన్నిద్ర పద్మసుభగంగా ఉంటుంది. వికసించిన పద్మంలాగా మనోరంజకంగా ఉంటుందన్న మాట. పద్మం జ్ఞాన చిహ్నం. ఆది శతపత్రంగానూ, సహస్రపత్రంగానూ వికసించవచ్చు. కాబట్టి దీన్ని 'జ్ఞాన ముద్ర' అంటారు. తన స్థాయిని తగ్గించుకొని సూతవేషంలో ఉన్న శ్రీ కృష్ణభగవానుడు పార్థునికి గీతను బోధిస్తున్నప్పుడు ఎడమచేతియందు పగ్గాలను, ములుకోలను పట్టుకొని కుడిచేతి యందు జ్ఞాన ముద్రను ప్రదర్శించాడు. "సవ్యేతోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రామ్". అనే చోట "సవ్యే, దక్షిణే" అనే రెండు వ్యస్త పదాల నడుమ ఉన్న 'కరసరసిజే' అనే ఉపమానోత్తరపద కర్మధారయ సమాస పదం" యొక్క ప్రయోగమూ, ప్రయోజనమూ గమనీయం కదా!

ఉపదేశ ముద్ర చేతి యందే పొందింది, కాబట్టి "ప్రతిపన్నహస్తాం" అనబడింది. 'ఉపదేశముద్రాం' అనే విశేష్యపదానికి "ఉద్బృష్టాతీం, ప్రతిపన్నహస్తాం, ఉన్నిద్ర పద్మసుభగాం" అనే మూడు విశేషణ పదాలను ప్రయోగించి ఆ ముద్రా ప్రభావాన్ని అగ్గలంగా ఉగ్గడించాడు కవి. మన విధిగా ముద్రను చూడవలసిందే. ముద్రతో (ద్వారా) బోధించే జ్ఞానాన్ని అనుభవించ వలసిందే. కాబట్టి 'పశ్యేమ' అనే క్రియాపదం ప్రయోగింపబడింది. "దృశిర్-ప్రేక్షణే" అనే ధాతువుకు 'పశ్య' ఆదేశమవుతుంది. "విధి నిమన్త్రాణా మన్త్రణా ధీష్ట సంప్రశ్నప్రార్థనాశీష్షు లిఙ్‌లోటౌ స్తః" అనే వాక్యాన్నిబట్టి, ఇది

సకర్మకధాతువు యొక్క పరస్మైపది, విధి లిజ్, ఉత్తమ పురుష బహువచనాంత రూపం. "ఉన్నిద్ర సత్త్వసుభగాం" అనే పాఠంలో – సత్త్వోద్రేకంకలవారికి సర్వదా అనుభవయోగ్యమని అర్థం.

ఉపదేశముద్ర, శరణాగతిని సూచిస్తుంది. చిటికెనవ్రేలు, ఉంగరపువ్రేలు, పెద్దవ్రేలు వరుసగా కర్మ జ్ఞానభక్తియోగాలను సూచిస్తాయి. ఈ మూడువ్రేళ్ళు క్రమంగా సత్త్వ రజస్తమోగుణాత్మకమైన మూల ప్రకృతికి సంకేతం. చూపుడు వ్రేలు జీవతత్త్వానికి సంకేతం. అంగుష్ఠం (బొటనవ్రేలు) పరతత్త్వానికి సంకేతం బొటనవ్రేలు కొనతో (తర్జని) చూపుడువ్రేలుకొన అనుకొని, మూడువ్రేళ్ళు నిటారుగా నిల్చియుంటే ఉపదేశ ముద్ర ఏర్పడుతుంది.

"అంగుష్ఠమాత్రః పురుషోఽంగుష్ఠంచ సమాశ్రితః" అని ఉపనిషద్వాణి. కర్మ, జ్ఞాన, భక్తులు మూడు జీవితంలో నిల్చియున్న జీవుడు నమ్రతతో ప్రకృతిని విడిచి, పరమాత్మయొక్క పాదారవిందాలను ఆశ్రయిస్తాడు. ఇది ఉపదేశముద్ర యొక్క సంకేతితార్థం.

తిరుమలలో రామానుజుల దివ్యమంగళ విగ్రహం (మూల, ఉత్సవ విగ్రహాలు రెండూ) కుడిచేతి యందు జ్ఞాన ముద్ర (ఉపదేశముద్ర)ను ధరించి కమ్రంగా వెలసియున్నది. శ్రీపెరుంబూదూరిలో – రామానుజుల అవతారస్థలం లోనూ, ఇతరత్ర దేవాలయాలలోనూ రామానుజుల దివ్యసుందర విగ్రహం రెండు చేతులను మోడ్చి ప్రార్థన చేస్తున్న విధంగా అంజలి ముద్రతో భాసిస్తున్నది. "అకారార్థో విష్ణుః" – 'అ'కారం విష్ణువు అనే అర్థం కలది. "ప్రార్థన వైకుంఠుణ్ణి జలధరింపజేస్తుంది" అని సూచించేది 'అంజలిముద్ర'.

పూర్వకాలంలో శ్రీ వేంకటేశ్వరస్వామి తన శంఖచక్రాలను తన పరమభక్తుడైన తొండమాన్ చక్రవర్తికి ఇచ్చాడట. 'దత్తా పహారం' అంటే ఇచ్చిన దానిని తిరిగి తీసుకొనే గుణం స్వామికి లేదు. కాబట్టి, అట్టి అర్చామూర్తిని జూచిన భక్తులు శివుడనీ, శక్తి అనీ తమకు తోచినరీతిగా భావించారు. భగవద్రామానుజులు తిరుమలకు వేంచేసి, అక్కడి ధర్మాధికారులతో సంప్రదించి, శూలం, డమరుకం, శంఖచక్రాలు ఇత్యాది పరికరాలను ఆయా దేవతలకు సంబంధించిన వాటిని – స్వామి సన్నిధిలోపెట్టి అందరి ముందే ద్వారాన్ని

బంధించి తాళాలువేసి, సీల్ (seal) చేయించారు. "ఆ దేవత, తానెవరైతే తనకు సంబంధించిన పరికరాలను ధరించుగాక" యని చెప్పి, అందరు కాపలా కాస్తుంటే, ఆ రాత్రి యంతా స్వామిని ప్రార్థిస్తూ అక్కడే నిల్చియున్నారు. తెల్లవారగనే అందరు చూస్తుండగా ద్వారాన్ని తెరిచారు. శ్రీ వేంకటేశ్వరస్వామి శంఖచక్రాలతో, తేజోవిరాజితుడై దర్శనమిచ్చాడు

**రామానుజార్య యతిరాజ నిరూపణేన**
**నాహం పరో జలధి జాదయితా ది తీదమ్ ।**
**ప్రాచీకటత్ స్వమపితం -**

"యతిరాజులు నిరూపించడం చేత, నేను శ్రియః పతికంటే ఇతరుడను కాను" అని ఆ స్వామి తన యొక్క, రామానుజుల యొక్క ప్రభావాన్ని అక్షరాలా ప్రకటించాడు. అప్పుడక్కడున్న జనమంతా, ఎవరికి వారే ఒక్కొక్కడు "తదహం భవంతం, శ్రీ వేంకటాచలపతిం ప్రణమామి నిత్యమ్". శైవమో, శాక్తేయమో కాక శ్రీ మహావిష్ణువు యొక్క అర్చారూపమని నిరూపించిన మీకూ (యతిరాజులకూ), "నేను లక్ష్మీనాథునికంటే మరొకరిని కానే కాను" అని స్వయంగా ప్రకటించిన శ్రీ వేంకటాచలపతికీ ఎల్లప్పుడు నమస్కరిస్తుంటాను, అని పలుకుతూ సాష్టాంగప్రణామాలు చేసిన వృత్తాంతాన్ని మహానుభావులైన పెద్దలు చెబుతుంటారు.

తనను నిరూపించినందువల్ల (ఆచార్యుడే భగవంతుణ్ని దర్శింపచేస్తాడు. కాబట్టి) ఆచార్యత్వపూర్తిగల మీరు,"అత్రైవ సుఖమాస్వ" - ఇక్కడనే సుఖంగా ఉండండి - అని శ్రీ వేంకటేశ్వర స్వామి ఆజ్ఞాపించాడు. అప్పటి నుంచి ఆచార్య స్వరూపంగా, ఉపదేశముద్రను ధరించి యతిరాజులు - ఉడైయవరులు - తిరుమలలో వేంచేసి ఉన్నారు. 'ఉద్గృహ్ణతీం - ఉపపాదిస్తున్నట్లుగా ఉన్న' అనీ ఉత్ప్రేక్షించవచ్చు.

ఉపదేశముద్రకు హేతువుగా ఉపనిషదర్థాన్ని మనస్సుకు పట్టించడం వర్ణితం. కాబట్టి వాక్యార్థహేతుక కావ్యలింగాలంకారం. వసంత తిలకావృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** పునరపి తద్వ్యాఖ్యాన ముద్రామేవోత్ప్రేక్ష్యాను భవతి,

ఉద్గృహ్ణతీమితి : అల్పధియాం నః - అస్మాకం; చిత్తే - హృది;

నివేశయితుం – నివేశనాయ; ఉపనిషత్సు నిగూఢమర్థం – సూక్ష్మార్థానల్పాంశం; ఉద్ధృష్ణతీం – ఉపపాదయంతీమివస్థితాం; లక్ష్మణమునేః, ప్రతిపన్నహస్తాం–లక్ష్మణమునిహస్తాం ప్రాప్తాం;

ఉన్నిద్ర సత్త్వ సుభగాం – ఉన్నిద్ర సత్త్వానాం – సత్త్వోద్రేకవతాం; సుభగాం– సదానుభావ్యాం; ఉపదేశముద్రాం, పశ్యేమ – అనుభవేమ.

'ఉన్నిద్ర పద్మసుభగా' మితిపాఠే వికసితారవిందమివ స్థితాం, అతఏవ దర్శనీయతా మిత్యర్థః.

'నిగూఢమర్థం చిత్తే నివేశయితు' మిత్యనేన లోకే కశ్చిత్ నిగూఢంధనం లబ్ధ్వా సూక్ష్మస్థలే నివేశయతీతి చస్ఫురతి.

**వాఖ్యానాంతరం :** ఉపనిషత్సునిగూఢం – నిలీనం; అర్థం; అల్పధియాం నః – మందబుద్ధీనా మస్మాకం; చిత్తేనివేశయితుం – మనసిస్థాపయితుం; స్వయమేవోద్ధృష్ణతీం – ఆకర్షతీం; ప్రతిపన్నహస్తాం – ప్రతిపన్నః హస్తః యస్యాస్తామితి.

**26. ఆకర్షణాని నిగమాంత సరస్వతీ నా**
**ముచ్చాటనాని బహిరంత రుపప్లవానామ్ ।**
**పథ్యాని ఘోరభవ సంజ్వర పీడితానాం**
**హృద్యాని భాంతి యతిరాజమునేర్వచాంసి ॥**

**అర్థం :** యతిరాజమునేః = శ్రీభాష్యకారుల యొక్క; వచాంసి = వాక్కులు; నిగమ+ అంత, సరస్వతీనాం = వేదాంత వాక్కులకు; ఆకర్షణాని = ఆకర్షకాలు; సమానమైన అర్థం కలవి. బహిః + అంతః + ఉపప్లవానాం = బయటా, లోపలా ఉండే ఉపద్రవాలకు; ఉచ్చాటనాని = దూరంగా తొలగించేవి. (నిరసించేవి). ఘోరభవ సంజ్వరపీడితానాం = తీవ్రమైన సంసార మహాజ్వరం చేత పీడితులయ్యేవారికి; పథ్యాని = జ్వరాన్ని నివారించేవి; హృద్యాని = మనోజ్ఞమైనవై; భాంతి = ప్రకాశిస్తున్నవి.

**తాత్పర్యము :** శ్రీ భాష్యకారుల వాక్కులు వేదాంత వాక్కులకు ఆకర్షణమంత్రాలు. బాహ్యాభ్యంతరాలైన ఉపద్రవాలకు ఉచ్చాటన మంత్రాలు, ఘోర సంసార మహాజ్వర పీడితులకు పథ్యాలు. అందరికీ హృద్యాలైభాసిస్తున్నాయి.

**వ్యాఖ్య :** యతిరాజముని వాగ్విలాస వికాస విన్యాసప్రభావం వర్ణితం.

భగవద్రామానుజ ముని యొక్క ఉపదేశముద్రకు గల ప్రాధాన్యాన్ని రెండు శ్లోకాల్లో వివరించిన తర్వాత, ఆ మునీశ్వర్లు ఉపదేశించిన, ప్రవచించిన, విరచించిన వాక్కుల ప్రభావం ఈ శ్లోకంలో సుశ్లోకితం. సత్యహిత మిత వచనం మౌనతుల్యమంటారు విజ్ఞులు.

యతిరాజుల వాక్కులు వేదాంత వాక్కులకు ఆకర్షణలు. 'సరస్వతి' అంటే భాష. "బ్రాహ్మీతుభారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ". (అమరం) 'సరస్వతీనాం' అని బహువచన ప్రయోగం వల్ల 'వాక్కులు' అని అర్థం. వారు ఉపదేశించిన వాక్కులలో వేదాంతార్థాలు అప్రయత్నంగా ప్రకాశిస్తుంటాయి. వేదాంతమంటె ఉపనిషద్విద్య. "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ" అన్నట్లు, వేదాన్త వన విహారిశ్రియః పతి. అంతేకాదు, 'సత్య'మనే మాటకూడా 'పరబ్రహ్మ' అనే అర్థమిస్తుంది.

**తానిహవా ఏతానిత్రీణ్యక్షరాణి, సతీయ మితి. తద్యత్సత్త**
**దమృతమథ యత్తన్మర్త్యమథ యద్యం తేనోభే యచ్ఛతి** (ఛాం.ఉ.)

సకారం జీవవాచకం. తకారం ప్రకృతి వాచకం. 'యమ్' అంటే ఈ జీవప్రకృతులనే రెండింటిని నియమించే సర్వేశ్వరుడని 'సత్యం' అనే శబ్దానికి అర్థం. 'ప్రధాన పురుషేశ్వరః'. (వి.సనా) ప్రధానమంటే ప్రకృతి; పురుషశబ్దం జీవవాచకం. ప్రకృతి పురుషులను 'ఈశ్వరః' అంటే నియమించేవాడనే అర్థమున్న ఈ భగవన్నామం సత్యార్థాన్నే తెల్పుతున్నదికదా! కాబట్టి, యతిరాజుల ఉపదేశం శ్రియఃపతియొక్క స్వరూప రూపగుణవిభూతులనే విశదం చేస్తుంది; వేదాంతార్థాలనే విలసింపజేస్తుంది.

బాహ్యోపద్రవాలు అంటే తెలిసీ తెలియని అల్పజ్ఞులచే బాధింపబడే వేదార్థాలు. "బిభేత్యల్పశ్రుతా ద్వేదః మామయంప్రతరిష్యతి" వేదం అల్పజ్ఞుని వల్ల 'నన్ను ఇతడు వంచించగలడు' అని భయపడుతుండింది. చివరకు నిగమాంత సరస్వతి సత్యమైన అర్థాన్ని బోధించే వ్యాఖ్యాతను జూచి సంతోషించింది. సరస్వతి

వాగ్దేవి కాబట్టి, బ్రహ్మసూత్రాలను ఉపనిషదర్థాలతో వివరించిన శ్రీమద్రామాను జమునులను (కాశ్మీరులో శారదాదేవి) 'శ్రీ భాష్యకారులు' అనే బిరుదు నిచ్చి సన్మానించిందని ప్రాజ్ఞులంటారు.

అంతరుపద్రవాలు అంటే కామక్రోధాదులు. రామానుజులు కామానుజులు కారు. పరబ్రహ్మను గూర్చి, ప్రపంచాన్ని గూర్చి సరిగ్గా తెలియక తికమక పడే లోకులకు తమ ప్రవచనాలచే మహోపకారం చేశారు యతిరాజులు.

'తత్ సృష్ట్వా, తదేవానుప్రావిశత్, - సచ్చత్యచ్చాభవత్" - (ఉపనిషత్తు) నిరవద్యః పరఃప్రాప్తేః నిరధిష్ఠోఽ క్షరఃక్రమః". (వి.పు. 5-1-48) నిరవద్యుడూ, దుష్ప్రాపుడూ, నిరాధారుడూ, అక్షరుడూ, క్రముడూ (వృత్తి సర్గతాయనేషుక్రమః " - అని సూత్రం) అంటే, అప్రతిబంధమహోత్సాహుడైన భగవానుడు తన బొజ్జలో ఇముడ్చుకొన్న జగజ్జాలాన్ని - చరాచర ప్రపంచాన్ని తన అద్భుత సంకల్పంతో సృష్టించి, సృజించిన స్థిరచర వస్తువులలోనూ తానే అనుప్రవేశం చేశాడు. కారణమూ, కార్యమూ తానే అయ్యాడు, అని సదసద్విచారాన్ని వేదాంతశాస్త్రార్థంతో సమర్థించి "సర్వం ఖల్విదంబ్రహ్మ" - అనే పరబ్రహ్మ ప్రకారాన్ని స్పష్టంగాబోధించారు శ్రీ భాష్యకారులు. కాబట్టి, బహిరంత రుపప్లవాలకు ఉచ్చాటన మంత్రాలు యతిరాజముని వచనాలు - అన్నారు దేశికులవారు.

సంసారమే తీవ్రజ్వరం; ఆ మహాజ్వరపీడిత మంటే తాపత్రయంవల్ల పుట్టిన దుఃఖాలకు ఆస్పదమైన శరీరం యొక్క స్థితి.

తాపత్రయం అంటే మూడు తాపాలు. 1) ఆధ్యాత్మికం:- కర్మేంద్రియాల చేత - హస్తపాదాది అవయవాలచేత - చేయబడే తాపం ఆధ్యాత్మికం. ఇది ఆధి, వ్యాధి (మానసం, శారీరం) అని రెండు రకాలు.

2) ఆధిభౌతికం : పశుపక్షి మనుష్యాద్యైః పిశాచోరగరాక్షసైః। సరీసృపా ద్యైశ్చనృణాం జాయతే చాధిభౌతికః॥ పశు పక్ష్యాదులవల్లనూ, పాములు, క్రిమి కీటకాదుల వల్లనూ కలిగే బాధ - దుఃఖం.

3) ఆధిదైవికం : శీతవాతోష్ణవర్షాంబు వైద్యుతాది సముద్భవః। తాపో ద్విజవరశ్రేష్ఠైః కథ్యతే చాధిదైవికః॥ ఎండ, గాలి, వాన (అతివృష్టి, అనావృష్టి) నీరు, చలి, విద్యుత్తు, పిడుగు మొదలైన వాటివలన కలిగే పీడ.

ఈ తాపత్రయ బాధను తొలగించుకోవడానికి - భవరోగ నివారణం కోసం భగవానుని గూర్చి మహా విశ్వాసంతో భజన చేయడమే సముచితం. కమనీయమది. ఆనందదాయకమది.

"సంసారే కింసారం? కంసారేశ్చరణకమల పరిభజనమ్" అన్నారు కదా! జ్వరపీడితునికి ఉప్పు, కారం లేని పథ్యం - మితమైన, హితమైన ఆహారం - ఇస్తే, ఆది జ్వరాన్ని పొగొట్టుతుంది. కాని అది ఆ జ్వరపీడితునికి రుచించదుకదా! కాబట్టి, దృఢమైన అధ్యవసాయంతో భగవంతుణ్ని "అన్యథా శరణం నాస్తి, త్వమేవశరణం మమ, తస్మాత్ కారుణ్యభావేన రక్ష రక్షోజనార్దన" అని ప్రపత్తి (భారమంతా నీదే, అని భరన్యాసం) చేస్తే, సంసార మహాజ్వరం నశిస్తుందని, భగవద్రామానుజులు బోధించడమేకాదు, స్వయంగా శరణాగతి చేసి భగవత్ కృపకు పాత్రులయ్యారు. శ్రీ భాష్యకారుల సూక్తులను విన్నంత మాత్రాన శబ్దాది విషయాల వల్లనూ, కామాదులవల్లనూ, సంసారమహాజ్వరం వల్లనూ కలిగే బాధలన్నీ నశిస్తాయని భావం.

**హృద్యాని :** ఎవరికి హృద్యమైనవో పేర్కొనలేదు కదా! యతిరాజముని వాక్కులు ప్రమేయుడైన శ్రీమన్నారాయణునికీ, ప్రమాణాలుగా ఉన్న శ్రుతులకూ, ప్రమాతలమైన మనకూ, అందరికీ మధురమైనవై, మనోజ్ఞమైనవై ప్రకాశిస్తున్నాయి, అని కవితార్కిక కేసరి హృదయం. భగవద్రామానుజుల రచనలు - గ్రంథాలు భూత, భవిష్యద్వర్తమాన కాలాలలోనూ ఆదరింపబడుతూ భాసిస్తుంటాయి వసంతతిలకావృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తదుక్తిం వర్ణయతి ఆకర్షణానీతి. నిగమాంత సరస్వతీనాం - వేదాన్త వచసాం; ఆకర్షణాని - తుల్యార్థానీతి యావత్; బహిరంతరుపప్లవానాం - బహిరుపప్లవాః - కుదృష్టి దుర్జల్పాః, శబ్దాది విషయాశ్చ; అంతరుపప్లవాః - కామాదయః; తేషాం ఉచ్చాట నాని - దూరోత్సారకాణి;

తత్సూక్తి శ్రవణ మాత్రాత్ బహిరంతరుప ప్లవాశ్చనశ్యం తీతి భావః. ఘోర భవసంజ్వర పీడితా నాం – తీవ్రసంసార మహాజ్వర పీడితానాం; హృద్యాని – స్వాదూని; పథ్యాని – జ్వరనివర్తకాని; యతిరాజమునేర్వచాంసి – ఏవం భూతాని, భాంతి – విద్యోతంతే.

**వ్యాఖ్యానాంతరం :** ఆకర్షణాని – ఆకర్షణమంత్రరూపాణి; ఉచ్చాటనాని – ఉచ్చాటన మంత్ర రూపాణి; ఘోరేత్యాది – ఘోర భవే – భయంకర సంసారే, సంజ్వరేణ – సంతాపేన, పీడితానాం – దుఃఖితానాం; వచాంసి – శ్రీ భాష్యాది సూక్తయ ఇతి.

**27. శీత స్వభావ సుభగా నుభవ శ్శిఖావాన్**
**దోషా వ మర్ద నియతోన్నతి రోషధీశ ః ।**
**తాపానుబంధ శమన స్తపనః ప్రజానాం**
**రామానుజో జయతి సంవలిత త్రిధామా ॥**

**అర్థం :** శీత స్వభావ సుభగ+అనుభవః = చల్లని స్వభావం చేత సొగసైన ప్రభావంగల; శిఖావాన్ = అగ్నిగా ఉండేవాడును, శిఖగలవాడును. దోషా+అవమర్ద; నియతా+ఉన్నతిః = రాత్రిని పొగొట్టడమందు, నిశ్చయమైన వృద్ధిగల; ఓషధీశః = చంద్రుడుగా ఉండే వాడును/ దోష = దోషాలను, అవమర్ద = పోగొట్టడమందు; నియతా=శాశ్వతమైన; ఉన్నతి = వృద్ధి గల; రోషధీ= రోషమైన ప్రజ్ఞగల వారికి; ఈశః = నాయకుడైనవాడును; ప్రజానాం = ప్రజలకు; తాప+అనుబంధ, శమనః = తాపసంబంధాన్ని చల్లార్చే; తపనః = సూర్యుడుగా ఉండేవాడును / ఆధ్యాత్మికాది తాపసంబంధాన్ని శమింపజేసే; తపనః = తప్త ముద్రలను వేయువాడును; సంవలిత, త్రిధామా = మిళితమైన మూడు తేజస్సులుగల/ కలిసియున్న మూడుస్థానాలుగల సర్వేశ్వరుడున్నట్టి; రామానుజః = లక్షణాచార్యులు అనబడే యతిరాజులు; జయతి = సర్వోత్కృష్టుడై వెలసియున్నాడు.

**తాత్పర్యము :** శీతల స్వభావంచేత మనోజ్ఞమైన అనుభవంగల జ్వాలలున్న అగ్నియైనవాడు (శిఖకలవాడు). దోషాన్ని పోగొట్టడంలో నియతోన్నతి గల

చంద్రుడైనవాడు. (ప్రజ్ఞాగ్రణి). ప్రజలకు తాపానుబంధాన్ని నివారించే సూర్యుడైనవాడు. (తప్తముద్రా విధాయకుడు) ఈ మూడు తేజస్సులు కలిసియున్న మూడు నివాసస్థానాలు గల భగవానునితో కలిసియున్న రామానుజులు సర్వోత్కృష్టంగా వర్ధిల్లుతున్నాడు.

**వ్యాఖ్య :** శ్రీమద్రామానుజులు అగ్నిచంద్రసూర్యుల తేజస్సమాహార స్వరూప స్వభావాలను కలిగియున్నా, తద్గతదోషాలు లేనివారని వర్ణించే శ్లోకమిది.

యతిరాజు శీతల స్వభావంచేత మనోజ్ఞమైన అనుభవంకలిగిన ఒక విలక్షణమైన శిఖావంతుడు. "వాయునఖః శిఖావానాశుశుక్షణిః" (అమరం) శిఖలు – జ్వాలలు కలవాడు, అగ్ని యని అర్థం. అగ్ని ఉష్ణస్వభావుడు. శుచియైనవాడు. పదార్థాలను పవిత్రంచేసేవాడు యతిరాజు అగ్ని లాగా వర్చస్వి, స్వయంగా పవిత్రుడు, బాహ్యాభ్యంతర శుచిత్వం కలవాడు. ఇతరులను – అపవిత్రులను పవిత్రులనుగా సంస్కరించేవాడు.

శీత స్వభావ సుభగానుభవుడు అగ్ని అనడం విరోధం. అగ్గికదు వేడిగా ఉండడం వల్ల, ఎవ్వరినీ తన దగ్గరికి చేరనీయని దోషం కలిగి ఉంది. అగ్నికి గల దోషానికి భిన్నమైన గుణం కలవాడు యతిరాజు. యతిరాజు శీతస్వభావుడు, దయార్ద్రహృదయుడు, ఆబాలగోపాలం తనను ఆశ్రయించే మనోజ్ఞమైన మహిమకలవాడు, శుభాశ్రయుడు కదా! అయితే యతిరాజును 'శిఖావాన్' అనడం సముచితమా? సముచితమే 'శిఖా' అనేది శ్లిష్టపదం.

"శిఖా చూడాకేశపాశీ" (అమరం) 'శిఖావాన్' సిగ గలవాడు, అనే శ్లేషచేత విరోధం పరిహరింపబడింది. ఇది 'విరోధాభాస' మనే అలంకార లక్షణం.

శిఖలేని యతుల (సన్యాసుల)తో శిఖనుకలిగియున్న రామానుజ యతిరాజులను వ్యావర్తించడమయింది. శ్రీవైష్ణవ యతులకు తలమీద సిగను ఉంచుకొని తక్కిన భాగాన్ని క్షౌరం చేయించుకోవడం ధర్మమని హారీతాదిస్మృతులు బోధించడం గమనీయం. "పౌర్ణమాస్యాం శిఖావర్జం ముండయేత శిరోయతిః"

"యథా ప్రహ్లాదనాత్ చంద్రః" – అన్నట్లు చంద్రుని లాగా యతిరాజు దర్శనీయుడు, ఆహ్లాదకరుడు. చంద్రుడు 'దోషావమర్దుడు' అనడం విరోధం.

అతడు దోషాకరుడు; రాత్రిని కలుగజేస్తాడు. 'దోషా' అనేది అవ్యయం. రాత్రి అని అర్థం. "దోషాచనక్తంచ రజనౌ" (అమరం) శ్లేషచేత 'దోషాః' అంటే దోషాలు అనే అర్థం వ్యక్తమవడం వల్ల విరోధం అభాస అయింది. యతిరాజు అజ్ఞానాంధకారమనే దోషాన్ని నశింపజేసేవాడు. చంద్రుడు కళంకం కలవాడు. యతిరాజు నిష్కళంకుడు. చంద్రుని కళలకు వృద్ధి, క్షయాలు (పెరుగడం, తరుగడం) నియతంగా ఉన్నాయి. యతిరాజు మహిమ శాశ్వతమైనది; నిత్యం ఉన్నస్థితి నుంచి ఉన్నతిని పొందుతుంది. నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞకలవారిలో ప్రథమగణ్యుడు యతిరాజు. 'ఓషధీశః' అంటే, చంద్రుడు తన అమృతకిరణాలచేత తరులతాగుల్మాది మూలికలను – ఓషధలను పోషించేవాడు. శ్రీ భాష్యకారుల సూక్తిసుధ "సంసారాగ్ని విదీపనవ్యపగత ప్రాణాత్మ సంజీవనీ?" సంసారమనే అగ్ని వేడిమివల్ల పోయిన ప్రాణులను జీవింపజేయజాలేది కదా! "సోమవత్ ప్రియదర్శనః" అన్నట్లు చంద్రునిలాగా చల్లని గుణాలు కల్గిన యతిరాజు ప్రియదర్శనుడు.

'తపనః' అంటె సూర్యుడు; ప్రజలను తన ఉష్ణకిరణాలచే తపింపజేసేవాడు. సూర్యునికి తాపానుబంధ నివర్తకత్వం విరుద్ధం. తాపకారియేకాని తాపశమనుడు కాడు సూర్యుడు. యతిరాజు మాత్రం ఆశ్రితులను తప్త ముద్రాంకితులను చేసి, వారికి గల ఆధ్యాత్మిక, అధి భౌతిక, ఆధిదైవిక రూపమైన తాపత్రయాన్ని శాంతింపజేసి ప్రకాశించే ఒక విలక్షణమైన సూర్యుడు. ఆశ్రితుల భుజాలయందు తప్తశంఖచక్రాలను ముద్రించి, గురుతేజస్సుతో వెలిగేవాడు కాబట్టి యతిరాజు తపనుడు. "తపనః సవితా రవిః" (అమరం) తపనుడు దుర్నిరీక్ష్యుడు. "తళర్విలరాగిల్ శార్వదుశదిరే" అన్నట్లు, తడయకుండా ఆశ్రయించడమే స్వరూపానురూపమని ప్రజలచే భావింపబడే తేజస్వి యతిరాజు.

సంవలిత త్రిధాముడు యతిరాజు. అగ్నిలాగా శుచిత్వమూ, చంద్రుని రీతిగా ఆహ్లాదత్వమూ, సూర్యునివలె తేజస్విత్వమూ కలవాడు. ముగ్గురి – అగ్ని సోమ సూర్యులకాంతులు లేదా ప్రభావాలు కలిసి భాసించేవాడు యతిరాజు.

'గృహదేహ త్విట్ ప్రభావాధామాని" (అమరం)

"ధామస్థానే చ జన్మని" (శేషనిఘంటువు). 'ధామన్' శబ్దానికి గల అనేకార్థాలలో ఇక్కడ కమనీయమైన 'కాంతి, స్థానం' అనే రెండు అర్థాలు వర్తిస్తాయి.

'త్రిధాముడు' అంటే సర్వేశ్వరుడు 'వైకుంఠం, పాలకడలి, సూర్య మండలం' అనే మూడు స్థానాల యందు నివసించేవాడు నారాయణుడని ప్రసిద్ధం. రామానుజ యతిరాజు 'సంవలిత త్రిధాముడు' - త్రిధామునితో కలసి మెలసి ఉండేవాడని మరొక అర్థం.

**యేఽ నన్య మనసఃశుద్ధాః, యేదాస్యైక పరాయణాః ।**
**తేషాం మే హృదయం స్థానం, వైకుంఠాత్ పరమం పదమ్ ॥**

"వాశమలరాళ్ మణవాళన్, తేశుపొలి విణ్ణాట్టిల్ శాల విరుమ్బుమే, వేరొన్లై యెణ్ణాదార్ నెంజత్తిరుప్పు" (జ్ఞానసారం)

ఇతర విషయాలను స్మరించని మనస్సు కలిగి, కైంకర్య నిరతులైన ప్రపన్నుల హృదయమందు నివసించడానికి శ్రియఃపతి పరమపదమందుండడం కంటె విశేషంగా ఇష్టపడుతాడట.

"యే భజంతి తు మాంభక్త్యామయితే తేషు చా ప్యహమ్" (9-29) ఎవరైతే నన్ను భక్తితో ఆరాధిస్తారో వారి యందు నేను, నాయందు వారూ ఉంటారని గీతాచార్యుడు బోధించాడు కదా! సదా పరగుణావిష్టుడైన భగవద్రామానుజుల హృదయ సంబద్ధుడు సర్వేశ్వరుడు.

ఈ స్తోత్రంలో వేదాన్త దేశికులు రామానుజుల సర్వాతిశాయిత్వాన్ని వర్ణించే 'జయతి' పదాన్ని ప్రయోగించిన నాలుగు శ్లోకాలలో ఇది మొదటి శ్లోకం. ఇది విరోధాభాస, శ్లేషాలంకారాలచే సుశ్లోకితం. వసంత తిలకావృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ యతీంద్రస్య శుచిత్వా హ్లాదకత్వతేజస్విత్వై రగ్నిచంద్ర సూర్య సమాహారత్వం, తద్గతదోషైరస్పృష్టత్వంచ, తత్ర విరోధాలంకారంచ సూచయన్, తత్స్వభావవర్ణనేన సర్వాతిశాయిత్వం ప్రతిపాదయన్ తమేవస్తౌతి - శీతేతి.

శీత స్వభావ సుభగానుభవః - శీతేన - దయార్ద్రేణ, స్వభావేన సుభగానుభవః - సర్వేషాంమనోజ్ఞాను భవః; శిఖావాన్ - చూడావాన్; అనేన "పౌర్ణమాస్యాం శిఖావర్జంముండయేత శిరోయతిః । కక్షో పస్థ శిఖా వర్జ మృతుసంధిషు వాపయే" దితి లిఖిత హారీత, మేధాతిథి వచనాని సూచ్యంతే. శిఖావాన్- అగ్నిః, తస్య శీతస్వభావో విరుద్ధ ఇతి సూచ్యతే.

దోషావ మర్ద నియతోన్నతి రోషధీశః - దోషావమర్ధే - దోషనిబర్హణే, నియతోన్నతిః - వ్యాప్తోదయః, రోషః యస్యసః దోషావ మర్దనియతోన్నతి రోషః, సచాసౌ ధీశశ్చేతి విగ్రహః. ధియః ఈశో ధీశః. ప్రజ్ఞాగ్రణీరిత్యర్థః. ఓషధీశ శ్చంద్రః. తస్య దోషా - రాత్రిః; తదవమర్దే - హననే, నియతోన్నతిః విరుద్ధేతి సూచ్యతే. ప్రజానాం తాపానుబంధ శమనః- సాంసారిక తాపసంబంధ నివర్తకస్సన్, తపనః - తప్త ముద్రా విధాయక ఇత్యర్థః.

తపనః సూర్యః, తస్య తాపానుబంధ నివర్తకత్వం విరుద్ధమితి సూచ్యతే.

సంవలిత త్రిధామా - సంవలితః - సంబద్ధః, త్రిధామా- సర్వేశ్వరః యస్మిన్సః. "యేఽనన్య మనస శ్శుద్ధాః,యే దాస్యైక పరాయణాః। తేషాం మే హృదయం స్థానం వైకుంఠాత్ పరమంపదమ్॥ "మయితే తేషు చాప్యహ" మిత్యాది న్యాయేన తత్స్వభావాత్. "సదా పరగుణావిష్ట" ఇత్యే తత్ స్వభావాచ్చ సర్వదా అస్య హృదయ సంబద్ధ స్సర్వేశ్వర ఇత్యర్థః. "త్రిధామే" తి అగ్ని చంద్రసూర్య సమాహారత్వంచ సూచ్యతే. ఏవంవిధః, రామానుజః జయతి - స ర్వోత్కర్షేణ వర్తతే.

**వాఖ్యానాంతరం:** శీతస్వభావ సుభగానుభవః - శీతస్వభావేన సుభగః - మనోజ్ఞ, అనుభవః - ప్రభావోయస్యసః. శిభావాన్ - అగ్నిః. శిఖావతోఽ గ్నేః ఉష్ణః స్వభావ ఇతి భావః. 'శిఖాయుక్తః.

దోషేత్యాది - దోషాణా మఘానాం, అవమర్దే నియతా-నిత్యా, ఉన్నతిః యస్యా స్సా, రోషధీః యేషాంతేషాం, ఈశః- స్వామీ. ఓషధీశః-చంద్రః; దోషాకర ఇతిభావః. ప్రజానాం తాపానుబంధశమనః - తాపానుబంధస్య - ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికాధి రూపస్య, శమనః - శాంతికారీ. తప్తముద్రాభి

స్తపనః. సూర్యస్తు తాపానుబంధకారీ తిభావః. సంవలితత్రిధామా – సంవలితం – మిశ్రితం త్రయాణాం అగ్నిసోమ సూర్యాణాం, ధామ – తేజో యస్యసః – తథోక్త ఇతి.

**28.** **జయతి సకల విద్యా వాహినీ జన్మశైలో**
**జనిపథ పరివృత్తి శ్రాంత విశ్రాంతి శాఖీ।**
**నిఖిల కుమతి మాయా శర్వరీ బాలసూర్యో**
**నిగమ జలధి వేలా పూర్ణచంద్రో యతీంద్రః ॥**

**అర్థం :** సకల విద్యా వాహినీ జన్మశైలః = సమస్త విద్యలు అనే నదులకు ఉత్పత్తి సాధనమైన పర్వతంలాంటి వాడునూ; జనిపథ పరివృత్తి శ్రాంత విశ్రాంతిశాఖీ = సంసార మార్గమందు సంచరించడంచేత బడలిక చెందిన వారికి శ్రమనుపోగొట్టే వృక్షంలాంటి వాడునూ; నిఖిల కుమతి మాయా శర్వరీ బాలసూర్యః = సమస్తకుదృష్టుల మాయ అనే రాత్రికి బాలభానునివంటి వాడునూ; నిగమ జలధి వేలా పూర్ణచంద్రః = వేదం అనే సముద్రం ఉప్పొంగడానికి పూర్ణచంద్రుని పోలినవాడునూ అయిన; యతి+ఇంద్రః = యతి రాజైన శ్రీమద్రామానుజులు; జయతి = సర్వోత్కృష్టుడై ఉన్నాడు.

**తాత్పర్యము :** సకల విద్యారూప నదులకు ఉద్గమస్థానమైన శైలసదృశుడూ, జనన మరణ రూప సంసార పథమందు గమనాగమనాలచే అలసిపోయిన వారికి విశ్రాంతి స్థానమైన ఛాయా వృక్షం వంటి వాడూ, కుమతుల మాయ అనే రాత్రిని తరిమివేయడానికి బాలసూర్య సమానుడూ, శ్రుతిసాగరం ఉప్పొంగడానికి పూర్ణచంద్రుని పోలిన వాడైన యతీంద్రుడు సర్వాతిశాయియై వెలుగుతున్నాడు.

**వ్యాఖ్య :** భగవద్రామానుజుల మహిమ (యందలి ముఖ్యాంశాల)ను వర్ణించే శ్లోకమిది.

'జయతి' పదశోభితమైన శ్లోక చతుష్టయమందు ఇది రెండవది. రామానుజయతీంద్రుడు సర్వవిద్యలూ, కళలూ తెలిసినవాడని సూచిస్తున్నది శ్లోకంలోని మొదటి చరణం.

విద్యలు నదులుగానూ, యతీంద్రుడు పర్వతంగానూ రూపించబడడం రూపకాలంకార లక్షణం. యతిరాజు అప్రధృష్యుడని సూచితం. నదులకు ఉత్పత్తిస్థానం పర్వతం. గంగకు హిమవన్నగం, కావేరికి సహ్యా పర్వతం జన్మస్థానం. శబ్ద తర్కమీమాంసాది చతుర్దశ విద్యాస్థానాలు మేఘం నుంచి జలంలాగా యతీంద్రుడనే శైల మందు పడి, దొర్లి, దుష్టాంశాలన్నీ తొలగింప బడినట్లు, వేదాంతశాస్త్రార్థాలన్నీ శోధింపబడి, ప్రజలకు ఉపయోగకరంగా సకల విద్యలు అక్కడినుంచి ఏరులైపారినాయి. స్వాదుజలంతో ప్రవహించే నదులన్నీ సముద్రంలో సంగమించే రీతిగా, సకల విద్యలన్నీ రామానుజదయా పాత్రుడైన వేంకటేశ్వరుడనే నామాంతరం గల వేదాంత దేశికులయందు సంక్రమించాయి. "విద్యోదన్వతి వేంకటేశ్వరకవౌ" - (దశావతారస్తోత్రం) దేశికులు విద్యోదన్వంతుడు. భగవద్రామానుజ సిద్ధాంత నిర్ధారణ సార్వభౌముడు కదా!

'జనిపథం' అంటే జనన మరణరూపమైన సంసారమార్గం. 'పరివృత్తి' అంటే పుట్టి, గిట్టి, మళ్ళీ పుట్టడం. ఈ సంసార మార్గమందు నడచినడచి శ్రమపడుతున్న మానవులకు విశ్రాంతిని కలిగించే వృక్షమే యతీంద్రుడని, రెండవ చరణంలో ప్రతిపాదించారు దేశికులు. "వృక్షో మహీరుహః శాఖీ". (అమరం) 'శాఖీ'- కొమ్మలు కలది - చెట్టు అని అర్థం.

ఎండలో సంచరిస్తూ అలసిపోయిన బాటసారులకు వృక్షం, చల్లని నీడను, అమృతంలాంటి మధుర ఫలాలను ఇచ్చి వారిశ్రమను నివారించి, ఆనందాన్ని ప్రసాదిస్తుందికదా! అలాగే సంసారమార్గ పరిశ్రాంతులకు విశ్రమించే స్థలం- విశ్రాంతిశాఖి, యతిరాజు. దివ్యసూరుల - ఆళ్వార్ల - తర్వాత ప్రపత్తిని అనుష్ఠించినవారు భగవద్రామానుజులు. వారిని ఆశ్రయించిన వారికే కాక, వారి సంబంధసంబంధులు కూడా మహా విశ్వాసంతో అనుసంధానంచేస్తే, సాంసారికశ్రమను నివారించి, శాశ్వత విశ్రాంతిని - భగవదనుభవాన్ని కల్పించే 'శరణాగతి గద్య' ను చేతనులకుప్రసాదించిన జగద్గురువు. శాఖీ-బహుశాఖలు కలది వేదం. వేదమార్గ ప్రతిష్ఠాపకుడు యతీంద్రుడు. జనన మరణ రూప సంసారపు దారిలో పరుగులుదీసే చేతనులను తమ శ్రీసూక్తుల ద్వారా

ప్రపన్నులను చేసి "మూకాంధానపిమోక్షయితారః" అన్నట్లు, ముక్తిని కల్పించే మహనీయుడు యతీంద్రుడు. కాబట్టి "శ్రాంత విశ్రాంతిశాఖి".

మూడవ చరణంలో యతిరాజును బాలసూర్యునిగా తాద్రూప్యరంజకం చేశారు దేశికులు. బాలభానుడు చూడముచ్చటగానుంటాడు. విశేషకాంతిని కలవాడు. బాలసూర్యుని ముందు చీకటి – రాత్రి నిల్వజాలక పారిపోతుంది. కుమతులంటే మాయావాదులు. వంచించే యుక్తియే మాయ. 'శర్వరి' అంటే దినవ్యాపారాన్ని చెరచే రాత్రి. వస్తువు యొక్క రూపాన్ని ఉన్నది ఉన్నట్లు తెలియనీయజాలనిది శర్వరి. కుదృష్టుల అపార్థప్రతిపాదన రూపమైన మాయ అనే రాత్రికి బాలసూర్యునితో సమానుడు యతీంద్రుడు. వేదవేదాంత శాస్త్ర వాక్యాలకు సరియైన అర్థాలను బోధించి, భగవద్రూపగుణ విభూతులను ప్రతిపాదించి లోకులను చైతన్యవంతులను చేస్తూ క్రమంగా వృద్ధి పొందే తేజస్వి యతీంద్రుడు.

నాల్గవ చరణంలో వేదరాశికీ సముద్రానికీ, యతీంద్రునికి పూర్ణచంద్రునికీ అభేద రూపం అధ్యవసితం. నిండుకళలతో పున్నమినాటి రాత్రి ప్రకాశించే వాడు పూర్ణచంద్రుడు. పూర్ణచంద్రుడు ఉదయిస్తుంటే, పున్నమిరాత్రియందు, సముద్రం ఉప్పొంగడం ప్రసిద్ధం. పర్వతాలవలె మహోన్నతంగా ఎగిరిపడుతున్న కెరటాలుగల జలధిని చూచి, కవులు కూడా 'సముద్రుడు తన యందు జన్మించి, గగనాన ప్రకాశిస్తూ లోకులను ఆహ్లాదపరచే పూర్ణచంద్రుణ్ని – తన పుత్రుణ్ని – చూడగానే మహోత్సాహాన్ని పొందుతుంటాడు, అని వర్ణిస్తుంటారు. 'వంశాబ్ధిచంద్రః' అనే వాక్యం ఇట్టిదే కదా! వేదం గంభీరమైనది, దురవగాహమైనదని 'జలధి' పదంచేత స్ఫురిస్తుంది.

"అబ్ధ్యంబువికృతౌ వేలా కాలమర్యాదయో రపి" (అమరం) "వేలాకాలే జలనిధే స్తీర నీర వికారయోః। అక్లిష్టమరణే రాగే సీమ్ని వారి బుధస్త్రియామ్". (ప్రతాపనిఘంటువు) ఇక్కడ 'వేలా' శబ్దానికి సముద్రజలోత్సర్పణం అని అర్థం. ప్రకృతి సిద్ధమైన 'సముద్రపు పోటు'ను పుత్రుడు కీర్తిమంతుడైనప్పుడు తండ్రికి కలిగే ఉత్సాహంగా భావించడం 'కవి సమయం'.

సర్వశాస్త్ర కళాపూర్ణుడైన రామానుజయతిరాజు యథావస్థితార్థాలను ప్రబోధించి మాన్య, సామాన్యజనులందరి హృదయాలను ఆహ్లాదపరచినందువల్ల, యతీంద్రుణ్ని చూచి వేద పురుషుడు (నిగమం), పూర్ణచంద్రుణ్ని చూచి సముద్రుడు ఉప్పొంగినట్లు, సంతోషాతిశయాన్ని పొందాడు అన్నారు దేశికులు.

ఈ శ్లోకరచనలో 'జయతి' అనే క్రియాపదం అగ్రస్థానం వహించింది. 'యతీంద్రః' అనే కర్తృపదం చిట్టచివర ఉంది. క్రియా సాపేక్షకమైనది జగత్తు. కర్తృపదం నమ్రతను క్రియాపదం ఉన్నతిని సూచిస్తున్నది. కర్త నమ్రతతో శైలిశాఖి సూర్యచంద్రేంద్రులవలె జగద్ధితార్థ ధర్మాలను క్రమంగా ఆచరిస్తే, ఉత్తరోత్తరం ఔన్నత్యాన్ని పొందుతాడని ధ్వనిస్తున్నది.

తాను చలించక తననుడీకొనే వ్యక్తులను చలింపజేసే దిట్టయైన గుట్టకు ఔన్నత్యం ఉంది. ఇతరులకు ఉపకరించే చెట్టు గుట్టమీదనూ ఉండడంచేత అది అంతకంటె ఎత్తైనది. చైతన్యం కలిగిస్తూ లోకాలకు బంధువైన సూర్యుని మండలం చాలా ఉన్నతమైనది. స్థిరచర వస్తువులకూ తన అమృత కిరణాలతో ఆహ్లాదాన్ని కలిగించే చంద్రుని మండలం అంతకంటె ఎత్తైన అంతరిక్షంకదా!

"వయస్సుపర్ణా ఉపసేదురింద్రం ప్రియమేధా ఋషయోనాథమానాః । అవధ్వాన్త మూర్ణుహి పూర్ధిచక్షు ర్ముముగ్ధ్య స్మాన్నిధయేஉవబద్ధాన్"- (ఉపనిషత్) అన్నట్లు- సప్తర్షులు కర్మజ్ఞానాలనే రెక్కలుగలిగిన పక్షులుగా వెళ్ళి యాచింపగా వారికి సర్వశ్రుతి మనోజ్ఞ ధర్మాలను ఉపదేశించి, సకలభోగాలనొసగిన ఇంద్రుని స్థానమైన స్వర్గం అన్నిటికంటెను మించి ఉన్నది కదా! సర్వోన్నత్యాన్ని వహించిన యతీంద్రుల యందు దేశికులకు గల ఆదరాతిశయాన్నీ ప్రకటిస్తున్న శ్లోక మిది.

రూపకాలంకార సజ్జితమైన మాలినీవృత్త రచితం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ యతీంద్రం ప్రతిపాదం రూపకభేదేన స్తౌతి జయతీతి. సకల విద్యావాహినీ జన్మశైలః - విద్యా వాహినీనాం - విద్యానదీనాం, జన్మశైలః-జన్మభూమిః; విద్యానాంనదీత్వ రూపణేన, మహానదీనాం శైలోద్భవత్వ ప్రసిద్ధ్యా శైలత్వోక్తిః. తథా పరాప్రధృష్యతాచ స్ఫురతి.

జనిపథ పరివృత్తిశ్రాంత విశ్రాంతిశాఖీ - జనిపథే - సంసారమార్గే, పరివృత్తయః - జన్మాద్యర్థ గతాగతాని, తైః, శ్రాంతానాం- శ్రమయుక్తానాం, విశ్రాంతి శాఖీ - విశ్రమార్థం ఛాయా వృక్షః. పరిశ్రాంతానాం ఛాయా వృక్షః శ్రమహరో భవతీతి తథోక్తిః.

నిఖిల కుమతి మాయా శర్వరీ బాలసూర్యః - నిఖిలానాం కుమతీనాం శంకరభాస్కరా దీనాం మాయాః వంచన యుక్తయః, తా ఏవ శర్వరీ - రాత్రిః తస్యాః బాలసూర్యః - తద్బాధకే వర్థిష్ణుః సూర్య ఇత్యర్థః.

నిగమ జలధి వేలా పూర్ణచంద్రః - నిగమా ఏవ జలధిః. జలధి పదేన నిగమానా మపరిచ్ఛేద్యత్వం సూచ్యతే. తద్వేలాయాః- తద్వికృతేః - తదుల్లాసస్యేత్యర్థః. "అబ్ద్యంబు వికృతి ర్వేలే " త్యమరః. తస్యాః పూర్ణచంద్రః తదుల్లాసహేతు రిత్యర్థః. సః, యతీంద్రః - రామానుజః, జయతి - సర్వోత్కర్షేణ వర్తతే.

**వ్యాఖ్యానాంతరం :** జయతీతి : లోకహితార్థ శైలశాఖి సూర్యచంద్రేంద్ర ధర్మాణాం గురౌసముచ్చయః. వాహినీ - నదీ. సర్వాణ్యపి విద్యాస్థానాని మేఘాదాపఇవ యతీంద్రశైలే పతిత్వా, దుష్టేష్వంశేషు నివృత్తేషు వేదవేదాంతార్థోపస్కరణౌ పయికశుద్ధి మత్తయా తతో నదీ రూపేణ ప్రావహన్. ఏవం సర్వవిద్యా శోధకత్వం దర్శితమ్.

**అన్యతమా వ్యాఖ్యా :** జయతీతి: జనిపథః - సంసారమార్గః, తత్రపరివృత్తిభిః - యాతా యాతైః, శ్రాంతానాం విశ్రమతరుః; మాయా - అపార్థప్రతిపాదన రూపా. వేలా - జలోత్సర్పణమ్.

29. ముని బహుమతసారా ముక్తి నిశ్రేణికే యం
సహృదయ హృదయానాంశాశ్వతీ దిష్టసిద్ధిః ।
శమిత విమత ఖేదా సంయమీంద్రస్య సూక్తిః
పరిచిత గహనా నః ప్రస్నువీత ప్రసాదమ్ ॥

**అర్థం :** ముని బహుమతసారా = బోధాయనాది మునులచేత నిష్కర్షింపబడిన అర్థాలు కలిగినట్టి; ముక్తి నిఃశ్రేణికా = మోక్షస్థానానికి నిచ్చెన వంటి; సహృదయ హృదయానాం = సహృదయుల హృదయాలకు; శాశ్వతీ = తరుగని, నశింపని; దిష్టసిద్ధిః = భాగ్యవృద్ధి వంటి; శమిత విమత ఖేదా = పోగొట్టబడిన ప్రతివాదుల వల్లకలిగే దుఃఖం కలిగినట్టి; పరిచిత గహనా = పరిచయంచేయబడిననూ గభీరార్థాలు కలిగిన; ఇయం=ఈ; సంయమి+ఇంద్రస్య = యతీంద్రుని యొక్క; సూక్తిః= వాగ్విలాసం (రచనలు). నః=మనకు; ప్రసాదం= అనుగ్రహాన్ని; ప్రస్నువీత = కృప చేయవలెను.

**తాత్పర్యము :** శ్రీ భాష్యకారుల దివ్యసూక్తులు బోధాయనులు మొదలైన మునులచేత నిష్కృష్టార్థాలు కలిగినట్టివి. మోక్షానికి సోపానం వంటివి. నిర్మత్సర హృదయులకు తరుగని భాగ్యాన్ని వృద్ధి పరచేటివి. ప్రతివాదుల వల్ల కలిగే ఖేదాన్ని తొలగించేటివి. తెలిసినట్లున్ననూ, ఇంకా తెలుసుకోదగిన మహార్థం కలిగినవి. కాబట్టి యతీంద్రుల శ్రీ సూక్తులు - గ్రంథాలు మనపైన కృపను వర్షించుగాత.

**వ్యాఖ్య :** యతీంద్ర సూక్తి వైభవం జిజ్ఞాసువుల పైన కృపను వర్షించాలని సంప్రార్థితం.

యతీంద్రసూక్తి అనే పదం ఏక వచనాంతమైనా, అది గద్యపద్యాత్మకాలైన శ్రీ భాష్యాది కృతులను సూచించే పారిభాషిక పదం.

**1. ముని బహుమతసారా :** భగవద్రామానుజుల కృతులలో శ్రీ భాష్య మనబడే బ్రహ్మసూత్ర వ్యాఖ్యానగ్రంథం గొప్పది. శ్రీ వేదవ్యాసమహర్షి చతుర్వేదసారాన్ని ఐదువందల నలుబైయైదు (545) బ్రహ్మసూత్రాలుగా రచించాడు. ఆ సూత్రాలను భగవద్రామానుజులు నాలుగు అధ్యాయాలుగానూ,

ఒక్కొక్క అధ్యాయాన్ని నాలుగు పాదాలుగానూ, మొత్తం నూటయాబైయారు (156) అధికరణాలుగా విభజించి, గంభీరంగా వ్యాఖ్యానించారు.

బ్రహ్మసూత్రాలకు మొదట బోధాయన మహర్షి 'వృత్తి' అనే విస్తృతమైన వ్యాఖ్యానాన్ని రచించాడు. శ్రీ ద్రమిడాచార్యులు సులభగ్రాహ్యంగా ద్రమిడభాష్యాన్ని, శ్రీ టంకాచార్యులు ఈసూత్రాలకు కారికలను వ్రాశారు. వీటిలో బోధాయన వృత్తి ముఖ్యమైనది.

"భగవద్భోధాయన కృతాం విస్తీర్ణాం బ్రహ్మ సూత్రవృత్తిం పూర్వా చార్యాః సంచిక్షిపుః. తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యా స్యంతే" - భగవద్భోధాయన మహర్షి రచించిన విస్తీర్ణమైన బ్రహ్మసూత్రవృత్తిని టంకద్రమిడ గుహదేవాది పూర్వాచార్యులు సంగ్రహించి చిన్న చిన్న గ్రంథాలుగా రచించారు. బోధాయన మహర్షి మొదలైన వారి మతాన్ని అనుసరించి బ్రహ్మసూత్రాలకు ప్రకృతి ప్రత్యయాల అర్థాలకు అనుగుణంగా వ్యాఖ్యానం చేయబడుతున్నది - అని శ్రీ భాష్యారంభంలో ప్రతిజ్ఞ చేశారు శ్రీమద్రామానుజులు.

భగవద్రామానుజుల బ్రహ్మసూత్రభాష్యానికి కాశ్మీరులో సరస్వతీ భాండారంలో సరస్వతీదేవి స్వయంగా 'శ్రీభాష్య' మని పేరు పెట్టిందని పెద్దలంటారు.

"భాష్యే ద్వే 'శ్రీమహత్' శబ్ద భూషితే శేషభాషితే" - ఆదిశేషుడే పతంజలి రూపంగా అవతరించి, మొదట (పాణిని రచించిన 'అష్టాధ్యాయి' అనే గ్రంథానికి వివరణయైన వ్యాకరణశాస్త్ర గ్రంథం) మహాభాష్యాన్ని రచించాడని, తర్వాత శ్రీమద్రామానుజులుగా అవతరించి బ్రహ్మ సూత్రాలపై శ్రీ భాష్యాన్ని రచించాడని, ఆ రెండు భాష్యాలు - ఒకటి శ్రీ శబ్దం చేత, మరొకటి మహచ్ఛబ్దం చేత - భూషింప బడుతున్నవని, ఈ సూక్తి భావం.

శ్రీభాష్యాన్నే కాక, భగవద్రామానుజులు బ్రహ్మ సూత్రాలకు 'వేదార్థ సంగ్రహం' 'వేదాన్త దీపం' అనే మరో రెండు లఘు వ్యాఖ్యాన గ్రంథాలను కూడా రచించారు.

'వేదార్థ సంగ్రహం'లోనూ "బోధాయన టంకద్రమిడ గుహదేవ కపర్ది బారుచి ప్రభృత్యవిగీత శిష్ట పరిగృహీత పురాతన వేద వేదాన్త వ్యాఖ్యాన సువ్యక్తార్థ శ్రుతి నికరదర్శితోఽయం పంథాః" అని విశదపరచారు.

"భాష్యోదితోఽధికరణార్థ సంగ్రహః"- అనే వేదాంత దీపోక్తిచేత, శ్రీభాష్య రచన తర్వాత 'వేదాన్త దీపం' రచింపబడినదని తెలుస్తున్నది.

·పరాశర, పారాశర్య, వైశంపాయన శౌనకాది మునులు ఒక వైపు, బోధాయన టంక ద్రమిద గుహదేవ నాథ యామున మునులు మరొకవైపు - రామానుజులకంటె పూర్వులైన ఈ గురువర్యలందరు తాము నిర్ణయించిన అర్థాలే శ్రీ మద్రామానుజుల సూక్తుల యందు ఉన్నాయని ఆనందిస్తున్నారు. "వైశంపాయనశౌనక ప్రభృతయః శ్రేష్ఠా ః శిరః కంపినః"- అని 'రహస్య త్రయసారం' లోని చరమశ్లోకాధికార సూక్తిచే స్పష్టమవుతున్నది.

**2. ముక్తినిఃశ్రేణికా ః** రామానుజుల సూక్తి వైకుంఠమనే ఉన్నత స్థలాన్ని అధిరోహించడానికి నిచ్చెన వంటిది. మానవుడు తన వర్ణాశ్రమధర్మానుగుణంగా అనుష్ఠిస్తూ, తద్వారా అర్థపంచక జ్ఞానాన్ని సంపాదించి, ఆపైన శ్రోత్రియుడూ, బ్రహ్మజ్ఞానియైన ఆచార్యుని ఆశ్రయించి, సాధన సప్తకానుష్ఠాన పూర్వకంగా పరబ్రహ్మధ్యానపరుడై ఉపాసించగా బ్రహ్మసాక్షాత్కారం లభించి, పరస్పర ప్రీతి మూలంగా చేతనుని పూర్వజన్మల కర్మనశించడం చేత ఇక జన్మలు లేనివాడై దేహావసానంలో "స్వేన రూపేణాభినిష్పద్యతే" అన్నట్లు స్వస్వరూపావిర్భావాన్ని పొంది మోక్షం సిద్ధించిన వాడవుతాడు- అని బోధించే శ్రీ సూక్తులు "ముక్తి సౌధవిశిఖా సోపానపంక్తులు" మోక్ష రూపమైన మేడమీదికెక్కడానికి మెట్లవంటివి. " నిశ్రేణిస్త్వధిరోహిణీ" (అమరం).

**3. సహృదయ హృదాయానాం శాశ్వతీ దిష్ట సిద్ధి ః** - ధనమదం, విద్యామదం, అభిజాత్యమదం లేని నిర్మత్సరుడు సహృదయుడు. భగవద్రామానుజ సూక్తులు చిదచిదీశ్వరతత్వాన్ని బోధిస్తాయి. సహృదయులు వాటిని అధ్యయనం చేసినప్పుడు విశిష్టాద్వైత సిద్ధాంతం వారి ప్రసన్న హృదయాన ముద్రపడుతుంది. తత్ఫలితంగా సహృదయ హృదయాలకు శుభోదర్కాన్ని కలిగించేవి సంయమీంద్ర

సూక్తులు. 'దిష్టం' అంటె భాగధేయం. "దైవం దిష్టం భాగధేయం భాగ్యం స్త్రీని యతిర్విధిః" (అమరం).

ఉపనిషద్దుగ్ధాబ్ధి మధ్యోద్ధృతమైన బ్రహ్మసూత్రామృతాన్ని పొందిన రామానుజులవారు దాన్ని సహృదయులందరు సులభంగా సేవింపదగినట్లు అందించారు. సహృదయులకు కలిగిన ఈ భాగ్యసిద్ధి శాశ్వతమైనది.

**4. శమిత విమత ఖేదా :** స్వేతర మతసిద్ధాంతాల వల్లకలిగే ఖేదాన్ని - మానసిక వ్యథను - తొలగించేవి యతీంద్రసూక్తులు. జీవుడే దేవుడు, ఆత్మయే పరమాత్మ, జీవబ్రహ్మైక్యం లాంటి ఇతర సిద్ధాంతం ప్రపన్నుల మనస్సుకు బాధను కలిగించేది కదా! అట్టి పరమత వాదాలను ఖండించి, విశిష్టాద్వైతం సిద్ధాంతీకరింపబడింది. "సోఽశ్నుతే సర్వాన్ కామాంథ్సహ బ్రహ్మణా విపశ్చితా" - జీవుడు దేవుని కల్యాణ గుణాలను అనుభవిస్తూ బ్రహ్మానందాన్ని పొందుతాడు. ఇత్యాది ఉపనిషత్సూక్తుల చేత ఖేదం శమింపబడింది. యతీంద్రసూక్తులను ఒంటబట్టించుకొన్న వ్యక్తులకు పరదూషణలను శ్రుతి హితమైన మాటలచే నిరాకరించే సామర్థ్యం కలుగుతుంది.

"శమిత దురితగంధా" అనే పాఠాంతరమూ ఉంది. సంయమీంద్రసూక్తికి పాపాన్ని ఇంచుక జాడలేకుండా నశింపజేసే శక్తిఉంది. లోతునుగానీ ఆవలితీరాన్ని గానీ మనం తెలుసుకోలేకపోయినా, సముద్రంలో పర్వదివసమందు స్నానంచేస్తే పుణ్యం లభిస్తుంది. అలాగే గంభీరవాగ్వైఖరిని విన్నా, మనపాపాలను సవాసనగా పోగొట్టే పావనత్వం యతీంద్రసూక్తులకు ఉంది. "పుణ్యం వేదైశ్చ సమ్మితం" (రామాయణం) అన్నట్లు విన్నంతనే పుణ్యమబ్బినప్పుడు, జిజ్ఞాసతో శ్రీ సూక్తులను అధ్యయనం చేస్తే, అది మరెంతో పుణ్యప్రదం కదా! పంచపాతకాలను, ఉపపాతకాలనూ ధ్వంసం చేసి పరిశుద్ధులను చేసే సత్తాకలది సంయమీంద్రసూక్తి.

**5. పరిచితగహనా :** శ్రీమద్రామానుజుల సూక్తి గభీరార్థంగల శబ్ద రచనా సౌందర్య దీప్తికలది. "క్వచిదభంగుర గూఢగతిః" - (దయా శతకం. 52) అన్నట్లు సంయమీంద్రుని సరస్వతి అంతర్వాహిని. మహాసముద్రంలో అడుగుదాకా మునిగే వానికే అనర్ఘరత్నాలు దొరుకుతాయి. తర్కవ్యాకరణమీమాంసాది శాస్త్రజ్ఞులకు

శ్రీ భాష్యాన్ని అనేక పర్యాయాలు అధ్యయనం చేస్తేగాని అందలినిగూఢార్థ రత్నాలు లభించవు కదా! యతిరాజ కృతులను అధ్యయనం చేసే అధికారులకు కూడా సంపూర్ణార్థావగాహనం సంశయగ్రస్తమే. శ్రీ భాష్యానికీ ఎందరో, ఎన్నో వ్యాఖ్యానాలను రచించారు. అయినా వారందరు అందలి నిగూఢార్థాలను పూర్తిగా అవగాహించలేకపోతిమనీ, ఇంకా గురువులవల్ల "బహుధాశ్రోతవ్యః" చాలాసార్లు వినవలసియున్నదన్నారు. శ్రీ భాష్యానికి 'శ్రుతప్రకాశికా' అనే ప్రసిద్ధి వ్యాఖ్యానాన్ని వ్రాసిన శ్రీ సుదర్శనభట్టర్ స్వామివారే **"కః కృత్స్నం వేత్తి భాష్యార్థమ్? శ్రుతాంశస్థితయే కృతిః"**

శ్రీ భాష్యార్థాన్ని పూర్తిగా గ్రహించడానికి ఎవరికి శక్యమవు తుంది? గురు ముఖతః విన్నసారాంశాన్ని మరచిపోకుండా నిల్పుకోవడానికే ఈ లఘుటీకను వ్రాసుకొంటున్నాను గాని, ఇది సమగ్ర వ్యాఖ్యానంకాదని తెల్పినారు. చదివినప్పుడల్లా నవ్యార్థ ద్యోతక సూక్తులు అవ్వి. వేదాన్త దేశికులు శ్రీభాష్యానికి "తత్త్వటీకా" అనే వ్యాఖ్యానాన్ని రచించే సందర్భంలో "ప్రవచన విధానష్టా వింశే జయధ్వజ పట్టికా" - ఇరువై యెనిమిదవసారి శ్రీభాష్యాన్ని ప్రవచనం చేస్తున్నట్లు తెల్పినారు. "సంకల్పసూర్యోదయ" మనే నాటకాన్ని రచిస్తున్నప్పుడు "త్రింశద్వారం శ్రావిత శారీరక భాష్యః" - ముప్పైసార్లు శ్రీ భాష్య ప్రవచనం పూర్తి అయిందని దేశికుల సూక్తుల వల్లనే తెలుస్తున్నది.

**నః ప్రసాదం ప్రస్నువీత :** సంయమీంద్రుని సూక్తి మనకు అనుగ్రహాన్ని ధారాపాతంగా కురిపించాలి, అని దేశికుల ప్రార్థన. తలస్పర్శిజ్ఞానం కలిగిన విపశ్చిద పశ్చిములకే శ్రీ భాష్యార్థం దుర్జ్ఞేయమన్న మాటను వింటుంటే, జ్ఞాన మే మాత్రం లేని అస్మదాదులకు మార్గ మేది? అంటే "తద్భాష్యమ్, సచ భాష్యకృత్, సచ హరిః, సమ్యక్ ప్రసీదంతునః" - శ్రీ భాష్యకారులైన రామానుజులవారూ, గ్రంథ ప్రతిపాద్యుడైన జగత్కారణభూతుడైన శ్రీమన్నారాయణుడూ మనపైన పూర్ణకటాక్షాన్ని ప్రసరింపజేయాలి - అని శ్రీ శ్రుత ప్రకాశికాచార్యులు చెప్పిన రీతిగా అనుసంధించుకొంటూ, శ్రీ కోశాన్ని వ్యాస పీఠం మీద ఉంచుకొని దండవత్ ప్రణామం చేయడం యుక్తం. వారి అనుగ్రహ ప్రసారం వల్ల భాగ్యవంతులైన కొందరికి సుబోధకం కావచ్చునని సుధీమణుల బోధ. ఇదంతా స్వభావోక్తి యేకాని అతిశయోక్తికాదుకదా! మాలినీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తత్సూక్తిప్రసాదం ప్రార్థయతే, మునీతి. మునిబహుమతసారా – మునిభిః బోధాయనాది మునిభిః; బహుమతసారా – నిష్కృష్టార్థా. ముక్తినిఃశ్రేణికా – ముక్తేరనాయాసేన ప్రాపికా. "నిశ్శ్రేణి స్త్వధిరోహిణీ" త్యమరః. సహృదయ హృదయానాం – జన్మాంతర భాగ్యలబ్ధ నిర్మత్సర హృదయానాం. శాశ్వతీ, దిష్టసిద్ధిః– అక్షయ్యా, భాగ్యవృద్ధిః. శమిత విమత ఖేదా – శమితః విమతాపాదితః ఖేదః యయాసా, తథోక్తా. పరిచిత గహనా – పరిచితాత్యంత గహనార్థా. యద్వా, పరిచితం – ప్రతిపాద్యత్వేన సంబద్ధం, గహనం – బ్రహ్మ, యస్యామితి బ్రహ్మ స్వరూప రూపగుణ విభూతి విశద ప్రకాశికేత్యర్థః. సంయమీంద్రస్య సూక్తిః ప్రసాదం, ప్రస్నువీత – ప్రస్నువతామ్.

**అత్ర వ్యాఖ్యానాంతరం :** మునీత్యాది, మునీనాం బహుమతేషు – నానావిధ మతేషు, సారా – స్థిరా – శమితదురిత గంధా – శమితః, దురిత గంధః యయాసా. పరిచితగహనా – పరిచితా – అభ్యస్తాపి, గహనా – దుష్ప్రవేశా ఇతి.

**30. భవ మరు పరిఖిన్న స్ఫీత పానీయ సింధు**
**ర్దురిత రహిత జిహ్వా దుగ్ధకుల్యా సకుల్యా ।**
**శ్రుతినయన సనాభిః శోభతే లక్ష్మణోక్తి**
**ర్నరక మథన సేవా స్వాద నాడిం ధమా నః ॥**

**అర్థం :** భవ – సింధుః । భవ = సంసారం అనబడే; మరు = ఎడారి – నిర్జల – ప్రదేశమందు; పరిఖిన్న = చాలా దుఃఖాన్ని పొందినవారికి; స్ఫీత = గొప్పనైన; పానీయ సింధుః – త్రాగడానికి యోగ్యమైన నదీ ప్రవాహం వంటి; దురిత – సకుల్యా। దురితరహిత – పాపంలేని వారి యొక్క; జిహ్వా–నాలుకకు; దుగ్ధకుల్యా = పాలు ప్రవహించే నదికి; సకుల్యా = సమానమైనట్టి; శ్రుతి నయన, సనాభిః = వేదమే కన్నులుగా కల వైదికులకు; బంధువులాంటి; నః = మనకు; నరక – నాడింధమా ।. నరకమథన = నరకాంతకుడైన శ్రీహరి యొక్క; సేవా = కైంకర్య రసాన్ని; ఆస్వాద = ఆస్వాదించడానికి; నాడింధమా =

మహానందాన్ని ప్రవహింపజేసేనాడి వంటి; లక్ష్మణ + ఉక్తిః = రామానుజుల శ్రీసూక్తి; శోభతే = శోభిస్తున్నది.

**తాత్పర్యము :** శ్రీ మద్రామానుజుల శ్రీసూక్తి సంసారమనే నిర్జల ప్రదేశంలో తాపంతో బాధపడేవారికి త్రాగదగిన నీటి ప్రవాహం లాంటిది. పుణ్యాత్ముల జిహ్వకు క్షీరప్రవాహంతో సమానమైనది. వైదికులకు బంధువు వంటిది. మనం భగవత్కైంకర్యరసాన్ని అనుభవించడానికి ఆనందాన్ని కలిగించే నాడి లాంటిదై ప్రకాశిస్తున్నది.

**వ్యాఖ్య :** శ్రీ లక్ష్మణముని సూక్తులనుభంగ్యంతరంగా ప్రశంసించే శ్లోకం.

సంసారం ఒక ఎడారి ప్రదేశం. శ్రీమద్రామానుజుల సూక్తి మధుర జలంతో ప్రవహించే నదిలాంటిది. ఎడారిలో నీడ, నీరు దొరకడం కష్టం. ఎడారిలో పయనించే వానికి మండుటెండవల్లనూ, కాగుతున్న ఇసుకనేల వల్లనూ తాపం అధికమవుతుంది. ఆ మరుభూమిలో నడిచి నడిచి ఖేదపడేవానికి చల్లని ఏటినీటిలో దూకి తలమున్కలుగానీరాడితే సర్వాంగాలు జలమగ్నమైనందు వల్ల బయటి తాపం తీరుతుంది. దోసిళ్ళతో కడుపునిండా తియ్యని నీరు త్రాగడం వల్ల లోపలి దప్పి తీరుతుందనే ఆర్తి గోచరిస్తుంది. "సమానౌ మరుధన్వా నౌ" (అమరం) మరుభూమి దాహం పుట్టించి చంపుతుంది.

జనన మరణరూప సంసారపుటెడారిలో తాపత్రయమనే ఎండలో పయనిస్తూ అలసి దప్పిగొన్న బాటసారికి భగవద్రామానుజుల సూక్తి అనే స్ఫీత పానీయసింధువు శ్రమను తొలగిస్తుంది. తాపంచల్లారుతుంది. దప్పిక తీరుతుంది. సూక్తుల గభీరార్థావగాహనతో బాహ్య విషయాలను అనుభవించాలనే అభిరుచి, ఆరాటమనే ఖేదం నశిస్తుంది.

"హరి సరసివిగాహ్యాపీయతేజోజలౌఘం భవమరుపరిఖిన్నః ఖేద మద్యత్యజామి" (ముకుందమాల 10) హరి సరస్సులో మునిగి, తేజస్సు అనే నీటిని త్రాగి ఇప్పుడు సంసారపుటెడారిలో కలిగిన బడలికనూ, అంతర్బ హిస్తాపాలను పోగొట్టుకొంటున్నానన్నారు శ్రీ కులశేఖరాళ్వార్లు. "మరువిణిదై

ఓంగు పునల్" (హస్తిగిరి మాహాత్మ్యం). కంచి వరదరాజస్వామిని ఎడారి నడుమ పొంగుతూ ప్రవహిస్తున్న చల్లని స్రవంతిగా వర్ణించారు శ్రీ వేదాంత దేశికులవారు.

శ్రీ మద్రామానుజుల కృతులు క్షీర నదితో పోల్చబడిన విషయం గమనీయం. పాలను పరమాత్మునిగా చెప్పడం స్వాపదేశం. శ్రీభాష్యకార సూక్తులు జగద్వ్యాపార పారీణుడైన శ్రీ మన్నారాయణుని కల్యాణ గుణాలను సాకల్యంగా స్రవింపచేస్తాయి. కాబట్టి 'పాలేరు'గా వర్ణితం.

పాలు పైత్యరోగులకు, హృద్రోగులకు రుచించవు కదా! పాపవాసనా దూషితాంతః కరణులకు లక్ష్మణముని సూక్తులు భోగ్యంగా ఉండవు. కేవలం సుకృతాత్ముల రసనకు రుచికరమై దేహానికి పుష్టిని, ఆత్మకు తుష్టిని కలిగిస్తుంటాయి.

**శ్రుతినయన సనాభిః**- వేదరాశికి నేత్రం భగవానుడే. వేదాలలో కనబడేవాడు పరమాత్ముడు. ''దివ్యం చక్షుఃశ్రుతి పరిషదామ్'' (భగవద్ధ్యానసోపానం, మొదటి శ్లోకం). "శుద్ధం చక్షుః శ్రుతిపరిషదామ్". (హంస సందేశం) అని దేశికులు వర్ణించారు. భగవత్స్వరూపగుణవిభూతులను సాక్షాత్కరింపచేస్తాయి కాబట్టి శ్రుతినయనునితో ముడిపడియున్న సూక్తులని తాత్పర్యం. లేదా, "సర్వస్య లోచనంశాస్త్రం" అన్నట్లు శ్రుతులే కన్నులుగా కలవారు వేదమూర్తులు. వైదికులని అర్థం.

"సనో బంధుర్జనితా" - (ఉపనిషద్వాణి) వైదికులకు - శ్రుతినయనులకు అక్కరకు వచ్చే చుట్టం లాంటివి లక్ష్మణోక్తులు.

భగవత్కైంకర్యాసక్తిని పెంపొందింపజేసేవి భగవద్రామానుజులకృతులు. "సేవాస్వాదనాడింధమా" అనే పదం 'లక్ష్మణోక్తిః' అనే పదానికి చివరి విశేషణం. గొట్టం లాగా ఉండే నరాలలో రక్తం ప్రవహిస్తుంటుంది. ప్రాణులను చైతన్య వంతంగా, కార్యాసక్తులనుగా ప్రేరేపించే ఆ బోలు నరాలే నాడులు. శరీరంలోని ఒక రకమైన నాడిని (స్త్రీ, పురుష సంభోగమందు) తాకితే కామోద్దీప్తి కలిగి గొప్ప ఆనందం నిలువెల్ల ప్రవహిస్తుంది. శ్రీ భాష్యకారుల సూక్తులను చదివేవారికినీ, విన్నవారికినీ అవి భగవదారాధనాసక్తిని కలిగించి బ్రహ్మానందాన్ని అనుభవింపజేస్తాయి. కాబట్టి శ్రీ లక్ష్మణోక్తి నరకాంతకుడైన శ్రీ కృష్ణభగవానునికి

షోడశోపచార పూజచేసి ఆనందరసాన్ని అనుభవించడానికి నాడింధమ రూపమైనదని భావం. "పానీయసిద్ధిః" పాఠాంతరం ఉంది. మాలినీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ పునరపి తత్సూక్తి మేవస్తౌతి, భవేతి. భవమరు పరిఖిన్న స్ఫీత పానీయ సిద్ధిః । భవమరుపరిఖిన్నానాం సంపారరూపనిర్జల దేశ సంచరణ పరిశ్రాంతానాం, స్ఫీత పానీయసిద్ధిః - ప్రభూత తరస్వాదుతర బలప్రాప్తిః. దురితరహిత జిహ్వా దుగ్ధకుల్యా సకుల్యా । దురితరహితానాం - నిష్పాపానాంజిహ్వాయాః, దుగ్ధకుల్యాయాః - దుగ్ధసరితః, సకుల్యా - తుల్యా; శ్రుతినయన సనాభిః । శ్రుతినయనానాం - వైదికానాం, సనాభిః -బంధుః, ఆనందినీత్యర్థః. నరక మథన సేవాస్వాదనాడింధమా ।. నరక మథన స్య - హరేః సేవాస్వాదస్య - సేవారసస్య. నాడింధమా - ప్రభూతప్రవాహప్రవర్తికా; నాడీ భేదే వేధేహి ప్రభూతరస ప్రవాహో భవతీతి ప్రసిద్ధిః. ఏవం విధా లక్ష్మణోక్తిః నః, శోభతే - రసావహా భవతి.

**అత్రవ్యాఖ్యానాంతరమ్ :** భవమరు పరీత్యాది. భవః - సంసార ఏవమరుః ధన్వా; జల వృక్షలతాది శూన్యారణ్యం. "సమానౌ మరుధన్వానౌ" ఇత్యమరః. తస్మిన్ పరిఖిన్నానాం. శ్రాంతానాం, స్ఫీతపానీయా - ప్రభూతోదకా; సింధుః - నదీ. శ్రుతినయన సనాభిః. శ్రుతీనాం. వేదానాం, నయన సనాభిః - నేత్రసదృశీ. నః - అస్మాకం. నరకేత్యాది. నరకం - నరకాసురం, మథ్నాతీతి నరక మథనః - హరిః. తస్యసేవా స్వాదస్య - కైంకర్య రసానుభవస్య నాడింధమ రూపా. ఇతి

**31.** **హరి పదమకరంద స్యందినః సంశ్రితానా**
**మనుగత బహుశాఖా స్తాప మున్మూలయంతి ।**
**శమిత దురితగంధాః సంయమీంద్ర ప్రబంధాః**
**కథక జన మనీషా కల్పనా కల్పవృక్షాః ॥**

**అర్థం :** సంశ్రితానాం = ఆశ్రయించిన వారికి; హరిపద మకరంద స్యందినః । హరి = పాపాలనుహరించే భగవానుని యొక్క; పద = చరణం అనే; మకరంద = పూదేనెను; స్యందినః = ప్రవహింప జేయునట్టి; (హరి =

ఇంద్రుని యొక్క; పద= స్థానమైన స్వర్గమందు) అనుగత, బహుశాఖాః= అనుసరింపబడిన, అనేక (వేద) శాఖలను కలిగినట్టి; శమిత, దురిత, గంధాః = పోగొట్టబడిన పాపాల వాసనలను కలిగినట్టి; కథక జన – వృక్షాః । కథక – వాదించే, జన = జనులకు, మనీషా = బుద్ధిని, కల్పనా = కూర్చుడ మందు, కల్పవృక్షాః = కోరికలను దీర్చే తరువులైన ; సంయమి+ఇంద్ర, ప్రబంధాః = యతిరాజు యొక్క ప్రబంధాలు; తాపం = తాపాన్ని; ఉన్మూలయంతి = నశింజేస్తుంటాయి.

**తాత్పర్యము :** యతిరాజ ప్రబంధాలు బాగా పరిశీలించే వ్యక్తులకు భగవానుని పాద మకరందాన్ని ప్రవహింపజేస్తాయి. బహుశాఖలను కలిగియున్న వేదానికి సమ్మతాలు. పాపాలను సవాసనగా తొలగించేవి. హేతువాదులకు ప్రజ్ఞను కల్పించడానికి కల్పవృక్షం వంటివి. తాపత్రయాన్ని శమింపజేస్తాయి.

**వ్యాఖ్య :** శ్రీ భాష్యకారుల ప్రబంధాల ఉత్కృష్టతను వర్ణించే శ్లోకం.

గత రెండు శ్లోకాలలో ఉక్తి, సూక్తి' అని స్త్రీలింగపదాలుప్రయుక్తమైనాయి. సూక్తికాంత పురుషోత్తముని కల్యాణగుణ వైభవాన్ని ప్రకటించేరక్తి, శక్తి కలదని సూచింపబడింది. ఈ శోక్లంలో పుంలింగమైన ప్రబంధశబ్దం కల్పితం. యతీంద్ర ప్రబంధాలు కల్పవృక్షసదృశాలు అని వర్ణింపబడినాయి.

హరిపదమంటె స్వర్గమని అర్థం. దేవలోకంలో నందనోద్యాన వనమందు దేవతరువులు – మందారం, పారిజాతం, సంతానం, కల్పవృక్షం, హరిచందనం – ఉన్నాయి.

**పంచైతే దేవతరవో మందారః పారిజాతకః ।**
**సంతానః కల్పవృక్షశ్చ పుంసివా హరిచందనమ్ ॥** (అమరం)

దేవతా వృక్షాలు పుష్పరసాన్ని ప్రస్రవిస్తాయి. అనేక కొమ్మలను కలిగియున్నందువల్ల తాపాన్ని శమింపజేసే చల్లని నీడను కల్పిస్తాయి. కమ్మని వాసనను వీచడం వల్ల దుర్వాసనను దూరంగా తరిమివేస్తాయి. ఆశ్రితుల కోరికలనూ దీరుస్తాయి.

భగవద్రామానుజుల వారి ప్రబంధాలు దేవలోకమందలి కల్పవృక్ష సాదృశ్యం కలవి కదా.

'హరిపదం' అంటే 'విష్ణుపాదం' అని మరొక అర్థం. విష్ణుపాదమందు మకరందం స్రవిస్తుంటుంది. "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః". అని శ్రుతివాక్యం. శ్రీమద్యామునాచార్యులవారు "అమృత స్యందినిపాదపంకజే" (స్తోత్రరత్నం 27) సర్వేశ్వరుని పాదాలు తామర పూవుల వలె సుగంధభరితమై, అమృతాన్ని - మకరందాన్ని - స్రవిస్తుంటాయన్నారు. కాబట్టి దేశికులవారు హరిపదమే మకరందమనీ రూపరంజకం చేశారు. యతీంద్ర ప్రబంధాలను అధ్యయనం చేసేవారికి శ్రీహరి పాదకమలాలను ఆఘ్రాణించి ఆస్వాదించే అభిరుచిని అవి కలుగజేస్తాయని అధ్యవసించారు దేశికులు.

అనుగత బహుశాఖాః. నిగమకల్పతరువుకు చాలాశాఖలు ఉన్నాయి. ఆ వేద శాఖలను అవలంబించిన వైదికులూ ఉన్నారు. శుద్ధాద్వైతవాదులు "తత్త్వమ" సీత్యాది వాక్యాలకు అభేదశ్రుతులనే ప్రమాణంగా గ్రహించారు కాని, భేదశ్రుతులను సమన్వయించలేదు. ద్వైతవాదులు భేదశ్రుతులనే తప్ప ఆభేద శ్రుతులను ప్రమాణీకరించి సమన్వయించలేదు. భగవద్రామానుజ ప్రబంధాలు ఘటకశ్రుతులను ప్రామాణికంగా గ్రహించి, చిదచిద్విశిష్టాద్వైతసిద్ధాంతాన్ని సమర్థించాయి.

'సంశ్రితానాం' అనే పదం అన్ని పదాలకు అన్వయిస్తుంది. అనేక శాఖలను అనుసరించినవారికి నిశ్చితార్థమేదో నిర్ణయింపబడనందువల్ల కలిగిన తాపాన్ని నశింపజేసేరీతిగా, యతిరాజ ప్రబంధాలయందు సర్వశ్రుతులకు ఐకకంఠ్యం ఉంది. కాబట్టి 'అనుగత బహుశాఖాః, తాపమున్మూలయంతి'' అని అన్వయించడం ఆవశక్యమే.

**శమిత దురితగంధాః** : ఈ సమాసపదం (29) ఇరవైతొమ్మిదవ శ్లోకంలోనూ ఉంది. పాఠాంతరంగా ఉన్న "శమిత విమతఖేదా" అన్న సూక్తియే అక్కడ సరియైనదనిపిస్తుంది. ఎందుకంటే, కల్పవృక్షసదృశ ప్రబంధాలు కమ్మని

భగవత్పాద సుగంధాలను వెదజల్లుతుంటాయి. కాబట్టి భగవత్పాద సుగంధాలు (ఇక్కడ) దుష్కృతాలవల్ల కలిగే దుర్వాసనలను పోగొట్టి "యథావృక్షస్య సంపుష్పితస్య దూరాద్గంథోవాతి" - కమ్మని పూలను పూచిన చెట్టువాసన దూరప్రదేశాలకు వీచినట్లు, యతీంద్ర ప్రబంధాలు పరిశీలించిన వ్యక్తిని సుకృతాత్మునిగా సంస్కరిస్తాయన్న అర్థాన్ని ద్యోతకం చేస్తున్నాయి. సంయమీంద్ర ప్రబంధాలు "కథక జన మనీషా కల్పనా కల్పవృక్షా"లే. కథక జనులంటే హేతవాదులు. యథార్థాన్ని తెలుసుకోవడానికి, సంశయగ్రస్త విషయాలను ప్రవేశపెట్టి, పూర్వపక్షంచేసి చర్చించి, వాక్యార్థ విచారణ చేస్తారు. అట్టి కథకజనుల ధిషణను ఒరపిడితో పదునుపెట్టి, సముచితయుక్తులను అపరిమితంగా స్ఫురింపజేసి, జయశీలమైన వారి వాంఛలను ఫలింపజేసే ప్రబంధాలు కల్పవృక్షాలే "ఓ వ్రశ్చూచ్ఛేదనే" అనే ధాత్వర్థంచేత "వృశ్చ్యతే - ఛిద్యతే - ఇతి వృక్షః; కల్పయతి వాంఛిత మితికల్పః. కల్పశ్చాసౌవృక్షశ్చ కల్పవృక్షః" అని వ్యుత్పత్త్యర్థం కలది కల్పవృక్షం. సంశయాలు ఛేదింపబడి, కోరబడిన యథావస్థితార్థాలనే స్ఫుటిత పల్లవాలతో ఏపుగా ఎదిగే చెట్టువంటివి శ్రీమద్రామానుజప్రబంధాలు.

సంశ్రితానాం తాపం ఉన్మూలయంతి: భగవద్రామానుజుల ప్రబంధాలను బాగా అభ్యసించిన వేదాన్తశాస్త్ర ప్రవర్తకుల పాపశాపతాపాలను (మొక్కలను కూకటి వేళ్ళతో పాటుపెరికి వేసి) నిశ్శేషంగా నివారించి, వారిని ఉజ్జీవింప జేస్తాయి.

**"దినేదినేచ వేదాంతశ్రవణా ద్భక్తి సంయుతాత్ ।**
**గురుశుశ్రూషయాలబ్ధాత్ కృచ్ఛ్రా శీతిఫలం లభేత్ ॥"**

యతీంద్రులైన శ్రీమద్రామానుజుల వారి వేదాంతశాస్త్ర ప్రబంధాల శ్రవణ పఠన మననాదులవల్ల మోక్షఫలం లభిస్తుంది.

శ్లేషాలంకారయుక్త మాలినీ వృత్త శ్లోకమిది.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తత్ ప్రబంధాన్ స్తౌతి, హరిపదేతి. సంశ్రితానాం- స్వస్మిన్ పరిశీలనవతాం. హరిపదమకరంద స్యందినః - హరిపదమేవ మకరందం

స్యందయంతీతి తాదృశాః, హరిపదరస్యతాపాదకా ఇత్యర్థః. అనుగత బహుశాఖాః – బహుశ్రుత్యనుగతార్థాః; అతః, తాపమున్మూలయంతి – కల్పవిశేషా నిశ్చయజాతం తాపం సమూలం నాశయంతీత్యర్థః – శమిత దురితగంధాః– స్వశ్రవణ మాత్రేణ క్షపిత సమస్తపాపాః. సంయమీంద్రప్రబంధాః కథక జన మనీషా కల్పనా కల్పవృక్షాః – కథక జనానాం – వాదినాం, మనీషా కల్పనాయాః తాదాత్త్విక యుక్తి యుక్తి కల్పనాయాః, కల్పవృక్షాః – అక్షయతయా ఉత్పాదకాః తాదృశాః సంయమీంద్ర ప్రబంధా స్తాపమున్మాలయంతీ త్యన్వయః. కల్పవృక్షాణాంచ స్వర్గవాసిత్వం, మకరంద స్యందిత్వం, శాఖాన్వయిత్వం, తాపోన్మూలకత్వంచ ధ్వన్యతే.

**వ్యాఖ్యానాంతరమ్ :** హరిపద మకరంద స్యందినః – హరిపదం – భగవత్పదమేవ మకరందం – పుష్పరసం స్యందంతే, ఇతి తథోక్తాః. కల్పవృక్ష పక్షే – హరేః ఇంద్రస్య, పదే స్వర్గే, మకరంద స్యందినః – పుష్పరస స్రావిణః . అనుగత బహుశాఖాః – అనుగతాః – ప్రాప్తాః, బహుశాఖాః ఋగ్యజుస్సామాదిశాఖాభేదాః, యేషాంతే. అన్యత్ర అనుగతానేక విటపాః. శమిత దురిత గంధాః – శమితః – శాంతింగమితః, దురితానాం గంధః యై స్తథోక్తా అన్యత్ర, శమిత దుర్గంధా ఇత్యర్థః. కథకేత్యాది. కథక జనానాం, మనీషా కల్పనాయాం కల్పవృక్ష సదృశా ఇతి.

**32.** **నానాభూతై ర్ణగతిసమయై ర్నర్మలీలాం విధిత్సో**
**రంత్యం వర్ణం ప్రథయతి విభో రాదిమ వ్యూహ భేదే ।**
**విశ్వంత్రాతుం విషయ నియతం వ్యంజితానుగ్రహస్సన్**
**విష్వక్సేనో యతి పతి రభూత్ వేత్రసారస్త్రిదండః ॥**

**అర్థం :** నానాభూతైః = అనేక విధాలైన; సమయైః = దర్శనాలచేత, సిద్ధాన్తాలచేత; నర్మలీలాం = వినోదక్రీడను; విధిత్సోః = చేయగోరుతున్న; విభోః = సర్వేశ్వరుని యొక్క; ఆదిమ వ్యూహభేదే = మొదటి వ్యూహమైన వాసుదేవ వ్యూహ విశేషం; అంత్యం = చివరిదైన; వర్ణం = వర్ణాన్ని, కృష్ణవర్ణాన్ని;

ప్రథయతి (సతి) = ప్రకాశింపజేయునప్పుడు, విషయ నియతం = ఐహికభోగాలయందు నియతంగా ఉన్న; విశ్వం = జగత్తును; త్రాతుం = రక్షించడానికి; విష్వక్సేనః = విష్వక్సేనుడు; వ్యంజిత + అనుగ్రహఃసన్ = సూచింపబడిన అనుగ్రహం కలవాడై; యతిపతిః = శ్రీమద్రామానుజులుగా; అభూత్ = అవతరించాడు. వేత్రసారః = (ఆయన చేతి) బెత్తం; త్రిదండః = త్రిదండంగా; అభూత్ = అయెను.

**తాత్పర్యము :** ప్రథమ వ్యూహమూర్తియైన పరవాసుదేవుడు నానావిధాలైన అవైదిక సిద్ధాంతాలను వ్యాపింపజేసి లీలారసాన్ని అనుభవింపగోరుతూ కడపటిదైన నల్లని వర్ణాన్ని పొందే సమయాన కలియుగం ఆరంభమయింది. అప్పుడు శ్రీ విష్వక్సేనుడు విషయభోగాసక్తులైన చేతనులను సంరక్షించడానికి అవ్యాజకృపతో యతిపతిగా అవతరించాడు. ఆయన చేతి దండమే త్రిదండ రూపందాల్చింది.

**వ్యాఖ్య :** శ్రీ విష్వక్సేనులే శ్రీమద్రామానుజాచార్యులుగా అవతీర్ణులని సుశ్లోకితం.

ఇదివరకు సర్వేశ్వరుని పంచాయుధియే భగవద్రామానుజులుగా అవతరించిన ప్రవృత్తి 12వ శ్లోక మందు వర్ణింపబడింది. ఈ శ్లోకం అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన పరవాసుదేవుని సర్వసేనాధిపతియైన శ్రీ విష్వక్సేనుడే స్వయంగా కృపాపూర్ణుడై యతిపతిగా అవతరించాడని వర్ణిస్తున్నది. విష్వక్సేనప్రశంసను మూడవశ్లోకమందు మనం గమనించాం కదా!

'విభుః' అంటే సర్వవ్యాపకుడు, సర్వరక్షకుడు; సర్వేశ్వరుడు కాబట్టి తన సంకల్పం చేత అన్నీ పొందేవాడు. ఆయన ఆవాప్త సమస్తకాముడు. ఆయన చేష్టలను ఏ ప్రబలశక్తి కూడా అడ్డుకోజాలడు. కాబట్టి ఆయన లీలలు అద్భుతాలు. జగద్రక్షణ స్వామికి ఒక లీల. వినోదంగా లీలారసాన్ని అనుభవించడానికి నానా విధాలైన సిద్ధాంతాలను స్వయంగా ప్రవేశపెట్టాడు.

"సాక్షాన్నారాయణోదేవః కృత్వా మర్త్య మయీం తనుమ్ ।
మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్ర పాణినా॥"

శ్రీమన్నారాయణుడు మానవ రూపాన్ని - ఆచారత్వాన్ని - వహించి, మునిగిపోతున్న లోకాలను - మానవులను - కృపచేత శాస్త్ర పాణియై ఉద్ధరిస్తుంటాడు. 'సమయా'లంటే దర్శనాలు, శాస్త్ర సిద్ధాన్తాలు.

"సమయా శ్శప థా చార కాలసిద్ధాన్తసంవిదః" (అమరం)

"సంకేతే సమయః ప్రోక్తో నియమేఽ వసరేఽ పిచ" (శేష నిఘంటువు)

'సమయ' శబ్దానికి అనేకార్థాలున్నాయి. ఇక్కడ శాస్త్ర సిద్ధాన్తమని అర్థం. ధర్మవ్యవస్థను కాపాడడానికి వైదిక, అవైదిక సిద్ధాన్తాల నేర్పరచిన వాడు భగవానుడు. వ్యాసజైమిన్యాది మహర్షులు వైదిక సిద్ధాన్తపరులు. కపిలుడు సాంఖ్యశాస్త్ర ప్రవక్త. బుద్ధుడు బౌద్ధ సిద్ధాంత స్థాపకుడు. భగవానుడే బుద్ధస్వామిగా అవతరించి స్వయంగానూ, మరికొన్ని సమయాలలో "త్వం వా రుద్ర మహాబాహో! మోహశాస్త్రాణి కారయ" అన్నట్లు మరికొందరి మూలంగానూ తత్త్వహిత పురుషార్థాలలో మోహపడే విధంగా చేసే అవైదిక సిద్ధాంతాలను మోహన శాస్త్రాలను ప్రవర్తింప జేశాడు.

ధూర్తులు కొందరు మొదట వేదోక్త ధర్మాలను ఆచరించి - యజ్ఞ యాగాదుల ద్వారా - అనేక శక్తులను సంపాదించి, ఐశ్వర్యవంతులై లోక క్షోభను కలిగించారు. వారవలంభించిన పద్ధతి వైదిక ధర్మబద్ధమైననూ, వారికి లభించినశక్తి లోకవినాశానికి హేతువైనది. త్రిపురాసుల ప్రవృత్తి ఇట్టిదే కదా! అటువంటి వారిని జయించడం ఎవరికి సాధ్యం? "శఠేశాఠ్యం సమాచరేత్" అన్నట్లు ముల్లును ముల్లుతోనే తీయాలి. ఆ ధూర్తులకు వేదమార్గం మీద అవిశ్వాసాన్ని కలిగించే కపటోపదేశాలను బుద్ధావతారంలో చేశాడు.

"తతో దిగంబరో ముండః" - "పునశ్చరక్తాంబరధృక్ - మాయామోహోఽ జితేక్షణః". (వి.పు) బోడి గుండు, ఎఱ్ఱని అంగవస్త్రం కలిగి, మాయా ప్రభావంచేత అందరినీ ఆకర్షించే చూపులు కలిగిన సుందరమూర్తి బుద్ధ భగవానుడు.

త్రిపురాసుల భార్యలు పతివ్రతలు. అశత్థ వృక్షాన్ని ఆలింగనం చేసుకొమ్మని వారికి చెప్పి, ఆ వృక్షంలో తాను ఆవేశించి, వారిచే ఆలింగితుడైన బుద్ధ భగవానుడు వారి పాతివ్రత్యాన్ని భ్రష్టంచేశాడు. త్రిపురాసురులను ధర్మభ్రష్టులను చేసి, తర్వాత దేవాసురయుద్ధంలో రుద్రునిచేత వారిని సంహరింపజేసిన వాడు నారాయణుడే. "హతాశ్చతే ఉ సురాదేవై స్సన్మార్గ పరిపంథినః" (వి.పు) అని వేద పురాణాలు వివరిస్తున్నాయి.

కలియుగంలో ధర్మం తగ్గినప్పుడు, భగవానుడేర్పరచిన అవైదిక దర్శనాల వ్యాప్తి అధికమై, మానవహృదయాలు సత్పథాచారానికి విరుద్ధంగా ప్రవర్తించడాన్ని చూచి శ్రీ శఠకోప మునులు చాలా ఆవేదనను వెల్లడించారు.

**"నిన్ మాట్టాయ మలర్ పురైయుమ్ తిరువురువమ్**
**మనమ్వైక్క మాట్టద పలశమయమ్ మదికొడుత్తాయ్"** (తి.శా.మొ.3-1)

స్వామీ। నిధిలాగా శ్లాఘ్యమై, పుష్పంలాగా సుకుమారమై భోగ్యమైన నీ దివ్యమంగళ విగ్రహాన్ని మనస్సున నిల్పుకోవడానికే నీ నాభి కమలమందు పుట్టిన ఈ లోకం అశక్తమైనది. ఈ అనర్థం చాలదన్నట్లు నీ యందు దృష్టిలేని అనేక మతాలను కూడా సృజించి, వాటి యందు చేతనులబుద్ధిని ప్రవేశపెట్టావు. తత్ఫలితంగా, చేతనులు తమ తమ మతవైరుధ్యాలతో వైషమ్యాలనూ, క్రోధాలను పెంచుకొని, ఒకరితో నొకరు కలహించుకొని, సమన్వయ బుద్ధిని కోల్పోయి నశిస్తున్నారు. ఇక వీరు నిన్నాశ్రయించడానికి మార్గమేది? అని సంసారులపట్ల జాలిపడి శ్రీ సుందర బాహు స్వామితో మొరపెట్టుకొన్నారు.

"ఇతి మోహన వర్త్మనా త్వయా గ్రథితం బాహ్యమతం తృణాయమన్యే" (శ్రీరంగరాజస్తవం ఉ.శ. 16) 'ఓ రంగనాథా! నీ భక్తుల విరోధులను వంచించే సంకల్పంచేత నీవు రూపొందించినదే అయిన, ఈ వేదబాహ్యమతాన్ని నేను చెత్తగా భావిస్తాను' అన్నారు శ్రీపరాశరభట్టరు.

**"లీలా దక్షాం త్వదనవసరే లాలయన్ విప్రలిప్సాం**
**మాయాశాస్త్రాణ్యపి దమయితుం త్వత్ప్రపన్నప్రతీపాన్ ॥"** (ద.శ.47)

ఉత్తమమైన వేదశాస్త్రాలనొసగడం భగవద్దయాకృత్యమే. అలాగే కొన్ని

సమయాలలో భగవత్కృపాపాత్రులైన వారి విరోధులను శిక్షిస్తూ మోహన - మాయా - శాస్త్రాలను ప్రవేశపెట్టడం కూడా భగవద్దయాకార్యమే.

"మిధః కలహ కల్పనా, విషమవృత్తి లీలా, దయా పరిగ్రహణ". (సంకల్ప సూరోదయం 1-67). భగవానునికి దయాదేవి, లీలాదేవి ఇద్దరు పత్నులు. దయాదేవిని కాక, లీలాదేవిని లాలిస్తున్నప్పుడు ఆమె ముందు విప్రలిప్సను నెరవేర్చుకొంటాడు; మాయాశాస్త్రాలను వ్యాపింపజేస్తాడు భగవానుడు. కాబట్టి ఆశ్రిత విరోధులను నిరసించడానికేర్పడిన ఈ భగవల్లీలను జనులు చక్కగా తెలుసుకొని, విషయ లాలసులు కాకుండా, ఏలాటి అపచారాలు చేయకుండా మెలగవలెనని దేశికుల ఆదేశం.

ఇలా భగవానుడు నర్మలీలను చేయగోరినప్పుడు తన రంగును మారుస్తాడట. ఇది యుగధర్మమని శాస్త్రం బోధిస్తుంది.

వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులు అనే చతుర్వ్యూహ మూర్తులలో, మొదటి వ్యూహమూర్తియైన పరవాసుదేవుడు కృతయుగంలో శ్వేత వర్ణాన్ని, త్రేతాయుగంలో రక్తవర్ణాన్ని, ద్వాపరంలో పీతవర్ణాన్ని, కలియుగంలో (కృష్ణ) నీలవర్ణాన్ని కలిగి ఉంటాడని శాస్త్రేతిహాస పురాణాలవల్ల తెలుస్తున్నది.

**"ఆసన్ వర్ణాస్త్రయో హ్య స్య గృహ్ణతోఽను యుగం తనూః ।**
**శుక్లో రక్తస్తథా పీత ఇదానీం కృష్ణతాంగతః ॥"**

దివ్య సూరుల సూక్తులు కూడా ఇలా ఉన్నాయి.

"పాలిన్ నీర్మైశెమ్బొన్ నీర్మై పాశియిన్ పశుమ్ పోలుమ్‌నీర్మై - నీలనీర్మై (తిరుచ్ఛంద విరుత్తమ్) అని భక్తిసారులు భగవానుని సిత రక్త శ్యామ కృష్ణ వర్ణాలను వర్ణించారు.

"మున్నై వణ్ణమ్ పాలిన్ వణ్ణమ్ - పిన్నైవణ్ణమ్ కొణ్ణల్ వణ్ణమ్" (పెరియ తిరుమొషి) మొదటిది పాలరంగు, చివరిది మొగులు రంగు అనిది తిరుమంగైయాళ్వార్లశ్రీసూక్తి.

'వర్ణ' మనే పదానికి 'జాతి' అనే అర్థమూ ఉంది. తమిళంలో ప్రసిద్ధుడైన కంబ మహాకవి 'భగవానుడే' చతుర్థ వర్ణానికి చెందిన నమ్మాళ్వారుగా అవతరించా'డన్నాడు. శ్రీమద్వేదాన్తదేశికులు "పరాంకుశ పరకాలాది రూపత్తాలే అభినవమాక ఒరుదశావతారమ్ పణ్ణి అనేక దేశికాపదేశత్తాలే అవతరిత్త రుళినార్". భగవానుడు పరాంకుశ పరకాలాదిరూపాలచేత ఒక అభినవ దశావతారుడై చేతనులను ఉజ్జీవింపచేశాడని 'గురుపరంపరాసార' మనే తమ గ్రంథంలో అనుగ్రహించారు.

"అత్రి జమదగ్ని పంక్తిరథ వసునందసూను వానవనుడైయ యుగవర్ణ క్రమావతారమో?" కృతయుగంలో భగవానుడు బ్రాహ్మణవర్ణంలో అత్రి, జమదగ్ని సూనుడుగానూ, త్రేతాయుగంలో క్షత్రియవర్ణమందు శ్రీ రామునిగానూ, ద్వాపరయుగంలో వైశ్యకులమనబడే యాదవ కులంలో శ్రీ కృష్ణునిగానూ, కలియుగంలో నాల్గవ వర్ణమందు శ్రీ శఠకోప దివ్యసూరిగా అవతరించాడనే సూక్తిని అళగియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ "ఆచార్యహృదయ" మనే గ్రంథంలో కృపజేశారు.

"అత్ర్యాది సూనురివ వర్ణయుగక్రమాత్" అనే 'పరాంకుశ పంచవింశతి" లోని సూక్తి కూడా ఈ విషయాన్నే బోధిస్తుంది కదా!

సర్వేశ్వరుడే అవైదిక సిద్ధాన్త కల్పన చేసి కలియుగంలో తాను నైల్యాన్ని దాల్చినప్పుడు కర్మవశ్యులైన లోకులు ఇంద్రియ సుఖాసక్తులవుతారు. విషయాసక్తివల్ల అనుభవించకపోతే జీవించలేమనే కోరిక జనిస్తుంది. ఆ కోరికను పొందనీయనివారిపై కోపమూ, దానివల్ల అ వివేకమూ, దానివల్ల మతిమరపు సంభవించి ఆత్మజ్ఞాన ప్రయత్నమే నశిస్తుంది.

**"ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తే షూపజాయతే।**
**.......స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥"**

అని గీతాచార్యుడు విషయధ్యానమెంత ప్రమాదమో తెల్పాడు కదా!

భగవద్ధ్యానం చేయకుండా విషయనియతమైన విశ్వాన్ని రక్షించడానికి

విష్వక్సేనులకు అపారమైన కృపకలిగింది. స్వతంత్రుడైన సార్వభౌముడు రాజకార్యాలను మరచి లీలారసమగ్నుడైతే, మంత్రులు హితంచెప్పినా వినని స్థితిలో ఉన్నప్పుడు, విశ్వాసపాత్రుడైన సేనాని ప్రజలకు యోగక్షేమాలను కల్పించడానికి పాటుపడుతాడు కదా! అదే రీతిగా, రాజ సేవాధురంధరుడైన శ్రీ విష్వక్ సేనుడు, జగదుపకారార్థం శ్రీ మద్రామానుజలుగా కలియుగంలో అవతరించాడు. తామసులను మోహింపజేయడానికి భగవల్లీలచే కల్పించబడిన అవైదిక మతసిద్ధాంతాలు వాస్తవమైనవికావు, అని యథార్థమైన చిదచిదీశ్వర తత్త్వాన్ని బోధించి ప్రజలను సన్మార్గమందు ప్రవర్తింపజేసినవారు భగవద్రామానుజులు.

సర్వేశ్వరుని సేనాపతి జగద్ధితార్థం యతిపతిగా అవతరిస్తే ఆయన, చేత బట్టుకొనే దండం త్రిదండంగా అవతరించింది.

సంభావనాలంకారద్యోతకమైన మంద్రాక్రాంతావృత్తశ్లోకమిది.

**సంస్కృత వ్యాఖ్యా :** యథా కుశలాః మంత్రిణః స్వతంత్ర తయా ఉన్మార్గ ప్రవృత్తేషురాజసు ఉపాయాంతరేణ ప్రజాభిమతమాచరంతి, తద్వన్నిరతిశయ స్వాతంత్ర్యే భగవతి లీలారసోద్యుక్తే కలియుగే చాత్యంత పాప ప్రచురే ప్రాప్తే కుశలో విష్వక్సేనః స్వానుగ్రహాతిరేకా దుపాయాంతరేణ జగద్రక్షణార్థం రామానుజాచార్యతయాఽవ తీర్ణ ఇత్యాహ, నానాభూతైరితి.

**నానాభూతైః** – సౌహార్ద తాదిరూపైః సమయైః – అవైదిక దర్శనైః; నర్మలీలాం – వినోదవ్యాపారం; విధిత్సోః– విధాతుమిచ్ఛోః; విభోః – భగవతః సర్వేశ్వరస్య; ఆదిమవ్యూహభేదే – వ్యూహస్య చతుర్థా వతారరూపస్యాదిమభేదే, వాసుదేవ రూప ప్రథమ వ్యూహ ఇత్యర్థః. సర్వావతారకారణతయా బౌద్ధాద్యవతారాణామపి హేతుభూతే; అంత్యం వర్ణం ప్రథయతి సతి – కృష్ణవర్ణయోగిని సతీత్యర్థః. భగవతః కృతాదియుగ చతుష్టయేఽపి శుక్ల రక్తపీతకృష్ణభేదోఽస్తీతి పాంచరాత్రాదిషు ప్రసిద్ధమ్. భగవత్య వైదిక సమయ ప్రవర్తనేన లీలా రసోద్యుక్తే పాపైకరుచౌ కలౌప్రాప్త ఇత్యర్థః. వ్యంజితానుగ్రహః విష్వక్సేనః విషయ నియతంవిశ్వం–జగత్; త్రాతుం – రక్షితుం; యతిపతి రభూత్

– రామానుజాచార్యతయా అవతీర్ణః; వేత్రసారస్త్రిదండమభూత్ – సమాహారత్వాన్న పుంసకత్వమ్. పుంలింగపాఠేత్ర్యవయవోదండ స్త్రిదండ ఇతి.

**33. లక్ష్యం బుద్ధే రసిక రసనా లాస్యలీలానిదానం**
**శుద్ధాస్వాదం కి మపి జగతి శ్రోత్ర దివ్యౌషధం నః ।**
**లక్ష్యా లక్ష్యై స్సితజలధివద్భాతి తాత్పర్యరత్నై**
**ర్లక్ష్మీకాంతస్ఫటిక ముకురో లక్ష్మణార్యోపదేశః ॥**

**అర్థం :** బుద్ధేః = బుద్ధికి; లక్ష్యం = లక్ష్యమైనట్టి; రసిక–నిదానం। రసిక = రసిక = రసికుల యొక్క; రసనా = నాలుకయొక్క; లాస్య లీలా = నర్తన లీలకు; నిదానం = ఆదికారణమైనట్టి; నః=మనకు; శుద్ధ+ఆస్వాదం = శుద్ధమైన రుచి కలిగినట్టి; జగతి = ప్రపంచంలో; కిం, అపి = ఒక విలక్షణమైన; శ్రోత్ర దివ్య+ఔషధం = చెవులకు దివ్యమైన ఔషధమైనట్టి; లక్ష్మీకాంత స్ఫటిక ముకురః = శ్రియః పతికి స్ఫటిక మయమైన అద్దం లాంటిదైన; లక్ష్మణ+ఆర్య+ఉపదేశః = శ్రీమద్రామానుజాచార్యుల ఉపదేశం (శ్రీ భాష్యది గ్రంథసముదాయం) లక్ష్య+అలక్ష్యైః = కనబడేవి, కనబడనివైన; తాత్పర్యరత్నైః = తాత్పర్యాలు అనే రత్నాలచేత; సితజలధివత్ =నిర్మలమైన – స్వచ్ఛమైన సముద్రంలాగా; భాతి = ప్రకాశిస్తుంది.

**తాత్పర్యము :** బుద్ధికి లక్ష్యమైనది భగవద్రామానుజుల వారి ఉపదేశ రూపమైన గ్రంథసమూహం. రసికుల జిహ్వాకు సర్వదా అనుసంధానం చేయడానికి కారణమైనది. దాసులకు రుచికరమైనది. సమస్తజనుల చెవులకు దివ్యమైన ఔషధంలాంటిది. లక్ష్మీనాథుని స్వరూప రూపగుణ విభూతులను ప్రతిబింబింపజేసే దర్పణంవంటిది. వేదాన్త తాత్పర్యాలు అనే అనర్ఘరత్నాలను ప్రకాశింపజేసే స్వచ్ఛమైన సముద్రం వంటిది శ్రీ భాష్యకారుల ఉపదేశం.

**వ్యాఖ్య : భగవద్రామానుజుల గ్రంథాలు నిత్యానుసంధేయాలు.** అసాధారణమైన శ్రీమల్లక్ష్మణార్యోపదేశాన్ని కమనీయంగా వర్ణించే శ్లోకమిది. సంప్రదాయ గ్రంథాలు ఉపదేశగమ్యాలు. కాబట్టి 'ఉపదేశః' అనే పదం ఏక

వచనాంతమందున్నా, అది యతిరాజుల రచనలకన్నిటికీ వర్తిస్తుంది. 'లక్ష్మణు'డంటే శేషత్వసీమా నియత లక్షణంకలవాడు. భగవద్రామానుజులు 'వేదార్థసంగ్రహ' మందు స్వాభిమతంగా తెల్పిన లక్షణమిలాగా ఉంది.

"పరగతాతిశయాధానేచ్ఛయా ఉపాదేయత్వమేవ యస్య స్వరూపం సశేషః పరఃశేషీ". సర్వాధికుడైన స్వామి అనే అర్థమిచ్చే పరుని యందు ఒక అతిశయాన్ని కలిగించాలి అనే ఇచ్ఛతో స్వీకరింపబడడమే ఏ వస్తువుకు స్వరూపమో ఆ వస్తువు పరునికి శేష మనబడుతుంది. దానిచే ఉపయోగాన్ని పొందే పరుడుశేషి అనబడుతాడు. ఈ అర్థాన్నే "శేషః పరార్థత్వాత్" (పూ.మీ. 3-1-1) అనే పూర్వ మీమాంసా సూత్రం బోధిస్తుంది. పరార్థమై అంటే పరుని ప్రయోజనం కోసం ఉపయోగపడే వస్తువుగానీ, వ్యక్తిగానీ శేషమని అర్థం. శేషభూతుడు భృత్యుడు. శేషి స్వామి అని నిష్కృష్ట లక్షణం. ఇచ్ఛను నాలుగురకాలుగా ఉదాహరించిన శ్లోకమిది.

**"ఇచ్ఛ యా యదుపాదేయం యస్యాతిశయసిద్ధయే ।**
**ఉభయానుభయైకైకజుషా, తౌశేషశేషిణౌ ॥"**

1. ఉభయజుషా ఇచ్ఛయా - (ఉభయగత ఇచ్ఛ). శేషశేషి వస్తువులు రెండు చేతన వస్తువులైతే ఉభయుల ఇచ్ఛనుగ్రహించాలి. ఉదా: యజమానుడు శేషి. ఋత్విక్కులు అతనికి శేషభూతులు. అలాగే రాజభృత్యులు.

2. అనుభయజుషా ఇచ్ఛయా - (అనుభయగత ఇచ్ఛ) రెండూ అచేతనాలైతే వాటికి (ఇచ్ఛ ఉండదు కాబట్టి) శేషశేషిభావాన్ని కల్పించే మూడవ వ్యక్తి ఇచ్ఛను గ్రహించాలి. ఉదా: యజ్ఞంశేషి. యాగద్రవ్యాలు శేషభూతాలు. (యజమానుని ఇచ్ఛతో కల్పితాలు) అలాగే, కల్యాణమంటపం శేషి. దాన్ని అలంకరించే వస్తువులు దానికి శేషభూతాలు.

3. ఏకజుషాఇచ్ఛయా - (శేషిగత ఇచ్ఛ) రెండింటిలో చేతనమైన వ్యక్తి ఇచ్ఛనుగ్రహించాలి. ఉదా: శేషియజమానుడు. అతడు ధరించే దీక్షా వస్త్రాదులు శేషభూతాలు. అలాగే గృహస్థుడు శేషి. అతడు స్వోపయోగానికి స్వీకరించిన గృహారామక్షేత్రాలు శేషభూతాలు.

**4. ఏకజుషా ఇచ్ఛయా** - (శేషగతేచ్ఛ) శేషభూతుల ఇచ్ఛయే కారణం. ఉదా: ప్రధానమైన దేవాలయం శేషి. అర్చకులు, పరిచారకులు దానికి శేషభూతులు. అలాగే కృషి వ్యాపారాదికం శేషి. రైతులు, ఉద్యోగులు ఆకృష్యాదికానికి శేషభూతులు.

**"న అకించిత్ కుర్వతః శేషత్వం"** శేషికి ఉపయోగపడని సొమ్ము శేష మనిపించుకోదు. దాని స్వరూపమే వ్యర్థం. శేషికి, స్వామికి కొంచెం అర్థ భేదముంది. "స్వామి" అంటే తన కంటే వేరే వస్తువులమీద 'ఇవినావి, అనే అభిమానమున్నవాడు.అఖిల జగత్స్వామిన్' (శరణాగతి గద్య). 'శేషి' అంటే వస్తువులతో ఉపయోగం కూడా పొందువాడు. కాబట్టి 'అశేషచిదచిద్వస్తుశేష భూత" - అని (శ.గద్య) విడిగా సంబోధించారు కదా! శాశ్వతమైన మేలునుగోరే హితాన్ని ఉపదేశించేవారు లక్ష్మణార్యులు. స్వార్థ త్యాగ లక్షణ లక్షితులు. దాస్య రసైకనిష్ఠా తత్పరులు కాబట్టి లక్ష్మణార్యశబ్దంచివరకు ప్రయుక్తం. లక్ష్యం అంటే గురి, ఉద్దేశ్యం, ఆదర్శం గొప్పది కాబట్టి అది మొట్టమొదట ప్రయోగింపబడింది. లక్షణాన్ని లక్ష్యంతో సమన్వయించి బోధించే ఉపదేశమాహాత్మ్యాన్ని ఆరు పదాలతో వివరించే శ్లోకమిది.

**1. లక్ష్యం బుద్ధేః :** సర్వార్థసాధనియైన బుద్ధికి లక్ష్యమైనది యతీంద్రోపదేశం. ప్రజ్ఞావంతుడు రామానుజుల వారి శ్రీభాష్యాదిగ్రంథాలను శ్రద్ధతో, పరిశీలించే బుద్ధితో గురు ముఖతః అధ్యయనం చేసి, చిదచిదీశ్వర తత్త్వాన్ని తెలుసుకొని తృప్తిపడుతాడు. 'మామిడిపండు' అనగానే దాని గుణాలను తలచుకొనే మానవునిబుద్ధి ఆ ఫలరసాన్ని ఆస్వాదించడానికి ఇష్టపడుతుందికదా! అలాగే సమగ్రంగా చదివి పూర్ణజ్ఞానాన్ని ఆర్జించడం కంటె వేరే గొప్పతనం లేదు- ఉండదని మానవుని ధిషణ ప్రీతితో ఆశించి సేవింపదగిన యతిరాజుల గ్రంథ సముదాయం. జ్ఞానజనకమని అర్థం.

**2. రసిక రసనా లాస్యలీలా నిదానం :** రసికుల నాలుక నర్తించడానికి మూలకారణమైనదని అర్థం. 'రసన' స్త్రీ లింగం కదా! నర్తకి అభినయాదులను ప్రదర్శిస్తూ నాట్యమాడి రసికులను రంజింపజేస్తుంది. అనుప్రాస,

అర్థాలంకారాలతోనూ, గంభీరభావాలతోనూ, రస ఘన ధ్వనులతోనూ వర్ణస్తోమవిభ్రాజితమైన గద్యత్రయం, శ్రీభాష్యంలోని పంక్తులు రసికుల జిహ్వాగ్రాన నర్తిస్తుంటాయి.

"శేష శేషాశన గరుడ ప్రముఖ నానా విధానన్త పరిజన పరిచారికాపరి చరిత చరణయుగళ"! అని (శ.గ)

**"సర్వత్ర బృహత్వగుణయోగేన హి బ్రహ్మ శబ్దః; బృహత్వంచ స్వరూపేణగుణైశ్చ యత్రాన వధికాతి శయం సోఽ స్యముఖ్యార్థః, సచ సర్వేశ్వర ఏవ; అతో బ్రహ్మశబ్ద స్తత్రైవ ముఖ్యవృత్తః".** (శ్రీ భాష్యం) ఇత్యాది పంక్తులను అనుసంధానం చేస్తూ రసికులు పులకితగాత్రులవుతారు. వారి హృదయం ఆనందంతో తడిసిపోతుంది. మనోరంజకంగా అనుసంధింప దగినదై, కంఠభూషణంగా అలంకరించుకోదగినది రామానుజగ్రంథమాల.

**3. శుద్ధాస్వాదం :** పవిత్రమైనది, పంచదారకల్పిన పాలలాగా భోగ్యంగా అనుభవింపదగినది. శుద్ధం అంటే అసంకీర్ణమైనది. స్వాదుతరమైన రసమని భావం.

**4. శ్రోత్రదివ్యౌషధం:** లోకులు చెవులచే సేవింపదగిన అసదృశమైన ఔషధం. "శ్రోత్రం దైవం, శ్రోత్రేణహితద్వందతే", జ్ఞాన ద్రవ్యం కాబట్టి చెవులతో మాత్రమే అనుభవింపదగిన మందు- అని ఉపనిషద్వాణి. భగవద్రామానుజుల ఉపదేశాన్ని కర్ణామృతంగా సేవిస్తే, చెవులారవింటే, భవరోగం - సాంసారిక వ్యాధి నశిస్తుంది. ఆధ్యాత్మిక సుఖం లభిస్తుంది. లోకులకు ఇతర విషయాలను రక్తితో వినే వ్యాధి సహజంగా ఉంటుంది. అలాంటి దుష్టవ్యాధిని నిర్మూలించే సామర్థ్యం కలిగిన దివ్యౌషధం రామానుజ గ్రంథజాలం. దీన్ని వింటే మరొకటిని వినే రుచి పుట్టదు కాబట్టి ఈ ఔషధం ఆయుష్కరం కూడ.

**5. లక్ష్మీకాంతస్ఫటికముకురః :** భగవంతుని స్వరూప స్వభావాలను ప్రదర్శించే స్వచ్ఛమైన అద్దం. "విభాతి వంశే హరితత్త్వమక్షతం" (16 శ్లో) అన్న వాక్యాన్ని వివరిస్తున్న పదమిది. శ్రీమన్నారాయణుడు ఈ దర్పణంలో

తనను తాను చూచుకొంటాడు. శ్రియః పతియే పరతత్త్వమని స్పష్టంగా తెలిపేది యతిరాజ గ్రంథ సమూహం. ఇతరుల సిద్ధాన్త గ్రంథాలు దేవతాంతర పరత్వాన్ని బోధిస్తాయి. హరి హర బ్రహ్మలలో పరతత్త్వం ఎవరికున్నదో విశదంగా, ప్రామాణికంగా బోధింపజాలవు కదా! కొన్ని వైష్ణవ సిద్ధాన్తగ్రంథాలలోనూ నారాయణుడు మాత్రమే బోధింపబడుతాడు. కాని శ్రీ వైష్ణవసిద్ధాన్తం, భగవద్రామానుజ సిద్ధాంతం మాత్రమే, స్వచ్ఛమైన దర్పణం. కాబట్టి ఈ స్ఫటిక ముకురంలో లక్ష్మీదేవితో కూడి నారాయణుడు తన దివ్యమంగళవిగ్రహాన్ని చూచుకొంటూ అలంకరించుకొంటాడు కదా! అందుకే 'లక్ష్మీకాన్త' పదం ప్రయుక్తం. జగత్కారణుడైన శ్రియః పతి, శ్రీనివాసుడు, శ్రీమన్నారాయణుడే 'పరదేవత'అని అద్దంవలె స్వచ్ఛంగా భాసింపజేసేది శ్రీమద్రామానుజ సిద్ధాన్త గ్రంథ సందోహం.

**6. "లక్ష్యా లక్ష్యైః సితజలధివత్ భాతి తాత్పర్యరత్నైః"** : లక్ష్మణార్యోపదేశం - గ్రంథవారం - స్వచ్ఛమైన సముద్రంతో పోల్చబడింది. 'సితజలధి' అంటే పాలకడలి అని కూడా అర్థం. పాలవలె తెల్లనిది, సచ్ఛమైనది అని భావం. స్వచ్ఛమైన సముద్రంలాంటి ఉపదేశం కాంతులనెగజిమ్మే రత్నాలతో ప్రకాశిస్తుంది. తాత్పర్యాలే రత్నాలు. వెలగలకొన్ని రత్నాలు సలిలోపరితలాననే కనబడు తుంటాయి. మరికొన్ని గభీరజలధిలోమునిగి వెదకితేగాని కనబడవు. కనబడినా వాటి వెల తెలియదు. లక్ష్యా లక్ష్యైః - కొన్ని కనబడినా, కనబడనివెన్నో ఉంటాయి అని అర్థం. వాక్యార్థ విచారంచేసినప్పుడు తాత్పర్యం గ్రాహ్యమైనట్లే అనిపిస్తుంది కాని, పంక్తి సమన్వయంలో ఇంక ఎంతో అర్థం అంతర్భవించి (దాగి) యున్నదని ద్యోతకమవుతుంది. కాబట్టి వేదాన్తశాస్త్ర పారీణులైన ఆచార్యుల సన్నిధిలో అధ్యయనం చేస్తే - లోతుకుదిగి పరిశీలిస్తే - అనర్ఘ రత్నాల వంటి భావాలు హృదయంగమంగా వెల్లడి అవుతాయి. అప్పుడప్పుడు వేదాన్త విద్వాంసులు సమావేశమై శ్రీ భాష్యంలోని వాక్యాలను చర్చిస్తుంటే కొత్తకొత్తవైన తాత్పర్యరత్నాలు జిగేలు మని బయటపడిదెందాన్ని కందళింపజేస్తాయి. దేశికులు దయాశతకంలో (52) "క్వచిదుపలక్షితా క్వచిదభంగుర గూఢగతిః" అన్నట్లు భగవద్రామానుజుల వారి ఉపదేశ జలధిలో తాత్పర్య రత్నాలు లక్ష్యాలక్ష్యాలుగా భాసించడం కేవలం భగవానుని దయాధీనమే కదా!

ఉపమా రూపకాలంకారప్రాణితమైన ఉల్లేఖాలంకారం. మందాక్రాంతా వృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తదుపదేశం స్తౌతి లక్ష్యమితి. బుద్ధేర్లక్ష్యం- యావాన్ ప్రజ్ఞాతిశయోஉస్తి తావతో విషయభూతం. రసిక రసనాలాస్యలీలా నిదానం - రసికానాం నిష్పాపతయా సుకృతాధిక్యేనచ సిద్ధరసికత్వానాం మహాత్మనాం, రసనాలాస్యలీలయాః - రస్యతయా సర్వదా అనుసంధానస్య నిదానభూతం; నః - అస్మాకం; శుద్ధాస్వాద - అనాస్వాదా సంకీర్ణం స్వాదుతరైకర సమితి యావత్. శ్రోత్ర దివ్యౌషధం - శ్రోత్రస్య దివ్యం - దేవనయోగ్యం, ఔషధం - విషయాన్తరశ్రవణ ప్రావణ్య రూప దుర్వ్యాధినివర్తకం, స్వవిషయ ప్రావణ్య జననద్వారా ఆయుష్కరంచ; లక్ష్మీకాంత స్ఫటికముకురః- భగవత్ స్వరూప రూపగుణవిభూతి విశద ప్రకాశకః; లక్ష్మణార్యోపదేశః - రామానుజాదార్య ప్రబంధః; లక్ష్యాలక్ష్యైః ప్రతీయమానార్థై రప్యపరిచ్ఛేద్యైః, తాత్పర్యరత్నైః - తాత్పర్యై రేవ రత్నైః; సితజలధివత్- నిర్మల జలధివత్; భాతి - నిర్మలసముద్రస్థాని ప్రతీయమానా న్యపి రత్నాన్యర్ఘ విశేషతారతమ్యైః అపరిచ్ఛే ద్యాని భవంతి, తద్వత్ అసావపి ప్రతీయమానార్థత్వేஉప్య పరిచ్ఛేద్య తాత్పర్య ఇత్యర్థః.

**34. స్థితి మవధీరయం త్యతి మనోరథ సిద్ధిమతీం**
**యతి పతి సంప్రదాయ నిరపాయ ధనోపచితాః ।**
**మధుకర మౌళిదఘ్న మదదంతుర దంతి ఘటా -**
**కరట కటాహ వాహి ఘన శీకర శీభరితామ్ ॥**

**అర్థం :** యతిపతి సంప్రదాయ నిరపాయ ధన+ఉపచితాః। యతిపతి=రామానుజుల యొక్క, సంప్రదాయ = సంప్రదాయం అనే; నిరపాయ = అపాయంలేని; ధన =ధనం చేత; ఉపచితాః = వృద్ధిని పొందిన వ్యక్తులు. మధుకర మౌళి-శీభరితామ్। మధుకర = తుమ్మెదల యొక్క; మౌళిదఘ్న = తలబంటి ఉన్న; మద=మదజలంచేత; దంతుర = ఎత్తువంతలుగా ఉన్న;

దంతిఘటా = గజ సమూహం యొక్క; కరట కటాహ = గంగాళాల లాంటి చెక్కిళ్ళ నుంచి; వాహి = ప్రహించడంచేత; ఘన శీకర = ఎక్కువైన తుంపురుల చేత; శీభరితాం = తడిసి రమ్యంగా ఉన్నట్టి; అతి మనోరథ సిద్ధిమతీం। అతిమనోరథ = కోరికను మించిన; సిద్ధిమతీం = సిద్ధిని పొందినట్టి; స్థితిం = (స్థితిని) ఐశ్వర్యాన్ని; అవధీరయంతి = తిరస్కరిస్తుంటారు.

**తాత్పర్యము :** యతిరాజుల సంప్రదాయ మనే తరుగులేని ధనంచేత వృద్ధిని పొందిన మానవులు, తుమ్మెదలకు కుత్తుకబంటిగా ఉన్న మదజలం నిమ్నోన్నతంగా ఉన్న గజయూథాల గిండ్లలాంటి కపోలాల నుంచి ధారగా ప్రవహించడం వల్ల అధికమైన మదజల బిందువులచేత తడిసి రమ్యమైనట్టి, కోరికను మించిన సిద్ధిని పొందియుండే స్థితిని - గజాంతమైన ఐశ్వర్యాన్ని తిరస్కరిస్తుంటారు.

**వ్యాఖ్య :** యతిరాజ సంప్రదాయానుయాయులు గజాంతైశ్వర్యాన్ని తృణీకరిస్తుంటారని ప్రశంసించే శ్లోకం.

యతిపతి సంప్రదాయం ఉపనిషత్సారభూతమై, దివ్య ప్రబంధ పారిజాత సుమరజ నిష్యందమై, చిదచిదీశ్వర తత్త్వదర్పణమై వెలసిన విశిష్టాద్వైత సంప్రదాయం. ఈ సంప్రదాయస్థులందరు అంబుజాక్షచరణాంబుజషట్పదులే. కాబట్టి రామానుజ సంయమీంద్ర సంప్రదాయమే నిరపాయమైన ధనం. అగ్ని చోరాదుల భయం లేని, శాశ్వతమైన ఈ యతిపతి సంప్రదాయ ధనం చేత వర్థిల్లుతున్న ధన్యాత్ములు మహోన్నతస్థితిని - ధనాన్ని లక్ష్యపెట్టరు. 'ఉపచితు' లంటే వృద్ధినిపొందుతున్న వారు. 'ఉప' పూర్వక 'చిఞ్' చయనే, ధాతునిష్పన్నమైన పదమిది. "నిదిగ్ధోపచితే" (అమరం)

విశిష్టాద్వైత సంప్రదాయ ధనవంతులు నిరాకరించే గొప్ప ధనమెట్టిదో ఒక్క జటిలమైన దీర్ఘసమాస పదభూయిష్ఠమైన ఉత్తరార్థంచే వర్ణింపబడింది. 'దంతుర' మంటే నిమ్నోన్నతమైనది. మదించి ఉన్న ఏనుగులకే మదజలంస్రవిస్తుంటుంది. "మదోదానమ్" ఏనుగును పీడించే మదజలమని అర్థం. (అమరం) దంతురమైనది దంతిఘటా కరటకటాహం. "దంతీ

దంతావళోహస్తీ". (అమరం) దంతాలు కలది దన్తి; ఏనుగు. "కరిణాంఘటనా ఘటా" (అమరకోశం) "ఘటాతు గజసంహతౌ (నా.ర.మాల) 'ఘటా' శబ్దానికి ఏనుగుల గుంపు అని అర్థం. 'కాకేభగండౌ కరటౌ'. (అమరం) 'కరటోవాయసే బిల్వే దర్దురూటేభగండయోః" (నా.ర.మాల).

'కరటో వాద్యభేదేస్యాత్ కుసుంభ కరిగణ్డయోః। ఏకాదశేచ(శ్రాద్ధేచ వాయసే నింద్య జీవనే' (ప్రతాప నిఘంటువు). 'కరట' శబ్దానికి ఉన్న అనేకార్థాలలో ఇక్కడ 'గజగండస్థల' మని అర్థం.

'కటాహస్తు హర్మ్యస్పృష్టే చ కర్పరే, తైలాది పాకపాత్రే' - (నా.ర.మాల)

'కటాహ' శబ్దానికి 'మేడమీది చదరం' పెద్దగిన్నె (తొట్టి) నూనెను కాచే పాత్ర అనే అర్థాలున్నాయి. 'కరట కటాహ' పదానికి కలశాలతో జలాన్ని తోడుకోదగిన పెద్ద గిన్నెల (గంగాళాల) వంటి 'ఏనుగు చెక్కిళ్ళు' అని అర్థం.

ఎత్తువంతలుగా ఉన్న, పెద్ద గిన్నెల వంటి చెక్కిళ్ల నుంచి, వాసనను పసికట్టి వచ్చిన తుమ్మెదలకు తలమున్కలైనంత మదజలం ప్రవహించడం వల్ల, ఇంక ఆ మదజలబిందువులు చిందడం వల్ల, ఆ ప్రదేశాన్ని రసమయంచేసే అందంగా తడిపే మదగజ సమూహాలు కలిగిన ఐశ్వర్యం గజాంతైశ్వర్యమని లోకం వాకొంటుంది.

"శీకరోఽ౦బుకణాః స్మృతాః" (అమరం). 'శీకృ సేచనే' ధాతునిష్పన్నమైన 'శీకర' పదానికి, గాలిచే ఇటూ-అటూ విసరబడిన 'నీటితుంపురు'లనే అర్థం.

'శీభరితాం'- 'శీభృ'కత్థనే - ధాతువుకు అరన్(ప్రత్యయం ఔణాదికం చేరగా శీభరశబ్దం ఏర్పడింది. "శీభరస్ఫార రమ్యయోః" (నిఘంటువు)

"అనతివేల నమీకరణచోదితైః శిశిరశీకర శీభరి తాంబరైః" (యాదవాభ్యుదయం. 3స.4 శ్లో) 'శీభరితం = స్ఫారీకృతం, రమణీయీకృతంవా' అని అప్పయ దీక్షితుల వారి వ్యాఖ్యానం.

"ధారానిర్యత్సలిల కణికా శీభరైశ్చంద్రకాంతైః" (పాదుకా సహస్రమ్. 902 శ్లో)

'స్థితిం' అనే విశేష్య పదానికి ఉత్తరార్థమే కాక 'అతిమనోరథ సిద్ధిమతీం' అనేది కూడా విశేషణపదమే. భవనప్రాంగణంలో మదగజాలను నిల్పి పోషించడం ప్రాభవ వైభవాలు కలవారిస్థితి కదా! ఆస్థితి 'అతిమనోరథసిద్ధిమతి' అంటే, అనుకొన్నదాని కన్నా అధిక సమృద్ధి కలది. అయితే ఇట్టి మహోన్నతస్థితిని 'ఐశ్వర్యం' అంటారు. మదగజాలను భరించడం వల్ల 'గజాంతైశ్వర్యం' సూచితం. "ఉందు మదకళిత్తన్" మదం స్రవించే ఏనుగులు కల సంపన్నుడని గోదాదేవి తిరుప్పావై'లో బోధించింది కదా! అలాగే సమృద్ధిని కూడా విశదీకరించింది. "వాజ్గక్కుడమ్ నిఱైక్కుం వళ్ళల్ పెరుంపశుక్కళ్ నీఙ్గాదశెల్వంనిఱైన్దు" (తిరుప్పావై. 3) కడుపార మేసిన పెద్ద, పరమోదారగోవులు కొట్టంలో నెమ్మదిగా నిల్చి, పాలను పిదుకుతున్నప్పుడు ఎడతెగని సంపదనిండే రీతిగా, లెక్కించలేనన్ని కడవలను పాలతో నింపేవి. వామనమూర్తి వృద్ధినిజెంది త్రివిక్రముడైనట్లే గోదాదేవి అనుష్ఠించేవ్రతంచేత దేశంలో పాడిపంటలు, సిరిసంపదలు నిరవధికంగా తామరతంపరలై సమృద్ధిని పొంది సర్వశోభనమేర్పడుతుందనికదా ఆ 'శుడర్కొడి' ప్రబోధం.

తమ నాశ్రయించిన వారికి సదుపదేశాలను కృపజేసి, పరిపూర్ణ జ్ఞానవంతులయ్యే విధంగా అనుగ్రహించి, అవిచ్ఛిన్నంగా భగవద్గుణానుభవాన్ని వృద్ధిపరచే యతిపతిసంప్రదాయమే నిజమైన ఐశ్వర్యమని దృఢాధ్య వసాయంకలవారు. ఆత్మోజ్జీవనకాంక్షులందరు – భౌతిక ద్రవ్యం ఎంత మహోన్నత స్థితికలదైనా, గజాంతైశ్వర్యాన్ని కూడా తృణీకరిస్తారు.

దేశికుల కవిత్వం గంభీరమైనా, హేతుమద్భావచమత్కృతి లలితంగా ప్రసన్నమవుతుంది. ప్రాకృత సంపదల వల్ల స్వాతిశయం పెరుగుతుంది. "గర్వమేపార కన్నులుగానరావు. చెవులు వినరావు చిత్తము చిక్కుపడును. మరచునీ సేవలన్నియు" (పోతన) ప్రహ్లాదుడన్నట్లు, అహంకార మమకారాలు వృద్ధిజెంది మోక్షప్రతిబంధకాలవుతాయి కదా! భౌతిక సంపద గజమదం లాగా కారిపోయి నేలపాలవుతుంది. అధోగతికి కారణమవుతుంది. యతిపతి సంప్రదాయధనం నిరపాయమైనది. ఊర్ధ్వగతికి కారణమైనది. కాబట్టి పారమార్థిక

దృష్టి స్థిరమై ఉన్న వ్యక్తులకు భౌతికవాంఛలు నశిస్తాయని, ఇట్టి సత్పథాచారశక్తిని పెంచేది యతిపతి సంప్రదాయమే అని ఉగ్గడించడం ఉక్తి వైచిత్రి.

"త్యాగేనైకే అమృతత్వ మానశుః" అనేశ్రుత్యర్థమే యతిపతి సంప్రదా యార్థమని నిశ్చప్రచం. 'నర్కుటక' వృత్త రచితమీ శ్లోకం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తన్మతస్థానా మైశ్వర్య కైవల్య పురుషార్థాంత రోపేక్షాంవదతి, స్థితిమితి. యతిపతి సంప్రదాయ నిరపాయధనోపచితాః - యతిపతి సంప్రదాయ రూప నిరపాయధనం అతస్కరగ్రాహ్యం శాశ్వతం ధనం, తేనోపచితాః - తేనసంపన్నాః, తత్సం ప్రదాయస్థా ఇత్యర్థః. మధుకరేత్యాది ఉత్తరార్థమేక పదమ్. మధుకరాణాం మౌళిదఘ్నేన - మజ్జనార్హేణ, మదేన దాన ప్రవాహేణ, దంతురే - నిమోన్నతీ కృతే, దంతిఘటానాం - గజసమూహానాం, కరట కటాహే - కపోలస్థలే, వాహిభిః- ప్రవహద్భిః, ఘనైర్బహుళైః శీకరైః శీభరితాం మధూకృతాం, అత్యంత రస్యామిత్యర్థః. అతిమనోరథ సిద్ధిమతీం - మనోరథా ద్యప్యతిశయిత సిద్ధియుక్తాం, స్థితిం - ఐశ్వర్యం, ఐశ్వర్యస్య గజాంత తయాప్రసిద్ధిరస్తి.

అత ఏవముక్తిః. అవధీరయంతి - తిరస్కుర్వంతి. యథా అత్యంత ధనాఢ్యాః కాకణీకాం తిరస్కుర్వంతి తథేత్యర్థః. శీఘరశబ్దో నిపాతనాత్ మధువాచకః

**35. నిరుపధి రంగవృత్తి రసికా నభితాండవయన్**
**నిగమ విమర్శకేళి రసికై ర్నిభృతై ర్విధృతః ।**
**గుణపరిణద్ధ సూక్తి దృఢకోణ విఘట్టనయా**
**రటతి దిశా ముఖేషు యతిరాజయశః పటహః ॥**

**అర్థం :** యతిరాజ యశః పటహః = శ్రీమద్రామానుజుల యశస్సు అనే (పటహవాద్యం) దుందుభి; నిభృతైః = చలనంలేని; నిగమ విమర్శకేళి రసికైః = వేదవేదాన్త శాస్త్ర విచారం అనే లీలయందు ప్రీతిగలవారిచేత; విధృతః (సన్) = ధరింపబడుతూ; గుణపరిణద్ధ - విఘట్టనయా। గుణ = శబ్దార్థ గుణాలచే; పరిణద్ధ = పరిపూరితాలైన; సూక్తి = సూక్తులు అనే; దృఢ = గట్టివైన; కోణ =

వాయించే కఱ్ఱలచేత; విఘట్ట నయా = కొట్టబడడంచేత; నిరుపధి = నిర్వ్యాజంగా; రంగ వృత్తిరసి కాన్ = రంగ విమానమందున్న శ్రీరంగనాథుని యందు ప్రీతిగల వ్యక్తులను; నాట్యరంగమందునటించే రసికులను; అభితాండవయన్ = నర్తింపజేస్తూ; దిశా ముఖేషు = అన్ని దిక్కులందు; రటతి = శబ్దిస్తున్నది. (గుణ = త్రాళ్ళచే; పరిణద్ధ = కట్టి బిగింపబడినదై; అని పటహపరమైన అర్థం.)

**తాత్పర్యము :** సుశిక్షితులైన వేద వేదాంతశాస్త్రార్థ విచారమనే లీల యందు ప్రీతి గల వ్యక్తులు యతిరాజుల కీర్తి రూపమైన భేరి వాద్యాన్ని ధరించారు. సకల గుణపూర్ణసూక్తులు అనే గట్టి కఱ్ఱలతో భేరిని కొట్టి వాయించారు. తత్ఫలితంగా, సంగీత వాద్యధ్వని నాట్యవృత్తిగల రసికులను రంగస్థలమందు ఉల్లాసంగా నటింప జేసేవిధంగా, యతిరాజ యశోరూప పటహవాద్యపరికరం శ్రీరంగేశుని యందు అవ్యాజ ప్రీతిగల శ్రీవైష్ణవులను నర్తింపజేస్తూ దశదిశల ధ్వనిస్తున్నది.

**వ్యాఖ్య :** యతిరాజుల యశస్సును ప్రస్తుతించే శ్లోకమిది.

శ్రీమద్రామానుజులకీర్తి వైభవంగా దశదిశల వ్యాపించే సముచితమైన, అపారమైన కీర్తి "ఏయ్న్ద పెరుంకీర్తి, తిక్కుత్తకీర్తి, ఏరణికీర్తి" అని యతిరాజ సంప్రదాయస్థులు గర్వపడుతూ గంతులువేస్తుంటారు. శ్రీవేదాన్త దేశికులు రామానుజ సిద్ధాన్త నిర్ధారణ సార్వభౌములు కాబట్టి, హరి యశః ప్రభావవైభవాలను నాటకీయ పరిభాషతో వర్ణించి ఆనందించారు.

భరత నాట్యశాస్త్రప్రవీణులైన వ్యక్తులు సంగీత వాద్య పరికరాలను ధరించి సరసకళాకేళిగా వాయించుతుంటే, ఆపాతమధురమైన ఆ వాద్యధ్వని సుశిక్షితులైన నటశేఖరులను రంగస్థలమందు రాసిక్యంగా నర్తింప జేస్తుంది. ఆ వాద్యధ్వని కూడా దూరప్రదేశాలకు ప్రసరిస్తుంది.

వేద వేదాన్త శాస్త్రాలను గురువుల వద్ద అభ్యసించి సుశిక్షితులైన వ్యక్తుల వైదుష్యం నిబ్బరంగా ఉంటుంది. అట్టి రసికులకు 'నిభృత' శబ్దం విశేషణంగా

ప్రయుక్తమయింది. "నిభృత వినీత ప్రశ్రితా స్సమాః" (అమరం) కర్మ విచారంచేసే పూర్వ మీమాంసాశాస్త్ర గ్రంథం శ్రీ 'జైమిని' మునిప్రణీతం. బ్రహ్మ విచారం చేసే ఉత్తర మీమాంసాశాస్త్రం - బ్రహ్మసూత్ర గ్రంథం - శ్రీ వ్యాస మునిప్రణీతం. 'మీమాంస' అంటే విచారమే కదా! కర్మవల్ల అల్పమైన, అస్థిరమైన స్వర్గాదిఫలం లభిస్తుందని తెలుస్తుంది. బ్రహ్మజ్ఞానం వల్ల అనంతమైన, నాశరహితమైన మోక్షఫలం సిద్ధిస్తుందని గోచరమవుతుంది. కాబట్టి, 'తదాహ వృత్తికారః - "వృత్తాత్ కర్మాధిగమాదనంతరం బ్రహ్మ వివిదిషా, ఇతి". బ్రహ్మసూత్ర వృత్తికారులైన బోధాయనమునులు చెప్పినట్లు 'కర్మవిచారం చేసిన తర్వాత బ్రహ్మవిచారం జేయదగినది' అని శ్రీమద్రామానుజులు శ్రీభాష్య గ్రంథంలో తెల్పినారు.

ప్రతిపాదింపబడే విషయభేదాన్ని బట్టి 'పూర్వమీమాస' అని 'ఉత్తర మీమాంస' అనే భేదం కలిగింది. కాని "కర్మబ్రహ్మ మీమాంసయో రైకశాస్త్ర్యం". కర్మబ్రహ్మమీమాంసలు అంటే పూర్వోత్తర మీమాంసలు రెండు కూడా ఒకే శాస్త్రమని శ్రీభాష్యకారులు బోధించారు. ఇట్టి వేదాన్త శాస్త్రార్థ విచారమనే లీలయందు రసికులైన విద్వాంసులు యతిరాజుల యశః పటహాన్ని ధరించారు. యశస్సు అంటే గుణప్రకాశం. 'పటహ' మంటే దుందుభి, భేరి అనే వాద్య పరికరం. "స్యా ద్యశః పటహోఢక్కా" - "భేరీ స్త్రీ దుందుభిః పుమాన్". "ఆనకః పటహోఽ స్త్రీస్యాత్". "పటహో డంబరౌ సమౌ" (అమరం) యశస్సే పటహమని 'అవధారణాపూర్వపదకర్మధారయ సమాసపదం'. పటహవాద్యపరికరం త్రాళ్ళచే కట్టిబిగింపబడి, కోలలచే మోదితే బాగా మ్రోగుతుంది.

వేదాన్తశాస్త్ర వాక్యార్థాలు సరిగా అర్థంకాక తికమకపెడుతున్నప్పుడు యతిరాజుల వ్యాఖ్యాన పంక్తులతో (విమర్శించి) సమన్వయపరచి యథార్థాన్ని గ్రహించిన రసికుల ఆనందం అంబరమందుకొంటుంది. పరస్పర విరుద్ధంగా ఉండే భేదాభేద శ్రుతులకూ, సగుణ నిర్గుణశ్రుతులకూ ఐకకంఠ్యాన్ని ప్రసాదించిన యతి రాజుల యశోవైభవాన్ని ప్రకాశింపజేస్తారు సహృదయులు. గుణ పరిణద్ధసూక్తులు - శబ్దార్థగుణాలతో పరిపూర్ణమైన సూక్తులు లేదా రచనలని

అర్థం. శబ్ద గుణాలంటే ఓజః ప్రసాదమాధుర్య గుణాలు. ఉపమారూప కోత్ప్రేక్షాదులు అర్థగుణాలు. "అసంఖ్యేయ కల్యాణగుణ గణౌఘమహార్ణవ" అని భగవద్గుణాల ఆనంత్యాన్నీ, గాంభీర్యాన్నీ వెల్లడించే సూక్తులే యశః పటహాన్ని వాయించే దృఢమైన కొడుపులు.

"కోణో వీణాది వాదనమ్" (అమరం) వాద్యాన్ని వాయించే కట్టె కొడుపును 'కోణ' మంటారు.

గుణపూర్ణ సూక్తులు అనే గట్టికట్టె కోలలచేత యశః పటహాన్ని కొట్టడం – విఘట్టనం – అంటే శ్రుతిస్మృతీతిహాస పురాణ వాక్యాలనూ, యుక్తి ప్రమాణాలనూ చెప్పి, ప్రతి పక్షులను వాదంలో జయించి భగవద్రామానుజుల కీర్తిని పలు దెసల ప్రకటించడమనే అర్థం ధ్వనిస్తుంది.

రసికులు అంటే రసమెరిగినవారు. మరి రసమేది? 'రసోవైసః' (శ్రుతి) రస స్వరూపుడు భగవానుడే. రంగధాముడే. యశః పటహరటనం ఇతురుల మీదకూడా ప్రభావాన్ని ప్రకటిస్తున్నది. 'నిరుపధి, రంగవృత్తి రసికాన్, అభితాండవయన్' – అవ్యాజంగా శ్రీరంగధామునియందు ప్రీతి–భక్తి–గల వ్యక్తులను ఆనందంగా నాట్యమాడునట్లుచేస్తున్నది అని ఒక అర్థం. 'రంగవృత్తి' అంటే రంగమందిర మందు వర్తించే శ్రీరంగనాథుడు.

'రంగం త్రపుణి రంగోవా రాగే నృత్తస్థలే రణే' (నా.ర.మాల) 'రంగ' శబ్దానికి 'తగరం, ప్రేమ, నాట్యస్థలం, యుద్ధం' అని నానార్థాలున్నాయి. 'వృత్తి' శబ్దానికి 'రసవ్యంజక వృత్తులు, జీవనోపాయం, సూత్రాది వివరణగ్రంథం' అని అనేకార్థాలున్నాయి. 'కైశిక్యాద్యాశ్చ వృత్తయః' (అమరం) ఆంగికాభినయ రూపాలైన కైశిక్యాది వృత్తులు నాట్యాశ్రయాలు కాబట్టి సాక్షాద్రసోపస్కారాలు.

శాస్త్ర ప్రకారం వాయించబడే వాద్యధ్వని చెవికిసోకగనే రంగస్థల నటనా వ్యాపారంగల వ్యక్తులు మహోత్సాహంతో ఆంగికాభినయ ప్రదర్శన రూపంగా నృత్యం చేస్తారని మరొక అర్థం. భగవద్రూపగుణ విభూతులను ప్రామాణిక శ్రుతులతో (సగుణ సిద్ధాంతాన్ని) స్థాపించిన శ్రీభాష్యకారుల యశస్సును విని

నిరుపాధిక భగవద్భక్తిగల శ్రీవైష్ణవ మహానుభావులు క్రమంగా - అప్రతిబంధ మహోత్సాహంగా - నలుదిక్కులనర్తిస్తుంటారని భావం.

"రంగస్థానే రసిక మహితే రంజితాశేషచిత్తే" (భగవద్ధ్యానసోపానం-12) రసికావతంసులు తమడెందమానందధామమయ్యేలాగా ఆడుతూ - పాడుతూ ఉండే స్థానమే శ్రీరంగధామమన్నారుదేశికులు. 'దశధా నిర్వర్తయన్ భూమికాం, రంగేధామని లబ్ధ నిర్భరరసైః అధ్యక్షితో భావుకైః (దశావతారస్తోత్రం-1)

నవరసభరితమైన రంగస్థానమందు పదిరకాల వేషాలువేసిన ప్రధాన నటశేఖరుడే వేంచేసియున్నాడు. ఆత్మభారమంతా సర్వరస స్వరూపుడైన సర్వశేషియందు అర్పించి, 'రసగ్గ్ హ్యేవాయంలబ్ధ్వా ఉనందీ భవతి' అని శ్రుతిపలికినట్లు తద్రసానుభవంగల ప్రపన్నులచే సేవింపబడుతూ వారిడెంద మందు అమందానందాన్ని కందళింపచేస్తున్నది శ్రీరంగం.

'ఊర్ పేరు మరంగమే' (నాచ్చి-తిరు). పవిత్రక్షేత్రం పేరు శ్రీరంగమే. ఇక్కడి దైవమూ శ్రీరంగమే.

రంగేశ భక్తజనమానసరాజహంసయైన రామానుజులవారు 'పొన్న రంగమెన్నిల్ మయలే పెరుగుమిరామానుశన్' (ఇరా.నూ.35) 'శ్రీరంగం అని ఎవరైనా అంటే, ఆ మాటను విన్నంతనే ఆ దివ్య దేశమందున్న ప్రేమ అతిశయించి ముగ్ధులయ్యేవారు అని తిరువరంగత్తముదనార్ వర్ణించారు.

రూపకాతిశయోక్త్యలంకారం. నర్కుటక వృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తద్యశోవ్యాప్తిం వదతి, నిరుపధీతి. యతిరాజ యశఃపటహాః - యతిరాజ యశోరూప పటహాః, యశసః పటహ త్వేన రూపణం, అతిస్ఫుట ప్రకాశతయా; నిగమ విమర్శకేళి నిరతైః - నిగమానాం వేదానాం వేదాన్తానాంచ, విమర్శః - విచారః, తత్రనిరతై ః - తత్పరైః ; పూర్వోత్తర మీమాంసాభి యుక్తైరిత్యర్థః. నిభృతైః - సావధానైః - విధృతః - పరిగృహీతస్సన్; గుణ పరిణద్ధసూక్తి దృఢకోణవిఘట్టనయా - గుణ పరిణద్ధాభిః - శబ్దగుణైః

అర్థగుణైశ్చ పరిపూర్ణాభిః, సూక్తిభిరేవ దృఢైః కోణైః - వాద్యవాదనైః "కోణోవీణాదివాదన" మిత్యమరః. యశసః పటహత్వేన రూపణాత్ కోణత్వేన సూక్తేః రూపణమ్. శబ్దగుణః ఓజస్త్వాదయః, అర్థగుణః ఉత్రేక్షాదయః. విఘట్టనయా-ప్రతిపాదనేన; రంగవృత్తి రసికాన్ - రంగేవృత్తిః వర్తనం యస్యసః రంగవృత్తిః - రంగేశః; తస్మిన్ రసికాన్ - ప్రీతియుక్తాన్, శ్రీవైష్ణవానిత్యర్థః. నిరుపధి - నిర్వ్యాజం; అభితాండవయన్ - ఆనందయుక్తాన్ కుర్వన్; దిశాముఖేషు రటతి - దిగంతేషు ప్రకాశతే. పటహోఽపి నిగమ విమర్శకేళి రసికైః - భరతశాస్త్రజ్ఞైః ధృతస్సన్ రంగవృత్తి రసికాన్ - నృత్త భూమి రసికాన్, తాండవయన్ - నర్తయన్, కోణ విఘట్టనయా ధ్వన తీతి చార్థాంతరం స్ఫురతి.

**36. ఇదం ప్రథమ సంభవత్కుమతి జాలకూలంకషా**
**మృషామతవిషానలజ్వలిత జీవ జీవాతవః ।**
**క్షరం త్యమృత మక్షరం యతిపురందరస్యోక్త యః**
**చిరంతన సరస్వతీ చికురబంధ సైరంధ్రికాః ॥**

**అర్థం :** ఇదం ప్రథమ - కషాః। ఇదం ప్రథమ = ఇదే మొదలుగా,కొత్తగా; సంభవత్ = జన్మించి యున్న; కుమతి = అపార్థాలను కల్పించే వారి యొక్క; జాల = సమూహాలను; కూలం కషాః = ఉన్మూలించునట్టి; మృషా మత-జీవాతవః । మృషామత = మాయావాదం అనే; విష+అనల = విషయుక్తమైన అగ్నిచేత; జ్వలిత = తపింపబడిన; జీవ=ప్రాణులకు; జీవాతవః = జీవనౌషధమైనట్టి; చిరంతన- సైరంధ్రికాః । చిరంతన సరస్వతీ = వేదవాణి యొక్క, చికురబంధ = కొప్పుగా ఉన్న ఉపనిషద్భాగానికి; సైరంధ్రికాః = అలంకరించే స్త్రీల వంటి; యతిపురందరస్య = యతీంద్రుల యొక్క; ఉక్తయః = సూక్తులు; అక్షరం = నాశంలేనట్టి; అమృతం = మోక్షాన్ని; క్షరంతి = ఇస్తున్నవి. స్రవిస్తున్నవి.

**తాత్పర్యము :** శ్రీభాష్యకారుల శ్రీసూక్తులు కొత్తకొత్తగా పుట్టుతున్న కుమతాలను పెళ్ళగించివేస్తాయి. మాయావాద రూపమైన విషాగ్నిచే తపించిన జీవులను బ్రతికించే ఔషధాలవంటివి. శ్రుతికాంతల శిరోజాలను అలంకరించే నెలతుకలు. ఆ శ్రీసూక్తులు శాశ్వత మోక్షదాయకాలు.

**వ్యాఖ్య : యతీంద్రుల శ్రీసూక్తి మహిమను ఉగ్గడించే శ్లోకమిది.**

ఇదం ప్రథమ సంభవత్ – ఇదే మొదలుగా, నూతనంగా జన్మించినవారని అర్థం. యతిరాజు రచనలకాలం వరకు పుట్టని, ఇకముందు పుట్టబోయే కుమతుల వర్గాలను కూలంకషంగా పెళ్ళగించివేసే సామర్థ్యం కలవి యతీంద్ర సూక్తులు. 'కుమతిజాలం' అంటే అపసిద్ధాంతపరుల సమూహం. 'కూలంకషాః' – 'కూలం' అంటే ఏటిదరి, నదీతటం. అడ్డగించే ఇరుదరులను ఒరసి పెళ్ళగిస్తూ వేగంగా పారే ఏరులను కూలంకషలంటారు. 'కూలంకషానిర్ ఝరిణీ' (అమరం). ఆధునికులైన అపసిద్ధాన్తపరులను అణచివేస్తూ ప్రసరించేవి యతిరాజుల శ్రీసూక్తులు. రామానుజ సిద్ధాన్తం ప్రకటితమైన తర్వాత కూడా ఆధునికులు యథార్థమనిగ్రహించక – తమ అభిప్రాయాన్ని మార్చుకొని సుమతులైయుండక – అపసిద్ధాంతపరులై యున్నందువల్ల 'ఇదంప్రథమ సంభవత్ కుమతులు' అనబడినారు. వీరి పాలిట శ్రీభాష్యకార్ల శ్రీసూక్తులు కూలంకషాలే అయ్యాయి.

'మృషామతం' అంటే మాయావాదం. నామరూపాత్మకమైన ప్రపంచ మంతా మాయాకల్పితమే. జగన్మిథ్య, బ్రహ్మసత్యం, నిర్గుణతత్త్వమైన ఆ బ్రహ్మమే నిత్యమైనదని బోధించేది మాయావాదం.

'సర్వ వ్యాపిన మాత్మానం క్షీరే సర్పిరివార్పితమ్'. (శ్వే.ఉ.)

'కఱన్దపాలుళ్ నెయ్యేపోల్' (తి.వా.మొ) ఇప్పుడే పిండిన పాలలో ఉన్న నెయ్యి వలె, సర్వేశ్వరుడైన పరమాత్మ చరాచరపదార్థాలన్నిటిలో వ్యాపించి ఉన్నాడని ఉభయవేదాంతాలు ఘోషిస్తుంటే జగత్తు మిథ్య అనడం అపచారం కదా!

రాజనగరులో ఉన్న ప్రభువు దేశప్రజలను పాలించడానికి కారణం అతని ఆజ్ఞకు అధీనులై అతడు నియమించిన ఉద్యోగులు పాలన వ్యవహారంలో ప్రవర్తించడమేకదా! నేరుగా పాలించే ఉద్యోగులకూ ప్రభువుకూ మిక్కిలిభేధమున్నా, ఆజ్ఞారూప నియమనశక్తిని బట్టి ప్రభువే పాలకుడనడం లోకవ్యవహారం. ఇక పరమాత్మ విషయం ఇంతకంటె గొప్పది కదా! "తత్ సృష్ట్వా, తదేవానుప్రావిశత్"

అని శ్రుతి. ప్రత్యక్షాది ప్రమాణాల వల్ల తెలియని విషయాన్ని తెలుసుకోవడానికి శబ్దం – వేదమే ప్రమాణం కదా! పరమాత్మ ప్రపంచాన్ని సృష్టించి, ఆ ప్రపంచానికి అంతరాత్మగా ప్రవేశించి నియామకుడయ్యాడు. 'యస్య పృథివీ శరీరం' ఇత్యాదిశ్రుతి వాక్యాలు 'ప్రపంచం పరమాత్మకు శరీరం' అని విశదీకరిస్తున్నాయి.

'యస్మాత్ పరం నాపరమస్తి కించిత్, యస్మాన్నాణీయోనజ్యాయోఽస్తి కశ్చిత్। వృక్ష ఇవస్తబ్ధో దివి తిష్ఠత్యేకః, తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్' అనే వేదమంత్రం మహానారాయణోపనిషత్తులోనూ, ముండకోపనిషత్తులోనూ, శ్వేతాశ్వతరోపనిషత్తులోనూ ఉన్నది. ఈ మంత్రం యొక్క వాస్తవార్థమిది.

'పరమాత్మకంటె వేరే అధికమైనదిగానీ, సూక్ష్మమైనదిగానీ లేదు. సర్వేశ్వరత్వ శక్తి కలది వేరే లేనేలేదు. సర్వజగత్కారణ భూతుడైన ఆ పరమాత్మ (ఏకః) ఒక్కరు చెట్టులాగా ఎవరికీ లొంగని ఠీవికలవాడై (దివి) వైకుంఠంలో ఉంటాడు. అట్టి పరమపురుషుని చేత ఈ దృశ్యప్రపంచమంతా వ్యాపింపబడి ఉన్నది.

ఏకశబ్ద వాచ్యమైన ఆ పరమాత్మయే సర్వప్రపంచానికి ఉపాదాన కారణమని బోధింపబడినది. మూల పదార్థం (మట్టి, కుండలుగా ఏర్పడునట్లు) వేర్వేరు రూపాలను పొందితే, దాన్ని ఉపాదానకారణమంటారు. అలాగా పొందిన రూపాంతరాలను ఉపాదేయాలైన కార్యాలు అంటారు. 'ఏకమేవా ద్వితీయమ్' (ఛాం. ఉ.) అద్వితీయమంటే (None to second) 'సాటిలేనిది' అని అర్థం. నిమిత్తకారణమైన పదార్థం మరొకటి లేనేలేదు. జగత్తుకు ఉపాదానమూ, నిమిత్తమూ, ఉభయవిధకారణంగాగల సమర్థుడు సర్వేశ్వరుడని బోధిస్తున్నది. సూక్ష్మచిదచిద్విశిష్టుడైన పరమాత్మయే స్థూల చిదచిద్విశిష్టంగా పరిణమించడం వల్ల ఉపాదాన కారణమే ఉపాదేయకార్యమైనది. బ్రహ్మమెలాగా సత్యమో, జగత్తు కూడా అలాగే సత్యమే. జగత్తు అసత్యం, మిధ్య అనే విధంగా అర్థం ఇక్కడ బోధపడుతులేదు కదా!

ఇక వృక్ష విషయాన్ని ఆలోచిస్తే శ్రీపరాశర మహర్షి ప్రణీతమైన పురాణ రత్నంలోని శ్లోకం స్మరణీయం.

"యథా హి కదళీ నాన్యా త్వక్పత్రాన్నాథ దృశ్యతే ।
ఏవం విశ్వస్యనాన్యస్త్వం త్వంచాపీశ్వర । దృశ్యసే ॥"

త్వక్పత్రాల కంటె కాండరూపమైన కదళీవృక్షం వేరు కాదు. ఆకులతోనూ పట్టలతోనూ విశిష్టమైన - కూడియున్న కాండమే అరటిచెట్టు. అలాగే చిత్, అచిత్ రూపమైన జగత్తుకంటే పరమాత్మ వేరుకాదు. ఆయన స్వరూపం చిదచిద్విశిష్టంగానే ఉంటుంది. విశేషమేమిటి? అంటే, ఆకులు, పట్టలకంటె వాటికి ఆశ్రయమైనకాండ రూపం కూడా అరటి చెట్టుకు ప్రత్యేకంగా ఉంది కదా! అలాగే విశేషణాలై పరమాత్మను ఆశ్రయించి ఉండే చిదచిత్తులకంటె విలక్షణమైన జ్ఞానానందాది అసాధారణ స్వరూపం కూడా పరమాత్మకు ప్రత్యేకంగా ఉంటుంది. ఇట్టి పరమాత్మయొక్క విలక్షణ స్వరూపం యోగి హృద్ధ్యానగమ్యమని సారార్థం.

విశేష్యమైన కాండానికి విశేషణాలైన త్వక్పత్రాలమీద, అది అచేతనమైనందువల్ల, నియంతృత్వ రూపమైన సామర్థ్యం లేదు. విశేషణాలై తనను ఆశ్రయించి ఉన్న చిదచిత్తుల మీద పరమాత్మకు నియంతృత్వం ఉన్నందువల్ల అవి అతనికి నియామ్యాలవుతున్నాయి. అపృథక్ సిద్ధి పూర్వకమైన నియంతృ నియామ్య భావసంబంధాన్ని బట్టి జగద్బ్రహ్మాలకు శరీర శరీరిభావం నిర్ణయింపబడిందని స్పష్టమవుతున్నది.

సర్వాంతర్యామిత్వాన్ని, సర్వోపాదానత్వాన్ని శ్రీ భాష్యకారులు 'ఈక్షత్యధికరణం' లో 'గౌణశ్చేన్నాత్మ శబ్దాత్' అనే సూత్రాన్ని ఉపనిషద్వాక్యాలతో వివరిస్తూ, అద్భుతంగా సమర్థించారు.

ఈ శ్వేతాశ్వతరోపనిషన్మంత్రానికే అద్వైత వ్యాఖ్యానం ఇలా ఉంది. 'వృక్ష ఇవస్తబ్ధః - నిశ్చలః; దివి - ద్యోతనాత్మనిస్వేమహిమ్ని; తిష్ఠతి, ఏకః-అద్వితీయః పరమాత్మా'.

'ఏకః' అనే శబ్దానికి అద్వితీయుడనే అర్థం చెప్పి, బ్రహ్మకు నిర్విశేష నిర్గుణ స్థితిని ఆపాదించింది. 'దివి, తిష్ఠతి' అనే పదాలచేత పరమాత్మకు

'వైకుంఠం' అనే నివాసస్థానం ఒకటి ఉన్నదని చెప్పితే, అతనిలోనూధర్మాలు కొన్ని ఉన్నవని వివరిస్తే 'అద్వితీయత్వం' విరోధిస్తుంది. కాబట్టి 'ద్యోతనాత్మని స్వేమహిమ్ని తిష్ఠతి'- తన ప్రకాశరూపమైన తన మహిమయందుతాను ఉన్నాడు, అనే కల్పితార్థం గమనార్హం. ముఖ్యంగా పరమాత్మచే వ్యాప్తాలైన పృథివ్యాది పదార్థాలూ, 'సోఽ శ్నుతే సర్వాన్ కామాన్ సహబ్రహ్మణా విపశ్చితా'. పరమవ్యోమ మనబడే వైకుంఠంలో ముక్తుడు పరమాత్మతో కలిసి సర్వభోగాలను అనుభవిస్తాడనే శ్రుత్యర్థాలు మాయావాదులకు పరమార్థాలు కావు. అవన్నీ మాయాకల్పితాల నడమే మృషామతం.

'మృషా మిథ్యా చ వితథే' (అమరం) 'మృషా', మిథ్యా అనే అవ్యయాలు 'అసత్యం' అనే అర్థమందు వర్తిస్తాయి.

మృషామతమే విషయుక్తమైన అనలం. విషం, అగ్ని ఈ రెండింటి సమ్మేళనం విషానలం. విషం మింగిన వ్యక్తిని కడుపులో చేరి పేగులు మాడ్చి నశింపజేస్తుంది. అగ్ని తాకినంతనే తన ఉష్ణోగ్రతచేకాల్చి చంపుతుంది. విషసహిత మైన అగ్ని తుల్యమైనదని రూపించడం వల్ల మృషామతం, శాస్త్రార్థం అవగాహన కాకున్నా, తత్సం బంధం చేతనే స్వరూపాన్ని నశింపజేస్తుందని తాత్పర్యం.

మృషామతమనే విషానలంచేత జ్వలితులై నష్టసత్తాకులైన జీవులకు జీవనౌషధాలు యతిరాజ సూక్తులు. 'జీవాతు ర్జీవనౌషధమ్' (అమరం) బ్రతికించే మందును జీవాతువంటారు. దివ్యౌషధాన్ని సేవిస్తే అది విషాగ్నికి విరుగుడై, దానివల్ల కలిగిన బాధలను నివారించి పునర్జీవితులచేస్తుంది. అలాగే రామానుజ సిద్ధాన్తం పాటింపబడినంతనే మాయావాద సంబంధం వల్ల స్వరూప హాని కలిగిన ప్రాణులకు మళ్ళీ సత్తా హేతువతుంది. భగవద్రామానుజ సూక్తులు తత్త్వహిత పురుషార్థాలను యథార్థంగా బోధించడంవల్ల, అవి కుమతి నివర్తకాలై, మాయావాదనిరాసకాలై 'అనన్యార్హత్వం, అనన్య శరణత్వం, అనన్య భోగ్యత్వం' అనబడే 'ఆకారత్రయ సంపత్తి'ని కలిగించి స్వరూప పోషకాలుగా వెలసి ఉన్నాయి, అని సారార్థం.

యతీంద్ర సూక్తులు - కృతులు - సైరంధ్రికలు. అంతఃపురంలోని

దేవేరులకు  గంధలేపనం, తిలకనిర్మాణం, కేశాలంకరణంచేసే నేర్పు కలిగిన నెరజాణలను 'సైరంధ్రికలు' అంటారు. 'సైరంధ్రీ పరవేశ్మస్థా స్వవశా శిల్పకారికా' (అమరం).

'చిరంతన సరస్వతి' అంటే వేదం. చిరంతనం అంటె చిరకాలీనం, ప్రాతదైన అని అర్థం. 'పురాణ ప్రతన ప్రత్నపురాతన చిరంతనాః' (అమరం) వేదాలు ప్రాబలుకులే కదా! 'చిరంతన సరస్వతీ చికురాలు' అంటే వేదాంతాలు- ఉపనిషత్తులు - అని లక్ష్యార్థం. 'చికుర' శబ్దానికి తలవెంట్రుకలు అని అర్థం. 'చికురః కుంతలో వాలః కచః కేశశ్శిరో రుహః' (అమరం) చికురబంధనమే చిత్తరంజకమైన కౌశలం.

తలవెంద్రుకలకు వాసన నూనెనురాసి, చిక్కులను విడదీసి, చక్కగా వాటిని దువ్వి, మూడుపాయలుగా విభజించి, ముచ్చటగా జడను  అల్లి, కొప్పు ముడువడమే ఒక కళాకౌశలం.

1. భేదశ్రుతి 2. అభేదశ్రుతి. భగవద్రామానుజులు స్వహస్తాలచే మూడవపాయగా గ్రహించిన  అంతర్యామి బ్రాహ్మణంలోని ఘటకశ్రుతితో భేదా భేద శ్రుతులను కలిపి ఆకర్షణీయంగా శ్రుతికాంతాచికురబంధం ఏర్పరచడం స్పృహణీయం. వేదశిరోభాగాలైన ఉపనిషత్తులకు శ్రీ భాష్యకారుల శ్రీసూక్తులు సైరంధ్రికలు అంటే పరస్పర విరుద్ధంగా ఉన్న భేదా భేద శ్రుతులకు శరీరాత్మప్రతిపాదకాలైన  ఘటకశ్రుతులతో ఐకకంఠ్యాన్ని సాధిస్తుంటాయి. ఒక ప్రభ్వీణికి సైరంధ్రికలు ఎందరో ఉంటారు. అలాగే, ఐకకంఠ్యాన్ని సాధించే విషయమందు కూడా ఘటకశ్రుతులు, లౌకికన్యాయాది ప్రమాణాలు చాలా ఉన్నాయి. యతిపురందర సూక్తులు అక్షరమైన అమృతాన్ని - మోక్షాన్ని ప్రసాదిస్తాయి.

'అక్షరంతు మోక్షేఽపి (అమరం). 'వర్ణేబ్రహ్మణ్యక్షరంస్యాత్' (శేషనిఘ) 'అక్షరం ప్రణవే ధర్మే ప్రకృతౌ తపసిక్రతౌ; వర్ణే మోక్షేచ నా త్వేషశివవిష్ణు విరించిషు' (నా.ర.మా.) 'అక్షరం' అంటే తరుగు - నాశనం లేనిది.

'అమృత' శబ్దం మోక్షార్థకం. 'ముక్తిఃకైవల్య నిర్వాణశ్రేయోనిశ్శ్రేయ సామృతం, మోక్షోఽ పవర్గః' అమరం.

యతీంద్ర శ్రీసూక్తులు అక్షరుడైన భగవానుణ్ణి సాక్షాత్కరింపజేస్తాయి. రసావహాలుకాబట్టి అవి శ్రద్ధతో అభ్యసించిన వారికి అమృతాన్నీ ప్రవిస్తాయి. శాశ్వతానందాన్ని అంకురింప జేస్తాయి.

ఒక్క శ్రీసూక్తులనే అనేక విధాలుగా వర్ణించడం వల్ల ఉల్లేఖాలంకారం. పృథ్వీ వృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అధతత్ సూక్తి వైభవం వదతి, ఇదమితి. ఇదం ప్రథమ సంభవత్ కుమతి జాల కూలంకషాః - ఇదానీముత్పన్నం స్వరూపం ప్రథమం యస్యతత్ ఇదంప్రథమం. నూతన మిత్యర్థః. తథా సంభవతాం, ఉత్పత్స్యమానానాం కుమతి జాలానాం - కుదృష్టి సమూహానాం, ఇతః పరం ఉత్పత్స్యమానానా మపీత్యర్థః. కూలం కషాః -బాధికాః; మృషా మత మేవమా యిమతమేవ, విషానలః-విషయుక్తాగ్నిః. విషస్యాంతః ప్రదేశే నాశకత్వమ్, అగ్నే రత్యంత సంయోగే నాశకత్వమ్. విషానలస్తు బహిఃకించిత్ సంబంధేఽ పి నాశకోభవతి; తద్వదిదమపి ఆంతరానభిమతత్వేఽ పి అంతఃశాస్త్రా నవగాహనేఽ పి సంబంధమాత్రాత్ స్వరూప నాశకమితిద్యోతనార్థం విషసహితాగ్ని తుల్యత్వేన రూపణమ్. తేనజ్వలి తానాం - నష్టసత్తాకానాం, జీవానాం జీవాతవః జీవనౌషధభూతాః. 'జీవాతుర్జీవనౌషధమ్' ఇత్యమరః. యథా దివ్యౌషధం స్వసంబంధమాత్రేణ విషనివర్తన ద్వారా సత్తా హేతుర్భవతి, తథైవే తాశ్చ స్వసంబంధ మాత్రేణ కుమతి నివర్తకాః సత్తాహేతవో భవంతి. ఇదము త్పన్నానాం కుదృష్టీత రాణాం నిరసనస్యా ప్యప లక్షణమ్.

చిరంతన సరస్వతీ చికురబంధ సైరంధ్రికాః - చిరంతనాః -చిరకాలీనాః సరస్వత్యః - వేదాః. -తాసాంచికురాణి - శిరోరుహాః, తై ర్వేదాన్తా లక్ష్యంతే; తేషాంబంధనే ఐకకంఠ్యాపాదనే, సైరంధ్రికాః - ప్రసాధికాః, కుశలా ఇత్యర్థః. చికురబంధే సైరంధ్రికానాంకౌశలాతిశయోఽ స్తీతి సైరంధ్రికా త్వరూపణమ్. యతి పురందరస్య - యతీశ్వరస్య, ఉక్తయః ప్రబంధాః, అక్షరం - అక్షయం;

అమృతం-మోక్షం, క్షరంతి - చేతన ప్రయత్ననిరపేక్షం స్వసంబంధమాత్రాత్ స్వయమేవ ప్రయచ్ఛంతీ త్యర్థః. ర సా వ హా ఇతి చ స్ఫురతి.

**వ్యాఖ్యానాంతరమ్** : ఇదమితి. అయమేవకాలః ప్రథమ దివసో యస్మిన్ కర్మణి తద్యథా తథా సంభవత్ యత్ కుమతి జాలం, తస్య కూలంకషాః; చిరంతనేత్యాది. చిరంతన సరస్వతీ - వేదవాణీ, తస్యాః చికురబంధః - ఉపనిషద్భాగః - తస్యసైరంధ్రికాః - తత్రత్య గ్రంధ్యాది నివర్తికాః; ఉపనిషద్భాగ గతా ప్రతిపత్తి, విప్రతిపత్తి, అన్యథా ప్రతిపత్తి పరస్పర విరోధభ్రాంత్యాది నివారణేన ఐకకంఠ్యం సంపాదకా ఇతిభావః. ఇతి సంకల్పసూర్యోదయటిప్పణీ.

ఇదం శబ్దేనాద్యతనః కాల ఉచ్యతే. స ఏవ ప్రథమ దివసో యస్మిన్కర్మణి యథా తథా సంభవత్ ఇదానీంతనమ్. కుమతిజాలం - బాహ్య కుదృష్టీనాంజాలమ్. తస్యకూలంకషాః-ఉత్కూలనం కుర్వంతః; ఆధునికకుమతి మతజాలోత్పాటన సమర్థా ఇత్యర్థః. మృషామతం- మాయావాదః, సఏవవిషానలః తేన జ్వలితానాం జీవానాం జీవాతవః - జీవనౌషధాని. చిరంతన సరస్వత్యాః - వేదవాచః, తాసాంచికురబంధః-కుంతల బంధః, ఉపనిషద ఇత్యర్థః, తస్యసైరంధ్రికాః - అలంకర్త్ర్యః. యతిశ్రేష్ఠస్యోక్తయః శ్రీభాష్యాదయః. అక్షయ మమృతం మోక్షం, క్షరంతి - స్రవంతి - దదతీత్యర్థః పీయూషప క్షేశ్రోత్రయోరితిశేషః. ఇతి ప్రభావలీ.

**అన్యావ్యాఖ్యా** : ఇదమితి వర్తమానః కాలఃప్రథమః యస్మిన్ కర్మణి తత్ ఇదం ప్రథమం యథాతథా సంభవతఃకుమతి జాలస్య నవీనయుక్తీనాం. యతీశ్వరస్య ఉక్త్యావిర్భావకాలేఽ నవస్థితానామపినివర్తికా ఇత్యర్థః. గోబలీవర్దన్యాయే నాద్వైత దూషణప్రాధాన్యమవలంబ్యాహమృషేతి. జీవాతవః -జీవనౌషధభూతాః చిరంతన సరస్వత్యాః - శ్రుతయః - తాసామేవస్త్రీణాం చికురంబంధః - ఉపనిషద్వాక్య జాతం. సైరంధ్రికాః - తత్పరిష్కరణార్థం స్త్రియః . ఉపనిషద్వా క్యరూపాన్ చికురాన్ వికీర్ణాన్త్రేధా భేధా భేద ఘటకశ్రుతి రూపేణ విభజ్య అన్యోన్య యోజనాత్ అశైధిల్యసంపాదికాః.

37. సుధా శన సుదుర్గ్రహ శ్రుతిసమష్టి ముష్టింధయః
కథా హవమసౌ గతాన్ కపట సౌగతాన్ ఖండయన్ ।
మునిర్మనసి లక్ష్మణో ముద ముదంచయ త్యం జసా
ముకుందగుణ మౌక్తిక ప్రకర శుక్తిభిః సూక్తి భిః ॥

**అర్థం :** అసౌ = ఈ, లక్ష్మణః = లక్ష్మణుడనే; మునిః = సంయమి. సుధాశన – ధయః । సుధా+అశన = అమృతం ఆహారంగా గల దేవతలకు, సుదుర్గ్రహ = తెలుసుకోవడానికి మిక్కిలి అశక్యమైన, శ్రుతి సమష్టి = వేదరాశిని, ముష్టింధయః = పిడికిట పట్టుకొని పానంచేసేవాడు. (అత ఏవ= కావుననే), కథా + ఆహవం = వాదకలహాన్ని; గతాన్ = పొందిన, కపట సౌగతాన్ = ప్రచ్ఛన్న బౌద్ధులను; ముకుంద – శుక్తిభిః ; ముకుంద = ముక్తినీ, భుక్తినీ ఇచ్చే భగవానుని యొక్క; గుణ = గుణాలు అనే; మౌక్తిక = ముత్యాల యొక్క ప్రకర = సమూహాలకు; శుక్తిభిః = ముత్తెపు చిప్పలవంటి; సు+ఉక్తిభిః = సూక్తులచేత; ఖండయన్ = ఖండిస్తూ, ఓడిస్తూ, (నః = మనకు) అంజసా = శీఘ్రంగా; మనసి = మనస్సున; ముదం = సంతోషాన్ని; ఉదంచయతి = పైకి ఉబుక చేస్తుంటాడు.

**తాత్పర్యము :** ఈ లక్ష్మణముని దేవతలు కూడా బాగా తెలుసుకోజాలని వేదరాశిని కబళీకరించేవాడు కాబట్టి ముకుందుని గుణరూపాలైన ముత్యాలను ఉత్పాదించే శుక్తుల లాంటి శ్రీసూక్తులచేత, వాదానికి కాలుద్రువ్వే కపట బౌద్ధులను పరాజితులజేస్తూ మనకు శీఘ్రంగా మనస్సులో హర్షాతిరేకాన్ని కలిగిస్తుంటాడు.

**వ్యాఖ్య :** ప్రతిపక్షులను పరాజితులజేసి, స్వపక్షులను సంతోషింపజేసే లక్ష్మణ ముని నైపుణ్యాన్ని స్తుతించే శ్లోకం.

మాయావాదులను ఓడించడమూ, అస్మదాదులకు ఆనందాన్ని కలిగించడమూ – ఈ రెండు విషయాలను బట్టి రామానుజులను ఇక్కడ 'లక్ష్మణ' (శబ్దం) నామధేయంతో సూచించడం గమనీయం.

1. ధర్మాత్మా సత్యసంధశ్చ రామోదాశరథిర్యది ।
పౌరుషే చా ప్రతిద్వంద్వః శరైనంజహిరావణిమ్ ॥

"ఓ బాణమా! దశరథపుత్రుడైన శ్రీ రాముడు ధర్మాత్ముడూ, సత్యసంధుడూ, పౌరుషమందు అప్రతిద్వంద్వుడూ అయితే, ఈ ఇంద్రజిత్తును సంహరింపుము" అని లక్ష్మణుడు శ్రీరాముని గుణాలను స్తుతించి, ప్రతిజ్ఞ చేసి, బాణాన్ని ప్రయోగించి కృతార్థుడయ్యాడు. లోకులకు కలిగే అనుమానం శ్రీ వాల్మీకికి కూడా కలిగింది కాబట్టి తాను లక్ష్మణునిద్వారా మూడు గుణాలపై శపథం చేయించి, శ్రీరాముడు మర్యాదా పురుషోత్తముడని నిరూపించాడు.

1. **ధర్మాత్ముడు :** "వృక్షైరాత్మాన మావృత్య వ్యతిష్ఠన్ గహనే వనే"– రాముడు సాంద్రారణ్యంలో చెట్ల చాటునదాగి ఉండి వాలిని వధించడం వల్ల 'ధర్మాత్ముడు కాదు' అనే అపవాదాన్ని తొలగించే శపథమిది.

2. **సత్యసంధుడు :** "శ్రీమానకృతదారశ్చ లక్ష్మణో నామ వీర్యవాన్" – శ్రీమాన్ లక్ష్మణుడనే పరాక్రమవంతుడు పెండ్లికాని వాడు, అదిగో! అని రాముడు శూర్పణఖను అటు పరుగెత్తించడం వల్ల – ముఖ్యంగా 'అకృతదారు' డనడం వల్ల 'అబద్ధీకు'డనే అనుమానాన్ని నివారించే ప్రతిజ్ఞ.

3. **పౌరుషమందు అప్రతిద్వంద్వుడు :** "అపాసర్పత్ ద్విత్రిపదంకించిత్ త్వరితవిక్రమః" – ఖరుడనేరాక్షసుడు హఠాత్తుగా పర్వతాకారుడై తన ముందునిలిచినప్పుడు, ఆ లీఢపాదుడవడానికి – ముందుకు కాలు చాచి నిలవడానికి – స్థలంలేనందువల్ల రెండు మూడడుగులు వెనుకకు జరిగిన రాముడు వెనుకంజవేసినవాడే కాని అద్వితీయ పౌరుషవంతుడెలా అవుతాడు? అనే ప్రశ్నకు దీటైన సమాధానకృత్యమిది.

లక్ష్మణుడు భగవద్గుణానుసంధానంచేసి, వేసిన బాణం ఇంద్ర జిత్తును వధించింది కదా!

2. **విభీషణో హనుమాంశ్చ జాంబవాంశ్చార్క్ష యూథపః ।**
**విజయేనాభినందంతః, తుష్టువు శ్చాపి లక్ష్మణమ్** ॥ (6-91-97)

విభీషణుడు, హనుమంతుడు, జాంబవంతుడు మొదలైన వానరయోధులు విజేతయైన లక్ష్మణుణ్ని అభినందిస్తూ అమందానందాన్ని పొందారు కదా। సుధాశనులకు సుదుర్గ్రహమైనది శ్రుతిసమష్టి. శ్రీ భాష్యకారులు

'దేవతాధికరణం'లో చెప్పినట్లు దేవతలకు శరీరాలున్నాయి, పరికరాలున్నాయి. బ్రహ్మ విద్యాధికారమూ ఉంది. కలకాలం భోగాలను అనుభవించాలనే ఆశతో ఓషధులను తెచ్చివేసి త్రచ్చిన కడలినుంచి జనించిన అమృతాన్ని పానంచేసిన వారేకాని భగవద్గుణామృతాన్ని పానంచేసే ప్రయత్నం దేవతలు సాధారణంగా చేయరు. స్వర్గంలో కర్మదేవతలూ ఉన్నారు. వారి పుణ్యం క్షీణించేదాకా నాకవాసులై తర్వాత తిరిగి వారీలోకానికి రావలసిన వారేకదా! దేవతలు శబ్దస్పర్శరూపాది విషయలోలురే కాబట్టి వారికి అనంత వేదాలను అనుశీలించి గభీరార్థాలను గ్రహించేసామర్థ్యంలేదు. గుణమే పూజ్యం కదా! భగవద్విషయ ప్రావణ్యం లేని వారెవరైతే నేమి? సుధాశనులైనా వేదరాశి వారికి సుదుర్గ్రహమే. అంతేకాదు భగవద్రామానుజులవారు భూదేవతలనూ "పారాశర్యవచస్సుధా ముపనిషద్దుగ్ధాబ్ధి మధ్యోద్ధృతాం – సుమనసో భౌమా ః పిబంత్వన్వహమ్" అని ఆదేశించారు. 'సుమనసః' అంటే మంచి మనస్సును కలవారు, ఇంక 'దేవతలు' అని కూడా అర్థం. సుమనస్కులైన మహానుభావులు ఉపనిషత్తులనే పాలకడలినుంచి ఉద్ధరింపబడిన వ్యాసభగవానుని వాగమృతాన్ని నిత్యం పానం చేయాలి అని ప్రబోధించారు. ఈ బ్రహ్మ విద్యను అభ్యసించే ప్రజ్ఞగల విద్యార్థులకైనా పైపైన అధ్యయనం చేస్తే వేద వేదాన్తార్థాలు బోధపడవుకదా! 'పీయూష మమృతం సుధా' – (అమరం).

అగస్త్యుడు సముద్ర జలాన్ని ఒక్కచుక్కకూడా మిగులకుండా ఆచమానం చేసినట్లు, శ్రీమద్రామానుజులు సుధాశనులకు సుదుర్గ్రహమైన శ్రుతి సమష్టిని పిడికిట పట్టుకొని పొట్టన పెట్టుకొన్నవారుకదా! 'ముష్టింధయః' అలుక్ సమాసం. (ముష్టింధయతి ఇతి) 'స్తనంధయః' వంటి శబ్దమిది. బాలకుడు అనే అర్థం. పిల్లలు పిడికిలిని (తమబొటనవ్రేలును) చప్పరిస్తుంటారు కదా! కరతలామలక మని భావం.

రామానుజులవారు బాల్యంలోనే 'కప్యాస' శ్రుతివాక్యానికి అర్థాన్ని ఎంత గంభీరంగా వివరించారో వారి చరిత్రయే బోధిస్తుంది.

వేదాలనన్నిటినీ పుక్కిట పట్టిన వారు కాబట్టి లక్ష్మణమునులు తమ

శ్రీ సూక్తులచేత కపట సౌగతులను కథాహవమందు ఖండించేవారు. "సర్వజ్ఞ స్సుగతో బుద్ధః" (అమరం) బుద్ధునికి సుగతుడని పర్యాయపదం. సుగతునికి సంబంధించినవారు 'సౌగతులు'. బౌద్ధులు వేదాలను ఒప్పుకోరు, అంగీకరించరు కాబట్టి 'వేదబాహ్యులు' అనబడుతారు.

'బాహ్యాభ్యంతర పదార్థాలు సిద్ధమైనవికావు. క్షణికాలే. సర్వం శూన్య మనడమే తత్త్వం. అభావమైపోవడమే మోక్షం' అనే బౌద్ధులను 'శూన్యవాదు' లంటారు.

'సర్వథానుపపత్త్యధికరణం'లో 'సర్వంశూన్యం' అనే మతం కూడా అసత్యమే అవుతుంది కాబట్టి 'సర్వశూన్యవాదం అసంభవం' 'సర్వం సత్యమే' అని సిద్ధాన్తీకరించారు శ్రీ భాష్యకారులు.

వేదాలను అంగీకరిస్తూ - ఒప్పుకొంటూనే 'సర్వం మిథ్య' అనే అద్వైతులను కపటసౌగతులు - ప్రచ్ఛన్న బౌద్ధులు అన్నారు. శ్రుతులకు గల యధార్థాలనుగ్రహించనందువల్ల వారిని "కుదృష్టులు, కుమతులు" అన్నారు. 'సర్వం మిథ్య' అనడంతగదు. 'మిథ్యాభూత శాస్త్రజన్య జ్ఞానస్య మిథ్యాత్వేన తద్విషయస్యాపిబ్రహ్మణః మిథ్యాత్వమ్'. శాస్త్రం లేకుంటే శాస్త్రమున్నదనే జ్ఞానం మిథ్య అవుతుంది. మిథ్యయైన శాస్త్రం వల్ల కలిగే జ్ఞానంచేత తెల్పబడే బ్రహ్మకూడా మిథ్య అని యేర్పడుతుంది.

"శూన్యమేవ తత్త్వమితి వాక్యేన తస్యాపి బాధదర్శనాత్" శూన్యమే తత్త్వమనే మాట శాస్త్రాన్ని కూడా బాధిస్తున్నదిగా కనబడుతుంది. కాబట్టి 'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ'. శ్రుతివాక్యం బ్రహ్మయొక్క స్వరూపాన్ని తెల్పుతుంది. 'బహుస్యాం ప్రజాయేయ' అనే వేదాన్త వాక్యం వల్ల 'నేను అనేక ప్రకారాలుగా అవుతాను' అని బ్రహ్మ సంకల్పించుకొని 'ఆత్మానం స్వయ మకురుత' తానే స్వయంగా సర్వమైనాడు.

"ఆదిత్య వర్ణం తమసస్తు పారే, సర్వాణి రూపాణి విచిత్యధీరః, నా మానికృత్వా అభివదన్ యథాఽ స్తే" (పురుషసూక్తం) బ్రహ్మ ఆదిత్య వర్ణుడు,

పరమవ్యోమాన అధిష్ఠితుడు. ఆ ధీరుడు బహురూపాలను సృజించి, వాటికి పేర్లను కూడా పెట్టి ఉన్నాడు అని బోధిస్తుంది.

"నిర్గుణం, నిరంజనం, నిష్కళం, నిష్క్రియం, శాన్తం" అనే శ్రుతి వాక్యాలు భగవానునికి రూపం లేదు, గుణం లేదు, విభూతి అంటే నియామకంలేదు అని బోధించవు. ఆ మాటలు కేవలం ప్రకృతితో సంబంధించిన హేయగుణాలు లేనివాడు భగవానుడని బోధిస్తున్నాయి.

"ఏష ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽ పిపాసుః, సత్యకామః సత్య సంకల్పః" – ఈ పరబ్రహ్మ పాపరహితుడు, ముదిమి, మరణం, దుఃఖం, ఆకలి దప్పులు లేనివాడు; సత్యకాముడు, సత్యసంకల్పుడు – అని ఛాందోగ్య వాక్యాలు జ్ఞాన స్వరూపుడైన పరబ్రహ్మకు జ్ఞాతృత్వాది కల్యాణ గుణాలు సహజాలు. హేయగుణాలు లేనేలేవని – సగుణ నిర్గుణ వాక్యాల ఉద్దేశ్యాన్ని విశదపరుస్తున్నవనీ, శ్రీవ్యాస భగవానుని అభిప్రాయ మిదే అనీ ప్రతి అధికరణంలోనూ 'సర్వం సత్యమే' అని లోక న్యాయంతోపాటు ప్రబోధించారు శ్రీమద్రామానుజులు.

కాబట్టి యతిరాజుల కృతులు – సూక్తులు ముత్తెపుచిప్పలన్నారు దేశికులు. నిర్గుణత్వాన్ని నిరసించి సగుణత్వాన్ని ప్రతిష్ఠించే సూక్తులని అర్థం. 'ముకుందుడు' అంటే ముం = ముక్తిని; కుం = (భూమిని) భుక్తినీ; దదాతి = ఇచ్చే వాడని అర్థం. ఐహికాముష్మికాలను ప్రసాదించేవాడు.

**ముకు మిత్యవ్యయం మాంతం నిర్వాణం మోక్షవాచకం ।**
**యస్త ద్దదాతి భక్తే భ్యో ముకుందస్తే న కీర్తితః ॥**

మకారం అంతమందు కలిగిన అవ్యయం ముకుం. అది మోక్షార్థకం. బ్రహ్మోపాసన – ధ్యానం – చేసే భక్తులకు మోక్షమిచ్చేవాడు కాబట్టి, పరమాత్మ ముకుందుడని కీర్తింపబడినాడని శ్లోకార్థం.

ముకుందుని కల్యాణగుణాలు అనే ఆణిముత్యాలు పుట్టే శుక్తుల వంటి తమ శ్రీసూక్తులచేత ప్రచ్ఛన్న బౌద్ధులైన అద్వైతులను వాదకలహంలో ఓడించారు శ్రీమద్రామానుజులు.

జయాపజయాలు దైవాధీనాలే కదా! పర్యవసానమెలా ఉంటుందో ఆందోళన చెందే స్వాశ్రితుల అంతరంగాన్ని శీఘ్రంగా విజేతయైన లక్ష్మణ ముని సంతోష రసతరంగితం చేశారు.

ఈ శ్లోకమందు వృత్త్యను ప్రాస అనే శబ్దాలంకారం ఉంది. 'గుణమౌక్తిక ప్రకర'. మనే చోట రూపకమనే అర్థాలంకారమూ ఉంది. "మునిర్మనసి లక్ష్మణః" అనే ఉపమేయ వాక్యార్థమందు ఉపమానవాక్యార్థం యొక్క అభేదారోపం గమ్యం కాబట్టి 'పదార్థవృత్తి నిదర్శనాలంకారం' పృథ్వీ వృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తమే వస్తౌతి, సుధాశనేతి. ముకుందగుణ మౌక్తిక ప్రకర శుక్తిభిః ముకుంద గుణా ఏవమైక్తికాని, తేషాంప్రకరః - సమూహః, తస్య శుక్తిభిః - ఉత్పాదికాభిః, నిర్గుణత్వనిరాసేన సగుణప్రతిష్ఠికాభిరి త్యర్థః. 'సూక్తిభిః - వాగ్భిః. కథాహవంగతాన్ - వాదాహవం ప్రాప్తాన్; కపటసౌగతాన్ - ప్రచ్ఛన్న బౌద్ధాన్ - శంకరాదీన్; ఖండయన్ - పరాజితాన్ కుర్వన్; సుధాశన సుదుర్గ్రహశ్రుతి సమష్టి ముష్టింధ యః. సుధాశనానాం - దేవానాం, సుదుర్గ్రహాయాః - అత్యంతం దుర్గ్రహాయాః, శ్రుతి సమష్టేః - వేదసమూహస్య, ముష్టింధయః - ముష్ట్యాపాతా, అనాయాసేన చుళకీకృతే త్యర్థః అసౌ లక్ష్మణమునిః. 'న' ఇత్యధ్యాహార్యం. తథా చ నః - అస్మాకం; మనసి చేతసి, అంజసా - శీఘ్రం 'స్వరసత ఇతివా' ముదం ఉదంచయతి - హర్షప్ర కర్షం జనయతి.

**38.** **కపర్ది మత కర్దమం కపిల కల్పనా వాగురాం**
**దురత్యయ మతీత్య తద్ద్రుహిణ తంత్రయంత్రోదరమ్।**
**కుదృష్టి కుహనా ముఖేనిపతతః పరబ్రహ్మణః**
**కరగ్రహణ విచక్షణో జయతి లక్ష్మణోఽయంమునిః ॥**

**అర్థం :** దురత్యయం = దాటశక్యంకాని; కపర్దిమత కర్దమం = శైవమతం అనే బురదను; కపిల కల్పనా వాగురాం = సాంఖ్యమతస్థుల కల్పన అనే వలను; తత్ ద్రుహిణ - దరమ్; తత్ = ప్రసిద్ధమైన, ఆ; ద్రుహిణ తంత్ర = సేశ్వర సాంఖ్యం అనే; యంత్ర+ఉదరం = యంత్రం యొక్క మధ్యభాగాన్ని ; అతీత్య=దాటి; కుదృష్టి కుహనా ముఖే = కుదృష్టుల వంచన రూపమైన

ముఖమందు; నిపతతః = పడుతున్న; పరబ్రహ్మణః = పరబ్రహ్మ యొక్క; కరగ్రహ విచక్షణః = చేతిని పట్టుకోవడానికి (రక్షణ కోసం) సమర్థుడైన; అయం = ఈ; లక్ష్మణః, మునిః = లక్ష్మణ యతి; జయతి = ప్రకాశిస్తున్నాడు.

**తాత్పర్యము :** దాటడానికి అశక్యమైన శైవమతమనే బురదనేలనూ, సాంఖ్య మతస్థుల కల్పన అనే వలనూ, సేశ్వర సాంఖ్యుల మతమనే యంత్ర మధ్యభాగాన్నీ దాటి, కుదృష్టుల వంచన అనే (ముఖ) బిలమందు పడుతున్న పరబ్రహ్మయొక్క చేతిని పట్టుకొని రక్షించే సమర్థుడైన ఈ రామానుజముని ఉత్కృష్టంగా ప్రకాశిస్తున్నాడు.

**వ్యాఖ్య :** యతిరాజుల మహోపకారాన్ని ప్రశంసించే శ్లోకమిది. నారాయణ పారమ్యాన్ని, గుణ విగ్రహ విభూతులను సమర్థించి, సత్తను కలిగించిన వారు శ్రీ మద్రామానుజులు. కాబట్టి యతిరాజులు పరబ్రహ్మను చేయూత నిచ్చి రక్షించారని వర్ణితం. కపర్ది మతం అంటే శైవమతం. కపర్దం – జటాజూటం కలవాడు కపర్ధి, శివుడని అర్థం 'ఉగ్రః కపర్దీశ్రీకంఠః' – (అమరం)

"ద్విష్టత్వ మిష్టత్వ మప వ్యవస్థమ్" (నైషధం) అని శ్రీహర్షుడు చెప్పినట్లు సుఖదుఃఖ భావాలు నియతంగా ఉండేవి కావు. బంధాత్మకమైన దుఃఖాన్ని బాపుకొని మోక్షాత్మకమైన సుఖాన్ని తెలుసుకోవడం లోకులకు అత్యావశ్యకం. 'బుద్ధిరేవ జయత్యేకా పుంసః సర్వార్థసాధనీ'. అన్నట్లు సకల వ్యవహారాలను సాధించే కారణం బుద్ధియే కదా! పూర్వం ప్రజ్ఞావంతులు తమబుద్ధి బలంచేత 'ప్రమాణాధీనో ప్రమేయనిశ్చయః' – అన్నట్లు ప్రమాణాల నేర్పరచుకొని ప్రమేయాలను పరిశీలించి, తత్త్వనిర్ణయంచేసి, బంధమోక్షాల విషయంలో తమ సిద్ధాంతాలను ప్రకాశింపజేశారు.

కపర్దిమతాన్నే శైవమతమనీ, పాశుపతమతమనీ అంటారు. ఈ దర్శనంలో 'పతి, పశువు, పాశం' అనే మూడు పదార్థాలున్నాయి.

'పతి' అంటే జగద్గురువైన పరమశివుడు. 'పశువు' అంటే పరతంత్రుడైన జీవుడు. 'పాశం' అంటే అచేతనమైన కర్మ. ప్రాణులకర్మను బట్టి పరమేశ్వరుడు

సృష్టిస్తాడు. ఈశ్వరుని శరీరం ప్రాకృతపాంచభౌతికం కాదు. అది శక్తి రూపాలైన ఐదుమంత్రాలచే కల్పితం.

'ఈశానః సర్వ విద్యానామ్' అనే మంత్రంచేత శిరస్సు.

'తత్పురుషాయ విద్మహే' అనే మంత్రంచేత ముఖం.

'అఘోరేభ్యోఽథ' అనే మంత్రంచేత హృదయం.

'వామదేవ' అనే మంత్రంచేత గుహ్యేంద్రియం.

'సద్యోజాతం' అనే మంత్రంచేత పాదాలు.

కల్పిత శరీరం కలిగిన ఈశ్వరుడు అనుమానం చేతనే తెలియబడుతాడు. జగత్తుకు నిమిత్తకారణం. పరమాణువులే ఉపాదానకారణం.

చేతికి రుద్రాక్షమాలను కంకణంగాధరించడం, జుట్టును జడగాచేసి తలకుచుట్టడం. చేతిలో కపాలధారణం. భస్మంతో స్నానం చేయడం వంటివి శైవమతాచారాలు. దీక్షనుగ్రహించిన క్షణంలో బ్రాహ్మణుడవుతాడు.

**కంఠికారుచికంచైవ కుండలంచ శిఖామణిః**
**భస్మయజ్ఞోపవీతంచ ముద్రాషట్కం ప్రచక్షతే ।**
**ఆభిర్ముద్రిత దేహస్తు న భూయ ఇహజాయతే ॥**

కంఠిక, రుచికం, కుండలం, శిఖామణి, భస్మం, యజ్ఞోపవీతం అనబడే ముద్రాషట్కధారణం,భగాసనస్థాత్మధ్యానం, సురాకుంభస్థాపనం, సురాకుంభస్థ దేవతార్చనం, గూఢాచారం, శ్మశాన భస్మస్నానం, ప్రణవ పూర్వక ధ్యానం - ఇత్యాది కర్మలచేత జీవులకున్న మలమయమైన కర్మ తొలగిపోయి శివసారూప్యం లభిస్తుంది. ఇదే మోక్షం. ఈ కపర్దిమతానికి శైవాగమం ఆధారం.

శ్రీ వ్యాసమహర్షి బ్రహ్మసూత్రాలు 2అ. 2పా. 7 అధికరణంలో 35 నుంచి 38 వరకు నాల్గుసూత్రాలచే కపర్దిమతాన్ని నిరసించారు. (ఒక సూత్రార్థం చూద్దాం) (35) 'పత్యురసామంజస్యాత్':- తత్త్వం, ఉపాసన, ఆచారం అన్నీ వేదవిరుద్ధాలే (అసామంజస్యం) కాబట్టి పశుపతి మతం అనాదరణీయం అని నిరసించాడు. ప్రజాపతి, శివ, ఇంద్ర, ఆకాశ, ప్రాణాది శబ్దాలు

అపర్యవసానవృత్తిచేత నారాయణ బోధకాలే. **"కారణరూపమకార పరబ్రహ్మోమ్". "సర్వభూత స్థమేకం నారాయణమ్"**. నిమిత్త, ఉపాదాన కారణభూతుడై, పరతత్త్వమైన నారాయణున్ని ధ్యానించడమే మోక్షసాధనమని వేదాలు బోధిస్తున్నాయి. **"య ఆత్మానమంతరో యమయతి" - "అంతఃప్రవిష్టః శాస్తా జనానాం" - "శాస్తా విష్ణురశేషస్యజగతోయో హృదిస్థితః"** - శ్రుతి వాక్యానుసారంగా నిఖిలచేతనాచేతనాలయందు ప్రవేశించి, జగచ్ఛరీరుడై, సకలవృత్తులకు నియంతయై ప్రకాశించే పరమాత్మకు శరీరం లేదనడం వేదవిరుద్ధం. అంతేకాదు, పరత్వంలేనివారిమీద పరత్వబుద్ధిని కలిగించి లోకులకు బుద్ధిమాలిన్యం కలుగజేయడం వల్ల కపర్ది మతాన్ని కర్దమంతో పోల్చినారు దేశికులు. నిజంగా బురదలో దిగబడినవాడు ఒకకాలు పైకి లాగబోతే మరొక కాలు మరింత ఊబిలోకి దిగబడుతుంటుంది. ఆ మురికి గుంటలో పరబ్రహ్మదిగబడినాడనడం కవితాచమత్కృతి.

పరబ్రహ్మ, దాటడానికి అశక్యమైన, అపవిత్రమైన ఆ పంకిలస్థలాన్ని అతికష్టంగా దాటి వచ్చాడు కాని వెంటనే ఉచ్చులో పడ్డాడు. అది సాంఖ్యులు కల్పించిన వల. శైవమతానికి కనీసం శైవాగమం పునాదిగా ఉంది కాని సాంఖ్యులకు ఏ ఆధారమూ లేదు.

సాంఖ్య దర్శనాన్ని ఉపదేశించిన వ్యక్తి కపిలమహర్షి, కాబట్టి దీనికి 'కాపిల' మనిపేరు. దీని యందు తత్త్వాల సంఖ్య ఇరువైయైదు (25). కాబట్టి సాంఖ్యమనిపేరు. ముఖ్యతత్త్వాలు 1 ప్రకృతి 2. పురుషుడు. 'మూలప్రకృతి రవికృతిః, మహదాద్యాః ప్రకృతి వికృతయః సప్త। షోడశకస్తు వికారః, నప్రకృతి ర్వాఽపివికృతిః పురుషః' 1. మూలప్రకృతి : కర్తృత్వమే దీని స్వరూపం. కంటికి కాన్పించని సూక్ష్మదశ చేత 'అవ్యక్త' మనీ పేరు. పుట్టించేదే కాని ఇది దేని నుంచి పుట్టిందికాదు. పురుషునిలాగా అనాది.

7 తత్త్వాలు - మహత్తత్త్వం, అహంకారతత్త్వం, పంచతన్మాత్రలు ప్రకృతి నుంచి పుట్టి, తర్వాత ఉన్న తత్త్వాలను పుట్టించడం వల్ల ఇవి ప్రకృతులూ, వికృతులూ అవుతున్నాయి.

16 తత్త్వాలు - రాజసాహంకారసహకారంతో - సాత్త్వికాహంకారం నుంచి పుట్టేవి చక్షుః శ్రోత్ర జిహ్వాఘ్రాణ త్వగింద్రియాలనబడే జ్ఞానేంద్రియాలు (5); వాక్పాణి పాదపాయూపస్థలనబడేకర్మేంద్రియాలు (5); మనస్సు అనే అంతరింద్రియం (1) మొత్తం ఇవ్వి (11). ఇంక, తామసాహంకారం నుంచి పుట్టే పంచతన్మాత్రలు పృథి వ్యాపస్తే జోవాయురాకాశాలనే పంచ(5) భూతాలను పుట్టించడం వల్ల - మొత్తమీ పదహారుతత్త్వాలు కేవలం వికృతులే.

ఈ 24 తత్త్వాలు ప్రకృతి వికారాలే.

1. పురుషుడు - తాను పుట్టడంగానీ, పుట్టించడంగానీ లేనందువల్ల, ప్రకృతీగాక వికృతీగాక విలక్షణమైన 25వ తత్త్వంగా ఉంటాడు.

ప్రకృతిలోని సత్త్వరజస్తమోగుణాలు సమస్థితిలో ఉన్నంత కాలం నానాత్వంలేదు. గుణవైషమ్యం వల్ల నానాత్వం కలుగుతుంది. ప్రకృతి పరిణామమే ఈ నానాత్వవిలసితమైన జగత్తు. ప్రతివస్తువు మరొక వస్తువునుంచే వచ్చిందనే ఈ వాదానికి 'సత్కార్యవాదం' అని పేరు. పురుషుడు నిష్క్రియుడు. గుణవంతమైన ప్రకృతి, సచేతనుడైన పురుషుడు పంగ్వంధ న్యాయంగా (కుంటివాడు, గ్రుడ్డివాడు కలసి) గమన వ్యాపారం సాగించడమే సంసారం. ప్రకృతి (24 తత్త్వాల) కంటె వేరైనవాడు పురుషుడు అని నిశ్చయించుకోవడమే - కేవలం తాను చిద్రూపుడననుకోవడమే పురుషునికి మోక్షం లభిస్తుంది. ఈ దర్శనంలో ఈశ్వరుడేలేడు. శబ్దం ప్రమాణమైనా, అది కపిలుని ఊహయే. శ్రీవ్యాస మహర్షి బ్రహ్మసూత్ర ద్వితీయాధ్యాయంలో ద్వితీయపాదం మొదల్కొని తొమ్మిది సూత్రాలతో కపిలమతాన్ని - సాంఖ్య దర్శనాన్ని - నిరసించారు. ముఖ్యంగా ఈశ్వరుడులేని వస్తువులేదు. ఆయన దయ, ఆజ్ఞలేకుండా ఏ కార్యమూ జరుగదు. పంగ్వంధ న్యాయం లోకంలో సాగుతున్నమాట సత్యమే. సాంఖ్యులు చెప్పే పురుషుడు నిర్ధర్మకుడు, నిష్క్రియుడైనప్పుడు అతడు చెప్పుతాడా? చూస్తాడా? జడమైన ప్రకృతి విని, గ్రహించి చెప్పినట్లు నడుస్తుందా? సూదంటురాయి ఇనుము వరకు రావాలి. నిర్వికారుడైన పురుషుణికి అలాంటి క్రియలేదుగదా? ఇదంతా అవివేక ప్రసంగమని నిరీశ్వరసాంఖ్య దర్శనం నిరసింపబడింది.

ఏ ఒక ఆగమాన్ని ప్రమాణంగా గ్రహించకుండా కపిలమహర్షి తన బుద్ధిచేత కల్పించాడు కాబట్టి, ఈ మతం 'కపిలకల్పన' అని చెప్పబడింది. ఈశ్వర ప్రసక్తియేలేని సాంఖ్యమతంలో చేరినవారు, వలలో చిక్కుకొన్న ప్రాణులు రక్షకుడు లేక నశించే విధంగా, నశిస్తారు. "వాగురా మృగబంధనీ" (అమరం)

పరబ్రహ్మ కాబట్టి 'కపిల కల్పనావాగుర' నుంచి విముక్తుడయ్యాడు అన్నారు దేశికులు.

తర్వాత పరబ్రహ్మ ద్రుహిణ తంత్రయంత్రోదరంలో తగుల్కొన్నాడు. "ధాతాఽబ్జయోనిర్ ద్రుహిణో విరించిః కమలాసనః" (అమరం). ద్రుహిణుడంటే చతుర్ముఖబ్రహ్మ. యోగశాస్త్ర ప్రవర్తకుడు.

"హిరణ్యగర్భో యోగస్య వక్తానాన్యః పురాతనః" అని యాజ్ఞవల్క్య మహర్షి తెల్పినాడు. బ్రహ్మ సంగ్రహంగా పురాణాలలో అక్కడక్కడ చెప్పిన సారాన్ని గ్రహించి శేషావతారుడైన పతంజలి మహర్షి విస్తరంగా ప్రవర్తింపచేశాడు. కాబట్టి యోగదర్శనానికి 'పాతంజల' మనిపేరు.

సాంఖ్యుల పరిణామవాదం యోగులచే అంగీకరింపబడింది. సాంఖ్యులు భగవానుణ్ని అంగీకరించలేదు. యోగులు నిమిత్తమాత్ర కారణమైన పురుషుణ్ని అధికంగా అంగీకరించారు. కాబట్టి కాపిలం 'నిరీశ్వర సాంఖ్యశాస్త్ర' మని పాతంజలం 'సేశ్వరసాంఖ్యశాస్త్ర' మని అంటారు. పురుషుడు సాంఖ్యదర్శన పురుషునివలె స్వతంత్రుడు కాడు. ప్రకృతియే స్వతంత్రమైనది. అదే సృష్ట్యాదులను చేస్తుంది.

క్లేశ, కర్మ, విపాక, ఆశయాలను పుట్టనీయని చిత్తవృత్తి నిరోధమే యోగం. 'అవిద్య, అస్మిత, రాగం, ద్వేషం, అభినివేశం' అనే క్లేశ పంచకం, కర్మ విపాకాదులు బంధహేతువులు. సాంఖ్యదర్శనంలో లేని ఈశ్వర ప్రణిధానం (కర్మలను ఫలాన్ని ఆశించకుండా చేసి, వాటిని ఈశ్వరునికి సమర్పించడం), యోగదర్శనంలో ఉంది.

పురుషుడు ఆదరంతో అష్టాంగయోగాన్ని అనుష్ఠిస్తూ ఈశ్వరారాధన చేయడం వల్ల ప్రకృతి పురుషులకున్న భేదభావం బలపడుతుంది. దానిచేత క్లేశ పంచకం నశించి, నిర్లిప్తుడై కైవల్యాన్ని పొందుతాడు. యోగశాస్త్రంలో మంత్రాలు వైదికాలు, తాంత్రికాలు అని రెండు విధాలున్నాయి. ఋగ్యజుస్సామలు వైదికాలు. కామిక, కారణ, ప్రపంచాద్యాగమాలలో వర్ణింపబడిన మంత్రాలు తాంత్రికాలు. దీనిలో స్వాహాంత మంత్రాలు స్త్రీమంత్రాలు. నమః పదాన్త మంత్రాలు నపుంసక మంత్రాలు. మిగిలినవి పుంలిగ మంత్రాలు. ప్రాణాయామంకన్న మించిన తపస్సు లేదు. నిర్బీజ సమాధిస్థితికి వచ్చిన యోగికి ప్రజ్ఞావస్థ సిద్ధిస్తుంది. యోగి అణిమాదిసిద్ధులను పొందగలడు. విదేహకైవల్యమూపొందగలడని ఈశాస్త్ర విచారం.

'ఏతేన యోగః ప్రత్యుక్తః' (బ్ర.సూ.2అ.1పా.2 అధిక. 3) సూత్రంతో శ్రీవ్యాసమహర్షి యోగదర్శనాన్ని నిరసించారు.

ప్రధానం అంటే ప్రకృతికే జగత్కారణత్వం, ఈశ్వరుడు అస్వతంత్రుడు, నిమిత్తకారణమాత్రుడని అంగీకరించడం అవైదికం. ధ్యేయ వస్తువు యొక్క ధ్యానమే మోక్ష సాధనమనే నియమంలేదు. కాబట్టి యోగుల ధ్యానం అవైదికం. సూక్ష్మంగా పరిశీలిస్తే ద్రుహిణ తంత్రయంత్రం మధ్యలో పడిన పరబ్రహ్మ చాలా హింసింపబడినాడు. ఆయన రూపగుణవిభూతులు రాపిడియైపోయాయి. యంత్రంలో పడిన చెరకుతుంట, రసమంతాపోయి పిప్పిమాత్రంగా మిగిలినట్లే, విశ్వాత్మకాదిసారాంశాలన్నిపోయి బ్రహ్మ మొక్కటే బయటపడుతుంది. ఈ కారణంగానే యోగదర్శనాన్ని యంత్రమన్నారు దేశికులు.

పరబ్రహ్మ పైన చెప్పిన మూడు రకాల అపాయస్థితులలో నుంచి దాటి వచ్చినప్పటికీ మళ్ళీ కుదృష్టుల కుహనా ముఖంలో పడుతున్నారు. కుహనా ముఖం అంతులేని మహాబిలంలాంటిది. మాయావాదులు 'సర్వం మిథ్య' అనడమే కాక 'ఆత్మ అఖండమైనది. ఆత్మయే పరమాత్మ' అని వాదించడం వేదాలను సమీచీన దృష్టితో చూడక, వాటికి అపార్థాలను కలిగించి లోకాన్నివంచించడమే అవుతుందికదా!

'భ్రాంతి నొందిన బ్రహ్మమే జీవుడు' అనీ శంకరమతంలోనూ, ఉపాధియుక్తుడైన బ్రహ్మమే జీవుడు అనీ భాస్కరమతంలోనూ బోధించడం వల్ల - సర్వశరీరాలలో ఉండే జీవుడు బ్రహ్మమే అన్నందువల్ల - ఆ బ్రహ్మమే కర్మ ఫలాలను అనుభవిస్తుంటాడు. ఒక శరీరంలో ఉండే జీవుడు చేసిన కర్మల ఫలాలను శరీరాంతరంలో ఉండే జీవుడనుభవిస్తుంటాడని చెప్పడంలో కర్మఫలానుభవ విషయమైన సాంకర్యం ఏర్పడుతుంది కదా! కాబట్టి, అణువులైన జీవులు బ్రహ్మకంటే భిన్నులవడం వల్ల సాంకర్యదోషానికి అవకాశమే లేదని శ్రీవ్యాసమహర్షి తన అభిప్రాయాన్ని 'అంశాధికరణం'లో 'మంత్రవర్ణాత్' - 'అసంతతేశ్చా వ్యతికరః' ఇత్యాది సూత్రాలలో విశదీకరించారు.

'పాదోஉస్య విశ్వాభూతాని' అనే మంత్రం సకలజీవులు బ్రహ్మయొక్క అంశమనే చెబుతుంది. జీవవాచకమైన భూత శబ్దం కూడా బహువచనంలోనే ప్రయుక్తం కదా! "నిత్యోనిత్యానాం చేతన శ్చేతనానాం, ఏకోబహూనాంయో విదధాతి కామాన్" అనే శ్రుతి, నిత్యులైన జీవులలో నిత్యుడూ, చేతనులైన జీవులలో చేతనుడూ, అనేకులైన జీవులలో ఒక్కడైన పరమాత్మ కోరికలను తీర్చుకుంటాడని బోధిస్తుంది. జ్ఞానస్వరూపులవడం వల్ల స్వరూపం ఒక్కటే అయినా, సర్వేశ్వరునికంటే జీవులు భిన్నులనీ, అనేకులనీ, నిత్యులనీ స్ఫుటమవుతుంది. ఈ విషయం శ్రీ భాష్యకారులు స్పష్టంచేశారు.

అద్వైతులు వేదాలను ప్రమాణాలుగా ఒప్పుకొని, ఇతర మతాలను ఖండించి, తమదే సమీచీన మతమన్నట్లు నటించడం భావ్యం కాదు. ఒక వ్యక్తి మనస్సులో విశ్వాసం కలిగించి, ఇంట్లోకి రప్పించి అతణ్ని నిలువునా దోచుకోవడమే వంచకుని కార్యం. అలాగే పరబ్రహ్మకు స్వరూప స్వభావాలేవీ లేవని అపలాపించి, ఆయన సర్వస్వాన్ని అపహరించారని 'కుదృష్టి కుహనా' అనే పదానికి అర్థం.

'కరగ్రహణ విచక్షణః' - నీటిలో మునిగిపోయేవాడు తనను కాపాడడానికి యత్నించే వ్యక్తిని కూడా ముంచేస్తాడు. కాబట్టి దృఢమైన శక్తి కలవాడే చేయూతనిచ్చి రక్షించగలడు. 'కరగ్రహణ' మనేచోట 'కచగ్రహణ' మంటే

బాగుంటుంది. మునిగేవాని జుట్టుపట్టి ఈడ్చి, కాపాడాలి కాని చేతిని పట్టికాదన్నాడట ఒక పండితుడు. వాస్తవంగా మునిగిపోతున్నవాడు తలమునిగినా, నన్నుకాపాడే వారుంటారు' అనే ఆశతో చేతులను పైకిఎత్తుతాడు. కాబట్టి 'కరగ్రహణ విచక్షణు'లైన లక్ష్మణ మునులు కుదృష్టి కుహనాముఖబిలంలో పడుతున్న పరబ్రహ్మను శ్రీహస్త గ్రహణంచేసి రక్షించారు. పరబ్రహ్మ స్వరూప స్వభావాలనున్నవి ఉన్నట్లుగా స్థాపించారని సారాంశం. జయతిపదమున్న నాలుగు శ్లోకాలలో ఇది మూడవది. రూపకాలం కారశోభితం. పృథ్వీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** కపర్దీతి. కపర్దిమత కర్దమం - కపర్దీ శైవమతభాస్య కర్తా తన్మతమేవ కర్దమం. కర్దమంచా స్వబుద్ధిమాలిన్యహేతుతయా; కపిల కల్పనావాగురాం - కపిలకల్పనా-సాంఖ్యమతం, తస్య కల్పనా త్వం శ్రుతిమూలత్వాభావేన స్వబుద్ధి కల్పనతయా, సైవవాగురా - ఆనాయః. తస్యావాగురా త్వం తత్ప్రవిష్టానాంతతో నిర్గంతుం అక్షమతయా. దురత్యయం, తత్ - ప్రసిద్ధం. ద్రుహిణ తంత్రయంత్రోదరం-ద్రుహిణ తంత్రమేవ సేశ్వర సాంఖ్య మతమేవ యంత్రం, తస్య ఉదరం - మధ్యం, తస్య సన్మార్గతి రోధాయకత్వేన యంత్రోదరత్వమ్. ఏతత్‌సర్వం అతీత్య - అతిలంఘ్య, ఏతత్ సర్వం వేద విరోధస్ఫోట్యా న్నిరస్య; కుదృష్టి కుహనాముఖే - కుదృష్టీనాం-శంకరాదీనాం, కుహనాః-వంచనాయుక్తయః, శ్రుతికంచుకచ్ఛన్న బాహ్యాయుక్తి కత్వాత్ తాసాంకుహనాత్వమ్. తన్ముఖే నిపతతః- శ్రౌతత్వ భాసకతయా శ్రుతి విరోధస్ఫోట్యా భావేన దుర్నిర సతయా, పతమానస్య గుణ విగ్రహాది ప్రహాణేన అసత్త్వాయతా మాప్యమానస్య, పరబ్రహ్మణః, కరగ్రహణ విచక్షణః - గుణవిగ్రహాది సమర్థ నేన సత్తాపాదన చతురః, లక్ష్మణోఽయం మునిర్జయతి. భిల్లాదిముఖేని పతతః సమీపవర్తి చతురః కరప్రదానేన సత్తాపాదకో భవతీతిచ స్ఫురతి.

అత్రమ్లేచ్ఛా ద్యపహృత సంపత్కుమారాహరణమపి వివక్షిత మిత్యాచక్షతే ఇతి సంకల్పసూర్యోదయటిప్పణీ.

**వ్యాఖ్యానాంతరమ్ :** కపర్దీతి - కపర్దిమత కర్దమం - పాశుపతాఖ్య పంకం. కపిలస్య కల్పనా - సాంఖ్యమతమ్. తదేవ వాగురా - జాలమ్.

దురత్యయం- దురతిక్రమం, దురవగా హమ్ ఇతియావత్. ద్రుహిణ తంత్రస్య - యోగ మతస్య, మంత్రవత్ స్థిర ముదరం, అతీత్య - పూర్వోక్త మఖిలం మత మతీత్యాపి, కుదృష్టయః - శంకరాదయః, తేషాంకుహనా-ప్రతారకయుక్తిః, తత్ర నిపతతఇత్యుక్త్యా అంధకూపఇత్యవగమ్యతే. తస్య ముఖే - అంతః, నిపతతః పరబ్రహ్మణః, నిర్విశేష చిన్మాత్రం బ్రహ్మేత్యుక్తస్య ఉద్ధరణార్థం కరస్యగ్రహణే, బ్రహ్మణః కరగ్రహణం నామ నిర్విశేషచిన్మాత్ర త్వేనోక్తస్య బ్రహ్మణః సవిశేష చేతనత్వ ప్రతిపాదనమ్. తత్ర విచక్షణః సన్‌జయతి. (అత్రటిప్పణీః - కుహనా - మాయాఖ్యావేతాళీ. బ్రహ్మణః తన్ముఖే నిపతనం నామ తదాక్రంతత్వాత్ చిదాత్మత్వ రూప స్వరూపనాశః. "కచగ్రహణ విచక్షణ" ఇత్యపి క్వచిత్పాఠః. కూపేనిమజ్జతః పురుషస్య జలోపరిదృశ్యమా ానాం కచానాంతటోపరిస్థితైః గ్రహణం హి లోకానుభవసిద్ధమ్).

**తదితర వ్యాఖ్యా** : కపర్దీతి : కపర్దో రుద్రజటాజూటః. అతః కపర్దీ రుద్రః. తన్మతం శైవమేవ. కర్దమః - అగాధః పంకః. పరబ్రహ్మణో రుద్ర విధేయత్వరూపః. కపిలః సాంఖ్యస్యవక్తా - తస్య కల్పనా - బ్రహ్మోపలాపేన లోకసృష్టిః. దురత్యయత్వం సర్వవిశేషణమ్. ద్రుహిణస్యచతుర్ముఖస్య తంత్రం-యోగశాస్త్రం, తదేవ యంత్రం; యంత్ర నివిష్టస్య యథావదుత్క్రమణం అసంభావ్యం, తస్యోదరం; తత్ర హీశ్వరం ధ్యానావలంబన మంగీకృత్య తస్యైశ్వర్యం ప్రతిఫలన కల్ప మిత్యుక్తమ్. యోగస్య యథా యథం ధ్యాన దర్శన సమానాకార జ్ఞాన హేతుత్వాత్ యోగిభిః ఈశ్వరస్య ప్రత్యక్షితత్వేసతి యోగశాస్త్రోక్తరీత్యైవ తత్త్వస్థితి రితిభ్రాంత్యతిశయ ఇతి యంత్రత్వోక్తిః. ఉక్తాస్సర్వేవాదినః, వేదవాక్యమాదాయ తత్త్వవిచారాకరణాత్ వేదబాహ్యప్రాయాః. వేదాన్తమేవ గృహీత్వా యేఽన్యథార్థం వర్ణయంతి, తేకుదృష్టయః. తేషాం మాయయా జ్ఞానాపహారిణాం కూటయుక్తి రూపకుహనాయాః ముఖేనివిష్టంబ్రహ్మ. ఏవం తస్యనిర్గుణత్వ సదోషత్వాది దురవస్థా ప్రాప్తౌ తత్పరిహారాయనిమగ్నం బ్రహ్మోద్ధృతం లక్ష్మణ మునినా. మజ్జన సమయే తత్‌బ్రహ్మస్యోత్తారకపురుషాలాభేన దుఃఖ్యత్ ఉపర్యాలంబనం కిమపి దైవాయత్తం లభ్యేతచేత్ సమ్యగితి స్వకరమూర్ధ్వం ప్రసారయదేవా మజ్జత్. వేగేనాగత్య, తత్కరం పరిగృహ్యా పూర్ణం బ్రహ్మ పారే

ప్రతిష్ఠాపయామాస, సోఽయం యతిరాజః. శ్రీరామభద్రస్యానాయాసం ఆనందిత్వంచ లక్ష్మస్థాపయామాస స లక్ష్మణః. భగవతోనిఖిల హేయప్రత్యనీకత్వం, కల్యాణ గుణైక తాన త్వమిత్యుభయ లక్ష్మప్రతిష్ఠాపకత్వా దయమపిలక్ష్మణః.

**39. కణాద పరిపాటిభిః కపిల కల్పనా నాటకైః**
**కుమారిల కుభాషితైర్గురు నిబంధనగ్రంథి భిః ।**
**తథాగత కథాశతై స్తదనుసారి జల్పైరపి**
**ప్రతారిత మిదం జగత్ ప్రగుణితం యతీంద్రోక్తి భిః ॥**

**అర్థం :** కణాద పరిపాటిభిః = కణాదుడు చెప్పిన వైశేషికశాస్త్ర క్రమాలచేత; కపిల కల్పనా నాటకైః = కపిల మహర్షి యొక్క కల్పన అనే నాటకాలచేత; కుమారిల కుభాషితైః = కుమారిల భట్టు యొక్క కుత్సిత భాషణలచేత; గురు నిబంధన గ్రంథిభిః = ప్రభాకరుని యొక్క నిబంధనలనే పీటముడులచేత; తథాగత కథా శతైః = బౌద్ధుల బహుకథలచేత; తత్+అనుసారి జల్పైః = వారిని అనుసరించిన అద్వైతుల ప్రలాపాలచేత కూడా; ఇదం = ఈ; జగత్ = ప్రపంచం; ప్రతారితం = మోసపోయింది. యతి+ఇంద్ర+ఉక్తిభిః = యతిరాజు యొక్క సూక్తులూ, కృతులూ అనే బోధలచేతనే; ప్రగుణితం = మిక్కిలి గుణం కలదయింది.

**తాత్పర్యము :** కణాదుని వైశేషిక శాస్త్రంచేతనూ, కపిలుని సాంఖ్యశాస్త్రం చేతనూ, భట్టాచార్యుని కుత్సిత భాషణలచేతనూ, ప్రభాకర గురువు యొక్క నిబంధనలచేతనూ, జైన బౌద్ధుల అనేక కథల చేతనూ, వారిని అనుసరించిన ప్రచ్ఛన్న బౌద్ధుల ప్రలాపాలచేతనూ ఈ జగత్తు వంచింపబడింది. శ్రీమద్రామానుజుల శ్రీభాష్యాది గ్రంథాలచేతనే యథార్థజ్ఞానం కలదిగా అయింది.

**వ్యాఖ్య :** యతిరాజుల జగదుపకారాన్ని ప్రశంసించే శ్లోకమిది.

నిర్గుణత్వాది దురవస్థలలో నిమగ్నుడైన భగవానునికి, నిఖిల హేయప్రత్యనీకత్వాన్నీ, కల్యాణగుణైక తానత్వాన్నీ స్థాపించి, ఉపకరించిన విధానాన్ని పై శ్లోకంలో ప్రశంసించారు. ఈ శ్లోకంలో దేశికులు, ఆర్గురి చేత మోసపోయిన జగత్తుకు కూడా యతిరాజులు చేసిన ఉపకారాన్ని వర్ణిస్తున్నారు.

**1. కణాద పరిపాటిభిః** : 'పరిపాటి' అంటే 'క్రమ' మని అర్థం. "అను పూర్వీస్త్రియాం వా వృత్ పరిపాటీ అనుక్రమః, పర్యాయశ్చ" (అమరం) కణాదుడు వైశేషిక దర్శన ప్రవర్తకుడు. పొలంలో ధాన్యకణాలను పావురం లాగా ఏరికొని తిని జీవించడం వల్ల కణాదుడని పేరు. కాబట్టి ఈ శాస్త్రానికి 'కాణాద' మని పేరు. 'విశేషం' అనే పదార్థాన్ని అంగీకరించడం 'వైశేషికం' అని పేరు.

ఉలూక మహర్షి కుమారుడైన కణాదునికి ఈశ్వరుడు గుడ్లగూబ రూపంతో ప్రత్యక్షమై పదార్థషట్కం ఉపదేశిస్తే, దాన్నే విపులీకరించినందువల్ల ఈ శాస్త్రానికి 'ఔలూక్యదర్శన' మని కూడా పేరు ఉంది. ఈ శాస్త్రజ్ఞులను 'పీలు పాకవాదు' లనడం పరిపాటి. 'పీలు' అంటే పరమాణువు. పాక మంటే విలక్షణమైన తేజస్సంయోగం. ఆ 'పాకం' పదార్థాల యందు విలక్షణమైన రూపరసగంధ స్పర్శలను పుట్టిస్తుంది. ఇది తర్క ప్రధానమైన మతం. కాబట్టి న్యాయ వైశేషికాలు జంట దర్శనాలుగా భావింపబడుతాయి.

షోడశ (16) పదార్థాలను ప్రతిపాదించే తర్కశాస్త్రానికే 'న్యాయశాస్త్రమని పేరు. ఈ జంటదర్శనాలు సర్వశాస్త్రాలకు, అపారవాఙ్మయానికి చాలా ఉపకారకాలు.

అరికాలిలో కన్ను ఉన్నందువల్ల అక్షపాదుడనే నామాంతరం కల్గిన గౌతముడు న్యాయదర్శన ప్రవర్తకుడు. కాబట్టి న్యాయ దర్శనానికి 'అక్షపాద' దర్శనమనీ పేరున్నది.

న్యాయదర్శనం వాదశాస్త్రం. వైశేషికం పదార్థశాస్త్రం. న్యాయరంగం ఆంతరం. వైశేషికం బాహ్యం, అని స్థూలంగా చెబుతారు. ఈ రెండూ కలిసినప్పుడే మోక్షప్రదమైన పదార్థ పరిజ్ఞానం ఉత్పన్నమవుతుంది.

'కాణాదం'లో ప్రకృతి, పురుషుడు ఉన్నారు. ఒక కార్యానికి ఒక కర్త ఉండనే ఉంటాడనే న్యాయంచేత, జగత్సృష్టికీ ఈశ్వరుడు ఒక కర్తగా అనుమానసిద్ధుడు. జగత్తుకు పరమాణువులు ఉపాదాన కారణం. ఈశ్వరుడు నిమిత్త కారణం. ఈశ్వరేచ్ఛతో కూడిన చేతనుల పరిపక్వమైన అదృష్టం చేత

ప్రేరేపించబడిన (ద్వ్యణుక, త్ర్యణుక, చతురణుక, పంచాణుకాలుగా అయ్యే) పరమాణువుల యందలిక్రియచేత జగత్తుపుట్టుతుంది. సంసారమనాది. ఈశ్వరోపాసనచే ముక్తి లభిస్తుంది. మోక్షంలో జీవుడు పాషాణకల్పుడు. (ఏ గుణమూలేక ఉంటాడు అని అర్థం) ఇతర ప్రమాణాలన్నీ ప్రత్యక్ష, అనుమాన మనే రెండు ప్రమాణాలలోనే ఇమిడి పోతాయి. కాబట్టి వేదం - శబ్దం ప్రమాణం కాదు. అది అనుమానంలోనే చేరుతుంది. భగవత్సాక్షాత్కారానికి పదార్థజ్ఞాన మవసరమని కణాదశాస్త్ర పరిపాటి.

శ్రీ వ్యాస మహర్షి బ్రహ్మసూత్రాలలో (2 అధ్యా.2పా. 10 నుంచి 16 సూ) ఈ దర్శనం నిరసింపబడింది. ఒకటి సంగ్రహంగా తెలుసుకొందాం. (13 సూ.) నిత్యమేవచ భావాత్ :- సమవాయస్య సంబంధత్వాత్ సంబంధస్య నిత్యత్వే సంబంధినో జగతశ్చ నిత్యమేవభావాత్ అసమంజసమ్ (శ్రీభాష్యం) అవయవావయవిలు, గుణగుణులు, క్రియా క్రియావత్తులు ఒకదానితో నొకటి విడదీయడానికి వీలులేని సంబంధంతో కలసియుండే 'సమవాయ' మనే పదార్థం వైశేషికులచే అంగీకరింపబడింది. సమవాయమనేది ఒక సంబంధం కాబట్టి,అది నిత్యమయితే అట్టి సంబంధంగల జగత్తు కూడా నిత్యం కావలసి వస్తుంది. జగత్తు సత్యమేకాని నిత్యం కాదు. ముముక్షువులు (వైదికులు అంగీకరించ నందువల్ల) ఈ మతాన్ని ఆదరించరని, మహద్దీర్ఘాధికరణంలో నిరసింపబడింది.

2. కపిల కల్పనా నాటకైః :- సాంఖ్యశాస్త్రం కపిలమహర్షిచే కల్పితంకదా! (సాంఖ్యర, యోగం రెండు జంట శాస్త్రాలు) ప్రకృతి కంటె తాను భిన్నుడని, ప్రకృతి చేష్టలకు తానువికారం పొందతగదని పురుషుడు గ్రహించడమే పురుషునికి ముక్తి అని సాంఖ్య మతం.

**రంగస్య దర్శయిత్వా నివర్తతే నర్తకీయథా వృత్తాత్ ।**
**పురుషస్యతథాஉత్మానం ప్రదర్శ్య వినివర్తతే ప్రకృతిః ॥** (సాంఖ్యకారిక -59)

రంగం మీద నర్తకి తననూ, తన ఆటనూ చూపరులకు చూపి, ఆ పనితీరగా తానే తెరమరుగుకు తొలగిపోతుంది. అలాగే నర్తకివలె ఆడుతుండే ప్రకృతి, పురుషుడే. తనదోషాలను బాగా తెలుసుకొంటే ఇంక పురుషుడు

తనచేత ఆకర్షింపబడడని గ్రహించి తన నాట్యాన్ని ఆపి, అదే అతనికి కనిపించకుండా నివర్తించిపోతుంది. అదే పురుషునికి ముక్తి. ఇదంతా కల్పితనాటకమే.

శ్రీవ్యాసమహర్షి "విప్రతిషేధాచ్చా సమంజసమ్" (బ్ర.సూ.) పరస్పర విరోధాలున్నందువల్ల సాంఖ్యమతం అసంగతమన్నారు.

పురుషుడు నిత్యముక్తుడు, నిర్వికారుడు. కాబట్టి అతడు ప్రకృతిని ఎన్నడూ చూడడు, దాని గుణాలనూ తన యందారోపించుకోడు. ప్రకృతి స్వయంగా అచేతన వస్తువుకాబట్టి అది కూడా తనను చూచుకోజాలదు. పురుషుని దర్శనశక్తిని తనదిగా తనయందు ఆరోపించుకోదు. ప్రకృతి పురుషుల స్వరూపమే సాన్నిధ్యం, సాన్నిధ్యమే దర్శనం, అదేమోక్షహేతువు అన్నట్లైతే, స్వరూపం నిత్యం కాబట్టి బంధమోక్షాలు సైతం నిత్యాలే అని ఏర్పడుతుంది. ఇలా పరస్పర విరుద్ధమైన సాంఖ్యమతం అసమంజసమని 'రచనానుపపత్త్యధికరణం'లో శ్రీభాష్యం విశదీకరించింది.

3. కుమారిలకుభాషితైః :- జైమిని ప్రణీతమైన పూర్వమీమాంసాశాస్త్రం కర్మలను ప్రతిపాదించే వేదమందలిభాగం. పూర్వమీమాంసాప్రచారకుడు కుమారిలభట్టు. భట్టు మతానుయాయులను భాట్టులంటారు. ఆచార్య కుమారిలభట్టు 1) 'శ్లోక వార్తిక' (శబరభాష్యంలోని ప్రథమాధ్యాయ, ప్రథమపాదానికి పద్యాత్మక వ్యాఖ్య)నూ 2) 'తంత్రవార్తిక' (ప్రథమాధ్యాయ ద్వితీయపాదం నుంచి తృతీయాధ్యాయం వరకు గద్యాత్మక వ్యాఖ్య)నూ రచించాడు.

మీమాంసా దర్శనంలో "చోదనా లక్షణోఽర్థో ధర్మః" అని జైమిని ముని ధర్మాన్ని నిర్వచించారు. ధర్మానుష్ఠానం వల్ల కోరిన ఫలాలుసిద్ధిస్తాయి. అనాది కాల సంచితమై అనంతపుణ్యపాపాదిరూపమైన కర్మస్వరూపమే సంసారం. వేదవిహిత కర్మానుష్ఠానమే మోక్షమిస్తుంది. విధి నిర్వహణమూ, నిషిద్ధకర్మ పరిత్యాగమూ సుఖమార్గాలు. కామ్య, నిషిద్ధకర్మలే ఆత్మకు బంధకాలు. ఆత్మలు అనేకాలు. నిత్యమైన ఆత్మకు స్వరూప ప్రాప్తియేమోక్షం. వేదం, స్మృతి, ఆచారం

ప్రమాణాలు. కర్మ ఆచరింపబడగానే అదృశ్యరూపంలో 'అపూర్వం' అనే శక్తి జనిస్తుంది. చేసిన కర్మ నశించినా 'అపూర్వం' అనే శక్తి తర్వాత ఎప్పుడో ఫలాన్ని జనింప జేస్తుంది. కర్మ సమాప్తి క్షణం నుంచి ఫలోత్పత్తి క్షణం వరకు 'అపూర్వం' ఉంటుంది. ఫలాన్ని కోరకుండా వేదోక్తమైన యజ్ఞాదులను చేస్తే పుట్టిన 'అపూర్వం' వల్ల కర్మసంబంధం పోయి కేవల ఆత్మ స్వరూప ప్రాప్తి కలుగును. శబ్దం నిత్యమైనది కాబట్టి వేదం, నిత్యమూ అపౌరుషేయమూ అని మీమాంస కులమతం.

మీమాంసకులలో అభిహితాన్వయవాదులు, అన్వితాభిధానవాదులు, అని రెండు తెగల వారున్నారు.

భాట్టులు అభిహితాన్వయవాదులు. 'గోవును తెమ్ము' అన్నప్పుడు, శబ్దబోధలో విషయంకానిది శక్తిజ్ఞానమందు విషయం కాదు, అని చెప్పడం.

అభిహితం = చెప్పబడిన పదార్థం యొక్క సంబంధం, సంసర్గమర్యాదతో ఆకాంక్షచే భాసిస్తుంది. 'తెమ్ము' అనే క్రియాపదం 'దేనిని' అనే కర్మను కోరుతుంది. 'గోవును' అనే శబ్దంలోని 'ను' పదార్థం కర్మత్వం. ఆధేయతా సంబంధంతో గోవిశిష్ట కర్మత్వం బోధపడుతుంది.

మొదట శబ్దబోధవల్ల అర్థబోధ; శబ్దార్థబోధ వల్ల వాక్యార్థమేర్పడడం అభిహితాన్వయ వాదం. శబ్దాలు సంకేతితార్థాలనే తెల్పుతాయి. అన్వయాన్ని బోధించవు. శబ్దాలకు పరస్పరంగా అన్వయాన్ని కలిపి, అఖండార్థాన్ని బోధించే వేరొకశక్తియే 'వాక్యశక్తి'. దీన్నే తాత్పర్యశక్తి' అంటారు.

వేదం 1. మంత్రాత్మకం 2. బ్రాహ్మణాత్మకం 3. అర్థవాదం అని మూడు విధాలు. అనుష్ఠాన సమయంలో అర్థస్మరణకారణమైనది 'మంత్రం'.

కర్మను విధించే వాక్యం 'బ్రాహ్మణం'. విధింపబడిన కర్మయొక్క ప్రాశస్త్యాన్ని తెల్పుతూ విధి వాక్యంతో ఒకే వాక్యంగా అన్వయించే ప్రమాణ వాక్యం అర్థవాదం.

విధి 1. అపూర్వవిధి 2. నియమవిధి 3. పరిసంఖ్యావిధి అని మూడు విధాలు.

**1. అపూర్వవిధి :** అత్యంతం ఇతరత్రప్రాప్తంకాని కర్మను బోధించేది. 'వ్రీహీన్ ప్రోక్షతి'. దర్శన పూర్ణమాసయాగంలో 'ధాన్యంమీద నీళ్ళు చల్లును' అనేది కర్మ. వేరే ప్రమాణమేదీ తెల్పని ప్రోక్షణ కర్మను ఇది విధించింది.

**2. నియమివిధి :** రెండింటిలో ముఖ్యపక్షాన నియమించేది. 'వ్రీహీన్ అవహంతి' పురోడాశం కోసం 'ధాన్యాన్నిదంచుదురు'. బియ్యం కోసం ధాన్యాన్ని దంచిగానీ, గోళ్ళతో గిల్లిగానీ, నూరిననూ పొల్లునుపోగొట్టవచ్చు. దంపి పొల్లుపోగొట్టిన బియ్యంతో పురోడాశాన్ని చేసి వాడిననేగాని అది యాగం వల్ల పుట్టే 'అపూర్వం' తో కలిసి ఫలాన్ని పుట్టించడానికి ఉపయోగపడదు.

**3. పరిసంఖ్యావిధి :** రెండు విధులు ఒకేసారి ప్రాప్తిస్తే, ఒక్కదానియందే మంత్రప్రసక్తి. 'అశ్వాభిధానీం ఆధత్తే' – చయన ప్రకరణంలో 'గుఱ్ఱపు త్రాడును పట్టుకొనును' అనేది విధి. ఈ మంత్రం ఉండడం వల్ల గుఱ్ఱపుత్రాడునే పట్టుకోవలెనని నిర్ధారణ. ఈ విధి లేకపోతే త్రాడును పట్టుకోవడాన్నే తెలిపే సామర్థ్యం (లింగం)తో, గాడిద త్రాడును పట్టుకోవడానికి కూడా "ఇమాంఅగృభ్ణన్ రశనాం ఋతస్య" – (ఋతస్య = యజ్ఞానికి, ఇమాం = ఈ; రశనాం = త్రాటిని; అగృభ్ణన్ = పట్టుకొనిరి). అనే మంత్రం తప్పక ప్రవర్తిస్తుంది. గాడిద త్రాటిని మంత్రం లేకయే పట్టుకోవాలి మరి. అప్పుడీ మంత్రానికి ప్రసక్తి లేదు.

"స్వార్థ త్యాగం, పరార్థ స్వీకారం, ప్రాప్తబాధ" (లింగం వల్ల గర్దభరశనానికి ప్రాప్తమైన ఈ మంత్రం బాధింపబడడం) అనే మూడు దోషాలున్నా, గత్యంతరం లేక 'పరిసంఖ్య'ను అంగీకరించవలసి వచ్చింది. (మీమాంసా పరిభాష ఇలా ఉంటుంది).

**4. గురు నిబంధన గ్రంథిభిః :** 'గురువు' అంటే ప్రభాకరుడు. కుమారిల భట్టు, ప్రభాకరుడు, ఈ మహాపురుషులిద్దరూ మీమాంసాదర్శన సంప్రదాయ ప్రవర్తకులు. ప్రభాకరుడు శబర భాష్య సిద్ధాంతాలకు 'బృహతీ', 'లఘ్వీ' అనే

వ్యాఖ్యాన గ్రంథాలను రచించాడు. వయస్సులో పెద్దవాడైనా, ప్రభాకరుడు కుమారిల భట్టుకు శిష్యుడు. ప్రభాకరమతానుయాయులను ప్రాభాకరులంటారు. 'పత్రిక' అనే మీమాంసాగ్రంథంలో "అత్ర తునోక్తం తత్రాపి నోక్తం" – అనే వాక్యం ఉంది. (ఇక్కడ మాత్రం చెప్పబడలేదు. అక్కడ కూడా చెప్పబడలేదు. అని వాక్యార్థం. ఈ వాక్యంలో భట్టుకుదోషం కనబడలేదట. ప్రభాకరుడు 'తునా' అనీ, 'అపినా' అనీ 'ఉక్త'మనే విషయాన్నీ రెండుసార్లు చెప్పడంవల్ల – ఈ వాక్యంలో పునరుక్తి దోషం ఉందని చెప్పినందువల్ల – భట్టు 'నీవే గురువు' అని ఆదరించాడట. గురువుకే గురువైన ప్రభాకరుని మతం 'గురుమత' మని ప్రఖ్యాతి బడసింది. అన్వితాభిధాన వాదం ప్రాభాకర (గురు) మతం. శక్తిజ్ఞానంలో విషయంకానిది శాబ్దబోధవిషయం కాదనడమే అన్వితాభిధానవాదం. 'గాం ఆనయ' – 'గాం బధాన' (ఆవును తెమ్ము, ఆవును కట్టివేయుము) అనగానే ఒకడు ఆవును తెచ్చి కట్టివేశాడు. ఏమీతెలియని బాలుడు చూస్తున్నాడు. 'అశ్వం ఆనయ'. (గుఱ్ఱాన్ని తెమ్ము) అన్నాడు. గుఱ్ఱాన్నీ తెచ్చాడు. బాలుడు గుఱ్ఱాన్నీ చూచాడు. 'తెమ్ము' పదం వెనుక 'గాం, అశ్వం' పదాలలోని 'ఆమ్' పదార్థం కర్మత్వం. ఇప్పుడాబాలునికి కట్టివేయబడినది ఆవు, అనీ; తేబడినది 'గుఱ్ఱం' అనీ గోచరించింది. వీరిమతంలో తాత్పర్యశక్తి అవసరంలేదు. అన్వితార్థం అంటే మొదట గోచరించిన వాక్యార్థం వల్లనే 'అభిధా' అంటే ప్రత్యేక పదాల అర్థంగోచరిస్తుంది.

భాట్టులు అంగీకరించే అనుపలబ్ధిప్రమాణాన్ని ప్రాభాకరులు అంగీకరించరు. 'ఉపలబ్ధి' అంటే ప్రత్యక్షం (కనిపించడం), కనిపించక పోవడమే అనుపలబ్ధి. అభావ ప్రత్యక్షానికి కారణమైనది 'అనుపలబ్ధి'. 'అభావం' అంటే లేకపోవడం. ఆ లేమిని ఇంద్రియాలచే తెలిసికోవడం అభావ ప్రత్యక్షం. అక్కడ 'ఘటం (కుండ) ఉన్నది తెమ్ము' అన్నాడు, బాలుడు అక్కడికి పోతే ఘటం కనబడలేదు. కాబట్టి ఆ బాలుడు అక్కడ ఘటం లేదన్నాడు. బాగా చూచి చెప్పుమన్నాడు. బాగా చూచాను, లేదు అన్నాడు. కాబట్టి లేకపోవడాన్ని కూడా బాగా చూడాలి. ఘటాభావ ప్రత్యక్షానికి ఘటానుపలబ్ధి కారణం. కాబట్టి అనుపలబ్ధి ప్రమాణమయింది.

ఒకని కన్నులు ఎంతదూరాన ఉన్న, ఎంత సూక్ష్మవస్తువునైనా గ్రహించగలవు కాని అతని చెవులు ఆ వస్తువును చూడగలవని చెప్పరాదు అన్నాడు ప్రాభాకర గురుడు. ఇవన్నీ గురు నిబంధన గ్రంథులు – పీటముడులు.

శ్రీ వ్యాసమహర్షి బ్ర.సూ. 'రచనానుప పత్త్యధికరణం'లో 'శాస్త్రంచ, 'పరమ పురుషారాధన – తద్విపర్యయ రూపే కర్మణీ పుణ్యపాపే, తదనుగ్రహ నిగ్రహాయత్తేచ తత్ఫలే' ఇతివదతి. అని భగవద్రామానుజుల సూక్తి–'యజ–దేవ పూజాయాం' అనే ధాతునిష్పన్నమైనవి యజ్ఞయాగాది శబ్దాలు. యజ్ఞాది కర్మలు భగవంతునికి అనుగ్రహాన్ని కలిగించడానికి హేతువులు. అవి భగవదాజ్ఞాను వృత్తిరూపాలై ఆయనను ఆరాధించే రూపాలు కాబట్టి పుణ్యశబ్ద వాచ్యాలు. తన ఆరాధన రూప పుణ్య కర్మలచే అనుగ్రహించి భగవానుడు కలిగించే సుఖం పుణ్య ఫలం.

భగవంతునికి నిగ్రహాన్ని కలిగించే, ఆయన ఆజ్ఞకు విరుద్ధంగా ప్రవర్తించి చేసే కర్మలు పాపశబ్దవాచ్యాలు. భగవానుడు, తన ఆజ్ఞను ఉల్లంఘించి చేసే కర్మలచే కోపించి, ఆయన కలిగించే దుఃఖం పాపఫలం.

'యత్ త్వత్ప్రియం తదిహ పుణ్య మపుణ్య మన్యత్, నాన్యత్తయోర్భవతి లక్షణమత్రజాతు'. (అతి మానుషస్తవం). భగవత్ప్రీతికరమైన కార్యం పుణ్యం, భగవన్నిగ్రహహేతువైన కార్యం పాపమన్నారు శ్రీకూరేశులు. 'ఫలాధికరణం'లో – జైమిని చెప్పినట్లు 'అచేతనాలైన యజ్ఞాది కర్మలే ఫలాన్ని ఇచ్చేవి' అనడం గానీ, ఆ యాగాదులచేత అప్రామాణికమైన 'అపూర్వ' మనబడే శక్తి కలుగుతుందనే కల్పన గానీ చెల్లదు – అని శ్రీవ్యాస మహర్షి ప్రకటించారు. పుణ్య పాపకర్మలు నశించడమంటే భగవదుపాసన చేత కర్మలకు సుఖదుఃఖాది ఫలాలనిచ్చే శక్తి లోపించడమని భావం. దేహావసానంలో భగవదనుగ్రహంవల్ల ఆత్యంతిక కర్మక్షయం కలుగుతుందని 'సాంపరాయాధికరణం' బోధిస్తుంది.

పరమాత్మకు లీలా శరీరమున్నదని, ఆయన ఆ శరీరంతో వేదాలను ఉపదేశించడం వల్ల వేదం పౌరుషేయమని, చక్షురాదీంద్రియాలకు దూరాన ఉన్న, పరోక్షంగా ఉన్న అనేక వస్తువులను చూడగలిగేశక్తి కలదని – కల్పించడం

అనుచితం. ప్రపంచంలో చూస్తున్న రీతిగనే కల్పించుకోవాలిగానీ లోకాతీతంగా కల్పించుకోరాదని బోధించారు.

ముఖ్యంగా, ఫలసిద్ధి యందు ఈశ్వరుణ్ని అంగీకరించకపోవడవల్లనూ, యజ్ఞాది కర్మలచేత 'అపూర్వం' అనే శక్తి పుట్టి ఫలమిస్తుందని చెప్పడం వల్లనూ కుమారిలభట్టు మతం కుభాషితమన్నారు దేశికులు.

భట్టువలె 'అపూర్వం' ను అంగీకరించడం వల్లనూ, అనుపలబ్ధిని మాత్రం అంగీకరించకుండడం వల్లనూ, ఆత్మజడమని చెప్పడం వల్లనూ గురుమతంలో గ్రంథులున్నవన్నారు దేశికులు.

**5. తథాగత కథా శతైః** : 'కథ' అంటే ప్రబంధకల్పన, వాదం అనే అర్థాలున్నాయి. బౌద్ధులకు సుగతుడే దైవం. సంసారం క్షణికం. బౌద్ధులలో మాధ్యమికులు, యోగాచారులు, సౌత్రాంతికులు, వైభాషికులు అని నాలుగు తెగలున్నాయి. దేనిలోనూ ఈశ్వరాస్తిక్యం లేదు.

1. మాధ్యమికులు : సర్వశూన్యవాదులు. ప్రమాణం, ప్రమేయం, ప్రమాత ఉంటాయని తలచడమే భ్రమ. శూన్యం చేత శూన్యమని తెలుసుకోవడమే ముక్తి.

2. యోగాచారులు : వీరు బాహ్య పదార్థాలు లేవంటారు. జ్ఞానం విషయాకారంగా ఉంటుందంటారు.

3. సౌత్రాంతికులు : వీరికి జ్ఞానం, జ్ఞేయం రెండూ సత్యాలే. కాని జ్ఞేయమైన జగత్తు అనుమానసిద్ధం.

4. వైభాషికులు: వీరు జ్ఞానంతో కూడిన బాహ్యపదార్థాలను అంగీకరిస్తారు. పరమాణువుల సంఘాతమై కళ్ళతో చూడదగినది జగత్తు. ఆ జగద్విషయ జ్ఞానం క్షణికం. వేరొక ఆత్మ లేదు. జగత్తు స్థిరమనే బుద్ధి బంధహేతువు, క్షణికమనేబుద్ధియే మోక్షం.

ఈ నల్గురి మతంలోనూ రాగాది విజ్ఞాన సంతానం యొక్క వాసన నశించడమే శూన్యరూపమైన నిర్వాణం.

'సముదాయాధికరణం, ఉపలబ్ధ్యధికరణం' లోని సూత్రాలతో శ్రీ వ్యాసమహర్షి బౌద్ధమతాన్ని ఖండించారు. 'తిరువాయ్ మొషి'లో మొదటి దశకంలోని తొమ్మిదవ పాశురంలో శూన్యవాదం నిరసింపబడింది. 'ఉళనెనిలుళన్ – పరన్దే' – పాశురమది. ఆస్తికులు ఈశ్వరుడున్నాడంటారు. నాస్తికులు లేడు అంటారు. ఎవడులేడు? అంటే, ఈశ్వరుడు అనవలసి యుంటుంది. కాబట్టి నిషేధమెప్పుడు ఉపాధిలేకయే 'లేదు' అని ఉండదు. ఇదిలేదంటే వేరొకటున్నదని చెప్పినట్లే కదా! 'కుండ పగిలింది. అది లేదు' – అంటే పెంకులున్నాయని అర్థం. నిషేధ ప్రతీతి లేకపోతే శ్రియఃపతి, ఆయన విభూతులు, శ్రుతి, తత్ప్రతిపాద్య విషయాలన్నీ అంగీకరించిననట్లే అవుతుంది.

జైనమతం సుమారుగా ఇలాగే ఉంటుంది. జైనులు ప్రతి పదార్థం ద్రవ్యాత్మకంగా (కారణాత్మకంగా) ఉన్నప్పుడు, ఆ పదార్థమందు సత్వనిత్యైకత్వ ధర్మాలుంటాయి అంటారు. ఆ పదార్థమే అవస్థా – కార్యాత్మకంగా ఉన్నప్పుడు అసత్వం, అనిత్యత్వం, అనేకత్వం ఇత్యాది విపరీత ధర్మాలు కలదిగా ఉంటుంది. ఈశ్వరుడు లేడు. రత్నత్రయం – సమ్యగ్దర్శన, సమ్యక్ జ్ఞాన, సమ్యక్ చారిత్రాలు మూడు కలిసి – మోక్షహేతువు. సాప్తభంగీన్యాయంచేత – సత్తు, అసత్తు, క్షణిక, నిత్య ఇత్యాదుల చేత – అన్నిటినీ, అంతటనూ సమానంగా భావించడం వల్ల ఈ సిద్ధాన్తం పక్షపాతరహితమవుతుంది. ఇతరదార్శనికులసిద్ధాన్తం మత్సర గ్రస్తమైనది. జీవుడు మధ్యమ పరిమాణం కలవాడని జైనులసిద్ధాన్తం. ఎంత శరీరమో అంత ఆత్మ ఉంటుందని అర్థం. పాదంలో బాధను శిరస్సున సుఖాన్ని ఏకకాలాన అనుభవిస్తామంటారు. ఆత్మనిత్యం, జన్మలు మారుతాయని అంగీకరిస్తారు. అయితే ఏనుగు శరీరంలో ఏనుగంత ఆత్మ కర్మవశాన విడిచి చీమ శరీరంలో ప్రవేశిస్తే, కొంతభాగం అందులో ఉండి, ఆత్మలో ఎంతో భాగం మిగిలి బయట ఉండవలసి వస్తుంది కదా! దూదిపింజకున్నట్లు ఆత్మకు సంకోచ వికాసాలున్నాయంటే, ఆత్మకు వికారాది దోషాలున్నట్లు అంగీకరించవలసి వస్తుంది కదా! ఇలా వితండవాదాలెన్నో ఉన్నాయి.

బ్రహ్మసూత్ర ద్వితీయా ధ్యాయద్వితీయ పాదంలో, నాలుగు సూత్రాలచేత వ్యాస భగవానుడు జైనమతాన్ని ఖండించాడు. కాబట్టి ఈ నాస్తిక వాదం గ్రాహ్యంకాదని దేశికులన్నారు.

6. తదనుసారి జల్పైః – 'జల్ప' మంటే జయించగోరే రెండు పక్షాలవారు తమ తమ పక్షాన్ని బలపరచుకోవడానికి చేసే వాదం. శూన్యవాదులైన బౌద్ధుల ననుసరించిన, ప్రచ్ఛన్న బౌద్ధులైన అద్వైతుల ప్రలాపాలు – "బ్రహ్మసత్యం, జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవనాపరః, బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి" అనేవి అద్వైత ముఖ్య సిద్ధాంతాలు.

'ఉత్తర మీమాంసాదర్శనమే' వేదాన్తం. ఇది వేదశిరస్సులైన ఉపనిషత్తులచే ప్రతిపాదితం. 'వేదాన్తం' లో 'అంత' శబ్దానికి 'నిర్ణయ' మని అర్థం. శ్రీ శంకరాచార్యాదుల మతం అద్వైతం.

బ్రహ్మవస్తువు అఖండమైనది. సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమైనది. మిథ్య :- త్రాడు పాముగా కనబడడమే భ్రమ. అలాగే పరిదృశ్యమానమైన జగత్తు 'అవిద్య' అనే దోషం చేత మొదట ఉన్నట్లు కనబడినా బ్రహ్మజ్ఞానం కలిగితే అది మాయమవుతుంది. జగత్తు అనే భ్రమ, జ్ఞానంతో తొలగి సర్వం బ్రహ్మమే అనే భావన కలుగుతుంది. కాబట్టి జగత్తు మిథ్య. ఈ మాయ బ్రహ్మవలె పారమార్థిక పదార్థమూకాదు. కుందేటి కొమ్ము వలె బొత్తిగా కనిపించనిదీ కాదు. 'కుందేటి కొమ్ము' వంటిదాన్ని 'తుచ్ఛం' (అంటే ఏ ప్రమాణానికి గోచరించేది కాదు) అంటారు. అనృత, జడ, దుఃఖ రూపమైన జగత్తు సత్త్వ రజస్తమో గుణాత్మకమై ఉంటుంది.

జీవుడు బ్రహ్మజ్ఞానం చేత బ్రహ్మమవుతాడు. జీవావస్థలోనే సంసార బంధం – బ్రహ్మ స్థితియే మోక్షం. ఆత్మకంటే వేరే ఏమీ లేదనడమే అద్వైత సిద్ధాంతం.

విశిష్టాద్వైత సిద్ధాన్త పరులకు బ్రహ్మసత్యమనే అంశమందు అప్రామాణ్య బుద్ధిలేదు. 'జగన్మిథ్య' అనే అంశం అప్రామాణికం. మిథ్యావాదం కల్పితం.

"మిథ్యైత దన్యద్ద్రవ్యం హి నైతి తద్ద్రవ్యతాం యతః" అని (వి.పు) పరాశర మహర్షి వాక్యం. వేరొక ద్రవ్యం అసలు ద్రవ్యమెట్లవుతుంది? "మిథ్యైతత్". అలాకావడం మిథ్యయే. అలాగే జీవద్రవ్యం పరంబ్రహ్మ ఎలా అవుతుంది? కాదుకదా! అయితే అది కూడా మిథ్యయే అవుతుందన్నారు. కాబట్టి అద్వైతజ్ఞానం వస్తు విపరీత విషయమైనందువల్ల మిథ్యయే అని పురాణరత్నం బోధిస్తున్నది.

ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ అద్వైతులకు కుదురదు. 'ఏక' అనే బ్రహ్మకూ 'సర్వ' పదార్థమైన ప్రపంచానికీ అభేదమంటే, మిథ్యయైన 'సర్వ' ప్రపంచానికంటె భిన్నమైన బ్రహ్మకూడా మిథ్య కావలసివస్తుంది. లేదా? ప్రపంచం సత్యమైనను కావలసి వస్తుంది. కాబట్టి మిథ్యావాదంలో అనేక దోషాలున్నాయన్నది స్పష్టమే. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" అంటే బ్రహ్మజ్ఞానం కలవాడు బ్రహ్మయే అవుతాడని జీవునికి బ్రహ్మతో ఐక్యాపత్తిని చెప్పడమూ అప్రామాణికమే.

బ్రహ్మ+ఏవ = బ్రహ్మయే అని కాదు. 'ఏవ' అనే అవ్యయం నిశ్చయార్థాన్ని బోధించక 'ఇవ' అనే అవ్యయంలాగా సాదృశ్యాన్ని బోధిస్తుంది. "విష్ణురేవ భూత్వా ఇమాన్లోకానభిజయతి'' అనే వాక్యంలోని 'ఏవ'- 'విష్ణువు వలె' అని సాదృశ్యవాచకమవుతుంది. కాబట్టి ముక్త పురుషుడు గుణాష్టక విశిష్టుడై పరమసామ్యాన్ని పొందుతాడని బోధిస్తుంది. "నిరంజనః పరమంసామ్యముపైతి". అనే శ్రుతి వాక్యంవల్ల సామ్యముక్తి, సగుణముక్తియే కాని నిర్గుణముక్తి అంటే ఆత్యంతిక ముక్తి కాదు అనడమూ అప్రామాణికమే.

సగుణముక్తిని పొందిన జీవునికి ఇంక అవిద్యా సంబంధం ఉంటుందని వాదించడం ప్రమాణ విరుద్ధమే. సమస్య భావః=సామ్యం; ఏకస్యభావః = ఐక్యం అన్నట్లు 'సామ్య' శబ్దానికి 'ఐక్య' మనే అర్థం చెబుతారు. కాని 'సమ' శబ్దానికి సాదృశ్యార్థమే ప్రచుర ప్రసిద్ధం. 'ఏకశ్చంద్రః' అనే బదులు "సమశ్చంద్రః" అనే వ్యవహారం లేదు.

**"ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే। తయోరన్యః పిప్పలంస్వాద్వత్తి, అనశ్నన్యన్యో అభిచాకశీతి"** (ముం.ఉ.5-1) ఒకే ఆకారం కలిగి, కలిసి తిరిగే రెండు పక్షులు ఒకే చెట్టును ఆశ్రయించి ఉన్నాయి.

ఆ రెండింటిలో ఒక పక్షి పండ్లను తింటుంది. మరొక పక్షి ఆ పండ్లను తినకుండా శోభిస్తున్నది. సాదృశ్య గర్భితమైన అధ్యవసానం చేత ఈ మంత్రం, జీవాత్మ పరమాత్మ ఒకే శరీరమందు ఉన్నారనీ, జీవాత్మ భోగ్యమైన కర్మఫలాన్ని భుజిస్తున్నాడు; పరమాత్మ కర్మఫలాన్ని భుజించకుండా సాక్షీభూతుడై ప్రకాశిస్తున్నాడని బోధిస్తుంది కదా! ఇందులో 'సయుక్' శబ్దం జీవేశ్వరులు స్వతః అపహత పాప్మత్వాది గుణాష్టకం చేత సమానులని బోధిస్తున్నది. సఖాయా (యౌ) అనడం వల్ల జీవేశ్వరులకు విడదీయరాని అవినాభావసంబంధం ఉన్నదని సూచిస్తున్నది. 'వృక్ష' శబ్దం 'ఆసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా" - (భ.గీ) అన్నట్లు ఛేదనార్హమైన శరీరాన్ని బోధిస్తుంది. కాబట్టి 'నిరంజనః అనే శబ్దం చేత బ్రహ్మ వలె జీవుడు, ప్రకృతి - అవిద్యాసంబంధరహితుడని స్పష్టమవుతున్నది. "తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ, నిరంజనః పరమంసామ్యముపైతి" (ముం.ఉ.5.3 మం.) 'సామ్యముక్తి ప్రకృతిసంబంధ వాసనారహితమైన ఆత్యంతికముక్తియే' అని తెల్పి, అద్వైత వాదాన్ని పరాస్తం చేస్తున్నది.

కణాద, కపిలాదుల చేత మోసపోయిన ప్రపంచాన్ని శ్రీ భాష్యకారులు తమ శ్రీసూక్తుల- కృతులచేత యథార్థ జ్ఞానం బోధించి, తీర్చిదిద్దారు, సంస్కరించారు.

స్వభావోక్త్యలంకారం, పృథ్వీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** ఏవమస్య బ్రహ్మోపకార కత్వం ప్రతిపాద్య జగదుపకారకత్వం ప్రతిపాదయతి కణాదేతి. కణాదపరిపాటిభిః - కణాదోక్త ప్రకారైః, వైశేషికశాస్త్రేణేత్యర్థః. కపిల కల్పనానాటకైః - కపిలేన స్వబుద్ధి కల్పిత వైదికచ్ఛా యానుకారైః, సాంఖ్యశాస్త్రేణేతి యావత్. కుమారిల కుభాషితైః - భట్టాచార్యస్య;

**సర్వనాశే సముత్పన్నే హ్యర్థం త్యజతి పండితః ।**
**అశ్వారూఢా : కథం చాశ్వాన్ని స్తరేయుస్సచేతనాః ।**
**అశ్వైరప హృతఃకోఽపి గర్దభః ప్రాపయిష్యతి ॥ ఇత్యాదిభి :**
**లోకరంజన మాత్ర ప్రయోజన వచనైః గురుబంధన గ్రంథిభిః**

ప్రాభాకర గురుప్రణీత నిబంధన వివరణాఖ్య గ్రంథచయ రూప దుర్మోచనగ్రథనైః; తథాగత కథాశతైః - సుగతానాం ద్వాదశాయతన పంచస్కంధాత్మక సంతతి వాసనా సంక్రాంత్యాద్యప్రామాణిక విచిత్ర ప్రకారోక్తిభిః; తదనుసారిజల్పైరపి - ప్రపంచాసత్యత్వ, చిన్మాత్ర సత్యత్వ, సవికల్పకత్వ ప్రత్యక్షత్వ సంవిదాత్మత్వ, నిర్విశేష సంవిదానందత్వ, నిర్విశేష స్వప్రకాశత్వ, బాధితానువృత్తి అసత్యా త్సత్యోత్పత్తి, ముక్తా సంవిత్ నిర్విషయత్వ, వ్యావహారిక సత్యత్వాంగీకరణాదిభిః బౌద్ధచ్ఛాయానుకారి మాయిమతానర్థక ప్రలాపైః ప్రతారిత మిదం జగత్, ప్రగుణితం - సంజాత యథార్థ జ్ఞానగుణకం అభూదితి యోజనా.

**వ్యాఖ్యానాంతరమ్ :** కణాదేతి కణాదస్యపరిపాటయః వైశేషిక గ్రంథాః కపిలస్యకల్పనాశాస్త్రాణి, తాన్యేవనాటకాని, అనృజుత్వాత్. కుమారిలస్య భట్టస్య కుభాషితాని - కుభాషితసదృశైః గ్రంథైః, గురోః ప్రభాకరస్య నిబంధనాన్యేవ గ్రంథయః, పీడావహత్వాత్. తథాగతస్య సుగతస్య కథా కథావత్ అనృజుభిః శతైః, గ్రంథశతైః, తదనుసారిణః శంకరాదయః తేషాంప్రలాపైః. ఇదమనుక్తా నామప్యుపలక్షణమ్, వంచితం జగత్, యతీంద్రోక్తిభిః - శ్రీభాష్యాదిభిః,ప్రగుణితం- ప్రకృష్టజ్ఞానాది గుణయుక్తం కృతమ్. స్వస్వరూపేఽవస్థాపితమిత్యర్థః.

**తదితర వ్యాఖ్యా:** గురునిబంధనేతి. ప్రాభాకర గురుకృతాయాః బృహ త్యాఖ్యాయాః శాబర వ్యాఖ్యాయాః నిబంధనమిత్యపి నామేత్యాహుః. క్లిష్టా పూర్ణపద ప్రయోగాత్, సర్వత్ర తస్యగ్రంథి రూపతా. తథాగతః - బుద్ధః. తదనుసారిణః శంకరాదయః; అపి - అనుక్త సముచ్చాయకః. ప్రగుణితం - ఋజుకృతమ్, ప్రకృష్ట గుణవచ్చకృతమ్. నిష్కంటకీ కృతమిత్యర్థః.

**40. కథా కలహకౌతుక గ్రహ గృహీత కౌతస్కుత -**
**ప్రథా జలధి సంప్లవ గ్రసన కుంభ సంభూతయః ।**
**జయంతి సుధియో యతిక్షితిభృదంతికోపాసనా -**
**ప్రభావ పరిపక్త్రిమ ప్రమితి భారతీ సంపదః ॥**

**అర్థం** : కథాకలహ - సంభూతయః। కథాకలహ = వాదకలహమందు; కౌతుక గ్రహ = ఉత్సాహం అనే పిశాచంచేత; గృహీత = పట్టుబడి-ఆవిష్టులై; కౌతస్కుత = 'కుతః కుతః' అని పలికే హేతు వాదుల యొక్క; ప్రథా = ప్రసిద్ధి అనే; జలధి సంప్లవ = సముద్రం యొక్క ప్రవాహాన్ని; గ్రసన = త్రాగడమందు; కుంభసంభూత యః = అగస్త్య మహర్షి వంటి వారైన; సుధియః = విద్వాంసులు - మంచిబుద్ధిగలవారు; యతిక్షితి - సంపదః । యతి క్షితిభృత్ = యతిరాజుల యొక్క; అంతిక = సమీప మందు. ఉపాసనా ప్రభావ = శుశ్రూష చేసిన మహిమవల్ల; పరిపక్త్రిమ = పరిపక్వమైన; ప్రమితి = యథార్థ జ్ఞానం యొక్క; భారతీ = విద్య యొక్క; సంపదః = సంపత్తు గలవారై; జయంతి = ప్రకాశిస్తుంటారు.

**తాత్పర్యము** : వాదరూప కలహమందు చాలా ఉత్సాహం కలవారి ప్రసిద్ధి అనే సముద్రాన్ని ఒక్క గ్రుక్కెడుగా త్రాగివేయడానికి అగస్త్యులవంటి వారైన సుధీమణులు శ్రీభాష్యకారుల సన్నిధిలో ఉండి శుశ్రూష చేసిన ప్రభావం వల్ల పరిపక్వమైన, యథార్థమైన జ్ఞాన సంపదనూ, విద్యా సంపదనూ కలవారై మహోత్కృష్టంగా ప్రకాశిస్తుంటారు.

**వ్యాఖ్య** : భగవద్రామానుజుల అంతేవాసుల మహిమ ప్రశంసితం.

శ్రీభాష్యకారుల సన్నిధిలో ఉన్నందువల్లనే అంతేవాసులకు శాస్త్ర జ్ఞానం లభించిందని దేశికులు పొగడుతున్నారు. వారి వద్ద శుశ్రూష చేసినందువల్లనే వీరికి గొప్ప ప్రజ్ఞ కలిగింది. శాస్త్ర పాఠాదులను అభ్యసించక వారిసేవచేస్తూ, వారి సంభాషణను ఆలకిస్తున్నందువల్ల వీరికి ఇతర మత సిద్ధాంతపరులను వాద కలహాల్లో జయించే శక్తి సామర్థ్యాలు కలిగాయంటే, గుర్వనుగ్రహం అంతే వాసులపై ఎంతో నిండుగా ప్రసరించియుంటుందనిపించకతప్పదు. ఇట్టి ప్రజ్ఞను శ్రుతపాండిత్యమూ అనవచ్చు.

సకల శాస్త్రాలను అభ్యసించిన ధీమంతులే శ్రీమద్రామానుజులవారి కృతులను అధ్యయనం చేసి బాగా అర్థంచేసుకోవలసియుంటుంది. అలాగా, వేదాన్త వాక్యార్థాలను క్షుణ్ణంగా, యథార్థంగా గ్రహించిన ధిషణగలవారే అంతేవాసులై ఉండి శుశ్రూషచేస్తూ, గుర్వనుగ్రహాన్ని పొందిన వారయితేనే రామానుజ సిద్ధాన్త వాక్యాలను అనర్గళంగా ఉపన్యసిస్తూ, ప్రత్యర్థులను వాదంలో యథార్థమైన ప్రజ్ఞాయుక్తులను ప్రదర్శించి ఓడించగలరు.

అంతికోపాసనాప్రభావం వల్ల యథార్థమైన, పరిపక్వమైన జ్ఞాన సంపదను పొంది, ఆచార్యకృపకు పాత్రులైన ఆంతరంగిక శిష్యులే శ్రీ కిడాంబి ఆచ్చాన్, ఎంబార్ (గోవిందభట్టు) కూరత్తాళ్వాన్, మొదలైన ఆచార్య పురుషులు. దేశికులు, తాను కూడా రామానుజులవారికి *నేరుగా శిష్యుడను కాలేకపోతినని చింతించినట్లు గోచరిస్తుంది. అయినా, ఆయాచార్యపురుషుల ద్వారా వారి యంత* ప్రజ్ఞాపాటవాలనూ, కీర్తి వైభవాలనూ తాను పొందినందువల్ల, తన పూర్వాచార్యులకు అసాధారణమైన కృతజ్ఞతాభావాన్ని ప్రకటిస్తున్నారు దేశికులీ శ్లోకంలో.

పరిపక్వమైన జ్ఞాన సంపద కలిగిన వారు కాబట్టి ప్రతి పక్షులను వాదకలహాల్లో గెల్వగలిగినారు. ప్రత్యర్థులు కూడా వాదకలహాలలో ఉత్సాహంతో పాల్గొని కీర్తి ప్రతిష్ఠలు బాగా సంపాదించినవారే సుమా! 'కౌతస్కుతు'లంటే పూర్వపక్షం చేసేవారని అర్థం. 'కుతః, కుతః' - ఎందువల్ల? ఎలా ఇది సంభవిస్తుంది? అని హేతువాదం చేసేవారు. పిశాచం ఆవహించినట్లు వాదించడంలో ప్రసిద్ధిని పొందిన మహా విద్వాంసులే వారు. వారి వాదప్రసిద్ధి అనే సముద్ర జలాన్ని ఆచమానంచేసి ఒక గ్రుక్కెడుగా త్రాగిన అగస్త్య మహర్షిలాంటివారు రామానుజులవారి అంతేవాసులు.

'కుంభసంభూతి' అగస్త్యుడు. కుండ యందు పుట్టిన ముని. కాలకేయులు మునులను దేవతలను బాధించేవారు. దేవతలు, మునులు గొప్పతపస్సంపన్నుడైన అగస్త్యమహర్షిని ప్రార్థించారు. అప్పుడు కాలకేయులు సముద్రంలో తలదాచు కొనియున్నారు. కాబట్టి, అగస్త్య మహర్షి సముద్ర జలమంతటిని ఆచమానం (పానం) చేశారు. కాలకేయులు బయట పడగానే దేవతలు వారిని సంహరించారని *భారతగాథ.* కౌతస్కుతప్రథ అంటే హేతువాదం చేసేవారి ప్రసిద్ధి - కీర్తి -

అగాధమైన సముద్రోదకం వలె విశాలంగా వ్యాపించి యుండింది. అలాంటి హేతువాదల ప్రసిద్ధి అంతా, అక్షయజ్ఞానం గల రామానుజులవారి అంతేవాసులతో వాదించినప్పుడు కుంభసంభవుడు ఒక్కసారి ఆచమానం చేయగానే సముద్రంలో నీరు మిగులకుండాపోయినట్లు, అదృశ్యమయిపోయింది. భగవద్రామానుజుల వారికి నేరుగా సేవ చేసే భాగ్యం కలిగిన, శిష్యులైన పూర్వాచార్యులలో ఒక్కొక్కరు కుంభసంభవునిలాంటి ప్రభావశాలురనీ, దేశికులవారు 'జయన్తిసుధియః' - ఆ సుధీమణులు సర్వోత్కర్షంగా ప్రకాశిస్తుంటారని ఈ శ్లోకంలో ప్రస్తుతించారు.

ఇది రూపకోపమాల అర్థ చమత్కారంతో పాటు శబ్ద చమత్కృతిమత్కృతి. పృథ్వీ వృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** కథా కలహేతి. కథా కలహా - సంభూతయః। కథా కలహే - వాదరూపకలహే; కౌతుకః - ఆదరః, స ఏవ గ్రహః - పిశాచః, తేనగృహీతాః ఆవిష్టాః, కౌతస్కుతాః - కుతః కుతః ఇతి వదంతీతి కౌతస్కుతాః . గృహీతాశ్చతే కౌతస్కుతాశ్చేతి విగ్రహః. తేషు ప్రథా - ఖ్యాతిః, సైవజలధిః. తస్య సంప్లవః ప్రవాహః, తస్యగ్రసనే - చుళకీ కరణే, కుంభ సంభూ తయః -అగస్త్యాః. యతిక్షితిభృత్ - సంపదః । యతిక్షితిభృతః, అంతికోపాసనం - సమీప సేవా, అనేన శాస్త్రపాఠాది నైరపేక్ష్యం సూచితమ్. తేన జన్యః ప్రభావః - మహిమా, తేన పరిపక్త్రిమయోః - సమ్యక్ పరిపాక మా పన్నయోః , ప్రమితి భారత్యోః - ప్రజ్ఞా సరస్వత్యోః, సంపత్ - సమృద్ధిః యేషాంతే తథోక్తాః సుధియః - ప్రామాణికార్థ వక్తారః, ఇతి యావత్. తే జయన్తి.

**వ్యాఖ్యానాంతరమ్ :** కథేత్యాది, కథారూపకలహే కౌతుకమేవ గ్రహః పిశాచః, తేన గృహీతాః యేకౌతస్కుతాః, తేషాం ప్రసిద్ధిరేవ జలధిః తస్య సంప్లవస్య - ప్రవాహస్య గ్రసనే - చుళకీ కరణే - భక్షనే, కుంభ సంభూతయః - ఆగస్త్యాః

యతిక్షితిభృదిత్యాది. యతిక్షితిభృత్ యతీంద్రః, తదంతికే ఉపాసనం - అవస్థానం, తస్యప్రభావేణ పరిపక్త్రిమాః, పరిణమంత్యః - పచేళిమాః, ప్రమితి భారతీ సంపదః - జ్ఞానవచస్సంపదో యేషాంతే సుధియః జయంతి - ఉత్కర్షేణవర్తన్తే. యద్వా దుర్వాదినో జయన్తి.

కౌతస్కుత కత్వేనాతీవ ప్రసిద్ధా అపి సుధియాం పురస్తాత్ కుత ఇతి ప్రష్టు మప్రగల్భా భవంతీతి యావత్.

41. యతీశ్వర సరస్వతీ సురభితాశయానాంసతాం
వహామి చరణాంబుజం ప్రణతిశాలినా మౌళినా।
తదన్య మత దుర్మద జ్వలితచేతసాం వాదినాం
శిరస్సు నిహితం మయా పద మదక్షిణం లక్ష్యతామ్ ॥

**అర్థం :** యతీశ్వర – యానాం। యతి+ఈశ్వర = యతీంద్రుల యొక్క; సరస్వతీ = గ్రంథాలచేత; సురభిత = పరిమళించియున్న; ఆశయానాం = మనస్సు గల, సతాం = సత్పురుషుల యొక్క; చరణ + అంబుజం = కమలాల వంటి పాదాలను; ప్రణతిశాలినా = నమ్రతచే ఒప్పుచున్న; మౌళినా = శిరస్సు చేత; వహామి = మోయుచున్నాను, తదన్య–చేతసాం। తత్ = ఆరామానుజ మతంకంటె; అన్యమత = ఇతరమతాలయందలి; దుర్మద = దురహంకారంచేత; జ్వలిత = దగ్ధమైన; చేతసాం = మనస్సుగల; వాదినాం = ప్రతిపక్షుల యొక్క; శిరస్సు = తలలమీద; మయా = నాచేత; అదక్షిణం పదం = ఎడమకాలు; నిహితం = ఉంచబడినదిగా; లక్ష్యతాం = చూడబడుగాక.

**తాత్పర్యము :** యతిరాజుల శ్రీభాష్యాదిగ్రంథాలను ఆదరంతో పరిశీలించడంచేత పరిమళించిన హృదయాలుగల సత్పురుషుల యొక్క పాదకమలాలను శిరసావహిస్తుంటాను. రామానుజమతంకంటె వేరైన మతాలయందు దురభిమానం గల దుర్వాదుల శిరస్సులపైన నావామపాదం అందరు చూస్తుండగా ఉంచబడుతుంది.

**వ్యాఖ్య :** పరమాచార్యుల పాదపద్మాలను శిరసావహిస్తున్న ప్రభావం వల్ల తాను పరమత భంగం చేస్తానని దేశికుల ప్రకటన.

**యతీశ్వర సరస్వతీ సురభితాశయానాం :** ఈ శ్లోకం 'సంకల్ప సూర్యోదయం' అనే నాటకంలో (2 అం. 43)నూ ప్రకటితం. శ్రీ భాష్యకారుల సూక్తుల – కృతుల – లో నిగమపరిమళాలు గుభాళిస్తుంటాయి. "తిరువాయ్

మొషియిన్ మణన్తరు మిన్నిశై” అని తిరువరంగత్త ముదానార్ పలికారు. నమ్మాళ్వార్లు కృపజేసిన సహస్రగీతిలో పరిమళం గుభాళించడం వల్ల అది చెవికింపైన గానమనబడింది. ఇక్కడ దేశికులు యతిరాజుల సూక్తులు పరిమళిస్తున్నాయన్నారు. వాస్తవంగా, రామానుజ గ్రంథాలను పరిశీలించిన వారి మధుర సూక్తులూ వినడానికి ఎంతో ఇంపుగా ఉంటాయి. 'సతాం' అనడం వల్ల కూరుత్తాళ్వాన్, గోవిందభట్టు, దేశికులకు పరమాచార్యులైన కిడాంబి అచ్చాన్ (అప్పుళ్ళార్) సూచింపబడినారు. 'సత్' అనే శబ్ద ప్రయోగం వల్ల ఈ పూర్వాచార్యులకు రామానుజుల సంబంధం చేత సత్త, సద్గుణ పూర్తి కూడా సూచింపబడింది. ఇట్టి సద్గురువుల శ్రీపాదకమలాలను దేశికులు శిరసావహిస్తుంటారు. సురభిత, అంబుజ అనే పదాల ప్రయోగంవల్ల స్వాచార్యుల శ్రీపాదాలు శిరసాహించే యోగ్యతను కలిగి ఉన్నాయని సూచితం. దేశికుల మౌళి ప్రణతిశాలి. కాబట్టి స్వాచార్యుల శ్రీ పాదకమలాలను సాష్టాంగ నమస్కార పూర్వకంగా (దేశికులు) తన తలమీద ధరించడం పరిపాటి అయింది.

రామానుజుమతంపైన కాక ఇతరమతాలపైన ఆదరాభిమానాలను కలగియున్న దుర్వాదుల తలల మీద తన వామపాదాన్ని మోపుతానని దేశికులన్నారు. 'దుర్మదజ్వలిత' పదప్రయోగం వల్ల దేశికుల హృదయం దుర్వాదులైన ప్రతిపక్షులను 'తృణాయ మేనే' అన్నట్లుగా 'కరీషం' – పేడ పిడుకను హీనంగా చూచేరీతిగా, తిరస్కరిస్తున్నట్లు స్ఫురిస్తున్నది. 'వాదినాం' అనే బహువచనం, ప్రతిపక్షులెందరున్నా, వారందరినీ శృంగభంగం చేయడానికి దేశికులు ఒక్కడే చాలు – సమర్థుడని తెల్పుతుంది. పరమతాభిమానుల శిరస్సులు తన కుడికాలును మోపడానికి యోగ్యమైనవి కావు. ఆ దుర్వాదుల తలల మీద తన వామపాదాన్ని మోపడమే సముచితమన్నారు దేశికులు. ఇది సాహసకృత్యమని భావించరాదు.

ధర్మారాజు సభలో శ్రీ కృష్ణుని అగ్రపూజను అంగీకరించని వారి తలలపైన వామపాదంమోపుతానని సహదేవుడు పలికాడు కదా!

రాజసూయయాగమందు "మానినాంబలినాం రాజ్ఞాంమధ్యే సందర్శితే పదే। తతోఽ పతత్ పుష్పవృష్టిః సహదేవస్య మూర్ధని" ఆ రాజుల మధ్య ఎడమకాలెత్తి చూపిన సహదేవుని తలమీద పూలవాన కురిసింది.

"సహదేవన్ కాలైకాట్టిన పోతవన్ తలైయిలే పుష్పవృష్టి యుణ్డాయిత్తు, పరత్వత్తై యుపపాదిత్త జ్ఞానియాన భీష్మన్ తలైయిలే పుష్పవృష్టి కణ్డతిల్లై" (భగవద్విషయ సూక్తి)

ఎడమకాలెత్తి చూపుతున్న సహదేవుని తలమీద పుష్పవర్షం కురిసింది. కాని "స ఏవ పృథు దీర్ఘాక్షః సంబంధీ తే జనార్దనః" – 'శ్రీకృష్ణుడు పుండరీకాక్షుడు, జనార్దనుడు, సర్వవిధబంధువు' అని భగవత్పరత్వాన్ని బోధించి, శ్రీకృష్ణుడే అగ్రపూజకు అర్హుడని చెప్పిన జ్ఞానియైన భీష్ముని తలమీద పుష్పవర్షం పడలేదు కదా!

'నావలిట్టు ఉదరుగిన్ఱోమ్ నమన్ తమర్ తలైగళ్ మీదే" (తిరుమాలై) "భగవన్నామ సంకీర్తన బలంచేకూరిన తర్వాత, పాపఫలాన్ని అనుభవింపజేసే యముని తలమీదనూ, అతని భటుల తలమీదనూ పాదప్రహారం చేసి తిరుగ గలిగాము" అని తొండరడిప్పొడి యాళ్వార్లు అన్నారు.

మొట్టమొదట, హనుమంతుడు (శ్రీరాముని) శత్రువుగా ఉన్న రావణుని పట్టణం – లంక–లోకి తన ఎడమకాలెత్తిపెట్టి ప్రవేశించాడు.

**లక్ష్యతామ్** : "సమున్నతిః సన్నతిహేతురాసీత్" – (యాదవాభ్యుదయం 5–56) ఉన్నతి వల్ల నతి కలుగుతుంది కదా! తన పూర్వాచార్యుల శ్రీపాద పద్మాలను శిరసావహించిన మహిమవల్ల దేశికుల పరమత వాదుల తలల మీద సకల జనులు చూస్తుండగా తన ఎడమకాలును మోపుతానని ప్రకటించడం శిష్టాచారంగా గోచరిస్తుంది.

ఇదిశాస్త్రవాదకలహం. శస్త్రాలతో కూడిన కలహంకాదు. పరమత సిద్ధాంతాలను ఖండించి రామానుజసిద్ధాంతాన్ని బలపరచి వృద్ధి చేసే సామర్థ్యం దేశికులకు తన పూర్వాచార్యుల శ్రీపాదకమలాలను ప్రణతిశాలియైన తనమౌళియందు వహించడం వల్ల ప్రభవించిందని విశదీకరిస్తున్నదీ శ్లోకం.

వాక్యార్థ హేతుక కావ్యలింగాలంకారం. పృథ్వీవృతం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథతచ్ఛిష్యప్రశిష్యభూతోఽహ మేక ఏవ పరమతభంగాయ అలమిత్యాహ, యతీతి. గురుపరంపరాయాః బుద్ధి విషయత్వేన సన్నిహితత్వాత్ తత్సన్నిధౌ పదోద్ధరణస్య అనుచితత్వేఽపి కృష్ణద్వైపాయన భీష్మాది పరిషద్గత సహదేవవత్ పరమతభంగ సూచకవతాం పాదోద్ధరణస్య అవశ్య కార్యత్వాత్ తదాహితా పచార పరిహారార్థం గురూన్ ప్రణమితి ప్రథమార్ధేన.

శ్రీ భాష్యాది పరిశీలనవతాం గురూణాం శ్రీపాదకమలం శిరసావహా మిత్యర్థః. అంబుజ పదేన, సురభితపదేన చతేషాం శిరసావహన యోగ్యత్వం సూచ్యతే. సచ్ఛబ్దేన తేషాంరామానుజాచార్య సంబంధాత్ లబ్ధ సత్తాక త్వప్రభృతి సద్గుణ పూర్తిః సూచ్యతే. ప్రణతిశాలినేత్యనేన స్వశిరసః స్వారోహత్వం స్ఫురతి. తస్మాద్యతీశ్వరా దన్యేషాం శంకరాదీనాం మత పరిశీలన జనిత పండిత మానిత్వ గర్వేణ జ్వలిత చేతసాం, దగ్ధహృదయానాం, దుర్వాదినాంశీర్షేషు (మయా అదక్షిణం) దక్షిణా దన్యత్ వామపాదం, నిహితం లక్ష్యతాం - దృశ్యతాం. సకల లోక సాక్షికతయా నిధీయత ఇత్యర్థః. వాదినామితి బహువచన సామర్థ్యేన అనేకేషాం అహమేక ఏవాలమితి ఫలితమ్.

జ్వలిత పదేన తేషాం కరీషవత్ తిరస్కార్యత్వం సూచితమ్.

**అత్రప్రభావళీ:** యతీశ్వర సరస్వతీ సురభితాశయానాం- యతీశ్వర సరస్వత్యాశ్రీభాష్యాది రూపయా, సురభితం - తత్త్వరహస్యేషు సంశయ విపర్యయరహితం, తాదృశః, ఆశయః మనో యేషాం తేషాం, సతామ్ - త ఏవ సంతః ఇతిభావః.

తదన్యమత దుర్మద జ్వలిత చేతసాం - తదన్యమతాని - శ్రీభాష్యకార మతా దన్యాని, తేషు దుర్మదః - దురభిమానః, తేనాగ్నినా, జ్వలితం - దగ్ధం, చేతో యేషాం తేషామ్. వాదినాం - దుర్వాదినాం; శిరస్సు అదక్షిణం పదం - వామం పాదం, మయా నిహితం లక్ష్యతామ్ - వీక్ష్యతామ్ ఇతి.

**వ్యాఖ్యానాంతరం:** సరస్వతీ - సూక్తిః. తత్సరభితత్వం - తత్సూక్తి తదర్థ విషయకానుభవ వాసనానిర్భరత్వమ్. ప్రణతిశాలినా- నమ్రేణ - పూర్వం

ప్రణామాన్వితేనవా; తదన్యేతి. యతీశ్వర సరస్వతీ సౌరభాత్మక మతాన్యేత్యర్థః. తన్మత కృతేన దుర్మదేనక్రుద్ధానాం, తైః తూలాయాపి తృణాయవా న మన్యామహే ఇతి స్వేషాం ప్రతిభటేషునికృష్టాభిమానవ త్వముక్తమ్. తావతా నికర్షస్య వాస్తవత్వం నసిధ్యతి. మయాతు పదం శిరసినిక్షిప్యతే. తత్ తేషాం నికర్షః. తేషా మన్యేషాంచ ప్రత్యక్ష ఇత్యాశ యేన లక్ష్యతా మిత్యుక్తమ్.

**42. భజస్వ యతిభూపతే రనిదమాది దుర్వాసనా**
**కదధ్వ పరివర్తన శ్రమ నివర్తనీం వర్తనీమ్ ।**
**లభస్వహృదయ! స్వయం రథ పదాయుధానుగ్రహ**
**ద్రుత ప్రహృతి నిస్త్రుట ద్దురిత దుర్వృతిం నిర్వృతిమ్॥**

**అర్థం :** హే హృదయ = ఓ మనసా! అనిత – నివర్తనీం । అనిదం+ఆది = అనాదియైన; దుర్వాసనా = దుష్టవాసన వల్ల; కదధ్వ = దుర్మార్గమందు; పరివర్తన = సంచరించడం వల్ల కలిగిన; శ్రమ = ఆయాసాన్ని; నివర్తనీం = తొలగింపజేయునట్టి; యతిభూపతేః, వర్తనీం = యతిరాజు యొక్క సన్మార్గాన్ని; భజస్వ = అవలంబించుము.

రథపదా – నిర్వృతిం । రథపద+ఆయుధ = చక్రాయుధుని యొక్క; అనుగ్రహా = కృపారూపమైన; ద్రుత = శీఘ్రమైన, ప్రహృతి = ప్రహారం–దెబ్బచేత; నిస్త్రుటత్ = ఖండింపబడే; దురిత = పాపరూపమైన; దుర్వృతిం = ప్రతిబంధకం కలిగిన; నిర్వృతిం = ఆనందాన్ని; లభస్వ = పొందుము.

**తాత్పర్యము :** ఓ మనసా! అనాది దుర్వాసన వల్ల దుష్టమార్గాల యందు సంచరించడం వల్ల కలిగిన – దుర్మతాలలో చేరడం వలన కలిగిన– శ్రమను నివారింపజేసే యతిరాజుల సత్సంప్రదాయాన్ని అవలంబించుము. చక్రాయుధుడైన శ్రీ మహావిష్ణువు యొక్క అనుగ్రహరూపమైన శీఘ్రప్రహారం చేత పాపరూపమైన ప్రతిబంధకం ఖండింపబడే భగవత్కైంకర్యరూపమైన గొప్ప ఆనందాన్ని పొందుము.

**వ్యాఖ్య : యతీంద్రులనాశ్రయించిన వారికి సుఖాతిశయం కలుగును.** ఆళ్వార్లు 'ఎన్మననే' అని సంబోధించి, హితంబోధించుకొన్నట్లు, దేశికులు కూడా ఓ మనసా! అని తమ మనస్సుకే కర్తవ్యాన్నిబోధిస్తున్నారీ శ్లోకంలో. ఇది లోకులకు ఎంతో హితకరమైనది.

ఓ మనసా! నీవు అనాదికాలం నుంచి అజ్ఞానాంధకారమార్గంలో సంచరిస్తున్నావు. పెడదారిలో నడిచేవారికి గులుకరాళ్ళు, ముండ్లు, మిట్ట పల్లాల వల్ల చాలా శ్రమకలుగడం సహజమే కదా! అలాగే అనాదియైన దుర్వాసనాబలం వల్ల, దుష్టమతాలలో ప్రవేశించి మనస్సుకు శాంతిలేక, తీరని అనేక కష్టాలను అనుభవిస్తున్నావు. బాధలను తొలగించే మార్గంలో సంచరించడానికి తలచుకొంటున్నావు కూడా. అయితే విను

**వర్తనీ శ్రమనివర్తనీ :** స్వర్గనరకాలకు దారితీసే శ్రమను తొలగించే యతిరాజుల సత్సంప్రదాయాన్ని అవలంబించితే శ్రేయస్కరం. భగవద్రామానుజ సంప్రదాయం రాజమార్గం. ఎందరో ఆచార్యులూ, భక్తులూ సంచరించడం వల్ల అది క్షుణ్ణమైన మార్గం. రామానుజ సంప్రదాయాన్ని అవలంబించినవారికి భగవదనుగ్రహం పరిపూర్ణంగా కలుగుతుంది. చక్రాయుధుడైన శ్రీ మహావిష్ణువు యొక్క ఆనుకూల్య సంకల్పం వల్ల సంసార ప్రతిబంధకమైన పాపరాశి పటాపంచలవుతుంది. ఆత్మకు శేషత్వ స్వరూపం సిద్ధిస్తుంది. తత్ఫలితంగా, రాజునాశ్రయించినందువల్ల, రాజబలంచేత దుర్వృత్తి మారిపోయి, సద్వృత్తిని అనుసరించి గమ్యాన్ని చేరుకొనే వ్యక్తులు సుఖపడునట్లే, యతిరాజపాద పద్మాలనాశ్రయించినందువల్ల పరిశుద్ధాత్ములై 'ఆత్మదాస్యం హరేః స్వామ్యం' అనే భావంతో భగవంతునికి నిత్యకైంకర్యం చేసే బ్రహ్మానందం లభిస్తుంది. 'ఓ మనసా! నీవూ ఆమోక్ష సామ్రాజ్యానందాన్ని పొందు' మని దేశికులు హితోపదేశం చేశారు.

రూపకాలంకారసజ్జితం. వృత్త్యను ప్రాసమనే శబ్దాలంకారం. పృథ్వీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథయతీంద్ర సమాశ్రయిణాం సౌఖ్యాతిశయం వదతి, భజస్వేతి, హేహృదయ! యతిభూపతేః - యతిరాజస్య అనిదమాది - నివర్తనీ - అనిద మాద్యా - అనాద్యా, దుర్వాసనయా జాతేన, కదధ్వపరివర్తనేన - స్వర్గనరకాది పరివర్తనేన, నివర్తనీం - నివర్తికాం, వర్తనీం - మార్గం, తత్సంప్రదాయమిత్యర్థః. భజస్వ - అవలంబస్వ తతః. రథపదా - దుర్వృతిం, రథపదం - చక్రం, తదాయుధస్య విష్ణోః, అనుగ్రహరూపయా - అనుకూల్య సంకల్పరూపయా, ద్రుతప్రహృత్యా - శీఘ్రప్రహారేణ, నిస్త్రుటంతీ - విభజ్యమానా, దురితరూపా, దుర్వృతిః - దుష్టమావరణం - ప్రతిబంధకం యస్యాస్తాం; నిర్వృతిం సౌఖ్యం, భగవన్నిత్యకైంకర్య రూపం మహానందం, లభస్వ-ప్రాప్నుహి. అనాదికాల సంచితానేక పాప సంచయస్యానుభవప్రాయశ్చిత్తాదిభిః వినాశయితు మశక్యత్వాత్ రామానుజాచార్య చరణారవింద సంబంధకృతా వర్ణనీయ భగవదనుగ్రహ వినాశ్యత్వమేవేత్యర్థః. ప్రతిబంధక పాపవినాశేచ శేషత్వ స్వరూప ప్రాప్తం భగవన్నిత్యకైంకర్యరూపం సిద్ధ్యత్యేవేత్యర్థః -కేనచిత్ సన్మార్గం వృత్త్యాదిభిః ప్రతిబధ్య దుర్మార్గ పరివర్తనే కల్పితేఽపి రాజ సమాశ్రయీ రాజబలాత్ వృత్త్యా దిక ముత్పాట్య సన్మార్గేణైవ గచ్ఛతీతి స్ఫురతి.

**43. కుమతి విహితగ్రంథ గ్రంథి ప్రభూత మతాంతర**
**గ్రహిళ మనసః పశ్యంత్యల్పాం యతీశ్వర భారతీమ్ ।**
**వికట మురభి ద్వక్షః పీఠీ పరిష్కరణో చితః**
**కులగిరితులారోహేభావీకియానివకౌస్తుభః ॥**

**అర్థం :** కుమతి - మనసః। కుమతి = దుర్మతులైన ప్రత్యర్థులచేత; విహిత = చేయబడిన; గ్రంథ గ్రంథి = గ్రంథరూపమైన ముడులచేత; (మూలవ్యాఖ్యానాలచేత) ప్రభూత = గొప్పవైన; మతాంతర = ఇతర మతాలయందు; గ్రహిళ = బద్ధమైన; మనసః = హృదయం కలవారు; యతీశ్వర భారతీం = యతిరాజుల సూక్తులుగల కృతిని (గ్రంథాన్ని); అల్పాం = చిన్నదిగా; పశ్యంతి = చూస్తుంటారు. (అనాదరిస్తారు).

వికట - చితః । వికట= విస్తారమైన, మురభిత్, వక్షః పీఠీ = మురహరి యొక్క వక్షఃస్థలాన్ని; పరిష్కరణ = అలంకరించడానికి; ఉచితః = తగినట్టి; కౌస్తుభః= కౌస్తుభ మనే రత్నం; కులగిరి, తులా+ఆరోహే = కులపర్వతంతో, త్రాసునందు ఎక్కినప్పుడు - తూచినప్పుడు; కియాన్, ఇవ, భావీ = ఎంత మాత్రం ఉంటుంది? (బరువులో చాలా తక్కువ తూగును).

**తాత్పర్యము :** కుమతులు రచించిన మూలవ్యాఖ్యాన గ్రంథాలు గొప్పవని ఇతర మతాలయందు బద్ధ హృదయులైన వారు యతిరాజుల గ్రంథం చిన్నదని న్యక్కారంతో చూస్తుంటారు. విస్తృతమైన మురారివక్షఃస్థలమందు అలంకరించడానికి యోగ్యమైన కౌస్తుభరత్నాన్ని ఒక పళ్ళెంలోనూ, కులాచలాన్ని మరొక పళ్ళెంలో ఉంచి తూచినప్పుడు కులాచలంతో కౌస్తుభరత్నం సరితూగునా? తూగదు.

**వ్యాఖ్య :** శ్రీమద్రామానుజగ్రంథావళి మహిమ గొప్పదని వివరించే శ్లోకమిది.

కుమతులు రచించిన గ్రంథాలను పరిశీలించిన కొందరు వ్యక్తులు మతాంతరుల అంటే సాంఖ్య బౌద్ధాది మతాల గ్రంథాలు గొప్పవని భావిస్తున్నారు. ఆ గ్రంథాలలో చెప్పవలసిన శాస్త్ర విషయాలు ప్రమాణాన్ని అనుసరించి ఉండవు. పైగా, శాస్త్రవాక్యాలకు పెడార్థాలను కల్పించి, వాటిని సమర్థించడానికి అనేక నిరర్థక వాక్యాలను పెంచి వ్రాయడం వల్ల పరిమాణంలో ఆ గ్రంథాలు పెద్దగా కనిపించడమే కారణం. మతాంతరుల మూలవ్యాఖ్యానాల మందు బద్ధహృద యులైనవారు రామానుజుల గ్రంథాలు రూపాన్ని బట్టి చిన్నవిగా కనబడడం వల్ల వాటిని గౌరవించడం లేదు. చిన్న చూపుతో చూస్తుంటారు.

గుణం ప్రధానం కాని రూపంపెద్దదైనా, చిన్నదైనా అప్రధానమని సారజ్ఞులంటారు.

శ్రీనివాసుని వక్షఃస్థలాన్ని అలంకరించే యోగ్యతగల కౌస్తుభరత్నాన్ని త్రాసులోని ఒక పళ్ళెంలో ఉంచి, మరొక వైపు చట్లు, చెట్లతో నిండిన కుల

పర్వతాన్ని ఉంచి తూచినప్పుడు ఆ కౌస్తుభరత్నం కులాచలంతో ఏ మాత్రమైనా సరితూగుతుందా? తులదూగలేనంత మాత్రాన కౌస్తుభ మణికంటె కులాచలం గొప్పదని పదార్థ మహిమ తెలిసిన వారు అనలేరు కదా!

ప్రజలెన్ని మాటలాడినా ప్రభువు మాటయే చెల్లుతుంది. ఇతర సంప్రదాయాల కంటె రామానుజ సంప్రదాయం భుక్తి ముక్తిదాయకమైనది. యతిరాజుల సూక్తులున్న గ్రంథావళి శ్రుతిస్మృతి ప్రమాణాలతో కూడి చాలా విలువ కలిగినదవడం వల్ల, అది రూపంలో చిన్నదే అయినా, కౌస్తుభమణిలాగా గౌరవింప దగినదే అని దేశికులు సుశ్లోకించారు. అన్యమతగ్రంధజాలం కులగిరి వంటిదని, రామానుజగ్రంధమాల కౌస్తుభమణి వంటిదని పోల్చి చెప్పినందువల్ల, ఇది దృష్టాంతాలంకారం. హరిణీ వృత్త రచిత శ్లోకమిది.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ యతీశ్వర మత విషయ ప్రబంధాల్పత్వ నిమిత్తానాదరం వ్యదస్యతి, కుమతీతి. కుమతివిహిత – గ్రహిళమనసః కుమతిభిః విహితైఃకృతైః, గ్రంథగ్రంథిభిః – మూలవ్యాఖ్యానైః, ప్రభూతేషు – మహత్సు, మతాంతరేషు, గ్రహిళమనసః – గృహీత గ్రాహిమనసః; యతీశ్వర భారతీం – యతీంద్రభాష్యాదికం, అల్పాం పశ్యంతి. వికట – చితః । వికటాయాః – విస్తృతాయాః, మురభిత్ వక్షః పీఠ్యాః – శ్రీమన్నారాయణ వక్షఃస్థలస్య పరిష్కరణో చితః – అలంకారోచితః; కౌస్తుభః, కులగిరితులారోహే – కులగిరిణాసహ తులాయామారోహే, కియాన్ భావీ – అత్యంత మల్పోభవతి. తథాఽపి సారభూతః కౌస్తుభః ఉపాదేయః; నాసారః కుల పర్వతః. తద్వత్ సారభూతం యతీంద్రమతమేవ ఉపాదేయం, నాసారభూతం మతాంతర మత్యర్థః

**తత్రప్రభావళీ :** కుమతీత్యాది – కుమతిభిర్విహితాః గ్రంథా ఏవ గ్రంథయః తైః ప్రభూతాని మతాంతరాణి, తేషు గ్రహిళ మనసః – బద్ధ హృదయాః, అల్పాం పశ్యంతి – కల్పత్వాత్ అసమీచీన మిదంమతమితి మన్యంత ఇతిభావః. మహత్వాల్పత్వే సమ్యక్త్వా సమ్యక్త్వయోః న ప్రయోజకే తథాఽ దర్శనాదిత్యాహ వికటేతి. వికట మురభి ద్వక్షః పీఠత పరిష్కరణో చితః కౌస్తుభమణిః కులగిరిణా సమం తులాయా మారోహేకియాన్ భావీ, నకించిదపి, తదపి ఆకారతోఽతి సూక్ష్మత్వేఽపి కౌస్తుభస్య శ్లాఘ్యతా కులగిరేః కిమస్తీ తిభావః.

**వ్యాఖ్యానాంతర :** కుమతివిహితా నాం(గ్రంథానాం యే(గ్రంథయః శిధిలభాగ గతశైధిల్య పరిహారాయ కంథా(గ్రథనవత్ (గ్రథనార్థ విహితాః వ్యాఖ్యారూపాః (ప్రాచీన నవీన (ప్రస్థానభిన్నాః (గ్రంథాః, తైః (ప్రభూతే లబ్ధాధిక్యే మతాంతరే ఆ(గ్రహయుక్తమనసః అల్పాం పరిమిత వర్ణాం పశ్యంతి. వికటేతి - విశాలేత్యర్థః. భగవతః కౌస్తుభవత్ హృద్యమిదం యతిరాజమతమితి భావః. కులగిరితులారోహే సామ్యవైషమ్యావధారణార్థ్వే కులాచలస్యతులాయా మేకస్మిన్ఘటే ఆరోహః, కౌస్తుభస్యచ ఘటాంతరే ఆరోహిత్యేవం తేన సహతులారోహే, కియాన్భావీ - న్యూనగుణ త్వా(శయ ఏవభవతి, తావతా న నికర్ష ఇతిభావః.

**44.** **స్థ విర నిగమస్తోమ స్థేయాం యతీశ్వరభారతీం**
**కుమతి ఫణితి క్షోభ క్షీబాః క్షిపంతు భజంతువా।**
**రస పరిమళ శ్లాఘా ఘోషస్ఫుటత్ పుట భేదనం**
**లవణ వణిజః కర్పూరార్ఘం కిమిత్యభిమన్వతే ॥**

**అర్థం :** స్థ విర నిగమస్తోమ స్థేయాం। స్థవిర = చిరకాలమున్న - అనాదియైన; నిగమ, స్తోమ = వేద సమూహం యొక్క; స్థేయాం = అర్థాన్ని నిర్ణయించునట్టి; యతీశ్వర భారతీం = రామానుజ(గ్రంథమాలను; (సూక్తిని). కుమతి ఫణితి క్షోభ క్షీబాః। కుమతి = దుర్మతుల యొక్క; ఫణితి= వాక్యాలచేత; క్షోభ = మన ః కాలుష్యం గల; క్షీబాః = మందమతులు; క్షిపంతు = అధిక్షేపింతురు గాక; వా = లేదా; భజంతు= పరి(గ్రహింతురుగాక. రస - భేదనం। రస, పరిమళ = రస పరిమళాలను; శ్లాఘా = కొనియాడే (ప్రచారం చేసే); ఘోష= గొప్ప ధ్వనిచేత; స్ఫుటత్ = విదళితమైన; (ప్రకటితమైన; పుటభేదనం = పట్టణంగల; (నగరాలలో (ప్రసిద్ధిని పొందిన). కర్పూర+అర్ఘం = పచ్చకర్పూరపు వెలను-ధరను; లవణ వణిజః= ఉప్పు వ్యాపారం చేసే వ్యక్తులు; కిం ఇతి, అభిమన్వతే = ఏమని తెలుసుకొంటారు? తెలుసుకోలేరని భావం.

**తాత్పర్యము :** కుమతుల వాక్కులచేత కలుషితమైన హృదయంకల వ్యక్తులు వేదాన్తవాక్యాలకు అర్థనిర్ణయం చేసే యతిరాజు శ్రీసూక్తులను ఆక్షేపించినా, స్తుతించినా ప్రయోజనం లేదు. నగరాలలో రస పరిమళాలచేత గొప్పగా చాటింపబడి ప్రసిద్ధి చెందే పచ్చకర్పూరపు ధర ఉప్పు అమ్ముకునే వ్యాపారులకు ఏమి తెలుస్తుంది? తెలియదుకదా!

**వ్యాఖ్య :** రామానుజ సంప్రదాయాన్ని అందరు ఎందుకు పరిగ్రహించరు? అనే ఆక్షేపణకు సమాధానమీ శ్లోకం.

గత శ్లోకంలో యతీంద్ర గ్రంథాల రూపాన్ని, కౌస్తుభమణి వలె రూపం (Size) చిన్నదైనా, ఉత్కృష్టమైనదని వర్ణింపబడింది. ఈ శ్లోకంలో ఆ గ్రంథాల స్వభావం (Merit) ప్రశంసనీయమని వర్ణితం. 'స్థవిర' శబ్దం ప్రాచీనం, చిరకాలం నుంచి ఉన్నట్టి, అంతమందున్నట్టి అనే అర్థాన్ని బోధిస్తుంది. 'స్థవిర నిగమస్తోమ' మంటే అంతమందున్న వేదసమూహమని అర్థం. కాబట్టి ఉపనిషత్తులు, వేదాంతశాస్త్రం అని భావం. "ప్రవయాః స్థవిరో వృద్ధః" (అమరం).

'స్థేయాం' అంటే, మిక్కిలి స్థిరమైనదని అర్థం. "స్థాస్నుః స్థిరతరః స్థేయాన్" (అమరం) ఇక్కడ, యతీశ్వరభారతి - శ్రీ సూక్తి, ఉపనిషత్తులను ప్రమాణంగా చెప్పి, వేదాంతార్థాన్ని నిర్ణయించడం వల్ల స్థిరతరమైనదని అర్థం.

కుమతులు వ్రాసిన గ్రంథాలలోని వచనాలను చదివిన వారి హృదయాలు కలుషితాలైనందువల్ల ఒడలెరగకున్న వారు కాబట్టి 'కుమతి ఫణితి క్షోభక్షీబాః'- అనబడినారు.

"మత్తేశౌండోత్కట క్షీబాః" - (అమరం) మదోద్రేకంచేత తమను తామే తెలుసుకోలేని వారు క్షీబులు. మనఃకాలుష్యంచేత మందమతులైన వీరు తామసులు కాబట్టి, యథార్థాలను ప్రామాణికంగా నిర్ణయించి చెప్పిన రామానుజుల శ్రీభాష్యాదిగ్రంథాలను నిందిస్తుంటారు. సత్వగుణం ఉద్రేకించినప్పుడే, వారు ఆ గ్రంథజాలాన్ని ప్రశంసిస్తుంటారు.

"స్వభావో మూర్ధ్ని తిష్ఠతి" - అన్నట్లు, వీరు మళ్ళీ రజస్తమో గుణా విష్టులై కుమతుల సంప్రదాయాన్నే అవలంబిస్తుంటారు. కాబట్టి, ఈ కుమతి ఫణితిక్షోభక్షీబులు భగవద్రామానుజుల సూక్తులను - కృతులను - నిందించినా, అభినందించినా నిష్ప్రయోజనం.

"ఉప్పు కప్పురంబు ఒక్క పోలికనుండు. జూడ జూడ రుచుల జాడ వేరు" అనే వేమన సూక్తిని గమనింపజేస్తుంది. ఉత్తర్థాం. "ఉప్పు మరియు పచ్చ కర్పూరం ఒకే విధంగా తెల్లగా ఉండే వస్తువులు. పచ్చకర్పూరం రసమయద్రవ్యం. ప్రత్యేకంగా కమ్మని రుచిగల వస్తువు. దాని పరిమళం దాచినా దాగదు. వర్తకులందరు అమ్మజాలరు. ప్రభుత్వానుమతిని (Licence) పొందినవర్తకులే రస పరిమళద్రవ్యాలను పట్టణాలలో అమ్ముకో గలుగుతారు. అందరు గాక, కొందరే కర్పూరాన్ని ఎంత ధరనైనా చెల్లించి, పరిగ్రహిస్తారు. "పత్తనం పుటభేదనం" (అమరం). ఉప్పు ఉప్పనగా ఉన్నా, దాన్ని వాడని వంటకం రుచించదు కదా! కాబట్టి అది సామాన్యంగా, పల్లెల్లోనూ, పట్టణాల్లోనూ వాడుకోబడుతుంది. వర్తకులందరు విక్రయించగలుగుతారు. చులకనైనది ఉప్పు. లవణ విక్రేత - ఉప్పును అమ్ముకొనే వణిజుడు, పట్టణాలలో తన రస పరిమళాల చేత శ్లాఘింపబడుతూ ప్రసిద్ధిని పొందిన, గొప్ప వెలగల పచ్చకర్పూరాన్ని నిందించినా ఆశ్చర్యం లేదు. స్తుతించినా ప్రయోజనం లేదు. వాస్తవంగా, లవణవణిజునికి పచ్చకర్పూరపు ధర-వెల-తెలియదు కదా! కాబట్టి ఆక్షేపించే వారు లవణ వణిజులవంటివారు, పచ్చకర్పూరం లాగా, నిగమ సురభిళమై, పరమసాత్త్వికమైన రామానుజ సంప్రదాయాన్ని అందరు పరిగ్రహించడానికి వీలు లేదని దేశికులు లౌకిక దృష్టాంతంతో సమర్థించారు. హరిణీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తత్సూక్తిశయాజ్ఞానాం తదనాదరాదర యోరనుపయుక్తత్వం వదతి, స్థవిరేతి. స్థవిరని గమస్తోమస్థేయాం। స్థవిరనిగమాః స్థవిరపదే నాంతో లక్ష్యతే. తథాచాంతభూతాః వేదాః, వేదాన్తా ఇత్యర్థః. తేషాంస్తోమః - సమూహః, తస్యస్థేయాం - తదర్థనిర్ణాయికాం; యతీశ్వర భారతీం - యతీంద్ర భాష్యాదికం. కుమతి ఫణితి క్షోభక్షీబాః। కుమతి ఫణితయః

– కుమత్యుక్త దుస్తర్కాదికం, త్రైఃక్షోభః – మనః కాలుష్యం, తేన క్లీబాః–మత్తాః, అజ్ఞాః, క్షిపంతు – అధిక్షిపంతు. భజంతు–పరిగృహ్ణంతు ఉభయ మ ప్య ను పాదేయ మితిభావః.

లవణ వణిజ ః – లివణ విక్రేతారః; 'ఇగు పధ లక్షణః కః' ఇతి 'క' ప్రత్యయాంతో వణిజశబ్దః. 'నాగరో వణిజో వణిక్' ఇత్యమరః. రసపరిమళశ్లాఘా ఘోష స్ఫుటత్ పుటభేదనమ్. రస పరిమళయోః శ్లాఘా–ప్రశంసా, తత్ ఘోషః – తత్ప్రతిపాదక వచన భూయస్త్వం, తేన స్ఫుటత్– విదళత్, పుటభేదనం – పత్తనం యస్య సః తథోక్తః; అత్యంతం ప్రసిద్ధ ఇత్యర్థః. తమ్;

కర్పూరార్ఘం కి మిత్యభి మన్వతే – కిమితి జానాతి? త దధిక్షేపః పరిగ్రహశ్చ కర్పూర స్యోపాదేయ త్వ అనుపాదేయత్వయో ర ప్రయోజకాభవతి. తద్వదేతదతిశ యాజ్ఞానాం అనుపాదానోపాదానే త్యాజ్య త్వోపాదేయత్వయోః న ప్రయోజకే ఇతి భావః.

**అత్రప్రభావళీ :** నను భవన్మత పరిగ్రహీతారో విరళా ఇత్యాహ స్థవిరేతి. స్థవిరనిగమస్తోమస్థేయాం। స్థవిరాః పురాణాః నిగమశబ్దేన వేదాన్తావివక్షితాః తత్ స్తోమస్య స్థేయాం వివాద పదనిర్ణేత్రీ, తాం. యతీశ్వరభారతీం, కుమతి ఫణితి క్షోభక్లీబాః। కుమతీనాంగ్రంథైః యః మనఃక్షోభః తేన మత్తాః పుమాంసః క్షిపంతు – ధిక్కుర్వన్తు. భజన్తువా – భజనేయథా గౌరవం నాస్తితథా క్షేపణేఽపిలాఘవం నాస్తీతి భావః. రసేత్యాది. రసశ్చ పరిమళశ్చ కర్పూర సంబంధి నౌ; తయోః శ్లాఘాఘోషేణ, స్ఫుటత్–విదీర్ణం, పుటభేదనం – పత్తనం, భిన్నం యథాభవతి తథా. ఉచ్చైః శ్లాఘ్యమాన రస పరిమళవదిత్యర్థః. కర్పూరార్ఘం. కర్పూరస్యఅర్ఘం – మూల్యం. లవణవణిజః – లవణ విక్రేతారః, ఇతి – ఇత్థమితి, కిం అభిమన్వతే– నజానంతీత్యర్థః. యథా లావణీకస్య కర్పూర శ్లాఘ్యతాఽజ్ఞానం కర్పూరస్య నదోషావహంతథా ఆయ మప్యపరిగృహ్ణాతామేవ దోషాయ నాస్మన్మతస్యేతి భావః.

**వ్యాఖ్యానాంతరమ్ :** నన్వే వంభగవతో హృద్యత్వేఽపి లోకే ప్రచారోనభవిష్యతీత్య త్రాహ, స్థవిరేతి. నాగరికలోక నిరంతరశ్లాఘ్యమానస్యావివేక సంఘే ప్రచారాభావః నదోషాయేతిభావః. స్థవిరాః – ప్రాచీనాః అనాదయః. స్థేయత్వం – వివాద పదవిషయ నిర్ణాయకత్వం. క్షోభః – సదస దనిర్వచనీయత్వాది సంభవభ్రమః. రసేతి – రసశ్చ పరిమళశ్చకర్పూరగౌ తచ్ఛాఘాఘోషేణ పుటభేదనం భిద్య మానంభవతి. ఘోషోనగర వ్యాపీతి యావత్. కర్పూరార్ఘమిత్యేవప్రాక్తనః పాఠః.

అర్ఘోమూల్యం. తత్రరస పరమళయోః అభావాత్ కథం బహుప్రీహిసమాస ఇతిచేత్, ఉచ్యతే. అర్ఘోహిమూల్యం. తస్యలాభ స్థానం పత్తనం. అతో షష్ఠీబహుప్రీహౌ యత్సంబంధి యల్లాభస్థానం పుటభేదనం స్పుటదిత్యర్థః సమంజసః. అస్యైతా వన్మూల్యమితి మూల్యమస్యాపి ఘోషణం హిలోకే సహజమ్. ఏవమపిలవణవణిజః నబుధ్యంత ఇతిచిత్ర మితిభావః. తృతీయ పాదేన యతిరాజ మతస్య వివేకిలోక విశిష్టాదరవిషయత్వమస్తీతి దర్శితమ్. అన్యేక్షిపంతు వాభజంతువా. కింతేన? తేహిభజంతోఽపి స్వమతాధిక గౌరవార్ఘామితి నజ్ఞాస్యంతి, కర్పూరభాక్ లవణ వణిగ్వత్. అతో భజనమప్యనాదరణీయమ్.

కిమిత్యభిమన్వతే. న్యాయ్యోఽయమర్ఘ ఇతినజానంతీ త్యర్థః. యద్వా, కిమిత్యేతావానర్ఘః? లవణ ఖండస్య దృఢత్వాత్ కర్పూర ఖండస్య అల్పత్వవత్ అదార్ఢ్యస్యాపి సత్త్వాదిత్యేవ మంస్యంత ఇతి.

**45. వహతి మహిళా మాద్యో వేధాస్త్రయీ ముఖరైర్ముఖైః**
**వరతనుతయా వామోభాగః శివస్య వివర్తతే।**
**తదపి పరమం తత్త్వం గోపీ జనస్య వశం వదం**
**మదన కదనై ర్నక్లిశ్యంతే యతీశ్వర సమాశ్రయాః ॥**

**అర్థం :** ఆద్యః = మొదటి వాడైన; వేధాః = చతుర్ముఖ బ్రహ్మ; త్రయీ ముఖరైః = వేదాధ్యయన ధ్వనిగల; ముఖైః = మొగాలచేత; మహిళాం = స్త్రీని – సరస్వతిని; వహతి = వహిస్తున్నాడు. శివస్య = శివుని యొక్క వామః భాగః

= ఎడమ పార్శ్వం; వరతనుతయా = స్త్రీ రూపంచేత; వివర్తతే = పరిణమించి ఉంటుంది. తత్ = ఆ; పరమం, తత్త్వం + అపి = పరతత్త్వమైన శ్రీ కృష్ణభగవానుడు కూడా; గోపీజనస్య = గోపస్త్రీలకు; వశంవదం = అధీనమై యున్నాడు. యతీశ్వర సమాశ్రయాః=రామానుజులను ఆశ్రయించిన వారు; మదన కదనైః = మన్మథుని ఉపద్రవాలచేత; నక్లిశ్యంతే = క్లేశం పొందరు.

**తాత్పర్యము :** ఆద్యుడైన చతుర్ముఖబ్రహ్మ వేదాలను పఠించే తన నాలుగు ముఖాలచే సరస్వతిని ధరించాడు. శివుని వామభాగం స్త్రీ రూపమయింది. శ్రీకృష్ణుడు పరమతత్త్వం కలవాడైనా గోపికలకు స్వాధీనుడయ్యాడు. యతీశ్వరులైన రామానుజులను ఆశ్రయించిన వారు మాత్రం మన్మథ బాధలచే క్లేశాన్ని పొందరు.

**వ్యాఖ్య :** భగవద్రామానుజులనాశ్రయించిన వ్యక్తులు కామహతులు కారని వర్ణించే శ్లోకమిది.

**ఆద్యోవేధాః** – మొదట శ్రీమన్నారాయణుని నాభికమలంనుంచి జన్మించిన చతుర్ముఖబ్రహ్మ అని అర్థం. 'విధతీతి వేధాః' అని వేధశ్శబ్దానికి వ్యుత్పత్త్యర్థం. సృజనాత్మకమైన కార్యానికి బ్రహ్మదేవునికి సహాయపడిన తొమ్మండుగురికి కూడా వేధశ్శబ్దం వర్తిస్తుంది. 1. భృగువు 2. పులస్త్యుడు 3. పులహుడు 4. అంగీరసుడు 5. అత్రి 6. క్రతువు 7. దక్షుడు 8. వసిష్ఠుడు 9. మరీచి అనేవారు నవబ్రహ్మలు.

ఈ నవబ్రహ్మలకంటె మొదట పద్మనాభునికి ఉద్భవించిన బ్రహ్మదేవుడు చతుర్ముఖుడు కాబట్టి 'ఆద్యఃవేధః' అనబడింది. చతుర్ముఖుడు తన నాలుగు మొగాలచే నాల్గువేదాలను అధ్యయనం చేస్తుంటాడు; 'త్రయీ' - ఋగ్యజుస్సామలనే మూడు వేదాలకే వర్తించే శబ్దమిది. 'త్రయాణాంవేదానాం సమాహారః = తయీ''. మూడు వేదాల ఏకీభావమని అర్థం. ''ఇతి వేదాస్త్రయస్త్రయీ" (అమరం) అయినా, అధర్వ వేదాన్ని కల్పుకొని సాధారణంగా వేదమనే అర్థమూ ఇస్తుంది. 'శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయస్త్రయీ"–(అమరం).

'ముఖర' శబ్దం ధ్వన్యర్థకం. వేదాలు ధ్వనించే ముఖాల యందు, స్పష్టంగా ఉచ్చరించడానికి యోగ్యంగా, జిహ్వాగ్రనర్తకిగా, 'సరస్వతి' అనే మహిళను

వహించాడు చతుర్ముఖ బ్రహ్మ. 'మహ్యాత ఇతి=మహిళా' - (మహ పూజాయాం' అనిధాత్వర్థం). 'పూజింపబడేది' అని వ్యుత్పత్త్యర్థం. సామాన్యంగా స్త్రీకి పర్యాయపదమిది. వ్యవహారంలో మాట-వాక్కు = ను ఆదరిస్తాం. కాబట్టి 'వాగ్దేవి' అని భావం. శివుని శరీరంలో సగభాగమైన వామపార్శ్వమంతా 'పార్వతి' అనే స్త్రీగా మారింది. 'వివర్తతే' అని పరిణామార్థక ధాతుప్రయోగం వల్ల, పూర్వావస్థ మారిపోయి అర్ధనారీశ్వర రూపం కలిగిందన్న మాట.

**తదపి పరమం తత్త్వం:** 'తత్+అపి' అన్నందు ల్ల 'కర్మవశ్యుడుకానివాడు కూడా కర్మవశ్యుడైనట్లు లీలామానుష విగ్రహుడయ్యాడు అని అర్థం. పరా, మా యస్మిన్సః = పరమః. లోకమాతయైన లక్ష్మీదేవి వక్షః స్థలాన కలవాడు శ్రియఃపతి. వాస్తవంగా, శ్రియః పతిత్వం లేకపోతే పరతత్త్వమే సిద్ధించదు. ఇతరుల కర్మబంధాలను తొలగించే, నారాయణుడు శ్రీదేవిని వక్షః స్థలాన సర్వదా ధరించి యుండడం ఆశ్చర్యమే. "సహధర్మచరీతవ" అనీ "ఉన్నక్కేఱ్ఱుంకోలమలర్పావై" అన్నట్లు శ్రీదేవి నారాయణాభిమతానురూపాలైన స్వరూప రూపవిభవైశ్వర్య శీలాద్యసంఖ్యేయ కల్యాణ గుణాలు కలది కాబట్టి ఆమెను ధరించాడు శ్రీకృష్ణావతారంలో శ్రీదేవి రుక్మిణి అయింది.

**గోపీజనస్యవశంవదం :** "యదిమే బ్రహ్మచర్యంస్యాత్" అని శ్రీకృష్ణ భగవానుడు పరీక్షిత్తును బ్రతికించినప్పుడు బ్రహ్మచర్యాన్ని ప్రదర్శించి, పరతత్త్వాన్ని నిరూపించుకొన్నాడు. పరబ్రహ్మయైన శ్రీకృష్ణుడు తనతో సమానశీలం లేనివారైన ఐదు లక్షల గోపికలకు పరతంత్రుడయ్యాడు. (గోభిః పిబంతీతి = గోప్యః) సర్వేంద్రియాలతో భక్తిరసామృతాన్ని పానం చేసిన వారు గోపికలు. శ్రీకృష్ణుని పట్ల అనన్యప్రేమ కలవారు గోపికలు. 'జన' శబ్దం సమూహవాచకం. బహుళార్థకం. చతుర్ముఖుడు సరస్వతికి తన ముఖాలను, శివుడు పార్వతికి తన సామేనను స్వాధీనం చేశాడు. వారిద్దరు ఒక్కొక్క పడతికి పరతంత్రులు. శ్రీకృష్ణుడు మాత్రం పలువురు పడతులకు పరతంత్రుడయ్యాడు. శ్రీకృష్ణుడు తన సర్వాంగాన్ని కాంతల వశం చేశాడు. త్రిమూర్తులే మన్మథుణ్ని జయించలేక వనితాజనకింకరులైతే సామాన్యలోకుల విషయం చెప్పనక్కరలేదు కదా!

'యతీశ్వర' శబ్దం సన్యాసులలో సార్వభౌముడు అనే అర్థాన్ని బోధిస్తుంది. శ్రీరామానుజాచార్యులు వైరాగ్యపురుషులు. చెరకు విల్కాని పూలబాణాల వల్ల కలిగే బాధలను - ఉన్మాదన, తాపన, శోషణ, స్తంభన, సమ్మోహనాలనే పంచబాణాల వ్యథను ఎరుగనివారు. వారి దృష్టిలో కాసులు పెంకాసులే. కాంతలు శవ సమానలే. అచ్యుత పదాంబుజాలనే పసిడియందే వారికి వ్యామోహం ఉండడం వల్ల తదితరమైనవాటిని తృణంగా భావించినవారు రామానుజ యతిరాజులు. 34వ శ్లోకంలో, యతిరాజులూ, వారిని ఆశ్రయించిన వారుకూడా ధన వ్యామోహంలేని వారని కీర్తింపబడినారు. ఈ శ్లోకంలో లైంగిక వాంఛలు లేనివారని ప్రశంసింపబడినారు. గోవిందభట్టర్ అనే 'ఎంబార్', శ్రీవత్సాంకమిశ్రులు అనే మహా పురుషులు, రామానుజుల నాశ్రయించినవారు, ప్రాపంచిక భోగాలయందు విరక్తి కలవారు కదా! "శ్రోత్రియస్యచాకామహతస్య" అనే ఉపనిషద్వాక్యం. కామహతులు కాని శ్రోత్రియులకే పరమానందం ప్రాప్తమవుతుంది' అని బోధిస్తుంది.

త్రిమూర్తులకీర్తి కన్నాఅధికంగా రామానుజుల కీర్తి వర్ణితమైనందు వల్ల అధికాలంకార మనవచ్చు. లోకులూ, లోకేశ్వరులూ ఒక విధంగా ప్రవర్తిస్తే, దానికి విరుద్ధంగా ప్రవర్తించిన రామానుజులు లబ్ధప్రతిష్ఠులవడం వల్ల విచిత్రాలంకారమిది. "ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి" అన్నట్లు విచ్ఛిత్తి విశేషం కలిగియున్న అలంకారమే ప్రధానం. హరిణీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తత్స మాశ్రయిణాం కామాద్యనుపహతిః నాస్తీతి వదతి, వహతీతి. ఆద్యోవేధాః - చతుర్ముఖః. మహిళాం- స్త్రియం, త్రయీ ముఖరైఃముఖైః - అధ్యయనైక పరైఃముఖైః. వహతి. వాణ్యాః వాక్ స్థితత్వాత్ ఇత్యర్థః. వాగ్దేవతాయాశ్చవాణీత్వ వ్యవహారః లోకోక్తిః. శివస్యవామోభాగః, వరతనుతయా - స్త్రీత్వేన; వివర్తతే - పరిణమతే. వివర్తశ్చ విజాతీయః పరిణామః అర్ధనారీశ్వర త్వాదితిభావః. తదపి పరమంతత్త్వం - శ్రీకృష్ణః గోపీజనస్య, వశంవదం - పరతంత్రం. లీలయా పరతంత్రంభావుకమిత్యర్థః. జనశబ్దేన బాహుళ్యముచ్యతే. తావేకైక వ్యక్తి పరతంత్రౌ. అసౌతుబహూనా మితిభావః.

యతీశ్వర సంశ్రయాస్తు, మదనకదనైః - మన్మథస్య ఉపప్లవైః; నక్లిశ్యంతే - నబాధ్యంతే. ఏవ మారోపణ మపినశక్యతే, ఇతిభావః

అత్ర ప్రభావళీ :- ఆద్యోవేధాః - నవ ప్రజాపతీ నామాద్యోవేధాః బ్రహ్మే. త్రయీముఖరైః - వేదత్రయధ్వని ముఖరితైః, ముఖైః; మహిళాం వనితాం- సరస్వతీం; వహతి. త్రయాముఖరైరితి ఛాందసత్వంఖ్యాప్యతే. శివస్యవామో. భాగః-పార్శ్వః; వరతనుతయా-స్త్రీరూపేణ, వివర్తతే- వివృతం వర్తతే. "యచ్చో చ నిస్సృతే"త్యాది ప్రసిద్ధిద్యోతనాయ శివస్యేత్యుక్తమ్. వివర్తోనామ పూర్వావస్థా విరుద్ధా వస్థాంతరమ్.

"యదిమేబ్రహ్మచర్యంస్యా" దిత్యాది ప్రసిద్ధ్యా 'తదపి పరమంతత్త్వం' ఇత్యుచ్యతే. "కృష్ణ ఏవహిలోకానా"మిత్యుక్తః కృష్ణశ్చ, గోపీ జనస్య వశంవదం-గోపీజనాధీనం జాతం. అనేన త్రిమూర్తి మధ్యే కస్యచిన్ముఖం, కస్యచిదర్ధశరీరం, కస్యచిత్ సర్వాంగమపికాంతాయత్తం; కిమితరేషామిత్యుక్తి వైచిత్రీ. తదుక్తం - "ఆహృదయాదా వదనా మౌళేః శౌరి ధాతృ గౌరీశాః। చిత్రం యత్రనిమగ్నా జయతి రసః మదన జీవాతుః" ఇతి

**టిప్పణీ :** అన్యేషామపి ప్రజాపతీనాం వేధశ్శబ్ద వాచ్యత్వ మస్తీతి ఆద్య ఇతి విశేషణమ్. వరతనుతయా - స్త్రీత్వేన. శివస్య - వశివిపరీతస్య. తదపి - ఆకర్మవశ్యమపి; పరమం - అనన్యాధీనం; అత్యుత్కృష్ట లక్ష్మీవిశిష్టమపీతివా. గోపీజనస్య-పరైః పురుషవ దుపేక్షిత జనస్య.

**46. నిగమ పథికచ్ఛా యాశాఖీ నిరాశమహానిధిః**
**మహిత వివిధచ్ఛాత్రశ్రేణీ మనోరథ సారథిః ।**
**త్రిభువనతమః ప్రత్యూషోఽ యంత్రివిద్య శిఖామణిః**
**ప్రథయతి యతిక్ష్మాభృత్పారావరీ మవిపర్యయామ్ ॥**

**అర్థం :** నిగమ-శాఖీ। నిగమపథిక = వేదమార్గ సంచారులకు, ఛాయా= నీడగల; శాఖీ = వృక్షం లాంటివారు; నిరాశమహానిధిః = భోగాలయందు

ఆశలేని ముముక్షువులకు (ప్రావ్యులు) పెన్నిధిలాంటివారు; మహిత - సారథిః మహిత = పూజనీయులైన, వివిధ ఛాత్రశ్రేణీ = పలు రకాలైన శిష్యుల సమూహం యొక్క; మనోరథ = మనోరథమనే రథానికి, సారథిః = సారథిలాంటివారు; త్రిభువన తమః ప్రత్యూషః = ముజ్జగాల అంధకారానికి ఉషఃకాలం వంటివారు; త్రివిద్యశిఖామణిః = వైదిక చూడామణులైన, అయం=ఈ; యతిక్ష్మాభృత్ = యతిరాజులు; అవిపర్యయా = విపర్యయంలేని; పారావరీం = పరావరసంబంధ జ్ఞానాన్ని; ప్రథయతి = ప్రకాశింపజేస్తున్నారు.

**అర్థాంతరం :** క్ష్మాభృత్ పదంచేత ధర్మప్రభవు అని అర్థం. యతిక్ష్మాభృత్= ధార్మికుడైన భూపతి; నిరాశ, మహానిధిః = అత్యాశలేనివాడు, గొప్ప ఐశ్వర్యమూ కలవాడు. నిగమపథికచ్ఛాయాశాఖీ = పట్టణానికి పోయే బాటసారులకు నీడనిచ్చే చెట్లను కల్పించేవాడు. మహిత వివిధచ్ఛాత్రశ్రేణీ మనోరథసారథిః = గొప్ప పనిచేసే అనేక భృత్యులకు, వారికుటుంబాలకు ఉండే కోరికలను నెరవేర్చేవాడు. త్రిభువన తమః ప్రత్యూషః = ముల్లోకాలలో ఆవరించిన పాపాలనూ, శోకాలనూ ఎండగట్టేవాడు. త్రివిద్యశిఖామణిః = వేదాన్ని (వైదిక ధర్మాలను) శిరసా వహించేవాడు. పారావరీం = ప్రబలదుర్బలత్వమనే; అవిపర్యయాం = విపర్యయం లేని రీతిని - బలవంతుని చేత బలహీనుడు బాధపడరాని పద్ధతిని; ప్రథయతి = కల్పిస్తాడు.

**తాత్పర్యము :** భూపతి ధర్మమెరిగినవాడు కాబట్టి రాజధానికి వచ్చిపోయే బాటసారులకు శ్రమ కలుగకుండా రాజమార్గాలలో నీడనిచ్చే చెట్లను నాటి సౌకర్యాన్ని కల్పించినట్లే, వేదమార్గంలో నడిచేవారిని అపసిద్ధాంతాలతో కలతపడకుండా తమ సిద్ధాంతంతో యథార్థజ్ఞానాన్ని బోధించి సంతోషింప జేసేవారు శ్రీమద్రామానుజులు. రాజు తానే సుఖపడాలనే ఆశలేనివాడు, మహైశ్వర్యం కలవాడు కదా! అలాగే ప్రాపంచిక భోగాలయందు ఆశలేని వారైనందువల్ల, భోగాశలేని ముముక్షువులకు మహానిధియైన వారు రామానుజ యతిరాజులు. రాజు తన సేవకులందరి కోరికలను నెరవేర్చేరీతిగా యతీశ్వరులు తనను ఆశ్రయించిన శిష్యుల మనోరథాన్ని నిర్వహించేవారు. ప్రజల శోక తాపపాపాలను రాజు తన శాసనం వల్ల పోగొట్టినట్లే, లోకుల అజ్ఞాన మనే

చీకటిని చీల్చివేసే ఉషఃకాలంలాంటివారు రామానుజులు. వైదిక ధర్మాలను గౌరవించే ప్రభువు రీతిగా, యతిరాజులు వైదికులకు అలంకార భూతులు. ధార్మికుడైన భూపతి బలవంతులు బలహీనులను బాధించకుండా ఉండే శాసనాన్ని కల్పించే లాగా రామానుజ మహీపతి విపర్యయంలేని పరావరవిద్యను ప్రకాశింపజేసేవారు.

**వ్యాఖ్య :** యతిరాజ వైభవాన్ని ఉల్లేఖించే శ్లోకం.

నిగమ శబ్దానికి అనేకార్థాలున్నాయి. "వణిక్పథః పురంవేదో నిగమః" (అమరం) "నిగమో నిశ్చయే పుర్యాం పథివేదే వణిక్పథే". (నా.ర) పట్టణం, వేదం, నిశ్చయం, మార్గం, అంగడి వీధి, అని నానార్థాలు.

**1. నిగమపథికచ్ఛాయా శాఖీ :** వేదమార్గమందు ప్రవర్తించేవారికి నీడగల వృక్షం వంటివారు. యతిరాజులు. యతి అనే రాజు (రూపకం). భూపతి రాజ మార్గంలో నీడనిచ్చే వృక్షాలను పెంచుతాడు. ఆ దారిలో పయనించే పథికులకు చెట్టు తననీడను, ఫలాలను ఇచ్చి, ఎండ, గాలి, ఆకలి వలన కలిగిన శ్రమను తొలగించి, విశ్రాంతిని కల్పిస్తుంది.

వేదాంతంలో తత్త్వచింతన చేసే వారికి యాదవ, భాస్కరాది మాయా వాదుల సిద్ధాంతాలవలన అర్థ నిర్ణయం చేయజాలని శ్రమ కలిగినప్పుడు, యతిరాజ సిద్ధాంతం యథార్థజ్ఞానాన్ని బోధించి, వారి హృదయ క్షోభను నివారించి, ఆహ్లాదాన్ని కలిగిస్తుంది.

**2. నిరాశ మహానిధి :** భూపాలుడు రాజభోగాలను అనుభవించాలనే ఆశలేనివాడు – నిస్స్వార్థుడు కాబట్టి పాలితులైన ప్రజలకు పెన్నిధిలాంటివాడు. అల్ప, అస్థిరాలైన ప్రాపంచిక భోగాలయందు నైరాశ్యం చెందిన ముముక్షువులకు యతిరాజులు అక్షయమైన భోగ్యపదార్థం (మహానిధి). మూకాంధానపి మోక్షయితారః". మూగవారికి, గుడ్డి వారికి కూడా అవ్యాజానుగ్రహంతో ముక్తిని ప్రసాదించే వారని రామానుజయతిరాజులు ప్రఖ్యాతిని పొందిన వారు. కాబట్టి ఆశ్రయించిన వారికి యతిరాజులే పెన్నిధి.

**3. మహిత వివిధచ్ఛాత్రశ్రేణీ మనోరథసారథి :** మంచి పనులను చేసే భృత్యవర్గం యొక్క కోరికలను నెరవేర్చేవాడు రాజు. "ఛాత్రాంతే వాసినౌ శిష్యే" (అమరం) ఛాత్ర, అంతేవాసిన్, శబ్దాలకు శిష్యుడని అర్థం. 'ఛద–అపవారణే' ధాత్వర్థాన్నిబట్టి తానెవరివల్ల ఉజ్జీవిస్తుంటాడో ఆ ప్రభువు యొక్క (గురువుయొక్క) అసచ్చరిత్రను కప్పివేసే వ్యక్తి "ఛాత్రుడు" అనబడుతాడు. సామాన్యంగా భృత్యుడని అర్థం. మనస్సేరథం. ఆ రథాన్ని నడిపే వ్యక్తి 'సారథి' అనబడుతాడు. యతిరాజును ఆశ్రయించిన ఛాత్రులు గొప్పవారు. మహితులు; అనేకులున్నారు – బ్రహ్మచారులు, గృహస్థులు, సన్యాసులు కూడా ఉన్నారు.

"యాన్యస్మాకం సుచరితాని, తానిత్వయో పాస్యాని" – "మా మంచి నడవడినే మీరు గ్రహించి, ప్రవర్తించాలి". అని గుర్వనుశాసనం. మహిత, వివిధ, ఛాత్రుల సమూహాల యొక్క మనోరథాన్ని నిర్వహించేవారు యతిరాజులు. భగవద్భాగవత కైంకర్యాలలో అంటే ప్రథమ పర్వ, చరమ పర్వ నిష్ఠలలో దేని యందు శిష్యులకు ఇష్టం ఉంటుందో ఆ నిష్ఠయందే వారిని నియమించి, తరింప జేసే వారు శ్రీమద్రామానుజులు.

**4. త్రిభువన తమఃప్రత్యూషః :** ముల్లోకాల తమస్సును తరిమివేసేది ఉషఃకాలం. "తమోరాహౌ గుణేధ్వాంతే శోకే". (నా–రత్నమాల) తమ శ్శబ్దానికి 'రాహువు, తమోగుణం, చీకటి, శోకం' అని నానార్థాలున్నాయి. 'ప్రత్యూషోఽహర్ముఖం' (అమరం) ప్రత్యూష మంటే దినముఖం, ప్రభాత సమయం.

తన ధర్మశాసనం చేత లోకుల శోకాన్ని – దుఃఖాన్ని దూరంచేసేవాడు రాజు. సర్వజనుల అజ్ఞాన ధ్వాంతాన్ని తత్త్వోపదేశంచేత ధ్వంసంజేసి జ్ఞానోదయం కలిగించేవారు యతిరాజులు. ఉషస్సు రాకడతోనే చీకటితొలగి క్రమంగా వెలుగు ఎక్కువ అయినట్లే రామానుజులు అవతరించడంతోనే ప్రపంచంలో తమోగుణం తగ్గి సత్త్వగుణం ఉద్బుద్ధమయిందని భావం.

**5. త్రివిద్య శిఖామణి :** వేదం విజ్ఞాన సరస్వమని భావించి, అధ్యయనం చేసి గౌరవంగా భావించేవ్యక్తులు, వేదమార్గానికి విరుద్ధంగా ప్రవర్తించని జనులు వైదికులు, త్రివిద్యులు. వైదికులను నెత్తినెత్తుకొనే వాడు, గౌరవించేవాడు రాజు.

వైదిక శిఖామణి అంటే వేద మార్గ ప్రవర్తకులలో శ్రేష్ఠులు యతిరాజులు. (సిగలో ధరింపబడే నగను శిఖామణి అంటారు.)

**6. పారావరీం అవిపర్యయాం ప్రథయతి :** పరులు అంటె పై అధికారులు. అవరులు అంటే తక్కుంగల అధికారులు. పరావరులకు సంబంధించిన (అంశం) విషయజ్ఞానం పారావరి. విపర్యయ మంటే క్రింది మీదవడం – తలక్రిందవడ మన్నమాట. విపర్యయం లేనిది అవిపర్యయం. జ్ఞానంచేత కార్యనిర్వహణ యోగ్యత కలవారైన ఆయా వ్యక్తుల స్వరూప స్వభావాలను పరిశీలించి, వారిని ఆయా పదవులయందు నియమించే పద్ధతి, వారికి నిర్ణయింపబడిన సంబలం – వేతనం – జీతం ఇచ్చే విషయం కూడా క్రింది మీద – అవక తవకలు–కాకుండా శాసించే వాడు రాజు.

పరుడంటే పరమాత్మ. అవరులంటే బ్రహ్మరుద్రాది జీవాత్మలు. పరావరులకు సంబంధించినది 'పారావరి'. పరావరులకు ఐక్యం గానీ, సామ్యం గానీ, చెప్పడం విపర్యయం అంటే దోషం. అట్టి దోషం లేనిది అవిపర్యయం. "శ్రేష్ఠాన్య దూర జ్యేష్ఠేషు పరః స్యాద్వాచ్యలింగకః । పరోఽరిః పరమాత్మా చ కేవలే పరమవ్యయమ్" (నా. రత్నమాల) పరుడు కానివాడు అపరుడు/అవరుడు.

"స్యాద్వ్యత్యాసో విపర్యాసో వ్యత్యయశ్చ విపర్యయే" (అమరం) విపరీతంగా పోవడమే 'విపర్యయం' అన్నమాట. పరావరుల విషయమైన జ్ఞానంలో కలిగే అనుమానాలను తొలగించి, ఇక ముందు ఎలాంటి మార్పు కలుగకుండా, ప్రమాణాలను నిరూపించి, సర్వశ్రేష్ఠుడైన శ్రియఃపతికి సంబంధించిన జ్ఞానం అసదృశమైనదని భగవద్రామానుజులు చిదచిద్విశిష్టాద్వైత జ్ఞానాన్ని ప్రకాశింప జేశారు. రూపకానుప్రాణితోల్లేఖాలంకారం. హరిణీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ యతీశ్వర వైభవం వదతి నిగమేతి. నిగమపథిక చ్ఛాయా శాఖీ. నిగమ పథికాః – వేదమార్గరతాః, వైదికాః. యద్వా, నిగమా ఏవ పథికాః – పాంథాః, తేషాం ఛాయా శాఖీ– శ్ర మహరః, స్వయం తత్త్వోపదేశేన తేషాం తత్త్వనిశ్చయ ప్రయాసహర ఇత్యర్థః. నిరాశ మహానిధిః. నిరాశాః – నిరస్తభోగాశాః, ముముక్షవ ఇత్యర్థః, తేషాం మహానిధిః –ప్రాప్యః. మహిత

వివిధచ్ఛాత్రశ్రేణీ మనోరథసారథిః. మహితానాం ఛాత్రాణాం– శిష్యాణాం, శ్రేణ్యాః – సమూహస్య, మనోరథస్య – ఐహికా ముష్మికాయాః, సారథిః – నిర్వాహకః . త్రివిద్యశిఖామణిః – అలంకారభూతః. యతిక్ష్మాభృత్ – యతిరాజః పారావరీం – పరావరతత్త్వతాం. అవిపర్యయాం–పరస్మిన్ పురుషే అవరత్వం, అపరస్మిన్ పురుషే పరత్వం; తయో రైక్యంవా విపద్యయః; తద్రహితాం. ప్రథయతి – ప్రకాశయతి.

క్ష్మాభృత్ పదేన భూపతి రూపార్థాంతరం చస్ఫురతి.

ధార్మికో భూపతిః – నిరాశమహానిధిః. నిరాశః – అత్యాశారహితః, మహానిధిః – మహేశ్వర్యయుక్తశ్చభవతి. నిగమ పథికచ్ఛాయా శాఖీ – నిగమః – పత్తనం. 'వణిక్పథే పురేదేశేనిగమః' ఇత్యమరః. తత్పథికానాం – పథిగచ్ఛతాం, ఛాయాశాఖీనః – ఛాయావృక్షాన్ కల్పయతి – తదానీం ఛాయాశాఖీకృతాయేన సః ఛాయాశాఖీతి విగ్రహః. మహితేత్యాది. మహితానాం వివిధానాం ఛాత్రాణాం – భృత్యానాం, శ్రేణీనాం – కుటుంబినాంచ, మనోరథసారథిః – అపేక్షిత నిర్వాహకో భవతి. త్రిభువనతమః ప్రత్యూషః – "రాజదండ భయాదేక" ఇతిన్యాయేన త్రిభువన పాపనివర్తకోభవతి. త్రివిద్యశిఖామణిః – త్రివిద్యాయాః శిఖామణయః – శిరసాగ్రాహ్యాఃయేనసః తథోక్తాః. పారావరీం – ప్రబల దుర్బలతాం; అవిపర్యయాం–ప్రబలేన దుర్బల బాధారహితాం; ప్రథయతి – కల్పయతి.

**47.** **జడ మతి ముధా దంతాదంతి వ్యథౌషధ సిద్ధయః**
**ప్రమితి నిధయః ప్రజ్ఞాశాలి ప్రపాలన యష్టయః ।**
**శ్రుతి సురభయః శుద్ధానందాభివర్షుక వారిదా ః**
**యమగతికథా విచ్ఛేదిన్యో యతీశ్వర సూక్తయః ॥**

**అర్థం** : జడమతి – సిద్ధయః । జడమతి = మంద మతుల యొక్క; ముధా = వ్యర్థమైన; దంతాదంతి = దంత యుద్ధం వల్ల కలిగిన; వ్యథా = బాధకు; ఔషధ సిద్ధయః = సిద్ధమైన ఔషధాలైనట్టి; ప్రమితి, నిధయః = జ్ఞానానికి,

నిధులైనట్టి; ప్రజ్ఞా – యష్టయః । ప్రజ్ఞా = ప్రజ్ఞ అనే; శాలి = వరి పంట యొక్క; ప్రపాలన = రక్షణ కోసమేర్పరచే; యష్టయః = కట్టె (బొమ్మ)ల వంటివైన; శ్రుతి సురభయః = వేదపరిమళం కలవైన; శుద్ధా – వారిదాః । శుద్ధ = అమలమైన; ఆనంద = ఆనందాన్ని; అభివర్షుక = వర్షించే; వారిదాః = మేఘాల లాంటివైన; యమగతి కథా విచ్ఛేదిన్యః = యముని లోకానికి పోయే కథలను నివర్తింపజేసేవియైన; యతీశ్వరసూక్తయః = యతిరాజు యొక్క సూక్తులు – కృతులు; (జయంతి = ప్రకాశిస్తున్నాయి).

**తాత్పర్యము :** యతిరాజుల శ్రీసూక్తులు అల్పజ్ఞుల వ్యర్థ ప్రలాపాలచేత కలిగిన దంతబాధకు సిద్ధౌషధం లాంటివి. తత్త్వ యాథార్థ్య జ్ఞానానికి పెన్నిధి లాంటివి. ప్రజ్ఞా రూపమైన సస్యాన్ని రక్షించడానికేర్పరచినకట్టె (బొమ్మ)లలాంటివి. వేదార్థ సౌరభం కలవి. అమలమైన ఆనందరూపవర్షాన్ని కురిపించే జలముక్కుల వంటివి. యమలోక ప్రసంగాలను ఛేదింప సమర్థమైనవి.

**వ్యాఖ్య :** యతీశ్వర శ్రీ సూక్తుల మహిమను ఉగ్గడించే శ్లోకం.

1. మతాంతరాల యందు అభినివేశంగల మందమతులు వాదకలహాలకు కాలు దువ్వుతారు. వేదాంతవాక్యాలను చక్కగా సమన్వయించి యథార్థాన్ని చెప్పలేక, వ్యర్థమైన ప్రగల్భాలను మితిమీరి, దురాగ్రహంతో పలుకడం వల్ల వారికి దంతబాధ కలుగుతుంది. 'దంతాదంతి' పదం కేశాకేశి, ముష్టాముష్టి పదాలలాగ బహుబ్రీహి సమాసం. ఇద్దరు వ్యక్తులు ఒందొరుల జుట్టులను పట్టుకొని చేసే యుద్ధానికి 'కేశాకేశి' అనే పదాన్ని ప్రయోగిస్తారు. ఒక వ్యక్తి ఉద్రేకంతో వాదిస్తున్నప్పుడు అర్థ నిర్ణయంచేయలేక తబ్బిబ్బు పడుతూ నాలుకను కరచుకొంటాడు. తన పై దంతాలతో క్రింది దంతాలను అదిమి దంతాలను కొరుక్కొంటాడు. తన దంతాలను తానే కొరుక్కోవడాన్ని 'దంతాదంతి' (దంతయుద్ధం) అంటారు. దంతయుద్ధ ప్రక్రియను ఎవడు చేస్తాడో అతనికే దంతబాధకలుగుతుంది. అల్పజ్ఞులు అనల్పంగా జల్పిస్తే కలిగిన దంతవ్యథను నిర్మూలించే ఔషధం లాంటివి యతిరాజసూక్తులు. అర్థ నిర్ణయంచేసి యున్న యతిరాజ సూక్తులను పరిశీలించిన ప్రత్యర్థి యథార్థాన్ని గ్రహించడంవల్ల తన

నోరుమూసుకొంటాడు. ఇక ముందు వాదించలేనందువల్ల దంతాదంతి వృథ తగ్గుతుంది.

2. ప్రమితి నిధయః "ప్రమితౌ ప్రమా" (అమరం) సత్యం తెలియడమే 'ప్రమితి లేదా ప్రమ' అనబడుతుంది. శ్రీ మద్రామానుజ దివ్యసూక్తులు సత్యమైన జ్ఞానానికి నిధులు. సంశయ విపర్యయాలు కలుగకుండా అనేక ప్రమాణాలతో సిద్ధాన్తీకరింపబడినవి కాబట్టి జ్ఞాన నిధులు.

**3. ప్రజ్ఞాశాలి ప్రపాలన యష్టయః** "బుద్ధిర్మనీషా ధిషణాధీః ప్రజ్ఞా శేముషీమతిః" (అమరం). నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞను పెంచి, కాపాడేవి యతిరాజసూక్తులు. 'యష్టిః' అంటే దుడ్డుకఱ్ఱ. ఈ శబ్దం స్త్రీలింగంలోనూ, పుంలింగంలోనూ వర్తిస్తుంది. "శాలయః కలమాద్యాశ్చ" (అమరం). 'శాలి' శబ్దానికి ధాన్యవిశేషమని అర్థం. కర్షకులు వరిపైరును, మృగాలు పాడుచేయకుండా దుడ్డుకఱ్ఱలను ఆడిస్తూ పొలమంతా తిరుగుతూ కాపాడుతారు. విశేషమేమిటి అంటే, వ్యవసాయం చేసేవారు సస్యవృద్ధి కోసం చాలా శ్రమపడుతుంటారు. ఒక కఱ్ఱను నిలువుగా భూమిలో పాతిన తర్వాత దాని మీద మరొక కఱ్ఱను అడ్డంగా కట్టి బట్టలను చుట్టుతారు. నిలువుకఱ్ఱపైభాగాన సున్నం రాసి నల్లరంగుతో ముక్కు, కన్నుల దిద్దిన ఒక మట్టికడవను బోర్ల వేసి ఉంచుతారు. ఈ కఱ్ఱ మనిషిలాగా కనబడుతుంది కదా! ఇట్టి బెదురు కఱ్ఱబొమ్మలను కర్షకులు పంటపొలాలనడుమ అక్కడక్కడ పెట్టినందువల్ల పశుపక్షి మృగాదులు వీటిని చూచి మనుష్యులనుకొని బెదిరి పంటపొలంలో అడుగుపెట్టవు. సస్యరక్షణకు యష్టులెట్టివో ప్రజ్ఞావృద్ధికీ, రక్షణకూ, యతిరాజశ్రీ సూక్తులు అట్టివే – కుదృష్టుల నుంచి ఆశ్రితులప్రజ్ఞను రక్షించేవి శ్రీ సూక్తులు.

**4. శ్రుతిసురభయః** – రామానుజసూక్తులు వేద పరిమళం కలవి. శ్రుతి అంటే వేదం. అది జ్ఞాన ద్రవ్యం. కంటికి కనబడదు. సురభి శబ్దానికి పరిమళం అని అర్థం. పరిమళాన్ని గ్రహించేది ముక్కు. కాని చెవులు గ్రహించవు కదా! జ్ఞాన ద్రవ్యం దైవసంబంధం కలది. కాబట్టి జ్ఞాన ద్రవ్యగంధాన్ని శ్రుతి అంటే కర్ణేంద్రియమే గ్రహిస్తుంది. "శ్రోత్రం దైవం. శ్రోత్రేణ హి తద్వ్రిందతే" అంటుంది ఉపనిషత్తు (బృ.ఉ.)

"ముడియానే" (3ప. 8వ) తిరువాయ్ మొషిలో భగవానుని సౌందర్యాన్ని అనుభవించడం కోసం తమ ఇంద్రియాలు ఆకలిగొన్నాయంటారు నమ్మాళ్వార్లు. ఒక ఇంద్రియం యొక్క పనిని మరొక ఇంద్రియం కావాలని కోరుకొంటున్నదట. కన్నులు భగవంతుణ్ణి దర్శించాలని కోరడమేకాక శ్రవణేంద్రియ విషయమైన విష్ణురథుని రెక్కల ధ్వనిని వినాలనీ, త్వగింద్రియ విషయమైన స్పర్శను కూడా కోరుకొంటుందట. అలాగే ఘ్రాణేంద్రియ విషయమైన వేదపరిమళం శ్రవణేంద్రియాలచే అనుభవింపజేయడం ఆశ్చర్యమే.

ఉభయ వేదాంతార్థాలను తమ కవితలో విషయీకరించే అభిరుచి, ఆసక్తి దేశికులకు అధికమని గోచరిస్తుంది కదా! శ్రీమద్రామానుజ సూక్తులు పలుకడానికి మృదుమధురంగానూ, వినడానికి ఇంపుగానూ ఉంటాయనీ అర్థం కమనీయం.

**5. శుద్ధానందాభివర్షుక వారిదాః** సముద్రపుటుప్పు నీటిని పరిగ్రహించి (అషియుళ్ పుక్కుముగన్దుకొడార్త్తేరి) న మేఘాలు స్వచ్ఛమైన మధురమైన స్వాదుజలాన్ని వర్షిస్తాయి. "యాభిరాదిత్యస్తపతితాభిః పర్జన్యోవర్షతి" సూర్యుడే కిరణాలచేత రసాన్ని గ్రహించి భూమిని తపింపజేస్తాడో, ఆ కిరణాలచేతనే పర్జన్యుడు వర్షిస్తాడు అంటుంది శ్రుతి. అలాగే యతిరాజ దివ్యసూక్తులు ప్రాకృత విషయానందం వంటివికాక, ఈ లోకమందే పరమానందాన్ని - దుఃఖమిశ్రితంకాని శుద్ధానందాన్ని ప్రసాదిస్తూ, దేహావసానంలో ముక్తినీ కలిగిస్తాయి.

**6. యమగతి కథా విచ్ఛేదిన్యః** - భగవద్రామానుజ గ్రంథాలను అధ్యయనం చేసినవారు యముడూ, యమభటులూ పెట్టే హింసనూ, బాధలనూ, పొందలేరు. వారికి 'నరకయాతన' సుతరాముఉండదు.

**"స్వపురుష మభివీక్ష్య పాశహస్తం వదతి యమః కిలతస్యకర్ణమూలే ।**
**పరిహర మధుసూదన ప్రపన్నాన్ ప్రభురహమన్యనృణాం నవైష్ణవానామ్॥"**

దేహంపతనమైన వెంటనే జీవాత్మను లాక్కొనిపోవడానికి పాశం *చేతబట్టు*కొని సిద్ధంగా ఉన్న తన భటునితో యముడు "విష్ణుభక్తులైన వారిని విడిచిపెట్టండి. నేను ఇతరులకే కాని వైష్ణవులకు దొరను కాను సుమా" అని రహస్యంగా చెవిలో చెబుతాడు" (విష్ణు పురాణం).

భగవద్రామానుజ సూక్తులు పరబ్రహ్మయైన నారాయణునికి సంబంధించి నవే అయినందువల్ల, వాటిని అనుసంధానం చేసే ప్రపన్నులకు నరకప్రాప్తి ఉండదు.

యతిరాజ సూక్తిమహిమను నైకవిధంగా వర్ణించడం వల్ల, ఉల్లేఖాలం కారం. హరిణీ వృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తత్సూక్తి మేవస్తౌతి జదేతి:- జడమతీత్యాది. జడమతీనాం - మందమతీనాం, ముధా దంతాదంతివృధాభూతం - దంత యుద్ధం వేదాన్త వాక్యానా మర్థా పరిజ్ఞానాత్ వృథా దంతాన్ దశతీత్యర్థః. తేన జాతాయాః వ్యథాయాః ఔషధసిద్ధయః - అపు.ర్థావతయా నివర్తకాః. తత్త్వార్థ ప్రదర్శనేన తన్నిశ్చయాయాస నివర్తకాః.

**ప్రమితి నిధయః** - ప్రమాణనిధానభూతాః. ప్రమాణనిరంతరాఇత్యర్థః యద్వా, ప్రమితిః - యథార్థ జ్ఞానం, తస్యనిధయః వాసభూతా ఇత్యర్థః. ప్రజ్ఞాశాలి ప్రపాలన యష్టయః - ప్రజ్ఞాశాలినాం - ప్రజ్ఞారూప సస్యానాం, ప్రపాలన యష్టయః- రక్షక యష్టయః. ఫలితశాలి సంరక్షణార్థం శిరసి పటం బద్ధ్వా యష్టిం మధ్యేస్థా పయంతి. యద్వా, ప్రజ్ఞాశాలినః - ప్రాజ్ఞాః, తేషాం ప్రాజ్ఞానామపి కుమతి యుక్తక్షోభాత్ ప్రజ్ఞాహానిర్భవ తీతి తన్నివర్తకః.

**శ్రుతి సురభయః** - వేదాన్త గంధస్యేతి వా, శ్రోత్రానందిన్యఇతివా. శుద్ధానందా భివర్షుక వారిదాః. శుద్ధానంద స్య - దుఃఖా సంభిన్నా నందస్య, మోక్షానందస్యేత్యర్థః. అభివర్షుక వారిదాః - ప్రార్థనా నిరపేక్షం, స్వయమేవ ప్రదాయకా ఇత్యర్థః.

**యమగతి కథా విచ్ఛేదిన్యః** - పరిహర మధుసూదన ప్రపన్నాన్, చక్రప్రతిహత వీర్య బలస్య సోన్యలోక్యః, న ఖలు భాగవతాః యమవిషయం గచ్ఛంతీతి న్యాయేన నరకప్రాప్తి ప్రసంగనివర్తకాః యతిరాజ సూక్తయః, జయంతీ తిశేషః.

**48.** **ప్రతికల మిహ ప్రత్యక్త త్త్వావలోకన దీపికాః**
**యతిపరిబృఢ గ్రంథా శ్చింతాం నిరంతరయంతినః ।**
**అకలుష పరజ్ఞానౌ త్సుక్యక్షుధాతుర దుర్దశా**
**పరిణత ఫలప్రత్యాసీద త్ఫలేగ్రహి సుగ్రహాః ॥**

**అర్థం :** ఇహ= = ఈ లోకమందు; ప్రత్యక్తత్త్వావలోకన దీపికాః। ప్రత్యక్ తత్త్వ = జీవాత్మ తత్త్వాన్ని; అవలోకన = చూడడమందు; దీపికాః = దీపంలాంటివైన; అ కలుష – సుగ్రహాః। అకలుష – నిర్దుష్టమైన; పరజ్ఞాన = పరమాత్మజ్ఞాన మందు; ఔత్సుక్య = ఉత్సాహం వల్ల కలిగిన; క్షుధా = ఆకలిచే; ఆతుర = పీడితులైనవారి యొక్క; దుర్దశా = ప్రాణసంశయావస్థయందు; పరిణత ఫల= పక్వమైన ఫలాలుగల; ప్రత్యాసీదత్ = దగ్గరలో ఉన్న; ఫలేగ్రహి= ఫలవృక్షాలవలె; సుగ్రహాః = సుఖంగా గ్రహింపదగినవైన; యతి పరిబృఢ, గ్రంథాః = యతిపతి యొక్క ప్రబంధాలు; ప్రతికలం = ప్రతిక్షణం; (ప్రతి అంశం) నః = మన యొక్క; చింతాం = స్మృతిని, నిరంతరయంతి = ఎడతెగకుండా కలిగిస్తున్నాయి.

**తాత్పర్యము :** యతిరాజ ప్రబంధాలు ఈ లోకాన జీవతత్త్వాన్ని తెలుసుకోవడానికి దీపం లాగా ఉపయోగపడుతున్నాయి. నిర్దుష్టమైన పరమాత్మజ్ఞాన విషయమై ఆదరం వల్ల కలిగిన ఆకలిచేత బాధపడిన జనుల దుర్దశను నివారించడానికి పండిన ఫలాలు కలిగి దగ్గరగా ఉన్న ఫలవృక్షాలవంటివై మనకు సర్వదా అనుసంధేయాలై ఉన్నాయి.

**వ్యాఖ్య :** జీవేశ్వరుల తత్త్వాన్ని బోధించే యతీశ్వర గ్రంథాలు నిరంతరం అనుసంధింపదగినవని వర్ణన.

యతిరాజుల నాశ్రయించిన వారికి పరావరజ్ఞానం కలుగుతుందని శ్లో. 46 లో విశదీకరింపబడింది. ఈ శ్లోకం, యతిరాజుల కృతులు – ప్రబంధాలు – ఆ విషయాన్నే వివరంగా బోధిస్తాయని, స్పష్టీకరిస్తున్నది.

'ఇహ' - ఈ లోకమందు అనడం వల్ల, నిత్యవిభూతి యందుమాత్రం శాస్త్రజ్ఞానం లేకుండా సర్వదా నిత్యసూరులు సర్వశేషియైన పరమపదనాథుణ్ణి స్తుతిస్తూ జ్ఞానజ్యోతులై ప్రకాశిస్తుంటారని శ్రుతి బోధిస్తుంది. "తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే. తద్విష్ణోః పరమంపదం". కాని, ఈ లీలా విభూతిలోనున్న వారికి పరోక్షమైన జీవేశ్వరతత్త్వాలను తెలుసుకోవడానికి శాస్త్రమే సాధనం - ప్రమాణం - అని సూచిస్తున్నది.

'ప్రత్యక్ తత్వం' - అంటే జీవాత్మ యొక్క యథార్థజ్ఞానమనీ - స్వస్వరూపజ్ఞానమనీ అర్థం. చీకట్లో ఉన్న వస్తువును ఉన్నదున్నట్లుగా చూడడానికి దీపం ఎలా ఉపయోగపడుతుందో, అలాగే జీవాత్మ యొక్క స్వరూపాన్ని తెలుసుకోవడానికి యతిరాజప్రబంధాలు కరదీపికలలాంటివని దేశికులు నొక్కివక్కాణిస్తున్నారు.

ఇతరులు చెప్పిన వేదాన్త సిద్ధాంతాలను అవలోకించిన వ్యక్తులలో కొందరు జీవుడే స్వతంత్రకర్తయని, కొందరు జీవుడే విభుడనీ, మరికొందరు జీవుడు జడ స్వరూపమవడంచేత జ్ఞాతృత్వమే లేనివాడనీ, ఇంక కొందరు ఏ శరీరాన్ని ధరిస్తే ఆ శరీరంతో సమానమైన పరిమాణం కలవాడు జీవుడనీ, మరి కొందరు పరబ్రహ్మకుజీవుడు అభిన్నుడనీ, ప్రతిబింబమనీ, పరిపరివిధాలా చెబుతుంటారు. యతిరాజు మాత్రం శ్రీవ్యాసభగవానుడు చెప్పిన బ్రహ్మసూత్రాల ఆధారంగా, ఉపనిషద్వాక్యాలను ప్రమాణంగా నిరూపించి, ఇతరుల సిద్ధాంతాలను ఖండించి అప్రత్యక్షాలైన జీవేశ్వరతత్త్వాలను యథార్థంగా గ్రహించేరీతిగా బోధించారు.

"కర్తాశాస్త్రార్థవత్త్వాత్" - (బ్ర.సూ. 2.3.33) అని 'కర్త్రధికరణం'లో జ్ఞాత, అణుపరిమాణుడైన జీవుడు కర్త అవడంవల్లనే 'స్వర్గకామోయజేత' - స్వర్గాన్ని కోరువాడు యజ్ఞాన్ని చేయాలి అనీ, ముముక్షుర్బ్రహ్మోపాసీత' - మోక్షాన్ని కోరేవాడు పరబ్రహ్మను ఉపాసించాలి, అని బోధించే శాస్త్ర విధులు సార్థకమవు తున్నాయి. "శాస్త్ర ఫలం ప్రయోక్తరి" కర్మలను చేయువాడే 'భోక్త'. అంటే ఆ కర్మలఫలాన్ని అనుభవించేవాడనడం వల్లనూ శాస్త్రం సార్థకమవుతున్నది. 'విజ్ఞానం యజ్ఞంతనుతే, కర్మాణి తనుతేఽపిచ" (తై.అ.5-1) విజ్ఞాన శబ్దం

అంతః కరణమైన బుద్ధిని తెల్పక 'జీవు'డని శ్రుతి తెల్పుతున్నది. విజ్ఞాన స్వరూపుడైన జీవుడు యజ్ఞాన్ని చేస్తున్నాడు. ఇతర లౌకిక, వైదిక కర్మలయందు కూడా కర్తృత్వం కలవాడవడం వల్లనూ జీవుడే కర్తయని స్పష్టమవుతున్నది.

'పరాయత్తాధికరణం'లో 'పరాత్తు తచ్ఛ్రుతేః' – జీవునిగల ఈ కర్తృత్వం పరమాత్మ యొక్క ఇచ్ఛకు అధీనమైయున్నదని శ్రుతివల్ల తెలుస్తున్నది. జీవుడు దేవుడుకాడు. స్వతంత్రుడూకాడు. కేవలం పరతంత్రుడు. "అంతఃప్రవిష్టఃశాస్తా జనానాం సర్వాత్మా" (తై.అ.3.11) పరమాత్మ లోపల ప్రవేశించి జనులను ప్రవర్తింప జేస్తూ అందరికీ ఆత్మగా ఉండేవాడు.

"య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽన్తరో యమాత్మానవేద, యస్యాత్మాశరీరం య ఆత్మాన మంతరోయమయతి సత ఆత్మా అంతర్యామ్యమృతః". (బృ.ఉప.5-7-22) ఎవడు ప్రత్యగాత్మయందున్నవాడై ప్రత్యగాత్మ లోపల ఉండి ప్రత్యగాత్మచే తెలియబడక, ప్రత్యగాత్మను శరీరంగా కలవాడై, ప్రత్యగాత్మను నియమిస్తున్నాడో అతడే నీ ఆత్మ, అంతర్యామి, అమృత స్వరూపుడు. "సర్వస్యచాహం హృదిసన్నివిష్టః, మత్తఃస్మృతిర్ జ్ఞానమపోహనంచ". (భ.గీ.) ఓ పార్థా! నేనందరి హృదయమందున్నవాడను. నావల్లనే స్మరణం, జ్ఞానం, అజ్ఞానం కలుగుతుంటాయి. ఈ శ్రుతిస్మృతుల ప్రామాణిక వాక్యాలవల్ల, పరమాత్మ జీవులలో అంతరాత్మగా ఉంటూ జీవులను ఆయాకార్యకలాపాలయందు ప్రవర్తింపచేస్తున్నాడని తెలుస్తున్నది కదా!

"ఏషహ్యేవ సాధుకర్మకారయతి తం యమేభ్యో లోకేభ్యో ఉన్నినీషతి ఏషహ్యేవ అసాధుకర్మ కారయతి తం యమధో నినీషతి" – పరమాత్మ ఏ వ్యక్తిని ఉత్తమ లోకాలను పొందింపసంకల్పిస్తాడో అతనిచే సత్కర్మలను చేయిస్తాడు, అధోలోకాలను పొందింపతలుస్తాడో అతనిచే పాపకర్మలను చేయిస్తాడు అని శ్రుతిబోధిస్తుంది. అయితే పరమాత్మ 'నిర్దయుడు, పక్షపాతి' అని శంకించరాదు. "అహం సర్వస్యప్రభవో మత్తఃసర్వం ప్రవర్తతే। ఇతి మత్వాభజన్తే మాం బుధాః భావసమన్వితాః" (భగీ.10.8) అర్జునా! సమస్త జగత్తుకు నేనేకారణమనీ, నా వల్లనే సర్వంజరుగుతుందని భావించే జ్ఞానులు నన్నే పొందుతారు.

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామిబుద్ధి యోగంతం యేన మాముపయాంతితే॥**
**తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజంతమః ।**
**నాశయామ్యాత్మభావస్థో జ్ఞాన దీపేన భాస్వతా ॥ (భ.గీ10-10 &11)**

నా యందు ఎల్లప్పుడు ఆసక్తి కలిగి నన్ను ప్రీతిపూర్వకంగా ఆశ్రయించే వారికి నన్ను చేరడానికి తగిన జ్ఞానాన్ని నేనే ఇస్తుంటాను. అట్టి వ్యక్తులను అనుగ్రహించడం కోసం ఆత్మ భావాన ఉన్నవాడనై ప్రకాశించే జ్ఞానదీపం చేత అజ్ఞానం వల్ల కలిగిన తమస్సును నశింపజేస్తుంటాను.

**తానహంద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।**
**క్షిపామ్యజస్ర మశుభాన్ ఆసురీష్వేవ యోనిషు (భ.గీ.16-19)**

నన్ను ద్వేషించేవారూ, క్రూరులూ, అమంగళులూ అయిన మాన వాధములను నేను సంసారంలో ఎల్లప్పుడు అసురసంబంధమైన యోనులందే పడవేస్తుంటాను అని శ్రీకృష్ణ భగవానుడే ఉపదేశించాడు. అంటే, తనకు అనుకూలంగా ప్రవర్తించేవారిని మాత్రమే అనుగ్రహిస్తాడనీ, ప్రతికూలురైన జీవులను పరమాత్మ నిగ్రహిస్తాడని శ్రీభాష్యంలో వివరింపబడింది.

**అకలుష - సుగ్రహః** - పరమాత్మజ్ఞాన విషయాన్ని దీర్ఘసమాసపదమైన ఉత్తరార్థం విశదం చేస్తున్నది. పరబ్రహ్మ నిర్గుణడు, విగ్రహాదిరహితుడు అనే జ్ఞానమూ, అపరులైన బ్రహ్మారుద్రాదుల యందు పరతత్త్వజ్ఞానమూ కలుషం అంటే దోషభూయిష్ఠం. అలాగాకాక, పరబ్రహ్మ గుణ విగ్రహ విభూతులుకలవాడు; లక్ష్మీపతియైన నారాయణుడే పరమాత్మ అనడం అకలుష పరజ్ఞానం. ఈ యథార్థ పరతత్త్వాన్ని తెలుసుకోవాలనే వారికి కలిగే ఔత్సుక్యం - ఉత్కంఠయే ఆకలి.

ఆకలిబాధచేపీడితుడైన వ్యక్తి ప్రాణ సంకటంలో ఉన్న సమయాన సమీపంలోనే ఉన్న, చేతికందదగిన ఫలాలున్న చెట్టు కనబడితే, దానిచే తన ఆకలిబాధను అనాయాసంగా శమింపజేసుకొంటాడు. అలాగే, కుమతుల గ్రంథాలవల్ల కలిగిన విపరీత జ్ఞానంచేత మనోవ్యథను పొంది, యథార్థమైన పరతత్త్వ జ్ఞానాన్నీ తెలుసుకోవాలనే ప్రీతిచే తహతహలాడుతున్న వ్యక్తికి

శ్రీ భాష్యకారుల ప్రబంధాలు పరమాత్మజ్ఞానాన్ని సుఖంగా కలుగజేస్తాయి. "స్యాదవంధ్యః ఫలేగ్రహిః" - (అమరం) గొడ్డుపోని మ్రానును 'ఫలేగ్రహిః' అంటారు.

పరతత్త్వ జిజ్ఞాసువులకు యతీశ్వర ప్రబంధాలు, క్షుధాపీడితులకు ప్రత్యాసన్నీ భూత ఫలవృక్షాల లాంటివి, అని సాదృశ్యం వర్ణితం. 'ప్రతికలం' అంటే ప్రబంధాలలోని ప్రతిచిన్న అంశంకూడా, ప్రతిక్షణం అకలుష పరజ్ఞానాన్ని సరసంగా బోధిస్తూ, మనం సర్వదా మననం చేయదానికి యోగ్యమైన ప్రబంధాలు.

**శ్రీమత్ గృధ్ర సరస్తీర పారిజాత ముపాస్మహే ।**
**యత్ర తుంగై రతుంగైశ్చ ప్రణతైర్లభ్యతే ఫలమ్ ॥**

దేశికులచే రచితమైన స్తోత్రం 'పరమార్థస్తుతి'లోని ఆరంభశ్లోకమిది. 'జటాయుక్షేత్ర' మనబడే 'తిరుప్పుళ్‌కుషి'లో వెలసిన దేవాదిదేవుడు 'శ్రీ విజయరాఘవ స్వామి' ఒక పారిజాత తరువుగా వర్ణింపబడినాడు. పొడుగువారు గానీ, పొట్టివారుగానీ దండవత్ ప్రణామం చేసేవారు ఆ పారిజాత వృక్షం యొక్క ఫలాన్ని పొందుతారు - అని ఆ శ్లోక తాత్పర్యం.

'ఆకలిగొన్నవాడు చేతిని చాచి తెంపుకోదగిన పండ్లుగల చెట్టు' అని వర్ణింపబడిన చోట ఈ శ్లోకం స్మరణీయం కదా!

యతిరాజగ్రంథాల ప్రాశస్త్యాన్ని రూపకోపమాలంకారాలతో కూడిన, సాభిప్రాయ విశేషణపద ప్రయోగం వల్ల, పరికరాలంకారంగా వర్ణించిన శోక్లమిది. హరిణీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** పునరపి తత్సూక్తిమేవ స్తౌతి, ప్రతికలమితి.

ప్రతికలం - ఏకదేశే ఽపి గ్రంథస్యాత్యంతా పరిజ్ఞానేఽపి.

ప్రత్యక్ తత్త్వావలోకన దీపికాః ప్రత్యక్ తత్త్వయోః జీవేశ్వరయోః, అవలోకనే - పరిజ్ఞానే, దీపికాః - హేతుభూతాః - అకలుష పరజ్ఞానేత్యాది. అకలుష పరజ్ఞానం - పరేబ్రహ్మణి గుణ విగ్రహాదిరహిత పరతత్త్వజ్ఞానం, అపరే బ్రహ్మరుద్రాదౌ పరతత్త్వ జ్ఞానం చ కలుష పరజ్ఞానం; తథా నభవతీత్య కలుష

పరజ్ఞానం. గుణ విగ్రహాదిమత్త్వ, లక్ష్మీపతిత్వ విశిష్టం యథార్థ పరతత్త్వ జ్ఞాన మిత్యర్థః. తత్రౌత్సుక్యం - ఆదరః, స ఏవక్షుధా- బుభూషా, అత్యంతౌత్సుక్య మిత్యర్థః. తథా ఆతురాః - ఆవసన్నాః, తేషాం దుర్దశా- ప్రాణసంశయదశా; తస్యాం పరిణత ఫలాః - పరిపక్వఫలాః, ప్రత్యాసీదంతః - ప్రత్యాసన్నీ భవంత్యః ఫలేగ్రహాయః - అవంధ్యఫలాః కదళ్యాదయః. "స్వాదవంధ్యః ఫలేగ్రహిః" ఇత్యమరః తద్వత్ సుగ్రహాః - సుఖోపభోగయోగ్యాః. యతిపరిబృఢ గ్రంథాః, నః - అస్మాకం, చింతాం నిరంతర యంతి - సదా స్వగతాం కుర్వంతి. సర్వదా అనుసంధేయా ఇత్యర్థః.

**49. ముకుందాంఘ్రిశ్రద్ధా కుముదవన చంద్రాతప నిభాః**
**ముముక్షా మక్షోభ్యాం దదతి మునిబృందారకగిరః ।**
**స్వసిద్ధాన్త ధ్వాంత స్థిర కుతుక దుర్వాది పరిష**
**ద్దివాభీత ప్రేక్షా దినకర సముత్థాన పరుషా ః ॥**

**అర్థం :** ముకుందా - నిభాః। ముకుంద = మోక్షమిచ్చే పరమాత్మ యొక్క; అంఘ్రి = చరణాలయందు; శ్రద్ధా = భక్తి అనే; కుముదవన = కలువ (పూవు)ల వనానికి; చంద్ర+ఆతప నిభాః = చంద్రుని కాంతి (వెన్నెల)తో సమానమైన(వి); స్వసిద్ధాన్త - పరుషాః। స్వసిద్ధాన్త = తమ సిద్ధాంతం అనే; ధ్వాంత = చీకటియందు; స్థిర = నిశ్చలమైన; కుతుక = సంతోషం-ఆదరంగల; దుర్వాది పరిషత్ - దుర్వాదుల సమూహం అనే; దివాభీత = గుడ్ల గూబల యొక్క; ప్రేక్షా = దృష్టికి (కంటికి); దినకర, సముత్థాన = సూర్యోదయం లాగా; పరుషాః = సహింపరాని (వి); ముని బృందారక, గిరః = యతి దేవుని యొక్క సూక్తులు - కృతులు; అక్షోభ్యాం = కలతలేని; ముముక్షాం = మోక్షంకోసమైన ఇచ్ఛను; దదతి = ఇస్తున్నవి.

**తాత్పర్యము :** యతిరాజ ప్రబంధాలు ముకుందపాదాల యందు శ్రద్ధ అనే కలువలవనానికి వెన్నెలలాంటివి. తమ సిద్ధాంతమనే చీకట్లో స్థిరమైన సంతోషంగల దుర్వాదులనే గుడ్లగూబల కంటికి సూర్యోదయం లాగా ఉగ్రమైనవి. ఇతరులచేత క్షోభనుచెందని మోక్షేచ్ఛనూ కలిగిస్తుంటాయి.

**వ్యాఖ్య :** యతిరాజ ప్రబంధాలు భగవద్భక్తిని వికసింపజేసి మోక్షేచ్ఛను కలిగిస్తాయని వర్ణన.

'ముకుంద' శబ్దం ఐహికాాముష్మిక సుఖాలను ఇచ్చే శ్రియఃపతి అనే అర్థం కలది. 'చంద్రాతప' శబ్దానికి వెన్నెల అని అర్థం. చంద్ర కిరణాల వల్ల కలువలు వికసిస్తాయి. సూర్యకిరణాలవల్ల కమలాలు వికసిస్తాయి. 'శ్రద్ధ' అంటే ఆస్థ. (earnest devotion) "శ్రద్ధాఖ్యారుచిరాత్వరా" (నిఘంటువు) "శ్రద్ధా సంప్రత్యయః స్పృహా" (అమరం) "శ్రద్ధాత్వాస్తిక్య కాంక్షయోః" (నా.ర.) భక్త్యతిశయం, మహావిశ్వాసం, ఇచ్ఛ అని నానార్థాలున్నాయి.

ముకుందుని చరణాలయందు శ్రద్ధ అనేదే కుముదవనం. చల్లని చంద్రకిరణాలు సోకగానే కలువలవనం వికసిస్తుంది. అలాగే సౌమ్యగుణం కలిగి అహ్లాదపరచే యతిరాజ సూక్తులు చెవికి సోకగానే ముకుంద చరణాల పట్ల శ్రద్ధ వృద్ధి చెందుతుంది. వేదార్థ సంగ్రహం, వేదాన్తదీపం, గద్యత్రయం మొదలైన గ్రంథాలలో భగవానుని దివ్యమంగళ విగ్రహసౌందర్యాన్ని వర్ణించే కొన్ని పంక్తులను చదవుతుంటే, నాస్తికులకైనా నోరూరుతుంది. రసికులడెందం కందళిస్తుంది. భక్తి వికసిస్తుంది.

'చంద్ర+ఆతప'శబ్ద ప్రయోగంవల్ల యతీంద్ర ప్రబంధాలు చంద్రిక వలె చల్లనివేకాక, సూర్యకిరాణాల వలె దుర్నిరీక్ష్యమైనవని కూడా ధ్వనిస్తుంది. "ప్రకాశోద్యోత ఆతపః" (అమరం) (ఆతపః- అంటే ఎండ).

"తమసో మా జ్యోతిర్గమయ" - అనే సూక్తి చీకటిలో నుంచి నన్ను వెలుగులోకి చేర్చు'మని ప్రాణిలోకం ప్రార్థిస్తుంటుంది. ప్రాగ్దిశలో ప్రభాకరుడు ఉదయించగనే సామాన్యంగా మనుష్య పశుపక్ష్యాదులు చైతన్యం కలిగి చాలా ఆనందపడుతాయి. కొన్ని ప్రాణులు మాత్రం చీకటినే ఎక్కువగా ఇష్టపడుతాయి, వెలుగుకు భయపడుతాయి. ఇట్టి ప్రాణియే పైడికంటి. దీన్నే దివాంధం, దివాభీతం, గుడ్లగూబ అంటారు. "ది వాహ్నీతి" - 'దివా' అనే అవ్యయం 'పగటియందు' అనే అర్థమిస్తుంది (అమరం).

"ఉలూకేతు వాయసారాతిపేచకౌ, దివాన్ధః కౌశికో ఘూకో దివాభీతో నిశాటనః"– (అమరం) 'ధ్వాంత' మంటే చీకటి. "అంధకారోఽ_స్త్రియాం ధ్వాంతం తమిస్రం తిమిరంతమః" (అమరం) గుడ్లగూబలకు చీకటియందే శ్రద్ధ. వెలుగులో వాటికి కంటిచూపు ఆనదు. అంటే, వాటి చూపును లోపంచేసేవాడు దివాకరుడు; సూర్యుడన్నమాట.

కుమతుల సిద్ధాంతం ఉన్నవస్తువును ఉన్నట్లుగా కనబడనీయదు, తెల్యనీయదు. కాబట్టి ఆ సిద్ధాంతం చీకటితో పోల్చబడింది. తమ సిద్ధాంత మనేచీకటియందే శ్రద్ధ, ఆదరం స్థిరంగా కల్గిన దుర్వాదులే గుడ్లగూబలు. దుర్వాదులనే గుడ్లగూబలకు యతీంద్ర సూక్తులు (సహింపరాని వైనందువల్ల) సూర్యోదయంలాంటివని, క్రూరమైనవని, చూడశక్యంకానివని వర్ణింపబడినాయి.

'ముముక్ష' అంటే మోక్షమందలి ఇచ్ఛ, శ్రద్ధ అని అర్థం. 'ముముక్షువు' అంటే, జనన మరణ రూపమైన చక్రబంధం నుంచి విడిపోయే కోరికను పెంచుకొన్న వ్యక్తి. అల్పమైన, అస్థిరమైన ప్రాపంచిక భోగాల నుంచి దూరంగా ఉండే కోరికను, లేదా ప్రాకృత భోగాల పట్ల నిర్లిప్తంగా ఉండే ఆలోచనను దీపింపచేస్తుంది వేదాంతశాస్త్రం. ప్రతిజీవికి మోక్షేచ్ఛ అవశ్యకం.

'మోక్ష' విషయంలో, ఆయా సిద్ధాంతాలలో వైవిధ్యం, వైషమ్యమున్నది. మోక్ష మంటే దుఃఖరాహిత్య మనికొందరు, సుఖం క్షణికమని తెలుసుకోవడమే మోక్షమని మరికొందరు చెప్పినారు. మోక్షమంటే 'పాషాణ కల్ప' మని తార్కికుల సిద్ధాంతం. భగవంతునిలో ఐక్యమవడమే మోక్షమని అద్వైత సిద్ధాంతం. ఉపాసనలో భేదమున్నా ఉపాస్యుడు మాత్రం ఒక్కడే కాబట్టి, చిదచిద్విశిష్టుడైన శ్రీమన్నారాయణుని గుణగణాలను కీర్తిస్తూ, ఆయన పాదకమల సేవను చేస్తూ, బ్రహ్మానందప్రవాహం తర్నిమగ్నమవడమే మోక్షమని విశిష్టాద్వైత సిద్ధాంతం. ముని బృందారకులంటే భగవద్గుణాలను మననం చేసే శక్తి సమృద్ధిగా కలవారిలో శ్రేష్ఠులని అర్థం. అట్టి యతిరాజుల శ్రీసూక్తులను విన్నవారికి, వారి ప్రబంధాలను సేవించిన వారికి ముకుందచరణ నళినాలయందు శ్రద్ధాభక్తులు పెరిగి, మోక్షేచ్ఛ జనిస్తుంది. వారి మోక్షేచ్ఛ దుర్వాదులైన పరుల వాదం చేత నశింపజేయశక్యం గాదు.

రూపకోపమాలంకారాలతో కూడిన ఈ శ్లోకం శిఖరిణీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** పునరపి తత్సూక్తింస్తౌతి, ముకుందేతి. ముకుందాంఘ్రి –నిభాః। ముకుందాంఘ్రిశ్రద్ధా ముకుంద చరణభక్తిః – సైవ కుముదవనం. తస్య చంద్రాతప నిభాః – వికాసకా ఇత్యర్థః. స్వసిద్ధాంతేత్యాది. స్వసిద్ధాంతమేవ ధ్వాంతం – తమః, యథావస్థిత వస్తు విజ్ఞాన నిరోధకత్వాత్ ధ్వాంతత్వమ్. తత్ర స్థిరకుతుకాః – స్థిరాదరాః. యే దుర్వాదినః తేషాం పరిషత్, సమూహః, స ఏవ దివాభీతః, తస్యప్రేక్షా – వీక్షణం, తస్యదినకర సముత్థానవత్ పరుషాః, దివాభీతాః – ఉలూకాః, తేషాంప్రేక్షణస్య–ఉన్మీలస్య దినకర సముత్థానం – సూర్యోదయః యథాపరుషః, అసహ్యాః, తథాఏతా అప్య సహ్యాః, దుర్వాదినః ఏతత్ ప్రబంధాన్ విలోకయితు మపినశక్ను వంతీత్యర్థః. మునిబృందారకస్య – యతిదేవస్య గిరః. ప్రబంధాః. అక్షోభ్యాం – కుమతి కుతర్కై రకృత్యాది భిశ్చక్షోభయితు మశక్యాం, ముముక్షాం – మోక్షేచ్ఛాం, దదతి – ప్రయచ్ఛం తీత్యర్థః.

**అత్రటిప్పణీ :** యతీంద్రసూక్తీ రభీష్టౌతి ముకుందేతి. చంద్రాతప – సూర్యాతపోభయరూపత్వం యతీశభాషితానామ్. మునిబృందారకః – మునిశ్రేష్ఠః – మననశక్తి సమృద్ధః. దివాభీతాః – ఉలూకాః. తేషాంధ్వాంత ఏవ ఆస్థా. తత్రైవ తేషాం ప్రేక్షాచ. ఆహని ఉలూకా న ప్రేక్షాం లభంతే ఏవంచ తత్ప్రేక్షాలోపకరత్వం అస్యదినకరస్య. తథా చదుర్వాది దివాభీత కర్తృక ప్రేక్షా విషయే దినకరవత్ సముత్థానేన నిష్ఠురాః, ఉగ్రాః గిర ఇతి. పరమత మోక్ష రీతిశ్రవణేతు స్వల్పస్థితాపి మోక్షశ్రద్ధా దూరతోఽపై తీతి భావః. శ్రీ భాష్యకా రస్య గిరః శ్రణ్వతాం జనానాం అక్షోభ్యాం – పరై రవిచాల్యాం మోక్షేచ్ఛాం దదతి.

**50. నిరాబాధా బోధాయన ఫణితి నిష్యందసుభగాః**
**విశుద్ధో పన్యాస వ్యతిభిదుర శారీరక నయాః ।**
**అకుంఠైః కల్పంతే యతిపతి నిబంధా నిజముఖైః**
**అనిద్రాణ ప్రజ్ఞా రసధమని వేధాయ సుధియామ్ ॥**

**అర్థం :** నిరాబాధాః = (నిర్+ఆ+బాధాః) కొంచెం కూడా బాధ లేని; భోధాయన ఫణితి నిష్యంద సుభగాః = బోధాయనుల 'వృత్తి' సారం చేత మనోహరములైన; విశుద్ధో - నయాః। విశుద్ధ = నిర్దుష్టములైన; ఉపన్యాస= శబ్ద సందర్భాలచేత; వ్యతిభిదుర= (వి+అతి+భిదుర) వేర్వేరుగా ప్రకాశిస్తున్న; శారీరక నయాః = వేదాన్తశాస్త్ర సంబంధమైన న్యాయాలు కలిగియున్న; యతిపతి నిబంధాః = యతిరాజు యొక్క ప్రబంధాలు; అకుంఠైః = ఖండింపరాని; నిజముఖైః = స్వీయ, ముఖ్య సిద్ధాంతాలచేత; సుధియాం = విద్వాంసులకు; అ నిద్రాణ-వేధాయ। అ నిద్రాణ = వికసించియున్న; ప్రజ్ఞారస = ప్రజ్ఞ అనే రసం యొక్క; ధమని = నాడిని; వేధాయ = భేదించడం కోసం; కల్పంతే = సమర్థములై ఉన్నాయి.

**తాత్పర్యము :** యతిరాజ ప్రబంధాలు ఏ మాత్రం బాధలేనివి. బోధాయనుల 'వృత్తి' గ్రంథాన్ని అనుసరించడం వల్ల మనోజ్ఞమైనవి. దోషరహితో పన్యాసాలచేత బాగా ప్రకాశిస్తున్న బ్రహ్మసూత్రాల అధికరణాలు కలిగి ఉన్నాయి. ఖండింపరాని తన ప్రతి పాద్యార్థాలచేత పండితులకు వికసించే ప్రజ్ఞ అనే రసాన్ని ప్రేరేపించే సామర్థ్యం కలవి.

**వ్యాఖ్య :** శ్రీ మద్రామానుజ సిద్ధాంత బలాన్ని ప్రదర్శించే శ్లోకం.

శ్రీ వ్యాస (బాదరాయణ) మహర్షి రచించిన బ్రహ్మసూత్రాలకు భగవద్రామానుజయతీంద్రులు వివరణ రూపాలైన శ్రీ భాష్యం, వేదాంత దీపం, వేదాన్తసారం అనే ప్రబంధాలను కృపజేశారు. వీటిలో బృహత్ గ్రంథమైన శ్రీ భాష్యాన్ని రచించిన కౌశలాన్ని దేశికులు సుశ్లోకించారు.

**నిరాబాధాః** : యతిరాజుల శ్రీసూక్తులు ఈషద్బాధలేనివి. 'బాధ' అంటే, ప్రమాణాలను, యుక్తులను చూపలేకుంటే సూక్తులు ఖండింపబడే అవకాశమని అర్థం. (నిర్+ఆ+బాధాః) 'ఆజ్' అనే అవ్యయానికి అనేకార్థాలున్నా, ఇక్కడ 'ఇంచుక' అని అర్థం. "ఆ ఙీషదర్థేఽ భి వ్యాప్తౌ సీమార్థే ధాతుయోగజే". (అమరం) శ్రీ భాష్యకారుల సూక్తులు ప్రత్యక్ష, అనుమాన, శబ్దప్రమాణాలతోనూ, లౌకిక యుక్తులతోనూ సమర్థింపబడినాయి. అందువల్ల అవి ఖండింపబడే బాధ లేశ మాత్రమైనా లేనివి అని సూచితం.

**బోధాయన ఫణితి నిష్యంద సుభగాః** - బోధాయన మహర్షి, బ్రహ్మసూత్రాలను వివరించే 'వృత్తి' అనే గ్రంథాన్ని రచించారు. ఆ 'వృత్తి'ని అనుసరించి రచనా ప్రవాహం సాగింది. కాబట్టి శ్రీభాష్యపంక్తులు మనోజ్ఞంగా ఉన్నాయి.

**"భగవద్బోధాయనకృతాం విస్తీర్ణాం బ్రహ్మసూత్రవృత్తిం పూర్వాచార్యాః సంచిక్షిపుః; తన్మతానుసారేణ సూత్రాక్ష రాణి వ్యాఖ్యాస్యంతే"** అని శ్రీ భాష్యకారుల ప్రతిజ్ఞ.

**విశుద్ధోపన్యాస వ్యతిభిదుర శారీరకనయాః** - పరబ్రహ్మ స్వరూప రూపగుణవిభూతులను తెలియజేసే చతుర్వేదాల సారాన్ని శ్రీవ్యాస మహర్షి 545 బ్రహ్మసూత్రాలుగా రచించారు. ఈ వేదాన్తశాస్త్రానికే శారీరక మీమాంసాశాస్త్రమని (వ్యవహారం) పేరు. భగవద్రామానుజులు 545 సూత్రాలను 156 అధికరణాలుగా విభజించి, నాలుగు అధ్యాయాలలో సమకూర్చారు. ఒక్కొక్క అధ్యాయాన్ని 1) సమన్వయాధ్యాయం, 2) అవిరోధాధ్యాయం, 3) సాధనాధ్యాయం, 4) ఫలాధ్యాయం అని పేర్కొన్నారు. ప్రతి అధ్యాయం నాలుగు పాదాలుగా విషయాన్ని బట్టి వింగడింపబడింది. మొత్తం 16 పాదాలలో శాస్త్రన్యాయంగా కొన్ని కొన్ని సూత్రాలను కూర్చి, రచింపబడిన గ్రంథం శ్రీ భాష్యం. యతిరాజ సూక్తులు గంభీరవాగ్వైఖరితోనూ, నిర్దుష్టమైన, మృదుమధురమైన శబ్దజాలంతోనూ అప్రతిమ ప్రభావం కలిగి ప్రకాశిస్తున్నాయి.

**అకుంఠైః నిజముఖైః** – బ్రహ్మసూత్రాలకు ఇతరులు వ్రాసిన భాష్యాలలో శాస్త్ర న్యాయాన్ని బట్టి (పైన చూపబడినట్లు) రచించే అందమైన పద్ధతి కనబడదు. శ్రీ భాష్యకారులు మాత్రం సూత్రార్థాలను వివరిస్తున్నప్పుడు 1) విషయం, 2) సంశయం, 3) పూర్వపక్షం, 4) సిద్ధాన్తం అనే క్రమాన్ని పాటించి, స్వీయ నైపుణ్యంతో భావరచనా సౌందర్యాన్ని ప్రదర్శించారు.

గహనతమమైన శారీరక మీమాంసాశాస్త్రానికి సంగ్రహ, విస్తర వ్యాఖ్యాన గ్రంథాలను రచించి, వేదాన్తవేద్యుడైన పరమపురుషుడు శ్రీమన్నారాయణుడే అని విశిష్టాద్వైత వేదాంత సిద్ధాంతాన్ని స్థిర పరచారు. ఇది ఖండింపరాని సిద్ధాంతం. ప్రతిపాద్యార్థాలవల్ల ప్రాజ్ఞులకు సరసానందం కలిగించేవి యతిపతిప్రబంధాలు, అని దేశికులు చమత్కరించారు.

**అనిద్రాణ ప్రజ్ఞారసధమని వేధాయసుధియామ్ :** మదనశాస్త్ర మర్మజ్ఞుడైన వ్యక్తి తన ధర్మపత్ని యొక్క రసనాడిని తట్టి రసోత్పాదనం చేస్తాడు. ఈ విషయం (30వ శ్లోకంలో) ఇదివరకే చెప్పబడింది కదా! (ప్రబంధ శబ్దం పుంలింగం-ప్రజ్ఞ స్త్రీ లింగం) లేదా; ఒకనాడీ శాస్త్ర నిపుణుడు ప్రజ్ఞారూపద్రవ రసౌషధాన్ని ఒక పాత్ర (Syringe) లోకి తీసుకొని, పదునైన సూదిమొనతో శరీరంలో ప్రత్యేక నాడిని భేదించి ప్రసరింప జేస్తే డెందం స్పందిస్తుంది. ధిషణకు దీధితి అధికమవుతుంది. అలాగే యతిరాజ ప్రబంధాల వల్ల స్థూల – సూక్ష్మ చిద చిద్విశిష్టాద్వైత జ్ఞానం వికసిస్తుంది. ఈ వాక్యార్థం వల్ల అర్వాచీన వైద్య శాస్త్రజ్ఞానం దేశికుల యందు ప్రకాశించినట్లు ప్రకటితమే కదా!

**"దృష్టే ఉపహ్నుత్యభావాదను మితి విషయే లాఘవస్యానుసారాత్ శాస్త్రేణైవావసేయే విహతి విరహితే నాస్తికత్వ ప్రహాణాత్। నాథో పజ్ఞం ప్రవృత్తం బహుభిరుపచితం యామునేయ ప్రబంధైః త్రాతం సమ్యగ్యతీంద్రై రిదమఖిల తమః కర్శనం దర్శనం నః". "తత్త్వముక్తా కలాపం" లోని ఈ శ్లోకం స్మరణీయం.** భగవద్రామానుజ మునీంద్రులు స్వీయప్రబంధాల వల్ల శ్రుతిశత సమధిగమ్యమైన తత్త్వ యాథాత్మ్య జ్ఞానాన్ని శాశ్వతంగా ప్రవహింపజేశారు.

రూపకోపమలచే అలంకృతమైన ఈ శ్లోకం కూడా శిఖరిణీ వృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తత్ప్రబంధైక దేశస్యాపి ప్రజ్ఞాప్రవాహోత్పాదకత్వం వదతి, నిరాబాధా ఇతి. ప్రమాణ బాధాదిరహితాః. బోధాయన ఫణితి నిష్యంద సుభగాః - బోధాయన ఫణితేః - బోధాయన వృత్తేః, నిష్యందవత్ - సారపరీవాహవత్ , సుభగాః - మనోహరాః- తదనుసారిణ ఇతియావత్. విశుద్ధోపన్యాస వ్యతిభిదురశారీరకనయాః. విశుద్ధోపన్యాసేన - శ్లాఘ్యశబ్ద సందర్భేణ, వ్యతిభిదురాః-వాచ్యతయా సంబద్ధాః, శారీరకనయాః - వేదాన్త న్యాయాః, యేషుతే తథోక్తాః, తాదృశాః - యతిపతినిబంధాః. అకుంఠైః-ప్రతివాదిభిరఖండితైః. నిజముఖైః - నిజైకదేశైః. అనిద్రాణప్రజ్ఞారసధమని వేధాయ - వికసిత తర జ్ఞాన ప్రవాహోత్పాదనాయ. కల్పంతే - సమర్థా భవంతి. ధమనిః - నాడిః. తద్వేధేహిరక్త ప్రవాహోభవతి. తద్వత్, సుధియాం - నిర్మలధియాం. సుఖేన జ్ఞానప్రవాహోత్పాదకా భవంతీతి.

**అత్రప్రభావలీ :** నిరాబాధాః - ఆబాధాః - ఈషద్బాధః. తేన రహితాః బోధా యనేత్యాది. బోధాయన ఫణితిః - వృత్తి గ్రంథః - తస్యనిష్యందః - ప్రసరః, తద్రూపత్వాత్ సుభగాః. విశుద్ధోప న్యాసేత్యాది. విశుద్ధేన - దోష రహితేన, ఉపన్యాసేన వ్యతిభిదురాః - సంపృక్తాః ప్రకాశమానాఇత్యర్థః. శారీరక సూత్రన్యాయాః యత్రతే. యతిపతినిబంధాః - శ్రీభాష్యాదయః. ఆకుంఠైః- కేనచిదపిబాధా భావాత్ తీక్ష్ణైః; నిజముఖైః - ముఖశబ్దేన లక్షణయా ప్రధాన ప్రతిపాద్యా అర్థా ఉచ్యంతే, తైఃసాధనైః - సుధియామ్ అనిద్రాణేత్యాది. అని ద్రాణా వికసితా యాప్రజ్ఞా సైవరసధమనిః, తస్యాః వేధాయ - సిరావేధాయ తత్సిద్ధ్యర్థమ్ - కల్పంతే - సమర్థా భవంతి. యథాతత్ సిరావేధేకృతే రుధిర రూపకీకసః ప్రసరతి, ఏవం నిజార్థ శ్రవణ మాత్రేణ ప్రజ్ఞారసం జనయంతీత్యర్థః

**అత్ర సంకల్పసూర్యోదయటిప్పణీ:** బోధాయనేత్యాది. బోధాయన ఫణితేః - వృత్తి గ్రంథస్య నిష్యందేన సుభగాః - తదనుసారిణ ఇతి యావత్. విశుద్ధేత్యాది. విశుద్ధేన - నిర్దోషేణ; ఉపన్యాసేన, వ్యతిభిదురాః - పృథక్ పృథక్ ప్రకాశ్యమానాః . శారీరక సూత్రగతా న్యాయాః, యైస్తే అని ద్రాణేత్యాది. నాడీ జ్ఞేన పుంసా బుద్ధినాడీ వేధనే యథాబుద్ధిర్వికసతి తథా శ్రీభాష్యాది గ్రంథైరపి జ్ఞానం వికసతీతి భావః ।

**వ్యాఖ్యానాంతరం :** నిరాబాధాః – ఈషదపి బాధరహితాః. ఇదం ముఖ్యం మతాంతర వైలక్షణ్యమ్. ప్రాచీన మునివ్యాఖ్యానానుసారిత్వమాహ బోధాయనేతి. "తదాహవృత్తికార" ఇతి హి త త్ర తత్ర దర్శితమ్. నిష్యందః – అనువాదః. విశుద్ధః – విషయా సాంకర్యమ్. తేనాధికరణానాం మిథో భేదః. తేన విషయ భేదేఽ ప్యైకాధికరణ్యం, విషయైక్యేఽ పి అధికరణ భేదశ్చ. పరమత ఇవేహ నేత్యర్థః. ముఖైః – తర్కైః. ధమనిః – నాడిః రసః – ద్రవరసః. ప్రబంధేన యుక్తతయా అర్థప్రతిపాదనం. నాడీం విధ్వా రసమి వానిద్రాణాం ప్రజ్ఞాంస్ఫురంతీంప్రసారయతి. అత్ర భిషజా శీఘ్రారోగ్య సంపత్తయే భేషజ రసం పాత్రే నిక్షిప్య అకుంఠేన సూచీముఖేన శరీరాంతర్నాడీం భిత్వారసప్రేరణం క్రియమాణం ధ్వన్యతే. ఆచార్యస్య వైద్య స్యార్వాచీన వైద్య వైదుష్యమపి.

**51.** **వికల్పాటోపేన శ్రుతిపథ మశేషం విఘటయన్**
**య దృచ్ఛా నిర్దిష్టే యతి నృపతి శబ్దే విరమతి ।**
**వితండా హంకుర్వత్ ప్రతి కథక వేతండ పృతనా**
**వియాత వ్యాపార వ్యతిమథన సంరంభ కలహః ॥**

**అర్థం :** వికల్ప + ఆటోపేన = సంశయం కల వాగాడంబరంచేత; అశేషం = పూర్తిగా; శ్రుతిపథం = వేదమార్గాన్ని; విఘటయన్ = చెడ గొడుతూ; వితండా–కలహః। వితండా = వితండవాదమందు; అహంకుర్వత్= గర్విస్తున్న; ప్రతికథక = ప్రతివాదులు అనబడే, వేతండ=ఏగునుల యొక్క; పృతనా = సమూహాల యొక్క; వియాత, వ్యాపార = ధృష్టవ్యాపార రూపమైన; వ్యతిమథన = ఒకరినొకరు అణచడమందు; సంరంభ = సంభ్రమం కలిగిన; కలహః = జగడం; యతినృపతి శబ్దే = యతిరాజ నామం; (శబ్దం). యదృచ్ఛా, నిర్దిష్టే = విచ్చల విడిగా, ఉచ్చరింపగా; విరమతి = శమిస్తుంది.

**తాత్పర్యము :** ఒక నిశ్చితార్థాన్నిచెప్పక వేదమార్గాన్ని పూర్తిగా చెడగొడుతూ, వితండా వాదమందే అహంకరిస్తున్న ప్రతివాదులు అనబడే గజ సమూహం యొక్క ధృష్టవ్యాపారమైన పరస్పర విజయ సంభ్రమరూప కలహం, యతిరాజ శబ్దాన్ని అలవోకగా విన్నంత మాత్రాన, తనంతతానే మానుతుంది.

**వ్యాఖ్య :** యతిరాజ నామప్రభావాన్ని వర్ణించే శ్లోకం.

భగవంతుని నామ మహిమ వలె సదాచార్యనామంకూడా గొప్పశక్తి కలిగి యుండడం వల్ల అశుభాన్ని చెదరగొట్టి, శుభాన్ని సమకూర్చుతుంది.

**వికల్పాటోపేన శ్రుతిపథం విఘటయన్ :** ఇది 'కలహ' శబ్దానికి విశేషణం. నిరాభాధత్వం ఎలాగా? అది ఇలాగా ఉండదా? లేకపోతే అలా అర్థం కావచ్చు కదా? అని వాగాడంబరాన్ని సంశయగ్రస్తంగా కల్పించడం 'వికల్పాటోపం'. (వికల్పం = neither nor) నిశ్చితమైన అర్థాన్ని చెప్పలేక వ్యర్థ పదాలతో విషయాన్ని విమర్శిస్తూ, ఖండించే యత్నం చేసే ప్రత్యర్థుల వాదం వల్ల శ్రుతులకు అభిమతమైన వస్తువు యొక్క స్వరూప స్వభావాలు చెడిపోతాయి.

"యతో వా ఇమాని భూతాని జాయంతే" - (ఎవని సంకల్పం చేత ఈ ప్రాణులన్ని కలుగుతున్నాయో)" "ఎవ్వనిచే జగంబు జగమెవ్వనిలోపల నుండు లీనమై" అనే అర్థమున్న శ్రుతిచేత, ప్రామాణికంగా ప్రతిపన్నమవుతున్న ప్రపంచాన్ని 'మిథ్య' యని చెప్పడం శ్రుతి పథాన్ని చెరచడమే అవుతుంది కదా! వేద సునిశ్చితార్థాన్ని దూషించే కలహమన్నమాట.

'వితండా వాదం' అంటే, ఇతరుల వాదాన్ని ఒప్పుకొనక – అంగీకరించక, తన వాదాన్ని స్థాపించనూ లేక చేసేవాదమని అర్థం. "స్వాభావికీ జ్ఞాన బలక్రియాచ" అనే శ్రుతి, పరబ్రహ్మ కల్యాణ గుణాలు కలవాడు, అని స్పష్టంగా చెబుతుంటే 'ఆయన నిర్గుణుడు' అంటే 'గుణాలు లేనివాడు' అని చెప్పడం వితండా వాదమే. 'నిర్గుణుడు' అనే పదానికి 'హేయమైన గుణాలులేనివాడు' అనే అర్థమే కాని 'గుణరహితుడో, గుణహీనుడో' అనే అర్థం మాత్రం కాదు. స్వమతస్థాపనం చేయలేక, ప్రత్యర్థుల వాదననూ అంగీకరించకుండా, ఎడతెగని విమర్శలు చేస్తూ, ప్రతిపక్షులను జయించగలమనే సాహసం చేయడం, అహంకరించడం వియాత వ్యాపారమే అన్నారు దేశికులు. దుర్వాదులను 'వేతండ పృతనా' అంటే గజసమూహమన్నారు. మదగజాలు చెట్లకొమ్మలను విరచివేస్తూ ఘీంకరించడం ధృష్ట వ్యాపారమేకదా! ప్రతికథకులంటే ప్రతివాదులు అని అర్థం. ప్రత్యర్థులు శ్రుతి విహితార్థాలను చెప్పేవారిని అణచివేయాలనే ఆగ్రహంతో

అల్లరి – కోలాహలం – చేయడం వియాతవ్యాపారం. "ధృష్టే ధృష్ణు ర్వియాతశ్చ" (అమరం) దిట్టతనంతో ఎదుటికి – మీది మీదికి పోవడం వియాతుని వ్యాపారం.

శ్రీభాష్యాది గ్రంథాల మాహాత్మ్యాన్ని కొన్ని శ్లోకాలలో ప్రశంసించిన తర్వాత దేశికులు 'రామానుజ' నామప్రభావాన్ని ప్రకటిస్తున్నారు. యథార్థంగా 'యతిరాజ' శబ్దాన్ని తలవనితలంపుగా – స్వేచ్ఛగా – అలవోకగా ఉచ్చరిస్తే చాలు రామ శబ్దం విన్నంతనే మారీచుని ప్రాణం కంఠగతమైనట్లే, ప్రతివాదుల సంరంభ కలహం చప్పున అణగిపోతుంది.

తిరువరంగత్తముదనార్లు "ఇరామానుశ ఎన్నుశొల్లుమినే". (ఇరామానుశనూత్తందాది–43) రామానుజ చతురక్షరీ మంత్రాన్ని అనుసంధిస్తే, కలిప్రభావం తరిగిపోతుందని ఉపదేశించారు. దేశికులు యతిరాజ చతురక్షరీమంత్రాన్ని ఉబుసుపోకగా ఉచ్చరిస్తే, వేదమార్గాన్ని చెరచివేసే ప్రతివాదుల సంరంభకలహం తనంతతానే శమిస్తుందని ఉపదేశించారు.

సింహనాదం వినగానే ఏనుగుల ధృష్టవ్యాపారం అణగిపోతుంది. అలాగే యతినృపతి శబ్దం వినగానే ప్రతికథకుల సంరంభకలహం శమిస్తుంది. ఇది ప్రతివస్తూపమాలంకార లక్షణం.

యతిరాజు పేరు వినబడినంతలోనే ప్రతివాదులు నోరు మూసుకొంటారు. ఇక వారి సిద్ధాంతమే వింటే చెప్పేదేముంది? వారు యతిరాజ సిద్ధాన్తాన్నే పాటిస్తారు. ఇది అర్థాపత్త్యలంకార లక్షణం. శిఖరిణీ వృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ కథం నిరాబాధత్వం? ప్రమాణాంతరబాధాభావేఽపి ఖండనయుక్త్యా సర్వస్యాపి ఖండనీయత్వాత్ ఇత్యత్రాహ, వికల్పేతి. వికల్పాటోపేన – వికల్పసంభ్రమక్షోభేణ, శ్రుతి పథం – వేదమార్గం, అశేషం, విఘటయన్ – దూషయన్. వితందేత్యాది. వితండాయాం స్వపక్ష స్థాపనాహీనవాదే, అహంకుర్వంతః – అహమేవ సమర్థ ఇత్యభిమానవంతః. ప్రతి కథకాః –ప్రతివాదినః, త ఏవ వేతండాః–గజాః, తేషాం పృతనాయాః– సమూహస్య;

వియాతవ్యాపారం - తేన జాతః వ్యతిమథన సంరంభకలహః - పరోక్తి భంజనారంభకలహః. యతినృపతి శబ్దే యదృచ్ఛా నిర్దిష్టే, విరమతి - శాంతో భవతీత్యర్థః. తదుక్త ఖండన ప్రకారేణ తస్యైవ ఖండనీయత్వా దన్యఖండనం న సంభవతీ త్యర్థః.

**అత్రప్రభావలీ :** యతీంద్ర సింహనాదశ్రవణ మాత్రేణ దుర్వాది గజానా మన్యోన్యకలహో న వర్తతే, ఇత్యాహ వికల్పేతి.

వికల్ప సంభ్రమేణ అశేషం వేదమార్గం, విఘటయన్ - పీడయన్. *వితండేత్యాది. వితండా - శుష్కవాదః. తన్మాత్రేణా* హంకుర్వంతః, ప్రతివాదిన *ఏవగజాః - తేషాంఘటా. తస్యావియా తవ్యాపారేణ*-ప్రగల్భ శుష్కోపన్యాసరూప వ్యాపారేణ, వ్యతిమథనే - అన్యోన్యనిరాసే, యః సంభ్రమ విశిష్టః కలహః - వాదరూపః. యతినృపతిశబ్దే - యతీంద్రస్యశబ్దః - సింహనాదః - శ్రీ భాష్యాది రూపః. తస్మిన్ యదృచ్ఛానిర్దిష్టే-యదృచ్ఛయా ఉచ్చరిత ఏవ, విరమతి - విరతోభవతి. యతిపతి రితి శబ్దే యదృచ్ఛయా యేనకేనాపి స్వేచ్ఛయా, నిర్దిష్టే - ఉదీరితే సతి, విరమతి - విరమం ప్రాప్నోతీతి.

**వ్యాఖ్యానాంతరమ్ :** సర్వస్యాపి నిర్వచస్య ఖండనేనైవ స్వపక్షసిద్ధిం మన్వానస్య వైతండికస్య ఖండన ఖండ నాద్యకర్తృ ప్రభృతేః కలహోఽపి శామ్యతీత్యాహ, వికల్పేతి. శ్రుతిపథం - శ్రుత్యభిమత వస్తు స్వరూప స్వభావాదికమ్. విఘటయన్ ఇత్యస్య కలహం ప్రతివిశేషణత్వమ్. య దృచ్ఛా నిర్దిష్టే - ఏతత్ ఖండ నానుద్దేశేనోచ్చరితేఽపి. యతినృపతి శబ్దే - భాష్యకారీయ సదసన్నిరూపకవాక్యే, యతినృపతి నామ్నివా. ప్రతికథకా ఏవ వేతండాః గజాః తత్సేనాయాఃయో ధృష్టవ్యాపారః, స ఏవ వ్యతి మథనసంరంభః - వాద్యుక్త సర్వ విషయ నిరాస సాహసాత్మక కలహః, సః విరమతి. అద్వైతినః సర్వే వైతండికా ఏవ. మిథ్యేతి వదంతి. సత్యమితి చరంతి.

**52.** **ప్రతిష్ఠా తర్కాణాం ప్రతిపదమృచాం ధామయజుషాం**
**పరిష్కారః సామ్నాం పరిపణ మథర్వాంగిరసయోః ।**
**ప్రదీప స్తత్త్వానాం ప్రతికృతి రసౌతాపసగిరాం**
**ప్రసత్తిం సంవిత్తేః ప్రదిశతి యతీశాన ఫణితిః ॥**

**అర్థం :** తర్కాణాం = యుక్తులకు; ప్రతిష్ఠా = నివాసభూమియై; ఋచాం = ఋగ్వేదానికి; ప్రతిపదం = పర్యాయపదమై; యజుషాం = యజుర్వేదానికి; ధామ = స్థానమై; సామ్నాం = సామవేదానికి; పరిష్కారం = అలంకారమై; అధర్వాంగిరసయోః = అధర్వవేదానికి; పరిపణం = మూలధనమై; తత్త్వానాం = తత్త్వాలకు; ప్రదీపః = దీపమై; తాపసగిరాం = ఆర్ష వాక్కులకు; ప్రతికృతిః = ప్రతిబింబమై ఉన్న; అసౌ = ఈ; యతీశాన ఫణితిః = యతిరాజసూక్తి; సంవిత్తేః = జ్ఞానానికి; ప్రసత్తిం = ప్రసన్నతను; ప్రదిశతి = ఇస్తుంది.

**తాత్పర్యము :** తార్కిక యుక్తివాదాలకు పర్యవసానభూమియై, ఋగ్వేదానికి సమానార్థక పదమై, యజుర్వేదానికి స్థానమై, సామవేదానికి అలంకారమై, అధర్వవేదానికి మూలధనమై, తత్త్వాలకు దీపమై, ఋషుల వాక్కులకు ప్రతిబింబమై యున్న ఈ రామానుజయతీంద్రుల సూక్తి (మన) జ్ఞానానికి స్వచ్ఛతను ప్రసాదిస్తుంది.

**వ్యాఖ్య :** యతిరాజ శ్రీసూక్తి మన జ్ఞానానికి ప్రసన్నతను కలిగిస్తుందని కీర్తించే శ్లోకం.

శ్రీమద్రామానుజుల వారి శ్రీ భాష్యాది కృతులన్ని చతుర్వేదాలను, స్మృతులను, ఇతిహాస పురాణాలను అనుసరించి ఉన్నాయి. సర్వవిద్యల సముచ్చయ రూపమైన యతిరాజ ఫణితియొక్క ఘనత కవితార్కిక కేసరియైన దేశికులను, తత్త్వహిత పురుషార్థాల విషయమై స్పష్టమైన జ్ఞానాన్ని అనుగ్రహించడం కోసం ప్రార్థింప జేస్తున్నది.

**1. తర్కాణాం ప్రతిష్ఠా :** యతిరాజ సూక్తులు - కృతులు తర్కశాస్త్ర యుక్తులకు పర్యవసానభూమి. కాబట్టి ఎవరైనా ఆ సూక్తుల యందు దోషం చూపడానికి తార్కికంగా యుక్తివాదమెంత జేసినా నిష్ఫలమే కదా!

**2. ఋచాం ప్రతిపదం :** ఋగ్వేదానికి పర్యాయపదమై ఉన్నాయి సూక్తులు. ఘటమనే పదానికి కలశమనేది ప్రతిపదం కదా! కాబట్టి ఋక్కులకూ శ్రీసూక్తులకు శబ్దభేదమేకాని అర్థభేదం లేదు. "ఏకవింశతిధా బాహ్వృచ్యమ్". ఋగ్వేదంలో 21 శాఖలున్నందువల్ల 'ఋచాం' అని బహువచనం ప్రయోగింపబడింది.

**3. యజుషాంధామ :** యుజుర్వేదానికి యతిరాజ సూక్తులు నిలయం "గృహదేహ త్విట్ ప్రభావాధామాని" (అమరం). గృహం, దేహం కాంతి, ప్రభావం అనే అర్థాలున్నాయి 'ధామన్' శబ్దానికి. యుజర్వేదానికి 101 శాఖలున్నాయి కాబట్టి 'యజుషాం' అని బహువచనం. "ఏకశత మధ్వర్యుశాఖాః" –'అధ్వర్యవ' కర్మ అంటే యజ్ఞాదికర్మకాండాత్మకమైన వేద సంహిత 'యజుర్వేదం'.

**4. సామ్నాం పరిష్కారః :** సామవేదానికి ఆభరణం - అలంకారం. చతుర్వేదాలలో గాన యోగ్యమైనది సామవేదం. "వేదానాం సామవేదోఽస్మి" (భ.గీ) 'వేదాలలో సామవేదాన్ని నేను' అని శ్రీకృష్ణభగవానుడు పార్థునికి ఉపదేశించాడు. సామవేదమంత్రార్థాన్ని యతిరాజసిద్ధాంతం ప్రకాశింపజేస్తుంది. కాబట్టి అలంకారమనిభావం. "సహస్రవర్త్మా సామవేదః". సామవేదం వేయి (1000) శాఖలు కలదని "సామ్నాం" అనే బహువచనం తెల్పుతున్నది. 'ఋగ్యజుస్సామ' లనే మూడు వేదాలకు ఒకే శబ్దం 'త్రయీ' అని రూఢి.

**5. అథర్వాంగిరసయోః పరిపణమ్ :** అథర్వణవేదానికి శ్రీ భాష్యకార సూక్తులు మూలధనం. ఈ వేదంలో అనేక విధాలైన అనిష్టనివారణ - ఇష్టప్రాప్తి రూప కర్మలు తెల్పబడినాయి. ఆర్థిక వ్యాపారానికి పెట్టుబడి ధనం అవశ్యకం. కర్మ చేస్తేనే ఫలితం ఉంటుంది. కాని యతిరాజ కృతులను పరిశీలించి, అనుసంధానం చేస్తే చాలు సర్వలాభాలను పొందవచ్చు. "స్త్రీ కటీ వస్త్ర బంధేఽపి నీవీ పరిపణేఽపిచ" (అమరం). 'నీవీ' శబ్దం కోకముడి, మూలధనం, పందెంకట్టిన ద్రవ్యం అనే నానార్థాలు కలది. "నవధా థర్వణోవేదః". అధర్వణ వేదానికి తొమ్మిది (9) శాఖాభేదాలున్నాయి.

ముఖ్యంగా ఈ వేద మంత్రద్రష్టలు ఇద్దరు - 1 . అథర్వణ ఋషి. 2. ఆంగిరసర్షి అందువల్ల ఈ వేదానికి 'అథర్వాంగిరసవేద' మని పేరు.

"అథర్వాంగి రసయోః" అనే షష్ఠీద్వివచనాంత పదం, ఈ విషయాన్నే తెల్పుతుంది.

**6. తత్త్వానాం ప్రదీపః** - ఇరవైనాల్గు (24) తత్త్వాలకు దీపం వంటివి. ప్రకృతి, మహత్, అహంకారం, పంచతన్మాత్రలు. పంచభూతాలు, పంచకర్మేంద్రియాలు. పంచజ్ఞానేంద్రియాలు, మనస్సు, అనే తత్త్వాలను తెలియజేస్తాయి. లేదా; చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు, అనే ఈ మూడు తత్త్వాలను ప్రదీపింప జేస్తాయి యతిరాజ దివ్యసూక్తులు.

**7. తాపస గిరాం ప్రతికృతిః** - ప్రాచేతస, పరాశర, పారాశర్య, శుక, బోధాయన పరాంకుశ పరకాల నాథయాముని మునుల దివ్య సూక్తులకు శ్రీ భాష్యకారుల శ్రీసూక్తులు ప్రతిబింబాలవంటివి.

యతీశాన ఫణితికి ఈ సప్త సంఖ్యాత్మక విశేషణాలను అమర్చి సముచితమైన ఔచిత్యాన్ని ప్రదర్శించారు వేదాంతదేశికులు. పరంపరాగతమైన ఆర్ష సంప్రదాయానికి అనుగుణమైన యతీంద్ర ప్రబంధాలు సంవిత్ప్రదమైనవి. "సంవిత్ ప్రతిపజ్జప్తి చేతనాః". "సంవిదాగూః ప్రతిజ్ఞానం" (అమరం) సమగ్ర జ్ఞానాన్ని ప్రసాదించేవి అని అర్థం. సంవిత్తేః ప్రసత్తిం ప్రదిశతి = Confers clarity of knowledge.

ప్రసిద్ధ విద్వాంసులూ, మహావ్యాఖ్యాతలైన (అర్వాచీన) రామానుజాచార్యుల సంస్కృత వ్యాఖ్యవల్ల 'ప్రతిపదమృచాం' అనే చోట "పరిపణ మృచాం" అనీ, 'పరిపణ మథర్వాంగిరసయోః' అనే స్థలంలో 'ప్రతిపద మథర్వాంగిరసయోః" అని పాఠమున్నట్లు తెలుస్తున్నది.

భగవద్రామానుజుల శ్రీసూక్తులు 'హలహలః' అనే శ్రీహయగ్రీవ స్వామి యొక్క హేషారవంతో సమానమైనవని ఈ (శిఖరిణీవృత్తం) శ్లోకంలోని పదాల ప్రయోగంవల్ల గోచరిస్తున్నది.

"సమాహారః సామ్నాం ప్రతిపదమృచాం ధామయజుషామ్... హరత్వంతర్ధ్వాంతం హయవదన హేషాహలహలః" - అని అదే వృత్తం గల హయగ్రీవస్తోత్రశ్లోకంలోని శబ్దాలతో సామ్యం ఉంది కదా!

'ప్రదిశతి' అన్న చోట 'ప్రదిశతు' అనే పాఠాంతరమూ ఉంది. దేశికులు శ్రీ భాష్యకారుల ప్రబంధాల వల్ల నిర్మలజ్ఞానం కలుగుతుందనే దృఢా ధ్యవసాయంతో స్తుతించారు.

రూపకాతిశయోక్త్యలంకారం. శిఖరిణీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తత్సూక్తేః సర్వవిద్యాస్థానాను గతిం వదతి ప్రతిష్ఠేతి. తర్కాణాం ప్రతిష్ఠా - యుక్తీనాం పర్యవసానభూమిః; ఋచాం, పరిపణం - మూలధనం.. "నీవీ పరిపణౌ సమౌ" ఇత్యమరః. తుల్యార్థత్వాత్ ఆనందికే త్యర్థః. యజుషాంధామ - యజురవస్థాన స్థలం; సామ్నాం, పరిష్కారః- అలంకారః. తత్తుల్యేత్యర్థః. అథర్వాం గిరసయోః, ప్రతిపదం - పర్యాయపదం, పర్యాయా ర్థేతియావత్. తత్త్వానాం, ప్రదీపః - ప్రకాశకః- తాపసగిరాం - పరాశరపారాశర్య శుక ప్రాచేతసాదిగిరాం, ప్రతికృతిః - ప్రతిబింబం, తత్తు ల్యార్థేర్థత్యర్థః. యతీశాన ఫణితిః - యతీంద్రస్యసూక్తిః; సంవిత్తేః -జ్ఞానస్య; ప్రసత్తిం - ప్రసన్నతాం, ప్రదిశతు - ప్రయచ్ఛతు. తత్త్వహితా దిషు నిశ్చయ జ్ఞానం దదాత్విత్యర్థః.

**53. హ తా వద్యే హృద్యే హరిచరణ పంకేరుహయుగే**
**నిబధ్నంత్యైకాంత్యం కిమపి యతిభూ భృత్ఫణితయః ।**
**శునా సీర స్కంద ద్రుహిణ హర హేరంబ హుతభుక్**
**ప్రభేశాది క్షుద్రప్రణతి పరిహార ప్రతిభువః ॥**

**అర్థం :** హత+అవద్యే=నిర్దోషమైన; హృద్యే = మనోజ్ఞమైన; హరిచరణ పంకేరుహయుగే = శ్రీహరి యొక్క అంఘ్రిజలజ ద్వయమందు, యతి, భూభృత్ ఫణితయః = యతిరాజ వాక్కులు; శునాసీర - ప్రతిభువః। శునాసీర = ఇంద్రుడూ, స్కంద = కుమారస్వామి; ద్రుహిణ = చతుర్ముఖబ్రహ్మ; హర = శివుడూ, హేరంబ

= వినాయకుడూ; హుతభుక్ = అగ్ని; ప్రభా+ఈశ= సూర్యుడు; ఆది = మొదలైన; క్షుద్ర = క్షుద్రదేవతలకు; ప్రణతి = నమస్కరించడాన్ని; పరిహార = పరిహరించడమందు; ప్రతిభువః= పూచీపడునట్టివై; కిమపి = విలక్షణమైన; ఐకాంత్యం = ఒకరి యందే ధృఢమైన భక్తిని; నిబధ్నంతి = కలుగజేస్తున్నవి.

**తాత్పర్యము** : భగవద్రామానుజుల శ్రీసూక్తులు ఇంద్రాగ్ని సూర్య దేవతలనూ, చతురానన, పంచానన, షడానన, గజాననాదిదేవతలనూ ఆరాధించరాదని బోధిస్తాయి. పవిత్రమై, హృద్యమైన శ్రియః పతిచరణారవిందాల యందే ప్రణతులర్పించాలని, ఏకాంతభక్తిని కలిగించడమందే ప్రాతినిధ్యం వహిస్తాయి శ్రీ సూక్తులు.

**వ్యాఖ్య** : యతిరాజ దివ్యసూక్తులు పరాత్పరుని యందు ఏకాంత భక్తిని కలిగిస్తాయని కీర్తించే శ్లోకం.

వైష్ణవ భక్తి అచంచలమైనది. పలుదేవతలను ఆరాధించడం ప్రశస్తమైన విషయంకాదు. ఉన్న దేవతయందు భక్తి సన్నగిలుతుంది. ఇతరదేవతలు కూడా 'ఏ ఒకరియందూ విశ్వాసంలేని వాడు' అని పట్టించుకోరు. ఇది లోకజ్ఞత కదా!

"యోవై స్వాం దేవతా మతి యజతే ప్రస్వాయై దేవతాయైచ్యవతే. పాపీయాన్ భవతి, నపరాంప్రాప్నోతి". శ్రుతి.

'తన ఇష్టదేవతను పూజిస్తున్న వ్యక్తి, వేరే దేవతను పూజిస్తే మొదట పూజించిన దేవత యొక్క అభిమానాన్ని కోల్పోతాడు. తర్వాత పూజించిన వేరే దేవత కూడా ఒక్కదాని మీద స్థిరబుద్ధి లేక మారుతున్న వ్యక్తి అని విశ్వసించదు. ఏ దేవతా పట్టించుకోనందువల్ల పాపిష్ఠుడై సద్గతిని పొందలేడు' అని శ్రుత్యర్థం. కాబట్టి దేవతాంతర ప్రావణ్యాన్ని నిషేధిస్తాయి యతిరాజ సూక్తులు.

దేవతాంతరులెవరు అంటే, ఈ శ్లోకంలోని తృతీయపాదం ఉట్టంకిస్తున్నది. 1) శునాసీరుడు అంటే ఇంద్రుడు. "వృద్ధశ్రవాః శు(సు)నా సీరః పురుహూతః పురందరః". (అమరం). 2) స్కందుడు = షణ్ముఖుడు, సుబ్రహ్మణ్యస్వామి అంటారు. "పార్వతీనందనః స్కందః" 3) ద్రుహిణ' శబ్దం చతుర్ముఖబ్రహ్మార్థకం.

'ద్రుహ - జిఘాం సాయాం' అనిధాత్వర్థం. అసురులకు హింసచేసేవాడని వ్యుత్పత్త్యర్థం. ద్రుహిణో విరించిః కమలాసనః. (అమరం). 4) హరుడంటే శివుడు. ప్రళయకాలాన సర్వంహరించేవాడని వ్యుత్పత్త్యర్థం. "హరః స్మరహరో భర్గః" (అమరం). 5) హేరంబుడు వినాయకుడు. "బు-గతౌ". రుద్రుని సమీపాన ఉండేవాడు. "హేరంబ లంబోదరగజానవాః (అమరం) 6) హుతభుక్ అంటే అగ్నిదేవుడు. హుతమును భుజించేవాడు. "హుతభుగ్దహనోహవ్యవాహనః" (అమరం). 7) ప్రభేశుడు సూర్యుడు. (ప్రభాణాం - త్విషాం - ఈశః) కాంతులకు అధిపతి లేదా ఈశుడు కాబట్టి ప్రభేశుడు.

వీరందరు నిత్యకర్మలలోనూ, యాగాది కర్మలలోనూ విధిగా పూజింప దగినవారు. వైష్ణవులకు ఇతర దేవతల యందు అసూయ ఉండదు. సత్కర్మల యందు దేవతానుష్ఠానం ఇష్టమే.

**ముముక్షవో ఘోరరూపాన్ హిత్వా భూతపతీ నథ ।**
**నారాయణ కళాః శాంతాః భజంతిహ్యనసూయవః ॥**

మోక్షార్థులైన వారు ఘోరరూపులైన భూతపతులను విడిచి, దేవతాంతర నిందసేయకుండా, శాంతులై, నారాయణ పరాయణులై ప్రవర్తిస్తుంటారని భాగవతం (1-2-26) బోధిస్తుంది.

నారాయణుడు సర్వదేవమయుడు. "సబ్రహ్మాసశివః సేంద్రః". అని శ్రుతి. "యజ్ఞైస్త్వ మిజ్యసే నిత్యం సర్వదేవమయాచ్యుత । హవ్యకవ్యభుగేకస్త్వం పితృదేవ స్వరూపధృక్" సర్వదేవమయుడవైన ఓ అచ్యుతా! నిత్యం యజ్ఞాలద్వారా నీవే ఆరాధింపబడుతుంటావు. దేవతా పితృస్వరూపుడవైన నీవొక్కడవే హవ్య కవ్యాలను భుజిస్తుంటావు" అని శ్లోక తాత్పర్యం. ముముక్షువులకు నారాయణుని యందే దృఢమైన భక్తి ఉంటుంది.

**"సత్యం ప్రహరవా మావా**
**మయి వజ్రం పురందర ।**
**నాహముత్సృజ్య గోవింద**
**మన్యమారాధయామిభోః॥"**

ఓ ఇంద్రా! నీవు మీద వజ్రాయుధాన్ని ప్రయోగించు లేదా ప్రయోగించకు.

నేను మాత్రం గోవిందుణ్ని వదలి ఇతర దేవతను ఆరాధించను సుమా! అని శ్లోకార్థం. ఇది విష్ణుభక్తుల దృఢభక్తికి నిదర్శనం.

సర్వపాపాలను హరించేవాడు. హరి. "హరింహరంత మనుయంతి దేవాః" దేవతలందరు సర్వపాపహరుడైన శ్రీహరినే అనుసరిస్తారు; ఉపాసిస్తారు. సంసారులకు హరిచరణ కమల పరిభజనమే శరణం. హరిచరణాలు నిత్యనిర్దోషాలు. "చరణం పవిత్రం వితతం పురాణం యేన పూతాస్తరతి దుష్కృతాని". శ్రుతి. ఆ పవిత్ర చరణాలు జలస్థలాలందునూ, వికసితకమలాలే కాబట్టి భక్తులకు భోగ్యంగా ఆశ్రయించదగినవి. అందువల్ల హతావద్యాలూ, హృద్యాలూ అయిన హరిచరణ కమలయుగళమందే ఐకాంత్యాన్ని కలిగించేవి యతిరాజసూక్తులు.

ఒక్కరి యందే నిశ్చయం కలవాడు ఏకాంతి. ఏకాంతి భావం (ధర్మం) 'ఐకాంత్యం'. (ఏకస్మిన్నేవ అంతః – నిశ్చయః యస్యస = ఏకాంతీ. ఏకాంతినః భావః = ఐకాంత్యం) కాబట్టి దేవతాంతర ప్రావణ్యాన్ని అంటే ప్రణామంగానీ, ఫలప్రార్థనను గానీ పరత్వబుద్ధిని గానీ వదలి శ్రియః పతి యొక్క చరణ పంకేరుహయుగ మందే ఐకాంత్యభక్తిని జనింపచేస్తాయి యతీశ్వర సూక్తులు.

పరపురుషుణ్ని కన్నెత్తి చూడని పతివ్రతా ధర్మంలాంటిది పరమైకాంత్యం. భక్తిని మించింది "పరమైకాంత్యం".

"ఉన్నాలల్లాల్ యావరాలుమ్ ఒన్ఱుంకుఱై వేణ్డేన్" (త్రి.వా.మొ. 5-8-3) ఓ స్వామీ! నాకు వేరే సాధనం లేదు. సర్వరక్షకుడవై, ప్రాప్తశేషివై, సర్వజ్ఞత్వ, సర్వశక్తి సమన్వితుడవైన నిన్ను తప్ప వేరెవరినీ తృణమైననూ అపేక్షింపను. మీ దివ్య పాదారవిందాలను సేవించే రీతిగా కటాక్షింపుమని సర్వదాప్రార్థిస్తుంటాడు పరమైకాంతి. అనన్య దేవతాకులు ఏకాంతులు. అనన్యదేవతాకులేకాక అనన్య ప్రయోజకులు పరమైకాంతులు. 'వైకుంఠవాసేఽపి నమేఽభిలాషః". మోక్ష సామ్రాజ్యాన్ని కూడా కోరనివారు. ఇక్కడ శాస్త్ర విహితమైన సపర్యలను చేస్తూ భగవంతునితో సంశ్లేషమే సుఖంగానూ, వియోగమే దుఃఖంగానూ భావిస్తూ తమ జీవనం పరమాత్మపరంగానే గడిపేవారు

ఏకాంతులలో పరములు శ్రేష్ఠులు. "ప్రతిభూః" - అంటే పూచీపడేవారు. ప్రతినిధి. జామీనుదారుడు. (a guarantor, a surety) "స్యుర్లగ్నకాః ప్రతిభువః" (అమరం).

కలహించే ఇద్దరు వ్యక్తుల మధ్య మరొక పలుకుబడి గల మహానుభావుడు చేరి 'అతడు నీ కోరిక తీర్చకున్నా, నేను తీర్చుతాను' అని ప్రాతినిధ్యం వహించి వారి కలహాన్ని మాన్పేవాడు 'ప్రతిభూ' శబ్ద వాచ్యుడు. అలాగే, దేవతాంతర భక్తులు శ్రియః పతియందు నిశ్చల భక్తి కలిగిన పరమైకాంతులతో దేవతాంతర పారమ్యాన్ని చెప్పి కలహిస్తుంటే, యతిరాజ శ్రీసూక్తులు ప్రబలమైన శ్రుతి ప్రమాణాల ద్వారా విష్ణుపారమ్యాన్ని స్థాపించి, వారి వాదకలహాన్ని పరిష్కరించే సామర్థ్యం కలవి.

గత శ్లోకంలో 'ప్రసత్తిం సంవిత్తేః' జ్ఞానం యొక్క స్వచ్ఛతను గూర్చి ప్రార్థించిన దేశికులు ఆ స్వచ్ఛతను ఈ శ్లోకంలో స్పష్టపరచారు.

"స్వసత్తయైవ స్వాశ్రయం ప్రతిక్వచిద్విషయ స్వప్రకాశనం హి సంవేదనం" అని శ్రీ భాష్యకారులు జ్ఞాన స్వరూపాన్ని నిర్వచించారు. అంటే జ్ఞానానికి మూడు లక్షణాలు ఉండాలి. ఒకటి తన ఉనికి, రెండవది తన ఉనికి ఆత్మ ఆశ్రయమై యుండడం, మూడవది తాను ఉండగా తనకు ఆశ్రయమైన ఆత్మకు తననూ, తనతో పాటు బయట ఉన్న ఒక వస్తువును స్పష్టంగా తెలిసే రీతిగా చేయడం. తన ఉనికి జ్ఞానం. అది కలవాడు జ్ఞాత. జ్ఞానానికి విషయమైనది జ్ఞేయం. జ్ఞానం ఆత్మకు ధర్మం. తేజోద్రవ్యం వెలుగుతున్న దీపానికి ద్రవ్యంగానూ, దాని కాంతి రూపధర్మంగానూ ఉన్నట్లే, జ్ఞానం కూడా ఆత్మకు స్వరూపంగానూ, ధర్మంగానూ ఉంటుంది.

ఆత్మజ్ఞానం ప్రత్యక్ - అంటే తనను తాను తెలుసుకొంటుంది. ధర్మభూత జ్ఞానం పరాక్ - అంటే తన ఉనికి వల్ల విషయాలను తెలియపరుస్తుంది. స్వయంప్రకాశమైన ధర్మభూతజ్ఞానంతో కూడిన ఆత్మ జ్ఞాతృత్వకర్తృత్వాలు కలిగి ఉంటుంది అని నిష్కర్షించారు శ్రీభాష్యకారులు.

అద్వైతులు చెప్పినట్లు వేదాంత వాక్యార్థ జ్ఞానం మాత్రం - కేవలం పద పదార్థ జ్ఞానం - జ్ఞానం కాదు. దాని వల్ల అవిద్యతొలగదు. మోక్షంకలుగదు.

"ఓ మిత్యాత్మానం ధ్యాయథ" అన్నట్లు బ్రహ్మజ్ఞానం అంటే ఉపాసన, ధ్యానం అని చెప్పబడే భక్తియే మోక్షసాధనం. కాబట్టి శ్రుతులు పరబ్రహ్మ రూపాన్ని 'నిర్విశేషచిన్మాత్రం'గా ప్రతిపాదించడం లేదు. జగదేక కారణుడూ, సర్వాంతర్యామి, సర్వనియామకుడూ, నిఖిలహేయగుణరహితుడూ, అనంత కల్యాణ గుణ గణ పరిపూర్ణుడూ, చిదచిద్విశిష్టుడూ అయిన సవిశేష పరబ్రహ్మ-శ్రియః పతినే ప్రతిపాదిస్తున్నందు వల్ల, "తస్యధీరాః పరిజానం తియోనిమ్" అన్నట్లు దేవతాంతర ప్రావణ్యం లేకుండా, ఆ సర్వశేషినే సర్వదా దృఢమైన భక్తితో భజించాలి' అని భగవద్రామానుజుల శ్రీసూక్తులు ఐకాంత్యభక్తిని కలిగించడమందే Surety - ప్రాతినిధ్యం వహిస్తున్నాయి.

తన జీవితాన్ని భగవద్గుణానుభవానికి అర్పించి, అనల్పమైన భగవదనుగ్రహాన్ని పొందడం పరివృత్త్యలంకార లక్షణం. శిఖరిణీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తదుక్తీనాం దేవతాంతర ప్రావణ్య నిరసనేన భగవదైకాంత్య జనకత్వం వదతి, హతావద్యేఇతి శునాసీరః - ఇంద్రః. "వృద్ధశ్రవా స్సునాసీరః" ఇత్యమరః. స్కందః- కుమారః, ద్రుహిణః-వేధాః, హరః - రుద్రః హేరంబః - గజాననః, హుతభుక్ - అగ్నిః, ప్రభేశః - సూర్యః, తేషప్రణతి పరిహారస్య - ప్రావణ్య పరిహారస్య, ప్రతిభువః - లగ్నకాః, "స్యుర్లగ్నకాః ప్రతిభువః" ఇత్యమరః. తన్నివర్తకత్వాదితి భావః. దేవతాంతర ప్రావణ్యస్య భగవదైకాంత్య భంజక త్వాదితిభావః. అనన్య దేవతాభక్తాః నాన్యం దేవం నమస్కుర్యాదిత్యాదీని ద్రష్టవ్యాని. యతిభూభృత్ ఫణితయః. హతావద్యే - అఖిలహేయప్రత్యనీకే, హృద్యే - కల్యాణ గుణాకరే, హరిచరణ పంకేరుహాయుగే కిమప్యైకాంత్యం- అత్యంతాలభ్యం, అత్యంత పారతంత్ర్యం, నిబధ్నంతి - జనయంతి.

54. యథా భూత స్వార్థా యతినృపతి సూక్తి ర్వి జయతే
సుధా సందోహాబ్ధి స్సుచరిత విపక్తిః శ్రుతి మతామ్ ।
కథా దృప్య త్కౌతస్కుత కలహ కోలాహల హత
త్రివేదీ నిర్వేద ప్రశమన వినోద ప్రణయినీ ॥

**అర్థం** : యథా భూత స్వ+అర్థా = ఉన్నదున్నట్లుగా తన అర్థాలు గల్గిన; సుధా సందోహ+అబ్ధిః = అమృత పుంజానికి సముద్రంలాంటి; శ్రుతి మతాం = వైదికులకు; సుచరిత విపక్తిః = సుకృత ఫలంవంటి; కథా దృప్యత్-ప్రణయినీ। కథా = వాదంచేత; దృప్యత్ = గర్విస్తున్న; కౌతస్కుత = 'కుతః, కుతః' అని వాదించే ప్రత్యర్థుల యొక్క; కలహ = కలహరూపమైన; కోలాహల = కోలాహలం చేత; హత = కొట్టబడిన; త్రివేదీ నిర్వేద = వేదాల వ్యసనాన్ని; ప్రశమన = పోగొట్టడమనే; వినోద = లీలయందు; ప్రణయనీ=ఆదరం కలిగిన; యతిరాజసూక్తిః = యతిరాజ సూక్తి; విజయతే = సర్వోత్కర్షంగా వర్తిస్తున్నది.

**తాత్పర్యము** : యతిరాజ సూక్తి ఉన్నదున్నట్లు తనచే ప్రతిపాదింపబడిన అర్థాలు కలది. అమృత సమూహానికి సముద్రం వంటిది, వేదప్రామాణ్యాన్ని ఒప్పుకొనే వైదికులకు పరిపక్వమైన సుకృతంలాంటిది, వాదగర్విష్ఠులైన ప్రతిపక్షుల కలహరూపకోలాహలంచే కొట్టబడిన వేదత్రయం యొక్క వ్యసనాన్ని శమింపజేసే లీలయందు ఆదరం కలదై సర్వోత్కృష్టంగా శోభిస్తున్నది.

**వ్యాఖ్య** : యతిరాజ శ్రీసూక్తి వేదత్రయ వ్యసనాన్ని శమింపజేస్తుందని సుశ్లోకితం.

"శోభతే లక్ష్మణోక్తిః" అని 30వ శ్లోకంలోనూ చెప్పబడింది. ఇక్కడ విజయతే యతిరాజనృపతి సూక్తిః" అని యతిరాజసూక్తి వైభవాన్ని కీర్తిస్తున్నారు దేశికులు. విశేషం అంటే భేదం గమనీయం. యతిరాజ సూక్తులు అర్థం చేసుకోరానంత కష్టతరమైనవి కావు.

**1. యథాభూతస్వార్థా:-** శ్రీ భాష్యకారుల సూక్తులు తమ అర్థాలను ఉన్నవి ఉన్నట్లుగా తెలియజేస్తాయి. వాటి భావాలను బాగా వివరించే అవసరం లేకుండా సులభంగా, సుగమంగా ఉన్నాయి. భావగాంభీర్యం కలిగియున్న రచనా సౌందర్యం గల సూక్తులని విశదీకరించారు దేశికులు.

**2. సుధా సందోహోబ్ధిః–** శ్రీ భాష్యాదిగ్రంథ పంక్తులు అమృత సముద్రం లాంటివి. అమృతం లాగా ఆస్వాదించడానికి భోగ్యమైనవి. అనుభవించిన వారికి చైతన్యాన్ని కలిగించే సామర్థ్యం కలవి.

**3. శ్రుతి మతాం సుచరిత విపక్తిః–** వేద వాక్యాలను ప్రమాణాలుగా చూపి సమర్థించే శ్రీ భగవద్రామానుజ సూక్తులు వైదికులకు వారు నోచిన నోముల ఫలంవంటివి. శ్రమపడి వేదాలను అభ్యసించినవారు శ్రుతిమంతులు. యతిరాజసూక్తులు శబ్ద ప్రమాణాన్ని అంటే వేద వాక్యాలను ప్రమాణంగా చూపడంవల్ల, వేదవిద్వాంసులకు యథార్థం తెలిసి, వారిని ఉజ్జీవింపజేస్తున్నాయని సారార్థం. శబ్ద ప్రమాణాన్ని ఆప్తవాక్యమంటారు.

**4. కథా – ప్రణయినీ :** 'త్రివేది' అంటే వేదత్రయం. వేదాలలో భేదశ్రుతులు, అభేదశ్రుతులు, ఘటక శ్రుతులు అని మూడు విధాలైన శ్రుతులు ఉన్నాయి. వీటిలో ద్వైతులు భేదశ్రుతులను 'ముఖ్యం'గా ఒప్పుకొని, అభేద శ్రుతులను 'గౌణం' అన్నారు. అద్వైతులు అభేదశ్రుతులను మాత్రం ముఖ్యంగా అంగీకరించి, భేదశ్రుతులు ముఖ్యమైనవికావు అన్నారు. భేదశ్రుతులు వ్యావహారిక భేదాన్ని తప్ప, వాస్తవమైన భేదాన్ని చెప్పడం లేదని వాదిస్తుంటారు. ఇలాగా తమ వాదమే నిర్దుష్టమైనదని వారు గర్విస్తుంటారు. వారి వాదకలహ కోలాహలం చేత భేదాభేద ఘటకశ్రుతులనబడే 'త్రివేది' తనకు ముఖ్యార్థాన్ని చెప్పడం లేదని వ్యసనాన్ని – దుఃఖాన్ని పొందింది. శ్రీ భాష్యకారులు ఆ మూడు విధాలైన శ్రుతులను సమన్వయంచేసి ముఖ్యార్థాన్ని బోధించడం వల్ల, వారి శ్రీసూక్తులు 'త్రివేది'కి కలిగిన బాధను – వ్యసనాన్ని తొలగించాయి. త్రివేదీ నిర్వేదాన్ని శమింపజేసేలీలయందు ఎంతో ఆదరాతిశయంకలవి యతిరాజ సూక్తులు.

'సూక్తి' స్త్రీ లింగంకదా! రావణుని పరుష వాక్కులకు మానసికంగా గాయపడిన సీతాదేవిని ఓదార్చి, ఆమె బాధను తొలగించిన త్రిజట, సరమలాగా, దుర్వాదుల కలహ కోలాహలంచేత కలిగిన 'త్రివేది' యొక్క బాధను తొలగించడంలో యతిరాజసూక్తి అధికోల్లాసాన్ని పొందింది.

శ్రీ వేదాన్తదేశికులకు యతిరాజసూక్తులపై రుచిరమైన అధ్యవసాయం ఉంది. జీవాత్మలకు పరమాత్మకు పరస్పరం భేదాన్ని బోధించే శ్రుతులు భేదశ్రుతులని వ్యవహారం. ద్వైతం అంటే భేదం.

1. **పృథ గాత్మానం ప్రేరితారంచమత్వా**
**జుష్టస్తత స్తేనా మృతత్వమేతి** (శ్వేతా శ్వతరోపనిషత్)

కర్మానుగుణంగా ప్రేరితుడైన జీవుడూ, ప్రేరకుడైన భగవానుడూ వేరు వేరు, అనే అధ్యవసాయంతో కూడియున్నవాడు మోక్షాన్నిపొందుతాడు.

**నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానాం**
**ఏకో బహూనాం యో విదధాతికామాన్** (కఠోపనిషత్)

నిత్యులూ, అనేకులూ అయిన జీవులకు నిత్యుడూ, చేతనుడూ అయిన ఏకైక పరమాత్మ (జీవులు) కోరే వాటిని కలుగజేస్తున్నాడు.

2. జీవాత్మకూ, పరమాత్మకూ భేదం లేదు–అనేవి అభేదశ్రుతులు. "తత్త్వమసి" (ఛాం) త్వం = నీవు; తత్ = ఆ పరబ్రహ్మావై; అసి = ఉన్నావు. "నేహ నానాఽస్తికించన". (బృహదా) ఇహ = ఇక్కడ, (ఈ బ్రహ్మయందు) నానా = భేదం; కించన = ఒక్కటికూడా; నాస్తి = లేదు.

జీవుడు తనను బ్రహ్మకంటె వేరైనవాడనని భ్రమించడమే సంసారం. తత్త్వమసీ త్యాది మహావాక్యాలచే బోధింపబడే జీవబ్రహ్మలకైక్య - అద్వైత - భావనతో ఆ భ్రమ తొలగిపోయి, అఖండ, అద్వితీయ సచ్చిదానంద స్వరూప సాక్షాత్కారాన్ని పొందడమే మోక్షం. వేదాంతులలో అద్వైతులకు బ్రహ్మైక్యమే పరమపురుషార్థం.

ఇలాగా, జగద్బ్రహ్మలకూ, జీవేశ్వరులకూ భేదాభేదాలను బోధించే శ్రుతులు కూడా విరుద్ధంగా భాసిస్తున్నాయి.

"సర్వంఖల్విదం బ్రహ్మ"- "తజ్జలానితి శాన్త ఉపాసీత" (ఛాం) అనే శ్రుతి వాక్యాలు "ఈ చరాచరజగత్తంతా పరబ్రహ్మ నుంచి పుట్టి, ఆయనచే నిలిచి, ఆయన చేతనే లయ మవుతున్నది. కాబట్టి, ఇదంతా బ్రహ్మాత్మకమే అని

భావించడం శాంతిహేతువవుతున్నది" - అని బోధిస్తున్నాయి. బ్రహ్మాత్మ కానుసంధానం శాంతి హేతువని చెప్పడం వల్ల భేదాభేద విరోధం పరిహరింప బడుతున్నది కదా!

భగవద్రామానుజులవారు ఘటకశ్రుతివాక్య ప్రమాణాలచేత భేదశ్రుతులనూ, అభేదశ్రుతులనూ సమన్వయ పరచారు. 'ఘటక' మంటే కనిపించే విరోధులను పరిహరించి, సమన్వయ మార్గాన్ని చూపే శ్రుతివాక్యం.

"య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽంతరోయ మాత్మానవేద, యస్యా త్మా శరీరమ్" (బృహదా). పరమాత్మకు చేతనా చేతనాలు శరీరాలు. ఈ శరీరాత్మ భావాన్ని అంతర్యామిబ్రాహ్మణం వివరిస్తున్నది. "పరబ్రహ్మ (జడ వస్తువునందు వలె) జీవుని యందు అంతరాత్మగా ఉన్నాడు. అంతర్యామిగా ఉండి జీవునికి ప్రవృత్తి నివృత్త్యాదులను కలిగిస్తున్నాడు. అట్లున్నప్పటికీ, ఈ జీవాత్మ తనలో ఉన్న పరమాత్మను తెలుసుకోలేడు. జీవాత్మ పరవాత్మకు శరీరం. జీవాత్మకు ఆ పరబ్రహ్మయే ఆత్మ" అని ఈ శ్రుతి వాక్యానికి అర్థం.

'తత్త్వమసి' వాక్యాన్ని సామానాధికరణ్య లక్షణంతో సమన్వయించారు శ్రీభాష్యకారులు. "తత్, త్వం" ఈ రెండు పదాలు సర్వనామాలే కదా! సర్వనామం పూర్వం ప్రక్రాంతమైనదాన్ని పరామర్శించి బోధిస్తుంది. కాబట్టి, దీనికంటె ముందు "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" భగవానుడు తాను 'అనేకంగా అవుతాను' అని సృష్టిసంకల్పం చేశాడనే వాక్యమున్నది. అందువల్ల "తత్" పదానికి జగత్తు యొక్క సృష్టి స్థితి సంహారాలను చేయగల ఆ పరమాత్ముడని అర్థం. 'త్వం' అనే పదానికి కూడా ప్రాకృత శరీరంలో ఉన్నజీవాత్మలో ఉన్నట్టి పరమాత్ముడని అర్థం.

సర్వజ్ఞత్వాది గుణ విశిష్టబ్రహ్మ, అచిచ్ఛరీరక జీవశరీరకత్వ విశిష్టబ్రహ్మ ఒక్కడే. కాబట్టి శరీరానికి కలిగిన అవస్థ శరీరి – ఆత్మ వరకు పర్యవసిస్తుంది. శరీరం బలిస్తే "స్థూలోఽహమ్" – అనడమూ, చిక్కిపోతే "కృశోఽహమ్" అనడమూ జీవులకు పరిపాటి. ఈ రీతిగా శరీరాత్మలకు పర్యవసానవృత్తి చేత ఐక్యం సంభవిస్తుంది. ఇదే విశిష్టమైన అద్వైతం. 'విశిష్ట' మనే పదానికి కూడియుండడమని అర్థం. ఈశ్వరుడు చిదచిత్తులనే విశేషణాలతో విశిష్టుడై

ఉన్నాడని అర్థమున్న పదమే "విశిష్టాద్వైతమ్". అభేదమున్నచోట శరీర శరీరి సంబంధమూ, భేదమున్నచోట చిదచిదీశ్వర తత్త్వాలు మూడు, వేర్వేరుగా గ్రహించి, చెప్పబడినందువల్ల సమన్వయం సమంజసమైనదనీ, ఇదే వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థమనీ విద్వల్లోకం ప్రశంసిస్తున్నది.

కాబట్టి, త్రివేదీ నిర్వేదాన్ని యతిరాజ శ్రీ సూక్తి శమింపజేసిందని దేశికులవారు ప్రశంసించారు. రూపకాలంకారం. శిఖరిణీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తత్సూక్తేః వైదిక జన సుకృత ఫలత్వం వక్తి, యథా భూతేతి. కథేత్యాది. కథాయాం – వాదే, దృప్యంతః – గర్విత చిత్తాః కౌతస్కుతాః – కుతః కుత ఇతివా దినః, యౌక్తికాః, తేషాంకలహాః – అనోన్యోక్తి భంజకః, తదర్థః కోలాహలః – సంభ్రమః, బాహ్యాకుయుక్తి జల్పనం, తేన, హతాయాః – కస్మింశ్చిదర్థే నిష్ప్రమాణతయా నిష్ప్రమాణీ భవత్యాః, త్రివేద్యాః – వేదత్రయస్య, నిర్వేదస్య – దుఃఖస్య, ప్రశమనవినోదే – ప్రశమన రూపే అనాయాస వ్యాపారే. ప్రణయినీ – ఆదరయుక్తా; యథాభూతస్వార్థా – యథార్థతర స్వార్థా. సుధాసందోహాబ్ధిః. అమృత సముద్రమయీ; శ్రుతిమతాం– వైదికానాం, సుచరిత విపక్తిః – సుకృత ఫలభూతా. శ్రుతిప్రామాణ్యస్థాపకత్వాత్ వైదిక సుకృత ఫలభూతా, యతీశ్వర భారతీ విజయతే. సర్వోత్కర్షేణ వర్తతే.

**55. శ్రుతిశ్రేణీ చూడాపద బహుమతే లక్ష్మణమతే**
**స్వపక్షస్థాన్ దోషాన్ వితథమతి రారోపయతియః।**
**స్వహస్తేనో త్క్షిప్తైః స ఖలు నిజగాత్రేషుబహుళం**
**గళద్భిర్ఘం బాలై ర్గగన తల మాలింపతి జడః ॥**

**అర్థం :** వితథమతిః = వ్యర్థమైన బుద్ధిగల; యః=ఎవడైతే; స్వపక్షస్థాన్= తన పక్షమందున్న; దోషాన్ = దోషాలను; శ్రుతిశ్రేణీ, చూడాపద, బహుమతే= వేదరాశి యొక్క, శిరఃస్థానమైన ఉపనిషత్తుల చేత, ఆదరింపబడిన; లక్ష్మణమతే= రామానుజమతమందు; ఆరోపయతి = ఆరోపిస్తున్నాడో; సః = ఆ, జడః = మూర్ఖుడు; స్వహస్తేన =తన చేతితో; ఉత్+క్షిప్తైః = పైకి ఎగురవేయబడినట్టిది

కనుకనే; నిజగాత్రేషు = తన శరీరావయవాలయందు; బహుళం = అధికంగా; గళద్భిః = రాలిపడుతున్నట్టి; జంబాలైః = బురదచేత; గగనతలం = ఆకాశాన్ని; ఆలింపతి = పూస్తున్నాడు. ఖలు = కదా!

**తాత్పర్యము** : బుద్ధి హీనుడెవడైతే తన మతమందలి దోషాలను ఉపనిషత్తులచే ఆదరింపబడే (యతిరాజ) రామానుజ మతమందు ఆరోపిస్తున్నాడో, ఆ మూర్ఖుడు తన చేతితో బురదను ఆకాశానికి పూయడం కోసం పైకి ఎగురవేస్తే, ఆ బురద తన శరీరమందే అధికంగాపడి మురికివాడవు తున్నాడు కదా!

**వ్యాఖ్య** : రామానుజ యతిరాజ మతం ఆకాశంలాగా నిర్మలమైనదని వర్ణితం.

"బోధాయన, టంక, ద్రమిడ, గుహదేవ, కపర్ది, బారుచి ప్రభృత్య విగీత శిష్టపరిగృహీత పురాతన వేద వేదాన్త వ్యాఖ్యాన సువ్యక్తార్థ శ్రుతి నికర దర్శితోఽ యం పంథాః" – బోధాయన ఋష్యాదులచేతనూ, ద్రమిడాది పూర్వాచార్యుల చేతనూ వ్యక్తపరచిన మార్గమే ఇది; అని రామానుజులవారు. 'వేదార్థ సంగ్రహ' మనే గ్రంథములో విశదీకరించారు. "ప్రపంచితస్యాయమర్థో వేదార్థ సంగ్రహే" అనే శ్రీభాష్యోక్తివల్ల, వేదార్థ సంగ్రహానంతరమే శ్రీభాష్య రచనమైనట్లు స్పష్టమవుతున్నది. శ్రీభాష్యం తర్వాత "వేదాంత దీపం" అనే గ్రంథాన్ని రామానుజులు రచించారని "భాష్యోదితోఽ ధికరణార్థ సంగ్రహః" అనే వేదాంత దీపోక్తి చేత తెలుస్తున్నది. దీని తర్వాతనే 'గీతా భాష్యం' రచింపబడింది. ఆ తర్వాత 'నిత్యగ్రంథం' (దీనిలో గీతాభాష్యచ్ఛాయను అనుసరించిన వాక్యాలు కనబడుతున్నందువల్ల) రచింపబడిందని విజ్ఞుల మాట. శ్రీరంగంలో శ్రీతాయార్ల సన్నిధిలో శ్రీ రంగనాథుని తిరుక్కల్యాణోత్సవం జరిగిన వెంటనే – ఆ కల్యాణ మంటపంలోనే "గద్యత్రయం" విరచితమైనట్లు ప్రతీతి.

కాబట్టి 'విశిష్టాద్వైతమతం' శ్రుతిస్మృతీతిహాసాది సకల ప్రమాణ ప్రసిద్ధమయినది.

శ్రుతి స్మృతులందు భేదాభేదాలను గూర్చి, సగుణ నిర్గుణాలను గూర్చి సంశయం కలిగే అవకాశం లేకపోలేదు. ఈ స్థితిని బట్టి కొందరు సగుణమనీ, కొందరు నిర్గుణమనీ, వారి వారికి అనుకూలించే కొన్ని ప్రమాణాలతో నిరూపిస్తూ వచ్చారు. నిర్గుణ వాదులకు సగుణశ్రుతులూ, సగుణవాదులకు నిర్గుణశ్రుతులూ బాధకాలుగా ఉండని (బాధక శ్రుతులకు) ఇతర శ్రుతులచే బాధ్యత్వం చెప్పడం అవశ్యకమయింది.

శాస్త్రకారులు రెండు ప్రమాణాలకు పరస్పర విరోధం కల్గితే, వాటిలో ఏది సావకాశమైనదో (ఏది మరొక విధంగా సమాధానం చెప్పుకోవడానికి అవకాశమిస్తుందో) ఆ (సావకాశ) ప్రమాణం బాధింపబడదగినదనీ; ఏది నిరవకాశమో (మరొక రీతిగా సమాధానం చెప్పుకోవడానికి అవకాశమీయదో) ఆ ప్రమాణం బాధిస్తుందనీ నిర్ణయించారు. అంటే, నిరవకాశప్రమాణం సావకాశ ప్రమాణాన్ని బాధిస్తుంది.

"నిర్గుణం, నిరంజనం" – గుణాలులేనిది, అవయవాలు లేనిది బ్రహ్మమని ఈ శ్రుత్యర్థం. ఇది సావకాశప్రమాణ వాక్యం. ప్రకృతితో సంబంధించిన హేయగుణాలు మాత్రం లేనిదని సమాధానం చెప్పడానికి అవకాశమిస్తున్నది కదా! (ఇది నిర్గుణశ్రుతి).

"జ్ఞా జ్ఞౌ ద్వా వజా వీశనీశౌ" (శ్వే) సర్వజ్ఞుడు ఈశ్వరుడు, అజ్ఞుడు అనీశ్వరుడు (పరతంత్రుడు) అనే ఇద్దరూ పుట్టకలేని వారు – అని శ్రుత్యర్థం. ఇంక " ఏష ఆత్మా అపహతపాప్మావిజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽ పిపాసుః, సత్యకామః సత్యసంకల్పః" (ఛాం). ఈ బ్రహ్మం పాపరహితుడూ, ముదిమి, మరణం, దుఃఖం, ఆకలి, దప్పికలూ లేనివాడు. సత్యకాముడు, సత్య సంకల్పుడు, అనిశ్రుత్యర్థం. ఇది నిరవకాశ ప్రమాణం. ఇది సగుణశ్రుతి. ఒకే వాక్యంలో జ్ఞాన స్వరూపుడైన పరబ్రహ్మకు దుర్గుణాలు లేవనీ, జ్ఞాతృత్వాది కల్యాణగుణాలు సహజంగా ఉన్నాయని బోధింపబడుతుంది కదా!

ఇలాగా శ్రుతుల యందలి పరస్పర విరోధాభాసాలను చక్కని న్యాయ సమ్మతమైన, సంప్రదాయసిద్ధమైన పద్ధతిచే రామానుజయతిరాజులు పరిహరించడం వల్ల శ్రుత్యాది సమన్వయ వైశిష్ట్యం వారికే వర్తించింది.

ఇట్టి వేదాంతశాస్త్రాన్ని అనుసరించి ఉన్న రామానుజమతమందు దోషాన్ని ఆరోపించేవాడు నిజంగా వితథమతి కలవాడేకదా! "వితథం త్వనృతం వచః" (అమరం) అబద్ధీకుడని అర్థం. అంతేకాదు జడుడుకూడా. అంటే తెలివి లేనివాడనే కదా! "అనంతావై వేదాః". వేదాలు అనంతమైనవి.

శ్రుతిశ్రేణికి అంటే వేదరాశికి, చూడాపదం అంటే శిరోభాగం వేదాంతం. వేదాన్త ప్రతిపాదితమైన రామానుజ మతమందు దోషారోపణచేస్తే, ఆ దోషం ఆ మతానికి తగులక, తన పక్షానికే - మతానికే తగులుతుంది. నిర్మలమైన ఆకాశాన్ని మలినం చేయడానికి చేతితో బురదను తీసి మీదికి విసరితే, ఆ బురద ఆకాశానికి తగులక, విసరివేసిన మూర్ఖుని శరీరం మీదనే పడుతుందికదా! వేదాంతాను మోదితమైన రామానుజమతానికి దోషాన్ని ఆరోపించేవాడూ, ఆకాశాన్ని మాలిన్యపరచడానికి బురదజల్లేవాడూ జ్ఞానహీనులే కదా! దృష్టాంతాలంకారం. శిఖరిణీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తన్మతే దోషారోపయి తౄణాంతద్దోషస్య తన్మతా స్పర్శనే నారోపయితృగామిత్వమేవేత్యాహ, శ్రుతీతి. యః, వితథమతిః - వ్యర్థబుద్ధి; శ్రుతిశ్రేణీ చూడాపద బహుమతే - శ్రుతిశ్రేణీనాం - వేదజాతానాం, చూడాపదైః - శిరోభిః వేదాంతైః, బహుమతే - ఆదృతే; సర్వవేదాంతైక రస్యాపాదకే; లక్ష్మణమతే - యతీంద్రమతే; స్వపక్షస్థాన్ దోషాన్ - ప్రమాణ తర్కవిరోధాదీన్, ఆరోపయతి - అవిద్యమానానేవ వదతి, ఆరోపస్యా విద్యమాన వచనత్వాదితి భావః. స్వహస్తే నోక్షిప్తైః - ఉపరిక్షిప్తైః - నిజగాత్రేషు - స్వదేహేషు, బహుళం, గళద్భిః - పతద్భిః, స్వమాలిన్యమేవ వహద్భిః, జంబాలైః - పంకైః; గగనతలం - ఆకాశం, ఆలింపతి - మలినీ కరోతి, ఆకాశమాలిన్యా పదానార్థం స్వహస్తేన గగనతలే పంకే క్షిప్తేసతి న సతస్మిన్న సక్త స్సన్ స్వస్మిన్ ఏవ పతతి, తద్వత్ నిర్దోషేయతీంద్రమతే దోషారోపణ దోషః స్వస్మిన్నేవ పతతీత్యర్థః.

**వ్యాఖ్యానాంతరం :** శ్రుతిశ్రేణీతి - శ్రుతిశ్రేణ్యాః చూడాపదాని - ఉపనిషదః. తత్రబహుమతే - పూజితే, లక్ష్మణమతే. స్వపక్షే దృష్టాన్ దోషాన్, వితథమతిః - వేదాన్త మతస్య దూషితత్వాభావాత్ వ్యర్థమతిః - యః-కశ్చి ద్వాదీ, ఆరోపయతి- ఆరోప్య దూషయితుమిచ్ఛతి, సః-జడః, స్వహస్తేన

ఉత్క్షిప్తైః, నిజగాత్రేషు – నిజ పక్షేష్వితి గమ్యతే. బహుళ మాపతద్భిః, జంబాలైః – పంకైః, గగన తలం – స్వతః నిర్మలం, ఆలింపతిఖలు – ఆలేప్తుమిచ్ఛతి. నచ తత్కార్యకరం భవతి, కింతు స్వోపర్యేవ పతతీత్యర్థః.

**టిప్పణీ :** చూడా – శిరోభూషణమ్. తత్పదం శిరః. శ్రుతి శ్రేణీ శిరోభిరుపనిషద్భిః, బహుమతే. యద్వా, శ్రుతిశ్రేణీ చూడేతి పదేన – బిరుదేన, బహుమతే, లక్ష్మణమతే. స్వహస్తేనేతి. యది కశ్చిత్ స్వహస్తేన పంక పిండానాదాయ గగనం లింపేత్, స పంకః తద్గాత్రే ఏవ గళేత్. నతుగగనే నిర్మలే స్యాత్. తదా పరైరుద్భావ్యమానాః దోషాః పరపక్షేష్వేవ పతంతి.

**56. నిరాలోకే లోకే నిరుపధి పరస్నేహ భరితో**
**యతిక్ష్మా భృద్దీపో యది నకిల జాజ్వల్యత ఇహ।**
**అహంకారధ్వాంతం విజహతి కథంకార మనఘాః**
**కు తర్క వ్యాళౌఘం కుమతి మత పాతాళ కుహరమ్॥**

**అర్థం :** నిరాలోకే = ప్రకాశంలేని; ఇహ = ఈ, లోకే = లోకమందు; నిరుపధి, పర, స్నేహ, భరితః = వేరే ప్రయోజనంలేని, భగవంతుని యందలి ప్రేమతో నిండియున్న । ప్రయోజనాంతర రహితమైన ఇతరుల యందు ఉండే స్నేహమనే నూనెతో నిండియున్న; యతి క్ష్మాభృత్ + దీపః = యతిరాజు అనే దీపం; యది, న, జాజ్వల్యతే, కిల = బాగా వెలుకగపోతే; అహంకార ధ్వాంతం = అహంకారం అనే చీకటి గల; కుతర్క వ్యాళ+ఓఘం = కుతర్క మనే సర్పసమూహం గల; కుమతి మత పాతాళ కుహరం = కుదృష్టుల మతమనే పాతాళం మధ్యను; అనఘాః = దుష్టులుకాని వారు; కథంకారం= ఎట్లు; విజహతి = విడుస్తారు?

**తాత్పర్యము :** జ్ఞాన ప్రకాశం లేని ఈ భూలోకమందు అనన్య ప్రయోజనమైన భగవత్ప్రేమ అనే నూనెతో నిండిన, ఇతరులయందు నిరుపాధికమైన స్నేహమనే నూనెతో నిండియున్న యతిరాజు అనే దీపం ప్రజ్వలించకుంటే, అహంకారమనే చీకటికలిగి, కుతర్కాలనే సర్పసముదాయాలతో

కూడియున్న కుమతుల మతమనే పాతాళంలో పాపరహితులు కూడా పడి బాధలను అనుభవించే వారు కదా!

**వ్యాఖ్య :** శ్రీమద్రామానుజులు అవతరించినందువల్ల లోకులు యథార్థ జ్ఞానవంతులై ఉజ్జీవిస్తున్నారనే భావాన్ని వ్యతిరేకాన్వయ పద్ధతిలో ప్రకటిస్తున్న శ్లోకమిది.

లోకంలో అజ్ఞానం అనే చీకటి ఆవరించింది. ప్రజలు వెలుగులేకుండా తమ జీవన మార్గాన్నీ చూచుకోలేని స్థితి ఏర్పడింది. చీకట్లో ఏదో ఒకదారిలో పోతే, ఆ దారి వారిని అగాధమైనగోతిలో పడవేయడం నైసర్గికమే కదా! ప్రమిత, నూనె, వత్తి మూడింటితో వెలిగే దీపం ఉంటే జనత గమ్యం చేరుతుంది. యథార్థమైన వస్తు స్వరూపం తెల్పడానికి భగదాజ్ఞచే శ్రీమద్రామానుజులు అవతరించారు.

రామానుజయతిరాజు స్వయంగా దీపమే.

**నిరాలోకే:** వెలుతురు లేని ఈ లోకంలో తత్త్వం, హితం, పురుషార్థం అనే మూడింటితో కూడిన జ్ఞాన మనే ప్రకాశంగల తేజోద్రవ్యం దీపం. జ్ఞాన ద్రవ్యం కంటికి గోచరించేది కాదు. చెవ్వ అనే ఇంద్రియానికే గోచరిస్తుంది.

"శ్రోత్రం దైవం. శ్రోత్రేణ హితద్విందతే" అని శ్రుతి యతిరాజు వేదాంత దీపమే. దీపానికి నిండుగా నూనె ఉంటే బాగా కాంతి రూపంతో వెలుగుతుంది. 'స్నేహం' అంటే నూనె (నెయ్యి) ప్రేమ, మైత్రి అనే అర్థాలున్నాయి.

యతిరాజు అనే దీపం పరస్నేహం – భగవత్ప్రేమ – చేత ప్రకాశిస్తుంది. తాను గాక తక్కినదంతా పరశబ్ద వాచ్యమేకదా! కాబట్టి 'పరుడు' అంటే ఇతరుడు. భగవానుడు అని అర్థం. పరహితచింతనమే ప్రయోజనం కాని ప్రేమకు వేరే ప్రయోజనమే లేనందువల్ల 'పరస్నేహం' నిరుపధి అనబడింది. భగవానుని యందు ఎట్లున్నదో, యతిరాజులకు పరుల యందు కూడా అట్లే నిరుపాధికమైన ప్రేమ ఉన్నది. పరస్నేహ భరితమైనది ఈ యతిరాజ దీపం.

ఇతర జనులయందు ప్రీతికలదని చెబుతుంటే, ఇక స్వీయ అంటే తన నాశ్రయించిన జనుల యందు కలప్రేమ చెప్పనక్కర్లేదు కదా! అది కింపునర్న్యా సిద్ధమే.

**పరస్నేహ భరితమైన దీపం :** యతిరాజులు మానవులు యందూ, మాధవుని యందూ పూర్ణప్రేమకలవారు కాబట్టి వారిది పరస్నేహం – శ్రేష్టమైన ప్రేమ. Supreme love. దానిచే పలుదెసల వెలుతురును ఇచ్చే దీపం.

'క్ష్మాభృత్' అంటే పర్వతం, రాజు అని కూడా అర్థం. కాబట్టి కొండ మీద దీపం తనకాంతిని దూర దూరప్రదేశాలకు ప్రసరింపజేసి, వాటిని ప్రకాశింప జేస్తుందని అభివ్యక్తం. యతిక్షాభృద్దీపం బాగా ప్రకాశించకుండా ఉంటే, అనఘులైన – స్వయంగా ఏ దోషమూలేని – స్త్రీలకూ, పురుషులకూ, ప్రాణాపాయం కలిగే, అగాధమైన గోతుల్లో పడే ప్రమాదం తొలగే అవకాశం లేకపోయేది.

**కుమతిమత పాతాళ కుహరమ్ :** అగాథమైన గోతుల్లో ముఖ్యమైనదే కుదృష్టుల శుద్ధాద్వైత సిద్ధాంతం. శ్రుతులకు అపార్థాలను బోధించే ఆ, కుమతుల సిద్ధాంతమే ఆత్మలను అధోలోకమైన పాతాళంలో పడద్రోసేది. పాతాళకుహరం కటికచీకటితో కూడియున్నది. అహంకార ధ్వాంతం. "అహంబ్రహ్మాస్మి" – నేను పరబ్రహ్మనే. 'సోహం' అనే ప్రాముఖ్యం కలది. ఆ బ్రహ్మను నేనే, అనే అర్థం కలది.

'అహం' అంటే అవిద్యావిచ్ఛిన్నమైన జీవుడు అనివాచ్యార్థం. అవిద్య అనే ఉపాధిని వదలి అందున్న చైతన్యం మాత్రం లక్ష్యార్థం. 'సః' అంటే మాయా విచ్ఛిన్న చైతన్యమైన ఈశ్వరుడు ముఖ్యార్థం. మాయను విడిచి అందున్న చైతన్యం మాత్రం లక్ష్యార్థం. ఈ రెండు పదాలయందు విశేషణాలైన వ్యావహారికోపాధులను విడువగా మిగిలే పారమార్థిక శుద్ధ చైతన్య బ్రహ్మామాత్రమే లక్ష్యమవడం వల్ల సర్వత్ర బ్రహ్మ యొక్కటే ఉన్నదని అర్థం. 'తత్త్వమసి' – ఆహంబ్రహ్మాస్మి' అనే మహావాక్యాల లక్ష్యార్థమిదే. అద్వైత సిద్ధాంతమిది.

విశిష్టాద్వైతికి 'దాసోఽహం' అంటే 'తాను సర్వేశ్వరునికి దాసుడు' అనే భావనయే సర్వదా ఉంటుంది. 'సోహం' భావనలో అహంకారం సూక్ష్మంగా గోచరిస్తుంది. అహంకారమే ధ్వాంతం - చీకటిగా రూపింపబడింది. కుమతి మత పాతాళకుహరం అహం అనే అంధకారంతో వ్యాపించి ఉన్నది. అంతేకాదు;

**కుతర్క వ్యాళౌఘం :** కుమతుల మతమనే గభీరగర్తం అంధకారబంధురమై యున్నందువల్ల కన్నులున్నవారూ, కన్నులు లేనివారూ, అందరు అందులో పడిపోవడం అజానజం.

కుతర్కాలు అంటే దుర్వాదాలు అనే ఎన్నలేని విషపన్నగాలతోనూ నిండియున్నది కదా ఆ, మత పాతాళకుహరం. అట్టిలోతైన గోతిలో అజ్ఞులూ, ప్రాజ్ఞులూ అనే భేదం లేక, పడినవారందరికీ విషసర్పాల వల్ల ప్రాణాపాయ మేర్పడుతుంది.

యతిరాజులు 38వ శ్లోకంలో కుదృష్టుల కుహనాబిలంలో పడిన పరబ్రహ్మను చేయూతనిచ్చి ఉద్ధరించారని కీర్తింపబడినారు. ఇక్కడ శ్రీభాష్యకారులు కుమతి మత పాతాళకుహరంలో పడుతున్న మానవులను తమ జ్ఞాన ప్రకాశంచేత కాపాడగలిగారని సుశ్లోకితులు.

"ఇరామానుశన్ మిక్క నాన్మ త్తైయిన్ శుడరొళియాల్" (ఇరామానుశ నూత్తందాది. 59) నిఖిల చేతనులను ఉజ్జీవింపజేయడానికి అవతరించిన రామానుజులవారు నాల్గువేదాల వాస్తవార్థప్రకాశం అనే దివ్య తేజస్సు చేత అజ్ఞాన మనే చీకటిని తొలగించారని తిరువరంగత్త ముదనార్లు కీర్తించారు. వేదాన్తదేశికులు 'యతిరాజులే బాగా ప్రకాశించే దీప' మన్నారు.

రూపకాలంకారం. శిఖరిణీ వృత్తమ్.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ యతీంద్రో దయాభావే కుమతి కుతర్క వ్యామోహన గాడాంధకారే అంధ చక్షుష్మదవిశేషేణగర్త పాతవత్ అజ్ఞ ప్రాజ్ఞా విభాగేనకు దృష్ట్యుక్త యుక్త్యాక్షోభాత్ యధార్థజ్ఞానలో పాదయః పాత ఏవావశ్యం భవే దిత్యాహ, నిరాలోక ఇతి.

నిరాలోకే – అనాద్యవిద్యామోహితత్వేన తత్త్వహిత పురుషార్థజ్ఞాన శూన్యే; ఇహలోకే నిరుపధి పరస్నేహ భరితః నిరుపాధిక భగవత్ ప్రేమ పరిపూర్ణః, భగవన్మంగళా శాసనార్థతయైవాత్మ సంరక్షక ఇతియావత్. యతిక్ష్మాభృత్ దీపః – యతిరాజదీపః, యది నకిల జాజ్వల్యతే – యది నప్రకాశతే; తదా అహంకార ధ్వాంతం – అహంకార రూపమంధకారయుక్తం; కుతర్కవ్యాళౌఘం – కుతర్క ఏ వవ్యాళాః – సర్పాః, కు తర్కాణాం వ్యాళత్వం ఆత్మసత్తానాశకత్వేన, తత్సమూహ యుక్తం; కుమతి మత పాతాళ కుహరం – కుమతిమతం – శంకరాది మతం, తదేవపాతాళ కుహరం – పాతాళమధ్యం, అనుత్తార్య మహాబిల మిత్యర్థః. కుమతి మత పాతాళ కుహరత్వం ఆత్మనాం పాతిత్యహేతునా; కథంకారం విజహతి – యతీంద్రో దయాభావేప్రాజ్ఞానా మపి కుదృష్టికృత వ్యామోహ ప్రహాణేన న సన్మత ప్రవేశః, ఇతి భావః. క్ష్మాభృత్ దీప పదాభ్యాం పర్వతస్థ దీపసమాధిశ్చ స్ఫురతి. తత్రనిరాలోకే – సూర్యాదిప్రకాశరహితే, గాఢాంధకారాయాం రాత్రౌ, ఇహలోకే నిరుపధి పరస్నేహభరితః – నిర్దోష ఘృతాది పరిపూర్ణః, క్ష్మాభృద్దీపః, బహుదేశ ప్రకాశకో భవతీత్యర్థః. యది నజా జ్వల్యతే – యదినభృశం జ్వలతి, తదా అనఘాశ్చ చక్షుష్మంతోఽపి ధ్వాంత వ్యాళ సమూహయుక్తం పాతాళ కుహరం కథం విజహతి. నత్యజంతి.

**57. యతిక్ష్మాభృ ద్దృష్టం మత మిహ నవీనం తదపికిం**
**తతః ప్రాగేవాన్య ద్వద తదపికిం వర్ణనికషే ।**
**నిశామ్యంతాం యద్వా నిజమతి తిరస్కార విగమాత్**
**నిరాతంకా ష్టంక ద్రమిడ గుహదేవ ప్రభృత యః ॥**

**అర్థం :** ఇహ = ఈ లోకమందు; యతిక్ష్మాభృత్ + దృష్ట = యతిరాజుచే చూడబడిన; మతం= సిద్ధాంతం; నవీనం = కొత్తది. తత్+ అపి, కిం = అందువల్ల ఏమి (నష్టం)? తతః = దానికంటె; అన్యత్ = వేరైనది (శంకరాదుల మతం); ప్రాక్+ ఏవ = పూర్వమే ఉన్నది. తదపి కిం = అందువల్ల ఏమి (మేలు); వద = చెప్పుము. వర్ణ నికషే = వన్నెను జూచే గీటురాయిమీద; నిశామ్యంతాం = పరీక్షింపబడుగాక. యత్+వా = పక్షాంతర మందు; టంక ద్రమిడ గుహదేవ ప్రభృతయః = టంక, ద్రమిడ, గుహదేవులు మొదలైన

పూర్వాచార్యులు; నిజమతి తిరస్కార విగమాత్ = తమ ప్రజ్ఞ యందు భ్రంశం లేనందు వల్ల; నిరాతంకాః = భయ సంశయాలు లేని వారు.

**తాత్పర్యము :** రామానుజ సిద్ధాంతం నవీనమని కొందరు ఆక్షేపిస్తుంటారు. అందువల్ల నష్టమేమీ లేదు. శంకరాదుల మతం అంతకు ముందే ఉన్నదని వారే వాదిస్తుంటారు. అందువల్ల వారి ప్రయోజనమూ సిద్ధించదు. గీటురాతి మీద గీసి పరీక్షిస్తే మంచిదేదో, చెడ్డదేదో వన్నెవాసిని బట్టి తెలుస్తుంది కదా! మరొకరకంగా చూస్తే, టంకద్రమిడ గుహదేవాది పూర్వాచార్యులు మతిభ్రంశం లేనందువల్ల భయమూ, సంశయమూలేనివారే.

**వ్యాఖ్య :** రామానుజ యతిరాజ సిద్ధాంతం ఉత్కృష్టమైనదని హేతువును ప్రదర్శించే శ్లోకం.

రామానుజ మతం అర్వాచీనమనీ, శంకరాదులమతం ప్రాచీనమనీ కొందరు వాదిస్తుంటారు. నవీనమనడం వల్ల హానిగానీ, ప్రాచీనమనడం వల్ల ప్రయోజంగానీ లేదు. పాత, కొత్తలను బట్టి మంచిచెడులను నిర్ణయించరాదు.

బంగారాన్ని గీటురాయి మీద గీచి, దాని వన్నెను పరీక్షిస్తేగానీ అది చొక్కపుబంగారమో, కేటి బంగారమో తెలియదు. అలాగే, ఒక మత సిద్ధాంతం ఉత్కృష్టమైనదా; నికృష్టమైనదా? అనే విషయాన్ని శ్రుతి స్మృతీతిహాస శాస్త్ర పురాణ వాక్య ప్రమాణాలచేత పరీక్షించి నిర్ణయించాలిగాని నవీన ప్రాచీనతలను బట్టి నిర్ణయించకూడదు. ఎవడైన నవీనమే గ్రాహ్యమని సంతోషిస్తే 'దుర్జనోతుష్యతు' – దుర్జనుడు సంతోషించుగాక – అనవలసి ఉంటుంది. ఇక్కడ కవికులగురువు కాళిదాసు చెప్పిన శ్లోకం సుసంగతం.

**పురాణ మిత్యేవ నసాధుసర్వం, నచాపికావ్యం నవమిత్యవద్యమ్**
**సంతః పరీక్ష్యాన్యతరత్ భజంతే, మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః**

(మాళవికాగ్నిమిత్రనాటకం)

పాత కావ్యమైనంత మాత్రాన సాధు కావ్యమనీ, కొత్తదైనంత మాత్రాన దోషభూయిష్ఠకావ్యమనీ నిర్ణయించరాదు. ప్రాజ్ఞులు రెండింటినీ పరీక్షించి, ఏది

మంచిదో దాన్ని గ్రహిస్తారు. స్వయంగా పరీక్షించే బుద్ధిలేని మూఢుడు ఇతరులేది చెప్పితే దాన్నే విశ్వసిస్తాడు, అని ఈ శ్లోకానికి అర్థం.

మత సిద్ధాంతాలన్నీ శ్రుతిస్మృతీత్యాది ప్రమాణాలతోనే వెలసిఉన్నాయి. బాధక ప్రమాణాలతో బాధింపబడే ప్రమాణాలు లేని మత సిద్ధాంతమే సర్వ మతసమ్మతమై ఉపాదేయమైనది కదా!

ఈ విమర్శ వల్ల రామానుజులవారు దర్శించిన సిద్ధాన్తమే ఉత్కృష్టమైనదని స్పష్టమవుతుంది.

ఇంకొక రకంగా విమర్శిస్తే, రామానుజమతం నవీనంకానే కాదు అని స్పష్టమవుతుంది. రామానుజ యతిరాజులకంటే శంకరభగవత్పాదులు పూర్వమే ఉన్నవారు. కాబట్టి ప్రాచీనత్వమే ఉత్కృష్టతకు కారణమన్నట్లైతే, శంకరాదుల మతం కంటె ప్రాచీనమైనది విశిష్టాద్వైత మతం. వేదవ్యాసభగవానుడు రచించిన బ్రహ్మసూత్రాలను అనుసరించి విశిష్టాద్వైత మత సిద్ధాంతాన్ని ప్రవర్తింపజేసిన బోధాయన, టంక, ద్రమిడ, గుహదేవాది పూర్వాచార్యులు శ్రీ శంకరాచార్యుల కంటే చాలా ప్రాచీనులు కదా! ఈ ఆచార్యులందరు సంశయ, విపర్యయ, మతి మాంద్యాదులు లేశమైన లేని బ్రాహ్మీమయమూర్తులు. "తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యాస్యంతే" అని ప్రకటించిన శ్రీ భాష్యకారులు శ్రీ వేదవ్యాస మహర్షిది విశిష్టాద్వైత మతమనియే నిర్ధారణ చేశారు. కాబట్టి, యతి రాజసిద్ధాన్త నిర్ధారణ సార్వభౌములైన శ్రీ నిగమాంత మహాదేశికులు నవీనమైన , ప్రాచీనమైన రామానుజయతిరాజమతమే సర్వోత్కృష్టమైనదని అగ్గలంగా ఉగ్గడించారు. హేత్వలంకారం. శిఖరిణీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ యతీంద్ర మతస్యాద్యతనత్వేన నూతనత్వేఽప్యుపాదేయత్వం వదతి; యతిక్ష్మాభృదితి. యతిక్ష్మాభృత్ దృష్టం మతం నవీనం, భవత్వితిశేషః. తదపికిం – తతః కాహానిః. అన్యత్ – శంకరాది మతం, ప్రాగేవ – ప్రాచీన మేవ; భవత్వితిశేషః తదపికిం – తతోఽపికో విశేష ఇత్యర్థః. వర్ణనికషే – స్వరూపశోధన ఇత్యర్థః ఉపాదేయత్వాను పాదేయత్వని రూపణ ఇతి యావత్. 'తదపికిం' ఇత్యత్రా ప్యనుషజ్యతే. నూతనత్వం పురాణత్వంచ కుత్రోపయుజ్యతే,

వద–ఆచక్ష్వ. అర్థ్యత్వా నర్థ్య త్వ ఏవ ప్రయోజక ఇతిభావః. అన్యథా బౌద్ధాది మతానాం శంకరాది మతాదిభ్యః ప్రాచీనత్వాత్ తన్మాత్రేణో పాదేయత్యే త్వే తేషామేవో పాదేయత్వం స్యాత్. నశంకరాది మతస్య, ఏతచ్ఛం కా సమాధాన తయా శ్రీ వేదాంతా చార్యైరేవ మీమాంసాపాదుకాయాం శ్లోక ఉక్తః. యథా:

"కించిత్ కేనాపి దృష్టం ప్రతిహత విషయం త్వేన తత్తేన తైస్తైః, ద్వేచోపా దాయిషాతాం ద్వితయమపి సదిత్య ప్రమత్తోనవక్తా ఇత్థం సత్యైక భక్తై రితర పరిహృతౌ నవ్యవస్థా నసిద్ధిః, ప్రత్యేతవ్యం త దర్థ్యం పటుతరమతిభిః ప్రాక్తనం నూతనంవా" ఇతి. కించిత్ – మతం, కేనాపి ప్రతిహత విషయం – బాధిత ప్రతిపాద్యం, దృష్టంత్వేన– అనన్యే కేనా పీత్యర్థః. తత్ – ప్రతిహతం; తేన – తథాత్వేన – దృష్టం ద్వేచ – ఉభేఅపిమతే; తైస్తైః – తత్తన్మతస్థైః; ఉపాదాయిషాతాం – సంగ్రహీతే అభూతామ్. అప్రమత్తః– ప్రాజ్ఞః, ద్వితయ మపి, సదితి – సమీచీనమితి; నవక్తా – న చ వదిష్యతి, ఇత్థం స తి – ఉభయ మతసాధుత్వస్యవక్తు మశ కృత్వేసతి, ఏకభక్తైః – ఏకైక మత ప్రవణైః, ఇతర పరిహృతౌ – ఇతర వర్జనే; నవ్యవస్థా నసిద్ధిః – నవ్యవస్థా పకయుక్తి సిద్ధిః . తస్మాత్, పటుతర మతిభిః – ప్రాజ్ఞైః; తదర్థ్యం – ప్రమాణానుగుణం, ఆర్థాదన పేతం; ప్రాక్తనం నూతనంవా, ప్రత్యేతవ్యం – పరిగ్రాహ్యతయా నిశ్చేతవ్య ఇత్యర్థః – ఇతి.

అన్యత్రా ప్యయమర్థః ప్రసిద్ధిః. యథా :–

"పురాణ మిత్యేవ న సాధు సర్వం, న చాపికావ్యం నవమిత్యవద్యమ్, సంతః పరీక్ష్యాన్య తర ద్భజంతే, మూఢః పరప్రత్య యనేయ బుద్ధిః" ఇతి. తస్మాత్ యతీంద్ర మతస్య నూతన త్వేప్యర్థ్యత్వా దేవో పాదేయత్వం నాన్యస్యానర్థ్యత్వా దితిభావః.

అథ పురాతన త్వమపి యతీంద్రమ తస్యైవేతి వదతి, నిశామ్యం తా మితి. నిజమత తిరస్కార విగమాత్ – నిజమతస్య నూతన త్వానర్థ్యత్వాదినా తిరస్కారా భావాత్; ని రాతంకాః – అవిశ్వ సనీయత్వ శంకారహితాః. "హృత్తాప శంకాస్వాతంక" ఇత్యమరః. ఏతన్మత ప్రవర్తకాః అన్యమత ప్రవర్తకే భ్యోఽ పి పురాతనాః. టంక ద్రమిడ గుహదేవప్రభృతయః, నిశామ్యంతాం – విలోక్యంతాం.

యతీంద్రోఽపి తదీయ భాష్యవృత్త్యాదీ నాంసంకుచితత్వ విస్తృతత్వాదిభిః దుర్గ్రహార్థత్వాత్ తదాలోచ్య సుగ్రహం భాష్యాదికం కృత్వా తన్మతమేవో పబృంహి తవా నితి భావః.

**అత్ర వ్యాఖ్యానంతరమ్ :** యతీతి. ఇహలోకే, యతిక్ష్మాభృద్ధృష్టం - యతీంద్ర వివక్షితం; మతం - సిద్ధాన్తం. నవీనం - నూతన మితిచేత్. తదపికిం - న హైన్యం ప్రాప్యత ఇత్యర్థః. అన్యత్ - అన్యమతం - తతః - యతిరాజ మతాత్, ప్రాగేవ - పురాతనమేవ. తదపికిం - తస్మాదపికిం సాధ్యతే. వద - కథయ. వర్ణనికషే - సువర్ణ వర్ణ పరీక్షా నికషోపలే; నిశామ్యంతాం - పశ్యంతాం. యద్వా - పక్షాంతరే; టంకద్రమిడ గుహదేవ ప్రభృతయః - భాష్య కర్తారః. నిజమతి తిరస్కార విగమాత్ - స్వీయ మతీనాం తిరస్కారస్య రాహిత్యాత్, బుద్ధి దౌర్బల్యాభావాదిత్యర్థః. నిరాతంకాః - భయ సంశయరహితాః. శ్రీ రామానుజ సిద్ధాంతాః స్వతఏవ ప్రమాణానీత్యర్థః.

**58. సుధా సారం శ్రీమద్యతి వరభువః శ్రోత్ర కుహరే**
**నిషించంతి న్యంచన్నిగమ గరిమాణః ఫణితయః ।**
**యదా స్వాదాభ్యాస ప్రచయ మహిమోల్లాసిత ధియాం**
**సదాఽస్వాద్యంకాలే తదమృతమనంతం సుమనసామ్ ॥**

**అర్థం :** శ్రీమత్ + యతి వర భువః = సంపత్తుగల యతీంద్రుల వల్ల జనించిన; న్యంచత్ + నిగమ గరిమాణః = క్రిందికి ప్రవహించే వేద మాహాత్మ్యం గల, ఫణితయః = సూక్తులు; శ్రోత్రకుహరే = చెవుల రంధ్ర మందు; సుధా+ఆసారం = అమృత వర్షాన్ని; నిషించంతి = వర్షిస్తాయి. యదాస్వాదా - ధియాం । యత్ = ఏ అమృతధార యొక్క; ఆస్వాద = అనుభవం యొక్క; అభ్యాస = ఆవర్తి యొక్క ప్రచయ = సమూహం యొక్క; మహిమ = ప్రభావంచేత, ఉల్లాసిత = వికసించిన, ధియాం = బుద్ధిగల; సుమనసాం = విద్వాంసులకు; తత్ = ఆ అమృతధార; కాలే = మరణ కాలమందు; సదా = ఎల్లప్పుడూ; ఆస్వాద్యం = అనుభవింపదగిన; అనంతం = అంతంలేని; అమృతం = మోక్షంగా; (భవతి = అవుతుంది).

**తాత్పర్యము :** సంపత్తు గల యతీంద్రుల వల్ల జనించిన, క్రింది వైపు ప్రవహించే వేదమహిమగల సూక్తులు శ్రవణ రంధ్రాలయందు అమృతధారను కురుస్తుంటాయి. ఆ అమృతధారానుభవాన్ని పునః పునః పరిశీలించే మహిమ వల్ల బుద్ధి వికసిస్తుంది. తత్ఫలితంగా, విద్వాంసులకు శరీరావసానకాలాన నిత్యానుభవయోగ్యమైన, అపరిచ్ఛిన్నమైన మోక్షమే అవుతుంది.

**వ్యాఖ్య :** యతీంద్ర సూక్తి వైభవాన్ని ప్రకాశింపజేస్తున్నశ్లోకమిది. యతిరాజులు శ్రీమంతులు. శ్రీశబ్దానికి 'మతుప్' ప్రత్యయం నిత్యయోగం. 'ఋచః సామానియజూగ్ంషి, సాహిశ్రీరమృతా సతామ్"శ్రుతి. కాబట్టి రామానుజులవారు జ్ఞానవైరాగ్యసంపన్నులని శ్రీమచ్ఛబ్దం సూచిస్తున్నది. శ్రీభాష్యకారుల వల్ల వెలువడిన శ్రీసూక్తులు నిగమాగమప్రమాణ గురుత్వం కలవి. నిగమాలు అంటే వేదాలు. "తుంగైరకృత్రిమగిరః స్వయముత్తమాంగైః, యం సర్వగంధ ఇతి సాదర ముద్వహంతి" - (గోదాస్తుతి. 19) అపౌరుషేయాలైన వేదాలు పరమాత్మణ్ణి సర్వగంధుడని నెత్తినెత్తుకొని ఎలుగెత్తి చాటుతుంటాయి. అంత ఉన్నత స్థాయిగల నిగమాలు నిమ్నస్థాయి లోకి వచ్చాయి. పర్వతం మీద ఉన్న జలం పంగువునకు (కుంటివానికి) సులభంగా పానయోగ్యం కాదు. ఆ జలమే క్రింద - నేలమీద - ప్రవహిస్తే, కఠిన జలం రాళ్ళమీది నుంచి దొర్లి దొర్లి పారి వస్తే - స్వాదుజలమై మధురంగా పానయోగ్యమవుతుంది. అలాగే సులభంగా బుద్ధిగోచరంకాని వేద ప్రామాణ్యాది రూపమాహాత్మ్యంగల బోధాయనాది పూర్వాచార్యుల గ్రంథాలను పరమప్రమాణంగా గ్రహించిన శ్రీభాష్యకారుల సూక్తులు - కృతులు సకలశ్రుతులకు ఐకకంఠ్యాన్ని బోధిస్తున్నందువల్ల సుఖంగా తెలియదగినవైనాయి.

శ్రీమద్రామానుజసూక్తులు అమృతధారను కురుస్తుంటాయి కాబట్టి శ్రుతిపేయాలు, అంటే చెవులకింపైనవి. సరళ భాషలో ఉండడం వల్ల ఆ శబ్దాలూ, అర్థాలూ అమృతంవలె భోగ్యమైనవని భావం. ఆ సూక్తులను మళ్ళీమళ్ళీ ఆవర్తి చేస్తే - అభ్యసిస్తే - జ్ఞానం వికసిస్తుంది. నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞ కలుగుతుంది.

'సుమనస్' శబ్దానికి దేవతలనీ, విద్వాంసులనీ అర్థం. "అమృతం వారి సుధయోర్నిర్వాణే చాతి సుందరే. అయాచితే యజ్ఞశేషే పుంసిధన్వంతరౌ భవేత్" (నిఘంటువు).

అమృత మంటే దేవతల ఆహారమనీ, పరబ్రహ్మానుభవరూపమైన మోక్షమని అర్థం. యతిరాజ సూక్తులు ముముక్షువులకూ, ముక్తాత్మలకూ అమృతం లాగా అనుభవించడానికి యోగ్యమైనవి.

**కాలే:** విద్వాంసులు శరీరావసానకాలమందు శ్రీ సూక్తులను అనుభవిస్తూ మోక్షాన్ని పొందుతారు.

**విణ్ణవర్ తమ్ కుషాంగళుడన్ వేతమ్పాడి**
**పణ్ణులకి ఆ్పడి యాద విశైయాళ్వాడుమ్**
**పల్లాణ్డే పల్లాణ్డుమ్ పాడువోమే** (పరమపదసోపానమ్-20)

'ఇక్కడ' పల్లాణ్డు' అనే ఆళ్వార్ల సూక్తులను అనుసంధానం చేసినట్లే, మనం పరమపదానికి చేరిన తర్వాత కూడా 'పల్లాణ్డు' అని నిత్యం పాడగలుగుతాం' అని దేశికులు నొక్కివక్కాణించారు.

'సదాఽస్వాద్యం' - అమృతం, అనంతం' : ముక్తాత్మలు పరమపదంలో 'పల్లాణ్డు' అని ఇంపుగా గానం చేస్తూ బ్రహ్మానందాన్ని అనుభవిస్తున్నట్లే, యతిరాజసూక్తులు - 'అత్రపరత్రచాపి' అన్నరీతిగా, ఎల్లప్పుడూ ఇహపరములందు అమృతం లాగా ఆస్వాదించడానికి యోగ్యమైనవి.

అనంతమమృతం - అపరిచ్ఛేద్యమైనది - శాశ్వతమైనది బ్రహ్మానంద రూపమైన మోక్షం. మోక్షదశయందు అనుభవింపదగిన బ్రహ్మానందం, ఇక్కడనే శ్రీమద్రామానుజ గ్రంథాలను సేవిస్తుంటే - సూక్తులను అనుసంధానం చేస్తుంటే, పరిపూర్ణంగా అనుభవింపశక్యమవుతుంది.

తుల్యయోగితాలంకారం. శిఖరిణీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ తత్సూక్తి వైభవం వదతి, సుధాసారమితి. యదాస్వాదాభ్యాస ప్రచయ మహిమోల్లాసితధియాం - యదా స్వాదాభ్యాసః - యత్సూక్తి పరిచయః తస్యప్రచయః-అతిశయః, తస్యమహిమ్నా - మాహాత్మ్యేన, ఉల్లాసితదియాం - వికసిత బుద్ధీనాం; సుమనసాం - విదుషాం, కాలే - శరీరముక్తి కాలే, ఆస్వాద్యం - అనుభావ్యం. అనంతం - అపరిచ్ఛేద్యం, తదమృతం- పరంబ్రహ్మ, సదా - అత్రపరత్రచాపి యతీంద్రదివ్యసూక్తి పరిచయే ముక్తి దశాను భావ్య పరబ్రహ్మానుభవః. ఇహ పిసిద్ధ్య తీత్యర్థః. న్యంచన్ని గమగరిమాణః - స్పష్టతయా తదర్థ ప్రతిపాదకత్వేనన్యగ్భూత నిగమాతిశయాః యతివర భువః - యతిరాజోక్తాః, ఫణితయః, శ్రోత్రకుహరే - శ్రోత్రావకాశే; సుధాసారం నిషించంతి - అమృతధారాం స్రవంతి.

**59. యతిక్షోణీభర్తు ర్య దిద మనిదంభోగ జనతా**
**శిరఃశ్రేణీ జుష్టం తదిహదృఢబంధం ప్రభవతు।**
**అవిద్యారణ్యానీ కుహర విహరన్మామక మనః**
**ప్రమాద్యన్మాతంగప్రథమనిగళం పాదయుగళమ్॥**

**అర్థం :** యత్, ఇదం=ఏ, ఈ పాదయుగళం; అనిదంభోగజనతా శిరః శ్రేణీజుష్టం। అనిదంభోగ=ఐహిక భోగరహితమైన; జనతా=జనసమూహం యొక్క; శిరఃశ్రేణీ=శిరస్సుల పంక్తిచేత; జుష్టం=సేవింపబడుతున్నదో; అవిద్యా-నిగళం। అవిద్యా=అజ్ఞానం అనే; అరణ్యానీ=మహారణ్యం యొక్క; కుహర=మధ్యన; విహరత్=సంచరిస్తున్న; మామక మనః=నా(దైన) మనస్సు అనే; ప్రమాద్యత్=బాగా మదించియున్న; మాతంగ=ఏనుగుకు; ప్రథమ నిగళం= మొదటి శృంఖలమో; తత్=ఆ, యతిక్షోణీభర్తుః=యతి భూపతి యొక్క, పాదయుగళం=చరణద్వయం; ఇహ=(నా) మనస్సునందు; దృఢబంధం=దృఢమైన (సం)బంధం కలదై; ప్రభవతు=స్థిరంగా ఉండుగాక.

**తాత్పర్యము :** ఏది, ప్రాపంచిక భోగాలులేని జనుల తలలచే సేవింపబడుతున్నదో, అజ్ఞానమనే మహారణ్యంలో విహరిస్తున్న నా మనస్సు అనే మదగజానికి మొదటి సంకెలయో, ఆ యతిభూపతి యొక్క పాదయుగళం నా మనస్సున దృఢ సంబంధం కలదై స్థిరంగా ఉండుగాక.

**వ్యాఖ్య :** యతీంద్ర చరణయుగళం తన మనస్సును స్వాధీనపరచుకోవాలని కవి విజ్ఞప్తి.

యతిరాజుల పవిత్ర పాదద్వంద్వాన్ని మహాజనులు తలలను వంచి సేవిస్తుంటారు. పాదాలను రక్షించే వారి పాదుకలను నెత్తినెత్తుకొంటారు. జన సమూహాన్ని 'జనత' అంటారు. 'ఇదం' అంటె ఈ సంసారం. సంసారం త్రివర్గం, అంటే ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాలను అనుభవించే అవకాశం కలది. ప్రాపంచిక భోగాలన్నీ ఈ త్రివర్గానికి సంబంధించినవే. 'ఇదం భోగజనత' కానిది 'అనిదంభోగజనత' ఈ ప్రాపంచిక భోగాలను అనుభవించాలనే ఆపేక్ష లేని, మహాభక్తి గల జనులని భావం.

**ఆచార్యస్య ప్రసాదేన మమసర్వమభీప్సితమ్।**
**ప్రాప్నుయామీతి విశ్వాసో యస్యాస్తి స సుఖీభవేత్॥**

అష్టాక్షరీ మంత్రాన్ని ప్రసాదించిన తన గురువు యొక్క అనుగ్రహం చేత తాను కోరినవన్నీ పొందుతాననే విశ్వాసం కలవాడు ఇహపర సుఖాలను పొందుతాడు. అని శాస్త్రం బోధిస్తున్నది.

గృహారామక్షేత్ర పుత్ర కళత్రాది ఐహిక భోగాలకు ఆశపడే ఇంద్రియాలకు కింకరులు కానివారు ఏకాంతభక్తులు.

"జ్ఞానమనుట్టానమివైనన్నాగవే యుడైయనాన గురువై యడైన్దక్కాల్, మానిలత్తీర్, తేనార్కమలత్తిరుమామగళ్కొషునన్ తానే వైగున్దం తరుమ్" (ఉ.ర.మా) – జ్ఞానానుష్ఠాలను పూర్ణంగా కలిగియున్న ఆచార్యుల పాదారవిందాలను ఆశ్రయించిన భూలోకవాసులకు శ్రియఃపతి స్వయంగా – తనంతటతానే – వైకుంఠాన్ని కృప జేస్తాడు – అని పూర్వాచార్యులు బోధించారు. క్షోణీ భర్త అంటే భూపతి. రాజు వేటాడి సాంద్రారణ్యంలో స్వేచ్ఛగా సంచరించే మదపుటేనుగును దృఢమైన సంకెళ్ళతో బంధించి దాన్ని తన వశం చేసుకోవడం లోక పరిపాటి. "మహారణ్య మరణ్యానీ" (అమరం).

మనస్సు ఒక మదపుటేనుగు. అది అజ్ఞానమనే మహారణ్యంలో విచ్చలవిడిగా పరిభ్రమిస్తుంది. అట్టి మనోరూప మహాగజాన్ని బంధించడానికి యతిరాజుల పాదాలే మొదటి సంకెళ్ళు.

తమ దేహాన్ని చూచుకొంటూ మురిసిపోయే వారి మనస్సు, ఎవరు హితబోధను చేసినా వినదుకదా! 'త్వంమే' - నీవు నాదానవే, అని చెబితే, అది 'అహంమే' - నాకు నేనే. నేనెవరిదానను కానని మొరకుగా ప్రవర్తిస్తుంది. అట్టి మదించిన మనోమాతంగాన్ని శ్రీమద్రామానుజ పాదయుగళమే నిగళమై బంధిస్తుంది. భగవానుని కల్యాణగుణాలను అనుభవించడం కంటే ఇతర భోగాలను అనుభవించడం కోసం పరుగెత్తకుండా మనస్సును బంధించే దృఢమైన సాధనం యతిరాజ పాదయుగళం. ఇక్కడ

**దృష్టేఽపి దుర్బల ధియం దమనేఽపిదృప్తం**
**స్నాత్వాఽపి ధూళిరసికం భజనేఽపి భీమమ్।**
**బద్ధ్వా గృహాణ వృషశైలపతేర్దయే! మాం**
**త్వద్వారణం స్వయమనుగ్రహ శృంఖలాభిః॥ (దయా శతకం-99)**

ఈ శ్లోకం స్మరణీయం. "ఓ వేంకటేశునిదయాదేవీ! మావటీడు ఏనుగును ఎంత లాలనచేసి పోషిస్తున్నా, మదంపట్టినప్పుడు అంకుశంతో శిక్షించినా దాని దర్పమణగదు. చక్కగా స్నానం చేయించినా మళ్ళీ దుమ్మెత్తిపోసుకొంటుంది. అడవుల్లోకి పారిపోవడానికి యత్నిస్తుంది. అట్టి మదగజాన్ని మావటీడు గట్టి సంకెళ్ళతో బంధించి వశపరచుకొంటాడు. అలాగే, భగవానుడు కరణ కళేబరాలనిచ్చి మంచి మనస్సును కృపజేసినా, అది స్థిరంగా ఉండనందువల్ల విషయారణ్యాలలో విహరించే ఆసక్తి కలిగియున్నాను, క్రూరమైన ప్రాపంచిక విషయాల నుంచి దూరమవడానికి నేను సమర్థుడనుకాను సుమా! ఓ దయాదేవీ! నిన్ను కూడా లక్ష్యపెట్టని నన్ను నీ అనుగ్రహమనే సంకెళ్ళచే బంధించి, సన్మార్గంలో స్థిరపరచి కాపాడు"మని దేశికులు ప్రార్థించారు.

విషయ వైరాగ్యం కలుగడం కేవలం ఆచార్యానుగ్రహైకసాధ్యమనే శాస్త్రార్థాన్ని దేశికులు ఈ శ్లోకం (59)లో మదగజాన్ని దృష్టాంతీకరించి నిరూపించారు. యతిరాజాంఘ్రిజలజ ద్వయాన్ని తమ మనస్సున స్థిరంగా నెలకొలిపి, నిత్యం ధ్యానించేవారు దేశికులు. భగవద్రామానుజుల అనుగ్రహం తమపై ప్రసరించకపోతే, తాము భగవదనుగ్రహానికీ పాత్రులుకాలేక పోతారని లోకులకు హితబోధనూ చేశారు దేశికులు. దృష్టాంతాలంకారం. శిఖరిణీవృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ రామానుజాచార్య చరణాంరవిందమేవ విషయాన్తర ప్రవణం మేమనః స్వవశయత్విత్యాహ, యతీతి. యతిక్షోణీ భర్తుః - యతిరాజస్య; అనిదంభోగజనతా శిరఃశ్రేణీజుష్టం - ఇదంభోగః - ఐహికభోగః, భగవదన్యభోగ ఇత్యర్థః. తద్రహితా అనిదంభోగా, భగవదనన్యభోగేత్యర్థః. సా చాసౌ జనతాచేతివిగ్రహః. జనతా - జనసమూహః . గ్రామజనబంధు సహాయేభ్యస్తసిల్. తస్యాః శిరఃశ్రేణ్యా- శిరోమాలయా, జుస్టం - సేవితమ్. అవిద్యేతి. అవిద్యైవ - అజ్ఞానమేవ, అరణ్యానీ - మహారణ్యం. "మహారణ్య మరణ్యానీ" త్యమరః. తస్యాః కుహరం - మధ్యం; తత్ర సంచరతః , మామకమనః ప్రమాద్యన్మాతంగస్య - మదీయమనో మహాగజస్య, ప్రథమనిగళం - ప్రథమావర్జసాధనం; యదిదంపాదయుగళం తదిహమే మనసి దృఢబంధం ప్రభవతు - సర్వదామేహృది భవత్విత్యర్థః. యదృచ్ఛయాకస్మింశ్చిదరణ్యమధ్యే సంచరన్మదగజః కుత్రచిత్ కుహరేప్రవిష్టః, తత్రోపాయేన బంధనంప్రాప్తః, తతోనిర్గంతుం నశక్నోతీతిచ స్ఫురతి.

**60. సవిత్రీముక్తానాం సకలజగదేనః ప్రశమనీ**
**గరీయోభిస్తీర్థై రుపచితరసా యామునముఖైః।**
**నిరుచ్ఛేదా నిమ్నేతరమపి సమాప్లావయతిమాం**
**యదృచ్ఛా విక్షేపా ద్యతిపతిదయా దివ్యతటినీ॥**

**అర్థం :-** ముక్తానాం = ముక్తజనులను / ముత్యాలను; సవిత్రీ= పుట్టించునట్టి, సకలజగత్+ఏనఃప్రశమనీ=సమస్త ప్రపంచం యొక్క పాపాలను పోగొట్టునట్టి; గరీయోభిః = గొప్పవారైన/పెద్దవియైన; యామున ముఖైః = యామునాచార్యులు మొదలైన/యమునానది మొదలుగాగల; తీర్థైః = ఆచార్యులచేత/జలాలచేత; ఉపచిత రసా=వృద్ధి చేయబడిన, అతిశయంగల/ నీరుగల; నిరుచ్ఛేదా=అవిచ్ఛిన్నమైన; యతిపతిదయా దివ్యతటినీ=యతిరాజుల కృప అనే గంగానది; నిమ్న+ఇతరం+అపి=ఉద్ధతుడనైనను/ఉన్నత ప్రదేశాన్ని కూడా; మాం=నన్ను; యదృచ్ఛా విక్షేపాత్=యాదృచ్ఛిక విజృంభణం వల్ల/ యథేచ్ఛగా ఉప్పొంగి పైకి ప్రవహించడం వల్ల, సం+ఆప్లావయతి= ఉజ్జీవింపజేస్తున్నది/మునుగునట్లు చేస్తున్నది.

**తాత్పర్యం :** గంగానది ముత్యాలను పుట్టించే రీతిగా యతిరాజుల దయ ముక్తపురుషులను సిద్ధింపజేస్తుంది. సకలజగత్తుయొక్క పాపాలనుక్షాళనం చేస్తున్నట్లే ఆశ్రయించినవారి దురితాలను శమింపజేస్తుంది. యమునాది నదులు చేరడం వల్ల గంగానది ఇంక వృద్ధిబొందునట్లే ఆళవందార్ మొదలైన పూర్వాచార్యుల సంబంధం వల్ల యతిరాజుల కృప అతిశయం పొందియుంది. గంగానది అడ్డు లేకుండా పొంగిపొరలి ప్రవహించడం వల్ల ఉన్నత ప్రదేశాలు కూడా మునుగుతున్నట్లే, యతీంద్రుల కృపారసం నిరంతరం విజృంభించడం వల్ల గర్విష్ఠులైన నా వంటి అయోగ్యులు కూడా మగ్నులై ఉద్ధరింపబడుతున్నారు.

**వ్యాఖ్య :** యతిరాజుల దయ గంగానదితో సమానమని నిరూపించే శ్లోకం.

యతిపతి దయాదివ్యతటినీ:- గంగా యతీంద్రుల సంపూర్ణ మహిమకు మూలకారణం భగవత్సంబంధమే. దివ్యగంగ శ్రీవిష్ణు పాదం నుంచి ప్రకటితమయింది. సకల భోగ్య పదార్థాలయందలి ఉత్కంఠను శ్రీమన్నారాయణ చరణనళిన యుగళమందే నిలిపిన శ్రీమద్రామానుజుల దయ ఆ భగవానుని సంకల్పానుసారంగా ప్రవర్తిస్తుంది. గంగానది మూడు లోకాలలో ప్రవహిస్తుంది. యతిరాజుల కృప ముజ్జగాలలో ఉండే జీవాత్మలపైన ప్రవహిస్తుంది. గంగానది త్రిమూర్తులలో శ్రీ మహావిష్ణువే పరదేవత అని బోధిస్తుంది. త్రిమూర్తుల తారతమ్యాన్ని మహా విద్వాంసులే తెలుసుకొనలేరు కదా!

త్రిమూర్తులలో ఒకడు తన చరణాన్ని చాచాడు. మరొకడు (బ్రహ్మదేవుడు) తన కమండలులోని ధర్మజలంతో ఆచరణాన్ని కడిగాడు. ఇంకొకడు ఆ పాద తీర్థాన్ని తన శిరస్సున ధరించి పరమశివుడయ్యాడు. ఆ పాద తీర్థమైన నేనే గంగను.

అందరి కాలిగోటి నీరు అపవిత్రంగా ఉంటుంది. త్రివిక్రముడైన శ్రీవిష్ణుమూర్తి యొక్క వామచరణాంగుష్ఠం నుంచి ఉద్భవించిన నేను (గంగానది) త్రిలోకాలను పావనం చేస్తుంటాను. ఆయన కాలిగోటి నీటికే ఇంత సామర్థ్యముంటే, ఇక ఆ సర్వోత్తమునికెంత సామర్థ్యమున్నదో ఎవరు

వర్ణించగలరు? శ్రీ మహావిష్ణువే పరదేవత అని ఉపాసించేవారికి ఇహపరసుఖాలను–భోగమోక్షాలను–ప్రసాదించేవాడు. ఆయన ముకుందుడుకదా! అని గంగానది మొట్టమొదట బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో విష్ణుమూర్తి యొక్క పారమ్యాన్ని, మిగిలిన వారి అవరత్వాన్ని ప్రస్ఫుటంగా ప్రకటించింది.

అలాగే శ్రీభాష్యకారుల కృప కూడా లోకులయందు అవ్యాజంగా ప్రసరిస్తూ, పరత్వంగా భావింపబడుతున్న ముగ్గురు మూర్తులలో శ్రీవిష్ణుమూర్తియే పరదేవత అని, బ్రహ్మరుద్రులు అవరులని స్పష్టంగా బోధిస్తుంది.

1. సవిత్రీముక్తానాం:- గంగాజలం సముద్రంలోకి ప్రవహించే మహానది. కాబట్టి ముత్యాలు గంగానదిలోకి రావడం చేత ముత్యాలను ఉత్పన్నం చేస్తుంది. అంతేకాదు, గంగోదకంలో స్నానం చేసినవారు ముక్తులవుతారు.

శ్రీభాష్యకారుల దయకు పాత్రులైనవారు ముక్తాత్మలవుతారు. మొట్టమొదట తల్లి శిశువులను ప్రసవిస్తుంది. తర్వాతనే బంధుజనులు ఆ శిశువులను లాలిస్తారు, పాలిస్తారు కదా! లోకరీతిగానే, మొట్టమొదట భగవద్రామానుజుల కృప బద్ధజీవులను ముక్తాత్మలుగా జనింపచేస్తుంది. యతిరాజుల దయ మొదట కలుగగా, వెనువెంట భగవద్దయ, భాగవతకృప ఆ ముక్తాత్మలపై ప్రసరించడం వల్ల వారు లాలన పాలన చేస్తారు.

2. సకలజగదేనఃప్రశమనీ:- 'ఏనస్' శబ్దం పాపార్థకం. "కలుషం వృజినైనోఽఘ మంహోదురిత దుష్కృతమ్". (అమరం)

గంగానది సర్వపాపాలను నశింపజేస్తుంది. కాబట్టి కపిల మహాముని హుంకరించడం వల్ల దగ్ధులైన అరవైవేల సగర రాజపుత్రులు, వారి భస్మంపై గంగ ప్రవహించిన వెంటనే, పవిత్రులై స్వర్గాన్ని పొందారు.

గంగలో స్నానం చేసేవారు "గంగాగంగేతి యోబ్రూయాద్యోజనానాం శతైరపి। విముక్తః సర్వపాపేభ్యోవిష్ణులోకం సగచ్ఛతి"- గంగానదికి వందల కిలోమీటర్ల దూరంలో ఉండి కూడా 'గంగా, గంగా' అని ఉచ్చరించేవాడు. సకల పాపాల నుంచి విముక్తుడై విష్ణులోకాన్ని పొందుతాడు - అని

అనుసంధిస్తుంటారు. అలాగే, యతిరాజ దయ కూడా సర్వజగత్తు యొక్క సకలపాపాలను నశింపజేస్తుంది. పాపం నశించిన వారికి ముక్తి లభిస్తుందనడంలో సందేహమే లేదు.

3. గరీయోభిర్యామున ముఖైస్తీర్థైరుపచితరసా:- "నిపానా గమయోస్తీర్థ మృషిజుష్టజలే గురౌ'' (అమరం) ''తీర్థం శస్త్రాధ్వరక్షేత్రోపాయో పాధ్యాయమంత్రిషు। అవతారర్షిజుష్టాంభః స్త్రీ రజస్సుచ"-(విశ్వనిఘంటువు). 'తీర్థ' శబ్దానికి ఉన్న నానార్థాలలో 'పవిత్రమైన జలం, గురువు' అనే అర్థ ద్వయం ఇక్కడ ఉపయుక్తం.

"నిదిగ్ధోపచితే"-(అమరం) 'ఉపచిత' శబ్దానికి 'వర్ధిల్లజేయబడినది, లేదా, హెచ్చినది' అని అర్థం.

యమున మొదలైన మహానదుల జలంచేరడంవల్ల గంగాజలం పెరుగుతుంది. యామున గురు కృప వల్ల రామానుజుల కృపామహిమ పెరిగింది.

"పత్యుఃసంయమినాం ప్రణమ్య చరణౌ తత్పాద కోటీరయోః, సంబంధేన సమిధ్యమాన విభవాన్ధన్యాంస్తథాఽన్యాన్ గురూన్" రామానుజుల శిరస్సుతో తత్పూర్వాచార్యులకూ, పాదాలతో తదనంతరీయులకూ సంబంధముంది.

"మస్తకం శ్రీశఠారాతిం, నాథాఖ్యం ముఖమండలే"- అన్నట్లు అవయవియైన భగవద్రామానుజులకు ఆళ్వార్లు, పూర్వాచార్యులు అవయవభూతులై చేరి యుండడం వల్లనూ, యతిరాజుల దయకు ప్రభావం హెచ్చింది.

4. 'దురుచ్ఛేదా' అని పాఠాంతరమూ ఉంది. 'నిరుచ్ఛేదా':- అల్పానల్పాది నదీజలాల చేరికవల్ల గంగా ప్రవాహం పెరుగుతుందే కాని తరుగదు కదా! అలాగే యామునాచార్య ప్రముఖుల కారణంగా యతిరాజుల దయాప్రవాహం నిర్విఘ్నంగా నిత్యం ఆశ్రితులపై బాగా ప్రవహిస్తుంది. ఆశ్రితులు ప్రమాదవశాన పాపులయినా కూడా శ్రీభాష్యకారుల కృపాప్రవాహం తరుగనే తరుగదు.

5. యతిపతిదయా దివ్యతటినీ నిమ్నేతరమపిమాం యదృచ్ఛా విక్షేపాత్ సమాప్లావయతి:– 'నిమ్న' మంటె పల్లపు భూమి. నిమ్న స్థలానికి ఇతరమైనది 'మిట్టనేల'. మిట్టనేలలకూ నీరు ప్రవహించాలనుకుంటే నదులకు ఆనకట్టలను కట్టి నీటిని పారించవచ్చు. ఆనకట్టలు లేకున్నా, మన ప్రయత్నం లేకపోయినా, వరదలు వచ్చి గంగాజలం పొంగిపొరలి మిట్ట పల్లాలనే భేదం లేకుండా అన్నీ మునిగిపోవునట్లు విజృంభిస్తుంది. గర్విష్ఠులై నమ్రతను ఎరుగకున్న నా వంటి ఉద్ధతుల మీద కూడా యతిరాజ కృపా ప్రవాహం స్వేచ్ఛగా, నిరర్గళంగా ప్రవహిస్తూనే ఉంటుంది. ఇక శ్రద్ధాభక్తులతో ఆశ్రయించినవారు యతిరాజుల దయకు పాత్రులవడంలో ఆశ్చర్యమేముంది.

**"పరాశర ముఖాన్ వందే భగీరథనయే స్థితాన్।**
**కమలాకాన్తకారుణ్య గంగాప్లావిత మద్విధాన్" (ద.శ.4)**

భగీరథుడు స్వప్రయత్నం చేత స్వర్గంగను భూలోకానికి తెచ్చి దాని ప్రవాహం చేత సగరపుత్రుల భస్మాన్ని తడిపి వారికి సద్గతిని కలిగించాడు. అట్లే పరాశరాది మహర్షులూ తమ యోగమహిమ చేత విష్ణు పురాణాది గ్రంథాలను రచించి, భగవద్దయకు దూరంగా ఉన్న నాబోటి వారిని లక్ష్మీకాంతుని దయారూపదివ్య గంగచే తడిపి సద్గతికర్హులను జేశారు. అట్టి పరమర్షులకు నమస్కారమని శ్లోకతాత్పర్యం.

దేశికులు రచించినవే అయినా ఈ రెండు శ్లోకాల భావాన్ని పోల్చిచూస్తే యతిపతిదయ సర్వశ్రేష్ఠంగానూ, మానవాభ్యుదయాన్ని కలిగించే శక్తిమంత్ర మైనదని స్మరింపజేస్తున్నది. అక్కడ కమలాకాన్త కారుణ్యగంగ. ఇక్కడ యతిపతిదయా దివ్యతటిని. గంగను దివి నుంచి భువికి తెచ్చి తడుపడానికి చేసిన భగీరథుని మహాప్రయత్నం లాగా, మహర్షులు పురాణాదులను విశ్వశ్రేయస్సుకోసం రచించడం కూడా గొప్ప శ్రమయే కదా! అక్కడ మీది నుంచి క్రిందికి ప్రవహించడం ప్రకృతి సిద్ధం. నాబోటివారిని తడుపడమే దాని ఫలితం.

ఇక్కడ యతిపతిదయ ప్రవహించడానికి భగీరథ ప్రయత్నం అవసరం లేదు. ఏ శ్రమ పడకుండా 'యదృచ్ఛా విక్షేపం'గా – స్వేచ్ఛగా పైకి పొంగుతూ

ప్రవహిస్తుంది. పైన ఉన్న - మిట్టకున్న - వ్యక్తి మీదికి ప్రవహించడం ప్రకృతి విరుద్ధమైన ప్రవృత్తి. అక్కడ కమలాకాన్తుని కారుణ్యగంగ, ప్లావనం - తడుపడం - మాత్రమే చేస్తుంది. ఇక్కడ యతిపతి దయా దివ్యతటిని నిమ్నేతరమైనా సరె, 'సమాప్లావన'మే - పైకి పొరల్లి నిండుగా ముంచడమే దాని పని. ఫలితం ఉద్ధరించడమే కదా! ఆచార్య కృపయే సులభంగా మోక్షం కలుగజేస్తుందని శ్రీ వైష్ణవులకు ప్రగాఢ విశ్వాసం ఉంటుంది. తల్లి శిశువుకు ఆహారం పెట్టే రీతిగా, అశ్రితులకు ఆచార్యానుగ్రహమే, భగవదనుగ్రహంకంటె సకల పురుషార్థాలను అనుభవింపజేస్తుంది. ఆచార్య స్వరూపంలో ఈశ్వరత్వమూ, ఆచారత్వమూ- రెండు-చేరి యున్నందువల్ల ఆచార్యుణ్ని ఆశ్రయించినప్పుడే సర్వేశ్వరుణ్ని ఆశ్రయించినట్లవుతుంది. సర్వేశ్వరునికంటె ఆచార్యులనే ప్రాప్యప్రాపకంగా ఆధ్యవసించిన శ్రీమధురకవులే 'చరమనిష్ఠాక్రమ'మనే ఈ ప్రాచీన మార్గాన్ని ప్రదర్శించారు. అందువల్ల "తూణ్పత్త మధురకవి తోన్ణక్కాట్టుమ్ తొల్వషి" - అని దేశికులే మరొకచోట అన్నారు.

శ్లేషోపమాలంకారయుక్తమైన ఈ శ్లోకం (49-60) పంద్రెండు శిఖరిణీ వృత్తశ్లోకాలలో శిఖరాయమానం కదా!

**సంస్కృత వ్యాఖ్య :-** అధతద్దయాం గంగా సమాధినాస్తౌతి, సవిత్రీతి. ముక్తానాంసవిత్రీ - ముక్తజనోత్పాదికా, స్వసంబంధేన ముక్తాన్కుర్వతీత్యర్థః. సకలజగదేనః ప్రశమనీ - సకలలోక పాపహరా, ఉభయముభయత్ర సమానం, గరీయోభిః, యామునముఖైః-యామునాచార్య ప్రభృతిభిః, తీర్థైః-ఆచార్యైః, ఉపచితరసా - ఉపచితాతిశయా, అన్యత్రయమునాజలైరుపచిత జలా; నిరుచ్ఛేదా (దురుచ్ఛేదా పాఠాంతరం) అపాయసంప్ల వాదిభిరపి దురపనోద్యా, అన్యత్ర అవిచ్ఛిన్నప్రవాహా; యతిపతి దయా దివ్యతటినీ - యతిపతిదయా రూపాగంగా; నిమ్నేతర మపి, మాం - ప్రావణ్యరహితత్వా దయోగ్యమపిమాం; యదృచ్ఛా విక్షేపాత్ - స్వకీయయాదృచ్ఛిక విజృంభణేన; సమాప్లావయతి - స్వసంబంధేన సముజ్జీవయతి. గంగాఽపియాదృచ్ఛిక విజృంభణేన, నిమ్నేతరమపి - ఉన్నత దేశమపి సమాప్లావయతి. గంగాతు, ముక్తానాంసవిత్రీ - మౌక్తికోత్పాది కేతిచవక్తుంశక్యతే.

**61. చింతాశేష దురర్థదంతుర వచః కంథాశతగ్రంథిలాః**
**సిద్ధాంతానసమింధతే యతివర గ్రంథాను సంధాయిని।**
**ముక్తాశుక్తి విశద్ధసిద్ధ తటినీ చూడాలచూడాపదః**
**కింకుల్యాం కలయేత ఖండపరశుర్మండూక మంజూషికామ్॥**

**అర్థం :** యతివర(పతి) గ్రంథ+అనుసంధాయిని=శ్రీభాష్యకారుల గ్రంథాలను అధ్యయనం చేసే వ్యక్తిపైన; చింతాశేష-గ్రంథిలాః। చింతా=విచారమే, శేష=మిగులునట్టి; దురర్థ=అపార్థాలుగల; దంతుర=విషమమైన, పూర్వోత్తర విరుద్ధార్థాలుగల; వచః=మాటలు అనే; కంథాశత=పెక్కు గంతలు (చినిగిన బట్టముక్కల) యొక్క; గ్రంథిలాః=ముడులచేనిండియున్నట్టి. (అనేక కంథా సదృశ వచనాలచే కూర్చబడినట్టి). సిద్ధాంతాః=(ఇతర) సిద్ధాంతాలు; న, సమింధతే= ప్రకాంశించవు-ప్రభావాన్ని చూపవు. ముక్తాశుక్తి - చూడాపదః। ముక్తాశుక్తి= ముత్యపుచిప్పలచేత, విశుద్ధ=పరిశుద్ధమైన; సిద్ధతటినీ=గంగానదిచే; చూడాల=అలంకరింపబడిన; చూడాపదః=శిరస్సు కలిగినట్టి; ఖండపరశుః =పరమశివుడు; మండూక మంజూషికాం=కప్పలకు (పెట్టెగా) స్థానంగా ఉన్న; కుల్యాం=కాలువను; కలయేత, కిం=(శిరస్సున) ధరించునా? (ధరించడు).

**తాత్పర్యము :** యతిరాజుల గ్రంథాలనధ్యయనం చేసే ప్రాజ్ఞులకు దురర్థాలుగల పూర్వోత్తర సందర్భాలులేని, పరస్పర విరుద్ధార్థాలుగల శబ్దాలను అతుకులబొంత మాదిరిగా కూర్చిన ఇతర సిద్ధాంతాలు రుచించవు, శోభించవు. ముత్యపుచిప్పలచే పరిశుద్ధమైన గంగను శిరస్సున అలంకరించుకొన్న పరమశివుడు కప్పలకు నివాసస్థానమైన చిన్న కాలువను తలయందు ధరిస్తాడా? ధరించడని తాత్పర్యం.

**వ్యాఖ్య :** యతిపతి గ్రంథాలను పఠించిన ప్రాజ్ఞులకు తదితర సిద్ధాంతాలయందు అభినివేశం ఉండదని వ్యక్తపరచే శ్లోకమిది.

గత శ్లోకం శ్రీ భగవద్భాష్యకారుల కృపయే ముక్తికి హేతువని వర్ణితం. విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులకు ఇతర సిద్ధాంతాలను పరిశీలించి ఆత్మనాశనం చేసుకొనే ప్రసక్తియే లేదని దేశికులు సుశ్లోకించారు ఇక్కడ.

యతీంద్రుల కృపాపాత్రులైన సుధీమణులకే వారి గ్రంథాలను సేవించే ప్రవృత్తి కలుగుతుంది. వారి సిద్ధాన్త వాక్యాల యందు, మనోహరమైన శబ్దార్థాలయందు రుచి హృదయంగమమైనందువల్ల ప్రాజ్ఞులకు ఇతర సిద్ధాంతాలయందు రుచి పుట్టదు. పట్టణాలలో సంచరించే వారికి పల్లెటూళ్ళల్లో సంచరించడానికి ఇష్టముండదు. షడ్రసోపేతమైన ఆహారం భుజించిన వారికి దుర్వాసన గల పాచి అన్నం రుచిస్తుందా?

ఇతర సిద్ధాంతాలు చినిగిన పాతబట్టల పేలికలను కుట్టడానికి కూడా యోగ్యంగా లేనందువల్ల ముడివేసి ఒక అతుకుల బట్టను సిద్ధం చేసినట్లు, అపార్థాలతో కూడి పూర్వోత్తర సందర్భాలు కూడా లేని అక్కడి, ఇక్కడి శబ్దాలను ఏరి కూర్చడం వల్ల, వాటిని అనుసంధానం చేసినవారికి అనేక చింత, శ్రమ మాత్రమే మిగులుతుంది కాని తత్త్వజ్ఞాన మేమీ లభించదు. దప్పిగొన్న సజ్జనుడు నీటి కోసం ఊసర భూమిలో బావిని త్రవ్వితే అతనికి శ్రమయే మిగులుతుంది కాని స్వాదుజలం మాత్రం లభించదు కదా! కాబట్టి, శ్రీభాష్యాది గ్రంథాలను అనుసంధించిన శ్రీవైష్ణవులు ఇతర సిద్ధాంతాల చేత ఆకర్షితులు కారు, ప్రభావితులూ కారు.

ఖండపరశువంటే పరమశివుడు. "భూతేశః ఖండపరశుర్గిరీశో గిరిశోమృడః" (అమరం) ముత్యపుచిప్పలచే పరిశుద్ధమైన గంగను తలదాల్చిన పరమ భాగవతోత్తముడైన శివుడు కప్పలు అణగియుండే మందసమైన, క్షుద్రమైన కాలువను తలదాలుస్తాడా? దాల్చడని దృష్టాంతాన్ని ప్రదర్శించారు దేశికులు. గంగానది ముక్తాశుక్తి గర్భితం. శ్రీభాష్యాది యతిపతి గ్రంథజాలం భగవద్గుణరత్న పంక్తి గర్భితం కదా! గంగాతీరమందు జనులు తపస్సుచేసి, పరిశుద్ధమైన గంగాజలమందుస్నానంచేసి ఎందరో సిద్ధ పురుషులయ్యారు. శ్రీభాష్య పంక్తులను బాగా మననం చేసి తాత్పర్యమందు మగ్నులై ఎందరో మోక్షసిద్ధిని పొందారు. భగవచ్చరణామృతమై, పాపనాశినియైన గంగను శివుడు శిరస్సు మీద అలంకరించుకొన్నాడు. భగవద్జ్ఞానామృతమై శ్రేయస్కరమైన యతివర గ్రంథజాలాన్ని పరమవైదికులు నెత్తినెత్తుకొంటారు. ఇట్టి పరిశుద్ధమైన గంగను

దించి శివుడు దానిస్థానంలో కప్పలకు భద్రపేటికయైన క్షుద్రకుల్యను తన మస్తకమందు ధరించలేడు కదా! అలాగే, మంగళకరమైన శ్రీభాష్యాది పుస్తకాలను వదలి దురర్థాలుగల శబ్దాలతోనూ, పరస్పర విరుద్ధ భావాలు గల వాక్యాలతోనూ నిండియున్న ఇతర సిద్ధాంతాలను శ్రీవైష్ణవులు శుద్ధబుద్ధితో ఆదరించలేరు కదా!

శబ్దాలంకారం - వృత్త్యనుప్రాస. అర్థాలంకారం - దృష్టాంతం. వృత్తం- శార్దూల విక్రీడితం.

**సంస్కృత వ్యాఖ్య :-** అథతత్ప్రణీతప్రబంధానుసంధాతౄణాం సిద్ధాంతాంతరాణి అరుచి గోచరాణీత్యాహ, చింతేతి. చింతాశేష దురర్థదంతుర వచఃకంథా శతగ్రంథిలాః- చింతా శేషాణాంతత్త్వ నిర్ణయా హేతుభూతానాం విచారమాత్రశేషాణాం, దురర్థానాం - శబ్ద విరుద్ధార్థానాం, దంతురాణాం - పూర్వోత్తర విరుద్ధార్థానాం, వచఃకంథానాం - కంథాసదృశ వచసాం, వచశ్శకలానామిత్యర్థః. శతైః, గ్రంథిలాః - గ్రంథియుక్తాః; సిద్ధాంతాంతర ప్రమేయ ప్రతిపాదక శబ్దఖండ శతగ్రథనేన నిర్మితాః; సిద్ధాంతాః- మతాంతరాణి. యతివర గ్రంథానుసంధాయిని, న సమింధతే- నరోచంతే, నప్రకాశంత ఇత్యర్థః. ముక్తాశుక్తి విశుద్ధ సిద్ధతటినీ చూడాలచూడాపదః - ముక్తాశుక్తిః - ముక్తోత్పాదికాశుక్తిః, తయా విశుద్ధా-నిర్మలా, యా సిద్ధతటినీ-గంగా, తయా చూడాలం- సంజాతచూడం, చూడా పదం - శిరః యస్యసః తథోక్తః, ఖండ పరశుః- భూతేశః, రుద్ర ఇత్యర్థః. "భూతేశః ఖండపరశు" రిత్యమరః. మండూక మంజూషికాం - మండూకా వాసభూతాం; కుల్యాం-వరాహ దీర్ఘికాం; కలయేతకిమ్ - ఆద్రియేత కిమిత్యర్థః

***అత్రప్రభావళీ వ్యాఖ్యా :-*** *గురుగ్రంథాన్ ప్రకారాంతరేణస్తౌతి, చింతేతి. చింతైవ శిష్యతే చింతాశేషాః,* న తత్త్వార్థ జ్ఞాన జనకాని, దురర్థైః- దుష్టార్థైః, దంతురాణి - విషమాని, యాని వచః కంథాః-వచాంస్యపి తతస్తత ఉపహృత్య నివేశితానీతిభావః; తైఃగ్రంథిలాః - సంజాతగ్రంథయః. సిద్ధాంతాః - ఇతర సిద్ధాంతాః; యతివరగ్రంథాను సంధాయిని - శ్రీభాష్యాద్యనుసంధానవతి పుంసి; న సమింధతే - ప్రబంధతయా నశోభం త ఇత్యర్థః.

దృష్టాంతమాహ, ముక్తేత్యాది. ముక్తాశుక్తిభిర్విశుద్ధా, సిద్ధతటినీ-గంగా, తయా చూడాలం-సంజాతచూడం, చూడాపదం - శిరోయస్యసః- ఖండపరశుః - రుద్రః, మండూక, మంజూషికాం-భోగ పేటికాభూతాం; కుల్యాం - అల్పాం కృత్రిమసరితం; కలయేత కిం- సింధుత్వేన, గణయేత్ కిమ్, అంగీకుర్యాత్ కిమిత్యర్థః.

**62. వందేతం యమినాం ధురంధర మహం మానాంధకారద్రుహో**
**పంథానం పరిపంథినాం నిజదృశా రుంధానమింధానయా।**
**దత్తంయేన దయాసుధాంబునిధినాపీత్వావిశుద్ధం పయః**
**కాలే నః కరిశైల కృష్ణజలదః కాంక్షాధికం వర్షతి॥**

**అర్థం :** దయాసుధా + అంబునిధినా = దయాగుణమనే అమృతానికి సముద్రం లాంటివాడైన; యేన=ఏయతిరాజు చేత; దత్తం = ఇవ్వబడిన; విశుద్ధం= పరిశుద్ధమైన; పయః=జలాన్ని; పీత్వా=త్రాగి, కరిశైల కృష్ణజలదః=హస్తిగిరి (కాంచి) యందలి నల్లని మేఘం; (వరదరాజ స్వామి). నః=మనకు; కాలే= కాలమందు; కాంక్షా+అధికం= కోరిన దానికంటె మించి; వర్షతి=వర్షిస్తున్నదో; తం=ఆ ప్రసిద్ధమైనట్టి; అహంమాన+అంధకారద్రుహో=అహంభావమనే కటిక చీకటిని ద్వేషించే (తొలగించే); ఇంధానయా=ప్రకాశమానమైన, నిజదృశా= స్వీయదృష్టి చేత; పరిపంథినాం= శత్రువుల యొక్క; పంథానం=దారిని; దుంధానం= అడ్డగిస్తున్న; యమినాం=యతులకు; ధురంధరం=నిర్వాహకుడైన (శ్రేష్ఠుడైన) రామానుజ మునిని గూర్చి; వందే=నమస్కరిస్తున్నాను.

**తాత్పర్యము :** అమృతం వంటి దయాగుణానికి సముద్రుడైన ఏ యతిరాజు సమర్పించిన పరిశుద్ధ తీర్థాన్ని పానం చేసి, కరిగిరి యందలి కృష్ణమేఘం (శ్రీవరదరాజస్వామి) మనకోసం కాలమందు కోరికకు మించి వర్షిస్తున్నదో అట్టి, అహంభావమనే అంధకారాన్ని అణచివేసే ప్రకాశమానమైన తన చూపుచేత పగతురదారిని అడ్డుకొనే యతిరాజు(ల)కు నమస్కరిస్తున్నాను.

**వ్యాఖ్య :-** దయామృతోదధియైన భగవద్రామానుజ గురువర్యులకు కవితార్కిక కేసరి నమస్కరించే శ్లోకం.

ఇంతకుముందు స్మరింపని కొన్ని ఉత్తమగుణాలను స్మరిస్తూ శ్రీభాష్యకారులకు కవి అభివందనమర్పిస్తున్నాడు.

కరిగిరిపైన కాలమేఘంలాగా ఉన్న శ్రీవరదరాజస్వామి మన మీద బ్రహ్మానందరూపమైన అమృతాన్ని వర్షిస్తున్నాడు. కారణమేమి? అంటే, భగవద్రమానుజుల దయాగుణమే కారణం. రామానుజులవారు శ్రీవరదరాజ భగవానునికి ఒకప్పుడు శుద్ధోదకాన్ని సమర్పించినందువల్ల కృతజ్ఞుడైన వరదరాజు మనకోసం భగవదనుభవరూపమైన అమృత వర్షాన్ని కురిపిస్తున్నాడు. ఇక్కడ కవి ఆ చరిత్రను స్మరింపజేశాడు.

శ్రీమద్రామానుజులు యాదవ ప్రకాశుల వద్ద వేదాంతశాస్త్రాన్ని అభ్యసిస్తున్నప్పుడు, గురుశిష్యులలో శాస్త్ర విషయంగా వివాదాలు పెరిగినాయి. "శేషం కోపేన పూరయేత్" అనే న్యాయరీతిగా, గురువు రామానుజులను గదిరించి, బెదరించి ప్రశాంతపరచేవాడు. రామానుజులు ఎప్పుడైనా అద్వైత మతాన్ని సమూలంగా ఉన్మూలించే సమర్థుడు. కాబట్టి ఆయనను ఈలోకం నుంచి పంపించడమే సముచితమని తలచి, తీర్థయాత్ర నెపంతో ప్రయాగకు వెళ్ళి గంగలో ఆయనను ముంచివేయాలని నిశ్చయించి శిష్యులతో బయల్దేరాడు గురువు.

వింధ్యపర్వతప్రాంత సాంద్రారణ్యంలో శ్రీరామానుజులుతైర్థిక సమూహం నుంచి విడిపోయి ఒంటరివాడయ్యాడు. రెండు దినాలు ఆహారపానీయాలు లేక డస్సిపోయాడు. మూడవనాటి రాత్రి చాలా భయపడుతూ తన ఇష్టదైవమైన కాంచీ వరదరాజస్వామిని "దేవరాజా! దయాసింధో! దీనరక్షణతత్పరా!" అని రామానుజులు గళమెత్తి మొరపెట్టుకొన్నాడు. అంతలో ఒక చెంచు సతీసమేతంగా వచ్చాడు. రామానుజులు వారిని తనకు సాయపడుమని వేడుకొన్నాడు. వారు ఆయనను గమ్యస్థానానికి చేరుస్తామని ఆ రాత్రి ఒక చెట్టుక్రింద ముగ్గురు నిద్రించారు. పెందలకడనే లేచి ఆనాడు చాలాదూరం నడిచిపోయారు.

చెంచెత దాహం తీర్చుకోవడానికి నీళ్ళు కావాలని కోరింది. రామానుజులు వారికి కృతజ్ఞతను ప్రకటించే అవకాశం కలిగిందన్న ఉత్సాహంతో కొంతదూర మేగి కనుగొన్న బావిలో నుంచి ఒక కలశం నిండా నీళ్ళు తెచ్చాడు. కాని ఆ చెంచు దంపతులు కనబడలేదు. ఆ ప్రాంతమంతా వెదకాడు. వారిజాడ తెలియలేదు. నలుప్రక్కల చూస్తూ గళమెత్తి పిలిచాడు. కరిగిరి దేవళం మీది పుణ్యకోటి విమానం పైన ఆ చెంచు దంపతులు విరాజమానులై కనబడ్డారు. ఆహా! అన్న రామానుజులవారి ఆనందానికి అవధులులేవు. తనను రక్షించడానికి వచ్చిన ఆ చెంచు దంపతులే "శ్రీ వరదరాజపెరుమాళ్ మరియు పెరిందేవితాయార్" అని రామానుజులు గ్రహించాడు. వెంటనే సంబరపడతూ, కంచి కోవిల్‌కు చేరాడు. ఆది దంపతులకు నయ:భయాలతో జలపూర్ణ కలశాన్ని సమర్పించి, ఆనందాశ్రువులు జాలువారగా సాష్టాంగ ప్రణామాలనాచరించాడు.

వింధ్యాటవి ఎక్కడ? ఈ కాంచీనగరమెక్కడ? అని రామానుజులు చకితుడై, ఆ దేవరాజానుగ్రహంచే ప్రభావితుడయ్యాడు. నాటి నుంచి ప్రతిదినం రామానుజులు ఆ బావినుంచే తెచ్చిన తీర్థం తిరువారాధనకు సమర్పింప బడుతుండేది.

పూర్వం బ్రహ్మదేవుడు ఈ కాంచీపురంలో హయమేధ యజ్ఞం చేశాడు. ఆ సమయంలో పత్నీశాలకు దగ్గర త్రవ్వబడిన బావియే ఈ బావి. నేటికీ "శాలైక్కిణర్" అనే ఈ బావి నుంచి తీర్థం తెచ్చి స్వామికి నిత్యపూజకు సమర్పింపబడుతున్నది. ఈ ఐతిహ్యం వల్ల భగవద్రామానుజులు శ్రీ వరదరాజస్వామికి నిత్యం తీర్థకైంకర్యం చేసేవారని తెలుస్తున్నది.

'శాలైక్కిణర్' శ్రీవరదరాజస్వామి కోవిలకు పశ్చిమదిశలో (4) నాల్గు కిలోమీటర్ల దూరాన ఉన్నది. ప్రతి సంవత్సరం వైకుంఠ ఏకాదశి తర్వాత పదకొండవ రోజున ఈ బావి నుంచి ఆలయం వరకు ఊరేగింపుతో తీర్థం తెచ్చి, ఆలయంలో స్మారకోత్సవం వైభవంగా జర్పుతుంటారు.

శ్రీ వరదరాజపెరుమాళ్, మేఘం వర్షాన్ని కురిపించునట్లే, వరాలను కురిపిస్తాడు. స్వయంగా శ్రీ వరదరాజే కృష్ణమేఘం.

"ఆషియుళ్ పుక్కుముకన్దు కొడు ఆర్తేటి". (తిరుప్పావై-4) అన్నట్లు, మేఘం సముద్ర జలాన్ని గ్రహించి జగత్కల్యాణం కోసం వర్షిస్తుంది. శ్రీవరదరాజ భగవానుడు యతిరాజ పాణిపద్మంచే తీర్థాన్ని పానంచేసి భగవదనుభవ రూపామృతాన్ని వర్షిస్తాడు.

మేఘానికి నీటినిచ్చే సముద్రుడు క్షారలవణజలభరితుడు. వరదునికి తీర్థాన్ని సమర్పించే యతిరాజు దయారసపూర్ణుడు. సముద్రజలం పరిశుద్ధంగా ఉండదు. స్వార్థం లేశమైనా లేని యతిరాజ తీర్థం (విశుద్ధం పయః) పాలలాగా స్వచ్ఛమైనది. సముద్రజలాన్ని గ్రహించిన మేఘం స్వాదుజలభరితమవుతుంది. దయాసముద్రుడైన యతిరాజ తీర్థాన్ని స్వీకరించిన వరదరాజు దయారస భరితుడవుతాడు. సముద్రజలగ్రహణం చేసిన మేఘం నీలవర్ణంతో శోభిస్తుంది. యతిరాజ తీర్థాన్ని గ్రహించిన భగవానుడు ఘనశ్యాముడయ్యాడు. జలదం పర్వతం మీద విశ్రాంతిగా ఉంటుంది. వరదుడు కరిగిరిపైన విరాజమానుడవుతాడు. తోయదమధ్యస్థమై విద్యుత్తు విహరిస్తుంది. వరదుని వక్షస్థలంపై తేజోనిధియైన మహాలక్ష్మి విద్యుల్లేఖలాగా భాసిస్తుంది. మేఘం రంగురంగుల ఇంద్రధనుస్సును ధరిస్తుంది. వరదుడు భిన్నభిన్న వర్ణాల కిరణాలను ప్రసరించే మణిమయభూషణాలను ధరిస్తాడు. మేఘం వాయుగతిననుసరించి చలిస్తుంది. వరదరాజు ఆచార్యుల ఇచ్ఛానుసారం చరిస్తాడు. మేఘం సూర్యునివలని తాపాన్ని శమింపజేస్తుంది. భగవానుడు సాంసారిక తాపత్రయాన్ని శమింపజేస్తాడు. మేఘం ఎండలో అలసిపోయిన బాటసారులకు ఛాయనిచ్చి సుఖపెడుతుంది. వరదరాజు దుష్కర్మ ఫలమైన దుఃఖం నుంచి కాపాడే శుభసంకల్పచ్ఛాయనిచ్చి వేదమార్గ ప్రవర్తకులను సుఖపెడ్తాడు. మేఘం ప్రాణులన్నిటికి మధురజీవనం (ఉదకం) ఇచ్చి దాహాన్నిశాంతపరుస్తుంది. భగవానుడు జీవరాశికి బ్రహ్మానందరూపమైన అమృతాన్ని ప్రసాదించడం వల్ల ఆకలి దప్పులు శాశ్వతంగా శాంతిని పొందుతాయి. తత్ఫలితంగా బ్రహ్మానందాన్ని అనుభవించే చేతనులు ఆకలిదప్పులు, శోకమోహాలు, జరా మృత్యువులనే షడూర్ముల‌ను దాటి "అపహతపా" ప్మేత్యాది శ్రుతి పలికినట్లు అష్టగుణాలంకృతులవుతారు.

మేఘం, సముద్ర జలాన్ని గ్రహించడం వల్ల కృతజ్ఞతతో సముద్రానికి సంబంధించిన చరాచర వస్తువులకు - సముద్రవసనయైన భూమి మీద ఉన్న తిర్యక్ స్థావర మనుష్యులకు - మధురమైన స్వచ్ఛ జలాన్ని అత్యధికంగా ప్రసాదిస్తుంది.

భగవానునిచే అస్మదాదులకు తదనుభవరూపామృతాన్ని ప్రసాదింపజేసే రామానుజయతీశ్వరులను దయాసుధాంబునిధులనడం అతిశయోక్తికాదు, అది స్వభావోక్తియే కదా! యతిరాజుల కృపకు పాత్రులైన వారి మీద భగవానుడు కూడా కృపను వర్షిస్తాడని సుస్పష్టం.

"ఇక్కదలిదత్తిల్ యారే అఱిబవర్ నిన్నరుళిన్‌తన్మై" (ఇరామా. నూ. 25) రామానుజుల దయా స్వభావాన్ని కడలి ఆవరించిన ఈ పుడమిలో ఎవరు తెలుసుకుంటారు? అన్నారు తిరువరంగత్తముదనార్లు.

యతిధురంధరులైన రామానుజుల దేదీప్యమానదృష్టి చేత అఖర్వగర్వాంధకారం నశిస్తుంది. వేద విరుద్ధమార్గం నిరోధింపబడుతుంది.

అహంమానాంధకారద్రుహా ఇంధానయా నిజదృశా పరిపంథి నాం పంథానం రుంధానం వందే:- శాస్త్రార్థవాదంలో గొప్ప పండితులనైనను జయించగలమని ప్రతివాదులు అహంకారంతో విర్రవీగుతుంటారు. అహంకారం వాస్తవంగా అంధకారమే. చీకట్లో పదార్థాలు కనబడవుకదా! అలాగే, అహంకారం శబ్దాలకు అనుగుణమైన అర్థాలను బోధించే శక్తిని నిరోధిస్తుంది. కుతర్కాలతో వేదవిరుద్ధమార్గాలను కల్పించి గర్వాంధకారులు జనులను ఆ మార్గాలలో నడువాలని బోధిస్తారు. ఇలాంటివారే పరిపంథులు - శత్రువులు. యతిరాజుల జాజ్వల్యమాన దృష్టిపడగానే విపరీతవాదుల గర్వాంధకారం పటాపంచలవుతుంది. తత్త్వజ్ఞానం ప్రకాశిస్తుంది. అలాగే పరిపంథుల వేదవిరుద్ధమైన పంథ (మార్గం) కూడా పంచబంగాళమవుతుంది. దుర్మార్గులు సన్మార్గులవుతారు.

ఇంకొకరకంగానూ చెప్పవచ్చు.

యతిరాజుల దృష్టి ఆశ్రితుల అహంకారాంధకారాన్ని తొలగించి భగవద్భాగవత శేషత్వజ్ఞానాన్ని కలిగిస్తుంది. అదే దృష్టి అదే సమయం ప్రతివాదుల అవైదిక సిద్ధాంతాలను - మార్గాలను చెరపుతుంది.

దేశికులవారు దయాశతకంలో (84) "నృసింహస్వామి కన్నులు ఏ క్షణంలో హిరణ్యకశిపునికి తీక్ష్ణకోపంతో భయంకరంగా ఉండెనో, ఆ కన్నులే అదేక్షణంలో ప్రహ్లాదునికి చల్లని దయను ప్రసాదిస్తూ ప్రశాంతంగా ఉండెను" అని వర్ణించారు. దీనికి మూలం "శీతత్తోడరుల్‌పెత్తు" (తిరువాయ్‌మొషి).

ఈ రీతిగనే "'పార్తాన్ అఱుశమయంగళ్ పదైప్ప" (ఇరా-నూ 52) వేదబాహ్యులైన షణ్మతాలు నిర్మూలమయ్యే రీతిగానూ, నా మహాపాపాలు భస్మమై నేను పావనమయ్యే రీతిగానూ, యతిరాజులు కటాక్షించారు' అన్నారు తిరువరంగత్తముదనార్లు.

భగవానుని దృష్టి, భాష్యకారుల దృష్టి, ఈ రెండింటి ప్రభావం ఒక్కవిధంగానే ఉంది. కాబట్టి, "ఆచార్య స్సహరిఃసాక్షాత్" అంటారు.

**"జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః।**
**సాత్త్వికస్సతు విజ్ఞేయః సవైమోక్షార్థచింతకః॥"**

ఏ వ్యక్తి జన్మిస్తున్నప్పుడు అతనిపైన భగవత్కటాక్షం ప్రసరిస్తుందో, ఆ వ్యక్తి రజస్తమోగుణాలు లేని శుద్ధ సాత్త్వికుడై, మోక్షసాధనానుష్ఠాన పరుడవుతాడు అని భగవత్కటాక్ష ప్రభావం వర్ణితం. అదేవిధంగా, ప్రతివాదుల అహంకారాన్ని అణచివేసి, వారు కల్పించిన దుర్మార్గాన్ని నిరోధించి, వారిని వేదమార్గారూఢులను చేస్తుంది యతిరాజుల దివ్య కటాక్షం; అని ఇక్కడ శ్రీభాష్యకారుల కటాక్ష ప్రభావం ప్రతిపాదింపబడింది.

ఇట్టి మహాప్రభావంగల దృష్టి సంపన్నులైన యతిరాజులకు నమస్కరిస్తున్నాను, అన్నారు దేశికులు.

ఉల్లేఖాలంకారం. శార్దూల విక్రీడితం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథయతీంద్ర మేవనమస్యతి, వంద ఇతి. కరిశైల కృష్ణ జలదః కరిగిరీశః, వరదరాజః, కాలే - కాలవిశేషే, దయాసుధాంబునిధినా - దయామృత సముద్రేణ; యేన దత్తం, విశుద్ధం - పావనం, పయః; వేధసా హయమేధ పత్నీశాలారూప పయః, పీత్వా, నః- తద్దయా విషయా

కృతానామస్మాకం, కాంక్షాధికం - అపేక్షానిరపేక్షం, వర్షతి - కృత్స్న మపేక్షితం ప్రయచ్ఛతీతియావత్. యాదవప్రకాశమిశ్రేణ సహవాసంపరిత్యజ్య స్థితః, పశ్చిమ దేశంగత్వా నివర్తమానః మార్గభ్రంశవ్యాకులః, కేనచిత్ సపత్నీకేన శబరేణమార్గం దర్శయిత్వా, ఏకేనాహ్నా వేధసః పత్నీశాలాపర్యంతం బహుదూర మానీతః, తేన దాహశాం త్యై శాలాకూప పానీయం ప్రార్థితః సన్, కూపమవతీర్య, గృహీతపానీయ ఉత్తీర్య, తమ దృష్ట్వా, తం కరిగిరీశం వరదంజ్ఞాత్వా, తస్యప్రత్యహం శాలాకూపపానీయం సమర్పయన్న వాతిష్ఠతేతి ప్రసిద్ధిః.

అహంమానాంధకారద్రుహా - అహంమానః - అహమేవసమర్థ ఇత్యభిమానః, స ఏవాంధకారః, తత్ద్రుహా-తత్భాధికయా; ఇంధానయా, నిజదృశా - స్వజ్ఞానేన, పరిపంథినాం - ప్రతివాదినాం, పంథానం - వాగ్వ్యాపారం, రుంధానం - ప్రతిరుంధంతం, యమినాం ధురంధరం - యతీంద్రం, వందే.

**63. కాషాయేన గృహీత పీతవసనా దండైస్త్రిభిర్మండితా**
**సామూర్తిర్మురమర్దనస్య జయతి త్రయ్యంతసంరక్షిణీ।**
**యత్రప్రఖ్యాపిత తీర్థవర్ధితధియా మభ్యస్యతాం యద్గుణా**
**నా సింధో రనిదం ప్రదేశనియతా కీర్తిః ప్రజాగర్తినః॥**

**అర్థం :** యత్ ప్రఖ్యాపిత తీర్ధవర్ధితధియాం। యత్=ఏ యతిరాజుల చేత; ప్రఖ్యాపిత=ప్రకాశింపబడిన; తీర్థ=(రేవు) సంప్రదాయం చేత; వర్ధిత=వృద్ధిని పొందిన; ధియాం=బుద్ధిని కల్గినట్టి; యత్+గుణాన్=ఏ యతిపతి గుణాలను; అభ్యస్యతాం=అభ్యసించేవారమైన; నః=మన యొక్క; అనిదం ప్రదేశనియతా= ఈ దేశమందే అని నియతిలేని; కీర్తిః=యశస్సు; ఆ సింధోః=చతుస్సముద్ర పర్యంతం; ప్రజాగర్తి=(నిద్రించక)ప్రకాశిస్తున్నదో; కాషాయేన=జేగురురంగు వస్త్రం చేత; గృహీతపీతవసన=గ్రహింపబడిన పీతాంబరం కలిగినట్టి; త్రిభిః=మూడు, దండైః=కఱ్ఱలచేత-త్రిదండం చేత; మండితా=అలంకరింపబడినట్టి; త్రయ్యంత సంరక్షిణీ=వేదాంతశాస్త్రాన్ని కాపాడునట్టి; మురమర్దనస్య=మురాంతకుని యొక్క; సా=అ(యతిరాజ), మూర్తిః=స్వరూపం (మూర్తి) జయతి=సర్వోత్కృష్టమై శోభిస్తున్నది.

**తాత్పర్యము :** ఏ యతిరాజుల చేత ప్రకాశింపబడిన విశిష్టాద్వైత సంప్రదాయం చేత వృద్ధి జేయబడిన బుద్ధిగలిగి వారి సుగుణాలను అభ్యసిస్తున్న మన కీర్తి ఈ దేశమందే అని నియమం లేనిదై చతుస్సముద్ర పర్యంతం వ్యాపించి ప్రకాశిస్తున్నదో, కాషాయవస్త్రంచే గ్రహింపబడిన పీతాంబరం కలిగి, త్రిదండం ధరించి, వేదాంత శాస్త్రాన్ని రక్షించే మురాంతకుడైన దత్తాత్రేయుల మూర్తివంటి ఆ యతిరాజమూర్తి సర్వోత్కృష్టంగా ప్రకాశిస్తున్నది.

**వ్యాఖ్య:-** దత్తాత్రేయ భగవన్మూర్తి వంటి యతిరాజమూర్తిని ఆశ్రయించినవారి కీర్తి సర్వదేశాలయందు వ్యాపిస్తుందని వర్ణితం.

పూర్వశ్లోకంలో యతిరాజులు తమ చూపుతోనే ప్రతివాదుల గర్వాంధకారాన్ని నశింపజేసే ప్రభావం కలవారనీ, ఆచార్య కృపచేతనే భగవానుడు కృపా వృష్టిని కలిగిస్తాడనీ వర్ణించడం వల్ల భగవానుని నిరాదరించినట్లు భావించరాదు. దత్తాత్రేయ భగవానుని అవతారులే యతిరాజులంటున్నారు శ్రీ వేదాంతదేశికులు.

లక్ష్మీనాథుడు దత్తాత్రేయ రూపంలో అవతరించాడు.

**"కాణాదశాక్యపాషండై స్త్రయీ ధర్మోవిలోపితః।**
**త్రిదండధారిణా పూర్వం విష్ణునా రక్షితాత్రయీ॥**

కాణాదులు, శాక్యులు, పాషండులు వైదిక ధర్మాన్ని లోపింపజేశారు. ఆ సమయంలో త్రిదండధారియై శ్రీ దత్తాత్రేయ రూపంలో అవతరించిన శ్రీ మహావిష్ణువు ఆ దుర్వాదులను పరాస్తం చేసి, లుప్తమైన వైదిక ధర్మాన్ని మళ్ళీ స్థాపించి రక్షించాడన్న ప్రామాణిక శ్లోకమిది.

దత్తాత్రేయ భగవానుడు కాషాయవస్త్రాలనూ, త్రిదండాన్ని ధరించిన సాధుమూర్తి. (సామూర్తిః). ఆ దత్తాత్రేయ స్వరూపమే మళ్ళీ ఇప్పుడు యతిరాజమూర్తిగా గోచరించాడని దేశికులన్నారు. శ్రియఃపతి మళ్ళీ పీతాంబరాన్ని వదలిపెట్టి, సంసారమందు విరక్తిని జెందినవాడనడానికి చిహ్నమైన కాషాయవస్త్రాన్ని ధరించి ఈ యతిరాజుగా ప్రకాశిస్తున్నాడు. ఊర్ధ్వపుండ్రాలు,

శిఖ, యజ్ఞోపవీతం, కాషాయవస్త్రం, త్రిదండం శ్రీ వైష్ణవ యతుల స్వరూప లక్షణం. వైష్ణవ సన్యాసులకుగానీ, ఇతర సన్యాసులకుగానీ కాషాయవస్త్ర ధారణ మాత్రం సాధారణమే.

మురమర్దనుడు అంటే మురాసురుణ్ని సంహరించిన వాడు శ్రీకృష్ణ భగవానుడు. యతిరాజు శ్రీ దత్తాత్రేయులలాగా శాస్త్రంతో శత్రువులను అణచివేశాడు. మురమర్దనుడు దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసి ధర్మాన్ని సంరక్షించాడు. యతిరాజులు (దత్తాత్రేయులవలె కాణాద, శాక్యపాషండులనే దుర్వాదులను అణచివేయడమే కాక శ్రీశంకరాచార్యులు భాస్కరాచార్యులు, యాదవ ప్రకాశ మిశ్రులు కల్పించిన మతాలనే వేదాన్త సిద్ధాంతాలని ప్రచారం చేసే మతాంతరాచార్యుల మతాలనూ ఖండించి త్రయ్యంత (వేదాంత) సంరక్షణ చేశారు. దత్తాత్రేయులు పీతాంబరధారులై ధర్మరక్షణ చేస్తే, యతిరాజులు కాషాయవస్త్రధారులై వైదికధర్మాన్ని రక్షించారని కొందరు ఈ శ్లోక పూర్వార్ధాన్ని అన్వయించి, చెబుతారు.) శ్రీమద్రామానుజులు వైదిక సంప్రదాయాన్ని రక్షించడానికి వచ్చిన భగవదవతారులే అని దేశికుల దృఢాధ్యవసాయం.

ఉత్తరార్ధంలో తమకు యతిరాజులతో గల ఘనిష్ఠ సంబంధ వైభవాన్ని ప్రస్తుతించారు దేశికులు. 'తీర్థం' అంటే రేవు, గురువు జలం, సంప్రదాయం అనే అర్థాలూ ఉన్నాయి. భద్రంగా దాటడానికి నదిలోకి దిగే మంచి మార్గాన్ని 'రేవు' అంటారు. భగవద్రామానుజుల శ్రీపాదతీర్థం సర్వపాపాలను సవాసనగా నశింపజేస్తుంది. రజస్తమస్సులను అణచివేసి సత్త్వగుణాన్ని పెంచుతుంది. బుద్ధిని శుద్ధిచేసి వికసింపజేస్తుంది. తీర్థం చరాచర పదార్థాలను పోషించినట్లే, ఆచార్య శ్రీపాదతీర్థం సాత్వికులను పోషించి పురుషార్థపరులను చేస్తుంది. శ్రీభాష్యకారులు డెబ్బది నల్గురు (74) ఆచార్యులను సింహాసనాధిపతులను చేసి తత్సంప్రదాయాన్ని ప్రకాశింపజేశారు. ఆ ఆచార్యుల సన్నిధిలోనూ, ఆ వంశీయుల సన్నిధిలోనూ యతిరాజ ప్రబంధాలను అధ్యయనం చేయడం వల్ల ఎందరో పరిణత బుద్ధులవుతున్నారు. జగదాచార్యులైన రామానుజుల నామావళిని – గుణాలను– సర్వదా అనుసంధానం చేస్తుంటారు. "నః" అనేపదం దేశికుల వారికేకాక యతిరాజుల నాశ్రయించిన వారందరికీ వర్తిస్తుంది. "పూజ్యేషుబహువచనం" అని దేశికులకూ వర్తిస్తుంది.

శ్రీపాదతీర్థ సేవనం, ప్రబంధాధ్యయనం, గుణానుసంధానం – ఈ మూడు పద్ధతుల వల్ల ఈ సంప్రదాయానుష్టానపరుల కీర్తి భూమండలమంతా వ్యాపించింది. ఈ కీర్తి ఒకనాడు ఆగేదికాదు, సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలలోనూ నిత్యప్రత్యగ్రంగా వ్యాప్తి చెందడమే 'సుందరమై'న పరిణామం. రామానుజ సంబంధులకే ఇంత ప్రభావముంటే, ఇక రామానుజుల మహిమ విషయమై చెప్పేదేముంది?

యతిరాజులకు, వేదాంతదేశికులకు పరస్పర సంబంధమెట్టిదో "న్యాయతిలకం"లో దేశికులు విశదపరచారు.

**"ఉక్త్వాధనంజయ విభీషణ లక్ష్యయాతే**
**ప్రత్యాయ్య లక్ష్మణమునేర్భవతా వితీర్ణమ్।**
**శ్రుత్వావరం తదనుబంధ మదావలిప్తే**
**నిత్యంప్రసీద భగవన్ మయి రంగనాథ"॥ (22)**

ఓ రంగనాథా! శ్రీరామావతారంలో విభీషణునితో 'సకృదేవ ప్రపన్నాయ' అని, శ్రీకృష్ణావతారంలో అర్జునునితోనూ 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అని నీవు పలికిన పలుకుల వల్ల – నిన్ను శరణాగతిని చేసిన వారందరిని తప్పక రక్షిస్తాననడం వల్ల – భగవద్రామానుజులను విశ్వసింపజేశావు. భక్తి ప్రపత్తులను చేయడానికి శక్తిలేనివారందరిని సంరక్షించడానికి పరమదయాళువైన శ్రీరామానుజులు మీ పాదపద్మాలలో దీర్ఘశరణాగతిచేస్తే, ఆ యతిరాజ చరణ సంబంధులందరికీ మోక్షమిస్తానని వారికి వరమిచ్చావు. ఆ వరాన్ని విని దృఢ విశ్వాసంతో ఆ జగదాచార్యులను ఆశ్రయించాను. వారిని ఆశ్రయించిన బలం వల్ల సర్వశేషివైన నిన్ను కూడా స్మరించక గర్వంతో ప్రవర్తించాను. శ్రీమద్రామానుజాచార్య సంబంధం గల నన్ను అనుగ్రహించు' మని దేశికులు ప్రార్థించారు.

జగదుపకారులైన యతిరాజమూర్తి సర్వోత్కృష్టంగా శోభిస్తుందని 'జయ' శబ్దాన్ని నినదించారు దేశికులు. వాస్తవంగా రామానుజుల తర్వాత ప్రపంచ ప్రఖ్యాతిని పొందిన శ్రీవైష్ణవాచార్యులు జ్ఞానవైరాగ్య భూషణులైన శ్రీవేదాన్త దేశికులేకదా!

సంబంధాతిశయోక్త్యలంకారం. శార్దూలవిక్రీడితం.

**సంస్కృత వ్యాఖ్యా :-** అధ యతీంద్ర పరిగృహీత త్రిదండ సన్యాసప్రవర్తక దత్తాత్రేయ ప్రశంసాపూర్వకం యతీంద్ర విషయీకార సంజాతం స్వ వైభవంవక్తి, కాషాయేనేతి. "కాణాదశాక్య పాషండైః త్రయీధర్మో విలోపితః। త్రిదండధారిణా పూర్వం విష్ణునారక్షితాత్రయీ"॥ వేద తదర్థ సంరక్షణార్థం సర్వేశ్వర ఏవ దత్తాత్రేయ మహర్షిరూపత యా అవతీర్ణః, సచ గృహీత తురీయాశ్రమవేషః తదనుగుణదండ కాషాయ వాసశ్శిఖాయజ్ఞోపవీత శిక్యాది యుక్తస్సన్ వేదాన్ రరక్షేతి ప్రసిద్ధిః. త్రయ్యంత సంరక్షిణీ, మురమర్దనస్య- మురారేః, సామూర్తిః - దత్తాత్రేయ రూపామూర్తిః, జయతి-సర్వోత్కర్షేణవర్తతే. యత్ప్రఖ్యాపితతీర్థ వర్ధితధియాం-యేన - దత్తాత్రయేణ, ప్రఖ్యాపితం - ప్రకాశితం, తీర్థం - త్రిదండశిఖాయజ్ఞోపవీతాదిప్రకాశయుక్తం తీర్థం - ఆచార్యః, తేన వర్ధిత ధియాం- తద్దయావర్థితధియాం, యత్ గుణానభ్యస్యతాం, నః-అస్మాకం, ఆసింధోః -ఆచతుస్సముద్రం; అనిదం ప్రదేశనియతా- ఇదంప్రదేశః క్వచిత్ప్రదేశః, తన్నియతా నభవతీత్యనిదంప్రదేశనియతా, సర్వత్రవ్యాప్తేత్యర్థః. కీర్తిః, ప్రజాగర్తి- యశఃప్రకాశత ఇత్యర్థః. సాజయతీత్యన్వయః.

అత్రవ్యాఖ్యానాంతరమ్-కాషాయేనేతి. కాషాయేన-వస్త్రేణ, గృహీత పీతవసనా - గృహీతం పీతవసనం పీతాంబరం యస్యాస్సా తథోక్తా, త్రిభిర్దండైర్మండితా - అలంకృతా, త్రిదండధారీత్యర్థః. త్రయ్యంత సంరక్షిణీ - త్రయ్యన్తానాం వేదాంతానాం, సంరక్షిణీ - రక్షణ విధాయినీ, మురమర్దనస్య - భగవతః, సామూర్తిః-శ్రీభాష్యకారమూర్తిః. జయతి. యత్ ప్రఖ్యాపిత తీర్థవర్థిత ధియాం - యయా మూర్త్యా, ప్రఖ్యాపితేన - ప్రథితేన, తీర్థేన - యదీయశ్రీపాదతీర్థేన, వర్ధితాః - వృద్ధింగమితాః, ధియః యేషాంతే; యత్ గుణాన్ - యస్యాః మూర్తేః గుణాన్ సౌశీల్యాదీన్, అభ్యస్యతాం - అభ్యాసంకుర్వతాం, నః-అస్మాకం, కీర్తిః-యశః, ఆసింధోః-సముద్రపర్యంతం- అనిదం ప్రదేశనియతా-ఇదంప్రదేశనియతా నభవతీత్యనిదంప్రదేశనియతా. సర్వదేశవ్యాపినీసతీ, ప్రజాగర్తీతి.

64. లిప్సే లక్ష్మణయోగినః పదయుగం రథ్యాపరాగచ్ఛటా
రక్షారోపణధన్యసూరిపరిషత్సీమంతసీమాంతికమ్।
భిక్షా పర్యటన క్షణేషుబిభరాంచక్రే గళత్కిల్బిషా,
యద్విన్యాసమిషేణ పత్రమకరీ ముద్రాం సముద్రాంబరా॥

**అర్థం :** సముద్ర+అంబరా = సముద్రమే వస్త్రంగా గల భూమి; భిక్షాపర్యటనక్షణేషు=మాధూకరం కోసం సంచరించే సమయాన; యత్ విన్యాస మిషేణ=ఏ యతిరాజుల అడుగులు వేయడమనే వ్యాజం చేత; గళత్, కిల్బిషా=జారిపోతున్న పాపాలు కలదై; పత్రమకరీ ముద్రాం= మకరికా పత్రాలను; బిభరాంచక్రే=ధరించిందో; లక్ష్మణయోగినః=ఆ రామానుజ ముని యొక్క; రథ్యా-సీమాంతికం। రథ్యా=వీథిలోని; పరాగ+ఛటా=దుమ్ము ధూళి సమూహం నుంచి; రక్షా=కాపాడే పాదుకలను, ఆరోపణ=వహించే; ధన్య=పుణ్యులైన, సూరి=విద్వాంసుల యొక్క, పరిషత్ = సమూహంయొక్క, సీమంత సీమా=శిరః ప్రదేశం యొక్క; అంతికం=సమీపంలో ఉన్న; పదయుగం= పాదద్వంద్వాన్ని; లిప్సే=పొందగోరుతున్నాను.

**తాత్పర్యము :** భిక్షకోసం పర్యటిస్తున్నప్పుడు ఎవరిపాద సంబంధం వల్ల పాపం నశించిన భూమి మకరికా పత్రాలచే అలంకరింపబడుతున్నదో, ఎవరి పాదాల మీద బజారుదుమ్ము పడకుండా రక్షించే పాదుకలను శిరసావహించడం వల్ల విద్వత్పరిషత్తు ధన్యతను ఆపాదించుకొంటున్నదో, ఆ యతిరాజుల పాదయుగళం లభించడానికి ఆశ పడుతున్నాను.

**వ్యాఖ్య:- కవిరాజు యతిరాజుల పాదసేవను అభిలషిస్తున్న వర్ణన.** దాస్యరసైక నిష్ఠ శ్రీ వైష్ణవ స్వరూప లక్షణం. ఆచార్య వరివస్యయే ఆత్మోజ్జీవన హేతువు. గురుసేవ చేసే భారతీయ సంస్కృతి అద్వితీయం.

**లిప్సే లక్ష్మణమునేః పదయుగం:-** 'లక్ష్మ' శబ్దానికి 'సంకేతం, చిహ్నం, గుర్తు' అని అర్థం. శ్రీరామచంద్రస్వామికి అయోధ్యలోనూ, అడవిలోనూ నిరంతరం కైంకర్యం చేయడమే యావజ్జీవం లక్ష్మ-సంకేతం-గా నిల్చిన వ్యక్తి లక్ష్మణుడు. "తదను సుమిత్రానందన వేషః, తదుపరి ధృతహాలముసల విశేషః,

**త**దనంతర మభవత్ గురురేషః"– జగద్ధితార్థం స్వరూప, గుణ దాస్యాల**తో** శ్రియః పతికి కైంకర్యం చేస్తూ, తత్త్వత్రయ సిద్ధాంతాన్ని బోధించిన భగవద్రామానుజులకు పెద్దలు లక్ష్మణమునియని నామకరణం చేయడం అన్వర్థమైనదేకదా! "గతిరితిపాద యోః" అని శ్రుతి పలికినట్లు వారి పాదపద్మాలను సేవించడం వ్యక్తి యొక్క సంపూర్ణ వికాసానికీ, సద్గతికీ ముఖద్వారం. కాబట్టి, దేశికులవారు యతిరాజుల - లక్ష్మణమునుల - పాదయుగళాన్ని ప్రార్థించడం కాక, పొందగోరడం చాలా సముచితం.

**"రథ్యాపరాగచ్ఛటా రక్షారోపణ ధన్యసూరి పరిషత్సీమంత సీమాంతికం"** అనే దీర్ఘ సమాస పదభూయిష్ఠమైన విశేషణం యతిరాజ పాదారవింద మహిమను ప్రస్ఫుటీకరిస్తున్నది. యతిపతి రథాలు సంచరించే రాజమార్గంలో సంచరిస్తారు. వారు బయల్దేరే ముందు పాదాలను రాళ్ళు, ముండ్లు–దుమ్ము, ధూళి సముదాయం నుంచి కవచాల్లాగా రక్షించే పాదుకలను ధరించేవారు. కాషాయ వస్త్రాలను, త్రిదండాన్ని ధరించినట్లే పాదుకలనూ ధరించడం తురీయాశ్రమధర్మం. వారి పాదుకలను ఆశ్రయించినవారు నేరుగా వారి పాదాలను ఆశ్రయించిన వారికంటెనూ ధన్యాత్ములవుతారు. పాదుకలను శిరసావహించే అవకాశ మున్నందువల్ల శిరస్సు - ఉత్తమాంగం చరితార్థమవుతుంది. పాదుకలను మహాత్ములైన విద్వాంసులు - (సూరిపరిషత్తు) తమ శిరస్సునందు కిరీటంలాగా ధరించడం వల్ల సౌభాగ్యవంతులైన స్త్రీల సీమంతసీమలో (పాపటలో)ని సింధూరం లాగా శోభను పొందుతారు. ఇలాగా, ఆ పాదుకా ధూళి వారి దుష్కర్మలకు ప్రాయశ్చిత్తంగా శిరస్సున చేరి జన్మను పవిత్రం చేస్తుంది. ఆచార్యుల పాదయుగళ సేవను పొందగోరడం బ్రహ్మానందానుభవ రూపమైన సాయుజ్యమనే మోక్షప్రాప్తికి హేతువు. కాబట్టి వేదాన్త దేశికులు లక్ష్మణముని పాదయుగళాన్ని (లిప్సే) 'పొందడానికి ఆశపడుతున్నా' నన్నారు. వారి అనుష్ఠానం చేతనుల కాదర్శవంతమే కదా.

కొందరు మహానుభావులు "రథ్యాపరాగ సముదాయాన్ని ప్రాకృతిక బాధల నుంచి కాపాడే 'రక్ష'గా సూరిపరిషత్సీమంత సీమ యందు ఆరోపణ– వహించడం వల్ల ఆ పరిషత్తుకు ధన్యతాపాదక మయినదని, నేరుగా యతిరాజు పాదాలకు

సంబంధించిన అర్థాన్నీ అనుగ్రహించారు. భరతుడు "ఆర్యపాదావిమౌమతౌ". ప్రజలకు 'ఈ పాదుకలు శ్రీరామచంద్రస్వామి వారి పాదాలే' అని ప్రదర్శించారు కదా! మహాత్ముల పాదాలుగానీ, పాదుకలుగానీ సమానంగా ఆదరింపబడుతాయి. ఇరామానుశనూత్తందాది (63)లో 'ఓ రామానుజా!'

**"పిడియై త్తొదరుంకళిరెన్న యాన్ ఉన్ పిఱంగియశీర్**

**అడియైత్తొదరుంబడి నల్గవేణ్డుమ్"** - మగయేనుగు ఆడయేనుగును మోహించి దాని వెంట తిరిగే రీతిగా, నేను మీ దివ్య పాదపద్మాలయందు అత్యంత ప్రావణ్యంతో సంచరించే పద్ధతిని అనుగ్రహించవలెను - అని తిరువరంగత్తముదనార్లు ప్రార్థించారు.

**"యద్వీథీనాం కరిగిరి పతేర్వాహవేగావధూతాన్**

**ధన్యాన్ రేణూన్, త్రిదశపతయోధారయంత్యుత్తమాంగైః"**

'హంససందేశకావ్యం'లో శ్రీవరదరాజస్వామి వేంచేసియున్న శేష, గరుడాది భగవద్వాహనాలను వాహకులు కంచివీథుల్లో ఊరేగించినప్పుడు లేచిన ధూళి రేణువులను దేవతలు మహాభాగ్యమని తమ శిరస్సునందు ధరిస్తారు' అని దేశికులు రచించారు.

యతిరాజపాదపద్మపరాగాన్ని చేతనులు పవిత్రంగా భావించడమే కాదు, అచేతనమైన భూమి కూడా యతిరాజ పాదాలచే అలంకరింపబడి, అనుగ్రహంగా భావించింది. అచేతన పదార్థానికి 'సముద్రాంబర' అని చేతనత్వం ఆరోపింపబడింది.

"హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ" (హ్రీదేవి అంటే భూదేవి). భూదేవి 'అచ్యుత వల్లభ'గా వేదశాస్త్రాలలో కీర్తింపబడింది. ప్రతిదినం పడకనుంచి లేవగానే జనులు ఇలాప్రార్థిస్తుంటారు.

**సముద్ర వసనే దేవి! పర్వతస్తవమండలే।**

**విష్ణుపత్ని నమస్తుభ్యం పాదన్యాసం క్షమస్వమే ॥**

పర్వత రూప స్తన మండలం కలిగి, సముద్ర రూపమైన వస్త్రాన్ని ధరించే, విష్ణుపత్నివైన ఓ భూదేవీ! నీ మీద పాదాలను మోపే నా అపరాధాన్ని క్షమించు. నీకు నమస్కరిస్తున్నాను అని శ్లోకార్థం.

సౌభాగ్యవతులైన స్త్రీలు శుభ్రంగా స్నానంచేసి, మంచి వస్త్రాలను ధరించిన తర్వాత, రంగురంగుల రసద్రవ్యాలతో తమ అవయవాలయందు (ఇప్పుడు మైదాకు పసరుతో) ఆకులు, పూలతోపాటు మత్స్య, మకరాదిరేఖలను చిత్రించుకొంటారు. దీన్ని 'పత్ర మకరీ ముద్ర' అని కవులంటారు.

సన్యాసాశ్రమస్థులు మధ్యాహ్న సమయాన భిక్షాటనం చేయడం విధి. యతిరాజుల పాదతలాలకు శంఖ రథాంగ కల్పక ధ్వజారవిందాంకుశ వజ్రాది సాముద్రిక శాస్త్రోక్త రాజలక్షణాలున్నాయి. కాబట్టి యతిరాజులైన రామానుజులవారు భిక్షాటన కోసం భూమి మీద పాదాలను పెట్టగానే భూదేవి పాపాలన్నీ ప్రక్షాళితమై నిర్మల అయింది. సముద్రాంబర మీద ఎన్ని సార్లు యతిరాజుల అడుగులుపడ్డాయో, అన్నిసార్లు ఆ పాద చిహ్నాలు ముద్రింపబడ్డాయి. ఆ చిహ్నాలలో కల్పక ధ్వజారవిందాంకుశ వజ్రాది రేఖలు స్పష్టంగా కనబడుతుండేవి. (యద్విన్యాస మిషేణ) భిక్షా పర్యటనలో రామానుజుల పాదన్యాస వ్యాజం చేతనే మొదట గళత్కిల్బిషయై భూదేవి పరిశుద్ధురాలయింది. తర్వాత సముద్రాంబర పత్రమకరీముద్రను ధరించి, సౌభాగ్యవతిగా అలంకృతమైనది.

'రక్షా రోపణ' అనే చోట పాదుకలు - పాదరక్షలనే అర్థం అసంగత మనిపిస్తుంది. పాదుకలను ధరిస్తే పాదచిహ్నాలు నేలమీద ముద్రితంకావు. యతులు భిక్షాటనలో తలమీద వస్త్రాన్ని కప్పుకొని, పాదుకలను ధరించడం సామాన్యధర్మం. విశేషధర్మం సామాన్య ధర్మాన్ని మించి ప్రకాశిస్తుంది.

'తిరుప్పావై జీయర్' అని ప్రసిద్ధినిపొందిన రామానుజులవారు, 'ఉన్దుమదకళిత్తన్' అనే (18) పాశురంలో చెప్పబడిన రీతిగా, వారి ఆచార్యులైన మహాపూర్ణుల గృహానికి భిక్షార్థం వెళ్ళితే పాదరక్షలను ధరించకపోవడం విశేష ధర్మం. ఈ విశేష ధర్మమే కవి హృదయమనీ, ('పాదరక్షలు' అనే అర్థం అసంగతమనీ) కొందఱు వ్యాఖ్యాతలు వివరించారు.

'62'వ శ్లోకంలో ఈశ్వర తత్త్వం, ఈ శ్లోకంలో చిదచిత్తత్త్వం వర్ణితం. యతిరాజ సంబంధం సర్వదా చిదచిదీశ్వరులనే తత్త్వత్రయంతో వ్యవహృత మవుతుందని జ్ఞాన వైరాగ్యభూషణులైన దేశికుల వారి ఆశయం.

గమ్యోత్ప్రేక్షాలంకారం. శార్దూల విక్రీడత వృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ రామానుజాచార్య చరణారవిందస్య ఉపకారకత్వాతి రేకాత్ తదాకాంక్షతే, లిప్సఇతి. సముద్రాంబరా - కృత్స్నాభూమిః భిక్షా పర్యటన క్షణేషు - భిక్షార్థ సంచారకాలేషు, అనేన అస్యవిహితా చారేషు కస్యచిదపిలో పోనాస్తీతి సూచ్యతే. యద్విన్యాసమిషేణ - పద్మధ్వజచిత్రాది సాముద్రికా లక్షణ పరిపూర్ణ రామానుజాచార్య చరణన్యాస వ్యాజేన, పత్రమకరీ ముద్రాం - పత్రమకరీరూపాలంకారం, బిభరాంచక్రే - బభార. లక్ష్మణ యోగినః - లక్ష్మ - చిహ్నం, తచ్చ శేషభూతస్య శేష్యతిశయాధానమేవ తచ్చ జగదు జ్జీవయితృత్వం, తద్యుక్తో లక్ష్మణః, శేషిత్వలక్షణ పరిపూర్ణ ఇత్యర్థః. తస్యయోగినః - రామానుజాచార్య స్య, రథ్యా పరాగ చ్ఛటా రక్షారోపణ ధన్యసూరి పరిషత్ సీమంత సీమాంతికం - రథ్యా - సంచారయుక్తా వీథీ, తస్యాః పరాగాణాం, ఛటా - సమూహః, తస్యాః రక్షారోపణం - రక్షణార్థమారోపణం, తేన ధన్యాః పరిపూర్ణ పుణ్యాః తే సూరయః - జ్ఞానాధికాః తేషాం, పరిషదః - సమూహస్య, సీమంత సీమాయాః - శిరోమధ్య దేశస్య, అంతికం - సమీపం, సమీపస్థిత మిత్యర్థః.

రక్షారోపణే త్యనేన ఇతః పూర్వం అరక్షితా ఏవ జిగీషయాసమాగతాః దుర్వాదిన ఏవ తత్సంచార యుక్తరథ్యా పరాగ సంబంధా దేవ సద్యః ప్రక్షీణ దుర్మతయః, ధన్యాఃకృతార్థాః జ్ఞానాధికా స్సంతః, ఏతత్పదయుగమేవ శిరసావహంతీతి యావత్. తత్పద యుగ మిత్యనేన భోగ్యాభివృద్ధిః సూచ్యతే.

లిప్సే - సదా ఉనుభా వ్యత్వాత్ వాంఛామి.

65. నానాతంత్ర విలోభితేన మనసా నిర్ణీత దుర్నీతిభిః
కష్టంకుత్సిత దృష్టిభి ర్యతిపతే రాదేశ వైదేశికైః ।
వ్యాసో హాసపదీకృతః పరిహృతః ప్రాచేతస శ్చేతసః
క్లుప్తః కేళి శుకశ్శుక స్సచ ముధా బోధాయ బోధాయనః ॥

**అర్థం :** నానా తంత్ర విలోభితేన = మతాంతరుల అనేక తంత్రాలచే వ్యామోహితమైన, మనసా = మనస్సుచేత; నిర్ణీత దుర్నీతిభిః = నిర్ణయింపబడిన అపసిద్ధాంతాలుగల; యతిపతేః = రామానుజల యొక్క; ఆదేశ వైదేశికైః =ఉపదేశానికి దూరమైన వారిచేతనూ; కుత్సిత దృష్టిభిః = కుదృష్టులచేతనూ, వ్యాసః = వేదవ్యాస మహర్షి; హాసపదీకృతః = పరిహాస పాత్రునిగా చేయబడెను. ప్రాచేత సః = వాల్మీకి ముని; చేతసః = బుద్ధివల్ల; పరిహృతః = పరిహరింపబడెను. శుకః = శ్రీశుకమహర్షి; కేళిశుకః = వినోదపు చిలుకగా; సః = ఆ ప్రసిద్ధుడైన; బోధాయనః, చ = బోధాయన మహర్షికూడా; ముధా బోధాయ = వ్యర్థ జ్ఞానం కలవాడుగా; క్లుప్తః = కల్పింపబడెను. కష్టం = అయ్యో! ఎంత కష్టం.

**తాత్పర్యము :** మతాంతరులు అనేక మత సిద్ధాంతాలచే వ్యాకులపడిన మనస్సు కలవారైనందువల్ల అపసిద్ధాంతాలను కల్పించారు. యతిరాజుల ఉపదేశాలకు చాలా దూరంగా ఉన్నారు, అంటే రామానుజులకంటే ముందున్న వారు. కాబట్టి ఇట్టి కుత్సిత దృష్టికలవారు వ్యాసమహర్షిని హాస్యాస్పదునిగానూ, వాల్మీకిని మూఢునిగానూ, శుకబ్రహ్మను క్రీడార్థమైన చిలుకగానూ, బోధాయన మహర్షిని జ్ఞాన రహితునిగానూ చేశారు. అయ్యో! ఇదెంతో విచారకరం కదా!

**వ్యాఖ్య :** కు దృష్టుల వ్యాఖ్యానాలవల్ల వేదేతిహాస పురాణ బ్రహ్మసూత్రాది ప్రబంధాలు అపలపించబడినవనే శ్లోకం.

రామానుజుల ఆశయాలు, ఉపదేశాలు రామాయణ భారత భాగవత ప్రబంధాలకనుకూలంగానూ, బ్రహ్మసూత్ర వృత్తి గ్రంథాన్ని విశేషంగా వివరించేవిగానూ ప్రసిద్ధిని పొందాయని సూచించడమే ముఖ్యోద్దేశంగా సుశ్లోకితం. రామానుజులకంటె పూర్వమే ప్రబలియున్న వేదబాహ్యులైన చార్వాకపాషండాది మత సిద్ధాంత గ్రంథాలను అనుసంధానంచేసి మోహితచిత్తులై

ఆ సిద్ధాంత విషయాలకు వేదప్రమాణాలను కల్పించదలచి, శ్రుతులకు అపార్థాలను నిర్ణయించడమే దుర్నీతి. దుర్నీతిపరులు అపసిద్ధాంతాలను ఏర్పరచి వాటిని వైదికసిద్ధాంతాలుగా ప్రచారం చేయడం వల్ల సత్యమైన వైదిక సిద్ధాంతాలను కించపరచారు. కాబట్టి వీరు కుదృష్టులే కదా!

బౌద్ధులలో యోగాచార బౌద్ధులు జ్ఞానం సత్యమే అనీ, జ్ఞేయమైన జగత్తును మిథ్యగా భావించారు. సంవృతి సత్యమైన జగత్తు అంటే దృష్టిలో దోషమున్నంత వరకు జగత్తు సత్యమనిపిస్తుంది, దోషం తొలగిపోతే అది మిథ్య యని ద్యోతకమవు తుందన్నారు.

అద్వైతులు జ్ఞాన రూపమైన బ్రహ్మ సత్యమనీ, జగుత్తు మిథ్య అన్నారు. తమను నాస్తికత నుంచి తప్పించుకోవడానికి, 'జగత్తు వ్యవహారదశలో సత్యంగా తోచి, పరమార్థ దశలో మిథ్యయే సిద్ధిస్తుంది' అన్నారు. ఈ విధంగా, సంవృతి సత్యానికే వ్యావహారిక సత్యమనే పేరును కల్పించి, బౌద్ధసిద్ధాంతానికే వైదిక రూపాన్ని ఘటింపచేశారు అద్వైతులు. తత్ఫలితంగా, మహర్షులూ, పూర్వా చార్యులూ, వారి ప్రబంధాలూ హాస్యాస్పదంగా పరిణమించడం విచారణీయాం శమయింది.

**యతిపతేరాదేశవైదేశికై :-** వీరికి ఉత్తరకాలంలో ఉన్న శ్రీభాష్యకారుల సంబంధం ప్రాప్తమై ఉంటే, వారి అనుగ్రహం వల్ల వీరు యథార్థ సిద్ధాంత విషయాలను క్షుణ్ణంగా తెలుసుకొని, శ్రుతులకు అపార్థాలను కల్పించకుండే వారుకదా! భగవద్రామానుజుల సదుపదేశం ఈ దేశంలోనే ప్రచారమయింది. కాని ఇతర మత సిద్ధాంతపరులు విదేశం – స్వర్గం – లో ఉన్నందువల్ల వారికి సంస్కరింపబడే అవకాశంలేకపోయింది. శ్రుతులకు అపార్థాలను కల్పించినట్లే, వీరు మహర్షుల ప్రబంధాలలోని తత్త్వవిషయాలకు విరుద్ధమైన అర్థాలను నిర్ణయించి, అపసిద్ధాంతాలను బోధించారు.

**కుదృష్టిభిర్వ్యాసోహాసపదీకృతః** : వైదిక సిద్ధాంతాలమీద హృదయం గమమైన దృష్టిలేని కుదృష్టులచేత వ్యాసమహర్షి నవ్వులపాలయ్యాడు. వ్యాస భగవానుడు వేదాలను విభజించాడు. వేదార్థాలను వివరించే మహాభారత

గ్రంథాన్ని రచించి, తత్త్వ, హిత, పురుషార్థాలను పరిమళింపజేశాడు. బ్రహ్మ సూత్రాలను - వాటిలో ప్రకృతి, జీవేశ్వరుల స్వరూప స్వభావాలను ఉపనిషదర్థాలకనుగుణంగా రచించాడు. ప్రత్యక్ష, అనుమాన, శబ్ద ప్రమాణాల ద్వారా జగత్తునూ సత్యమని విశదీకరించాడు.

కుదృష్టులు వైదిక ప్రమాణాలనన్నింటినీ అప్రమాణమని 'జగత్తు మిథ్య' అని భావించారు. కాబట్టి, 'వ్యాసాయ విష్ణురూపాయ వ్యాస రూపాయ విష్ణవే' విష్ణు భగవానుడే అని ప్రశంసింపబడిన శ్రీవ్యాస మహర్షి కుదృష్టులచేత పరిహాసపాత్రుడుగా చేయబడినాడు.

బ్రహ్మసూత్రాలకూ, మహాభారతానికీ విరుద్ధమైన వీరి సిద్ధాంతాలు శ్రీ భాష్యప్రబంధంలో విపులంగా చర్చింపబడినాయి.

**ప్రాచేతసశ్చేతసః పరిహృతః:-** "వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా" వేదవేద్యుడైన పరమ పురుషుడు దశరథుని పుత్రుడై అవతరించగా, వేదం వాల్మీకిముని చేత శ్రీమద్రామాయణ గ్రంథ రూపంగా వెలిసింది.

"భవాన్ నారాయణోదేవః" అనీ "గుణైర్విరురుచేరామః" - శ్రీమన్నా రాయణుడే పరాత్పరుడనీ, సకలకల్యాణ గుణ పరిపూర్ణుడనీ స్థాపించినవాడు వాల్మీకి ముని. సూర్యునికే సూర్యుడు శ్రీరాముడు, ఆ సూర్య ప్రభయే సీతాదేవి అని సీతారాముల చరిత్రను కుశలవులచే మధురంగా గానంచేయించి "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముప బృంహయేత్" అన్నట్లు, 'రామాయణం' చేత వేదార్థాన్ని వ్యక్తపరచిన తపస్వి వాల్మీకి. భగవానుడు సగుణుడనేదానికి విరుద్ధంగా నిర్గుణుడనీ, దేవతాంతర పరత్వాన్ని కూడా ప్రకటించారు కుదృష్టులు. వాల్మీకి రామాయణం కంటె వాసిష్ఠ రామాయణాన్నీ వీరు పరమ లక్ష్యంగా భావిస్తారు. "మాయా మాత్రంతు" - "ఆత్మేతి తు" - అని అద్వైతానుగుణమైన సూత్ర శకలాలు వ్యాసగ్రంథమందు కనబడుతాయి, కాబట్టి వీరు వ్యాసమహర్షిని మనసులోనైనా స్మరిస్తారు. కాని, శ్రీరాముడు సకలగుణాభిరాముడని

వెల్లడించినందువల్ల, వాల్మీకిమునిని వీరు తమ మనస్సునుంచే తొలగించారు. విషయంపై విశ్వాసంలేనందువల్ల ఆదికవియైన వాల్మీకిని స్మరించరని భావం.

వాస్తవంగా, వ్యాసునికంటె వాల్మీకి మొదట ఉండదగిన వాడు. కాని ఈ శ్లోకంలో వాల్మీకికంటె ముందు వ్యాసుడే ఉన్నాడు. 'బ్రహ్మసూత్రాలు' అనబడే ఉత్తరమీమాంసాశాస్త్ర గ్రంథరచయిత వ్యాసుడే అయినందువల్లనూ, వాటికి శ్రీశంకభగవత్పాదుల బ్రహ్మ సూత్రభాష్యం, ఇతర భాష్యాలు వెలువడినందువల్ల, వ్యాసుడే మొదట ఉట్టంకింపబడినాడు.

**శుకఃకేళిశుకః క్లుప్తః** - చిలుకకొట్టిన పండు భాగవతం.

**అర్థోఽయం బ్రహ్మసూత్రాణాం భారతార్థ వినిర్ణయః ।**
**గాయత్రీ భాష్యరూపోఽసౌ వేదార్థః పరిబృంహితః ॥**

శ్రీ శుకబ్రహ్మ సూక్తి సుధయైన శ్రీ మద్భాగవత పురాణ మహిమ అపారమైనది. "భాగవతం బ్రహ్మసూత్రాల అర్థాన్ని బోధిస్తుంది. గాయత్రీ మంత్రానికి భాష్యరూపంగా వెలసింది. దీనిలో మహాభారతంలో వర్ణింపబడిన విషయం నిర్ణయింపబడింది. దీనియందు వేదార్థమంతా ప్రతిపాదింపబడింది".

శ్రీ శుక యోగి సగుణబ్రహ్మయైన శ్రీ భగవానుడే పరతత్త్వమనీ, భక్తియే మోక్షసాధనమనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఈ ప్రతిపాదనను సరకుచేయక కుదృష్టులైన విద్వాంసులు తమకు తోచినరీతిగా సిద్ధాంతాలను కల్పించి ప్రచారం చేశారు. శ్రీ శుకబ్రహ్మను ఆట-పాటలకు ఉపయోగపడే రామచిలుకగా భావించారు; నిరర్థక వాక్యప్రయోక్తగా పరిగణించారని భావం.

**సచ బోధాయనో ముధా బోధాయక్లుప్తః** : బోధాయన మహర్షి బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానాన్ని రచించారు. ఈ వ్యాఖ్యానం పేరు. 'వృత్తిగ్రంథం'. బోధాయనులు విశిష్టాద్వైత సిద్ధాంతాన్నే - ఇదే వ్యాస మహర్షి హృదయమని - ప్రతిపాదించారు: అట్టి బోధాయనుల బోధ జ్ఞానం, ముధా - నిరుపయోగ మన్నారు. ఇలాగా, వ్యాసవాల్మీకి శుక ప్రబంధాలు కుదృష్టులచే ఉన్మత్త ప్రలాపాలుగా పరిగణించపబడినాయి. శ్రీ భాష్యాన్ని యతిపతి రచించకుంటే

అందరినీ వంచించే వారు కదా! అని కవి అభిమతం. భగవద్రామానుజులు, శ్రీ భాష్యంలో కుదృష్టుల సిద్ధాంతాలను ఖండించి, లోకోజ్జీవనం కోసం శ్రీమద్వేద మార్గాన్ని పునః స్థాపనచేశారు. వృత్త్యను ప్రాసాలంకారం శార్దూల విక్రీడితం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథైతన్మత విరుద్ధమతప్రవర్తకై స్సర్వవేదాన్త ప్రవర్తక మహర్షి గ్రంథాః వ్యర్థీకృతా ఇత్యాహ, నానేతి. నానాతంత్రవిలోభితేన - నానాసిద్ధాంత దర్శన వ్యాకులితేన; మనసా; నిర్ణీత దుర్నీతిభిః - నిర్ణీతాపన్యాయైః యతిపతేరాదేశ వైదేశికైః - యతిపతి మతాననుప్రవిష్టైః, మతాంతర నిష్ఠైరిత్యర్థః - కుత్సితదృష్టిభిః - శంకరాది కుదృష్టిభిః, వ్యాసోహాసప దీకృతః - అపహాస్యః కృతః; ప్రాచేతసః - వాల్మీకిః. చేతసః పరిహృత ః - మూఢః కృతః. "మాయామాత్రంతు" - "ఆత్మేతితు" - ఇతి అద్వైతా సుగుణసూత్ర శకలాదికం వ్యాస గ్రంథే దృశ్యమ్; తావదపి నాస్తీతి గుణాభిరామ రామైక పరత్వాత్ వాల్మీకిః పరిహర్తవ్యః. శుకః - శ్రీ శుకబ్రహ్మయోగీ, కేళిశుకః క్లుప్తః - వినోద పక్షిక్లుప్తః సబోధాయనశ్చల ప్రజ్ఞాగ్రేసరతయా ప్రసిద్ధః, బ్రహ్మమీమాంసా సూత్రస్య అతి విస్తృతవృత్తి గ్రంథకర్తా బోధాయన మునిః, ముధాబోధాయ-వృథా ప్రజ్ఞానాయేవ జాతః. కుదృష్ట్యుక్త వ్యాఖ్యానేన సర్వప్రబంధానా మపిహాస్యత్వం జాతమిత్యర్థః. పరే ఉపన్యస్య సర్వానప్యవంచయిష్యన్, యదిన యతిపతిః శ్రీ భాష్యమరచయిష్యదితి స్వాభిమతం కవిరావిష్కరోతి.

**66.** **అర్థ్యా తిష్ఠతి మామికా మతిరసా వాజన్మరాజన్వతీ**
**పత్యా సంయమినా మనేన జగతా మత్యాహిత చ్ఛేదినా ।**
**యత్సా రస్వత దుగ్ధసాగర సుధా సిద్ధౌ షధా స్వాదినాం**
**ప్రస్వాపాయ న బోభవీతి భగవన్మాయా మహాయామినీ ॥**

**అర్థం :** భగవత్ + మాయా మహాయామినీ = భగవానుని మాయఅనే గొప్ప రాత్రి; యత్సారస్వత - ఆస్వాదినాం । యత్ = ఏ యతిపతి యొక్క; సారస్వత = వాఙ్మయ మనే; దుగ్ధసాగర = పాలకడలి యొక్క; సుధా= అమృత రూపమైన సిద్ధ+ఔషధ+ ఆస్వాదినాం = (సిద్ధాంతార్థం అనే) సిద్ధౌషధాన్ని

ఆస్వాదించిన వారికి; ప్రస్వాపాయ = నిద్రింపజేయడానికి; న, బోభవీతి = సమర్థమైనది కాదో; జగతాం = ప్రపంచానికి; అత్యాహిత + ఛేదినా = భయాన్ని తొలగించే; అనేన = ఈ; సంయమినాం, పత్యా = యతిరాజు చేత; ఆ జన్మ రాజన్వతీ = పుట్టినప్పటి నుంచి మంచి (స్వామి) రాజును కలిగియున్న, ఆసౌ = ఈ, మా మికా = నాదైన; మతిః = బుద్ధి; అర్థ్యా = సార్థకంగా; తిష్ఠతి = ఉన్నది.

**తాత్పర్యము** : భగవంతుని మాయ అనే మహారాత్రి యతిరాజుల శ్రీసూక్తులు అనే క్షీరసాగరంలోని అమృత రూప సిద్ధౌషధాన్ని సేవించిన వారిని నిద్ర పుచ్చజాలదు. ప్రపంచంలో ప్రాణుల యొక్క సత్తను నశింపజేసే ప్రబలదుష్కర్మమనే భయాన్ని ఛేదించే యతిరాజుల చేత, జన్మకాలం నుంచి ఉత్తమ రాజుగా కల నాబుద్ధి ఆర్జవ గుణసంపన్నమై యున్నది.

**వ్యాఖ్య** : యతిరాజుల దయకు పాత్రమైన వంశమందు జన్మించడం వల్ల కవికి కలిగిన అతిశయాన్ని వర్ణిస్తున్న శ్లోకం.

**భగవన్మాయా మహాయామినీ** : భగవానుని మాయయే దీర్ఘరాత్రి. ఈ మాయకూ, రాత్రికీ చాలా సామ్యమున్నది. రాత్రి అందరిని నిద్రలో పడవేసి జ్ఞాన శూన్యులను చేస్తుంది. వస్తువుల వాస్తవికరూపాన్ని తెలియకుండా చేసి విపరీత జ్ఞానాన్ని కలిగిస్తుంది. కమ్మగా నిద్రపోవాలనే భోగ్యతా బుద్ధిని కలిగించే రాత్రిని లోకులు పరమభోగ్యంగా భావిస్తారు.

భగవన్మాయ అంటే ప్రకృతియే, సంసారమే. ఈ మాయ జీవులను అజ్ఞానావస్థలో ఉంచుతుంది. భగవత్స్వ రూపాన్ని తెలియనీయక విపరీత జ్ఞానాన్ని కలిగిస్తుంది. ఈ మాయ - ప్రకృతి - అనేక వస్తువులుగా పరిణమించడం వల్ల, ప్రాకృతిక విషయాలమీద భోగ్యతాబుద్ధిని జనింపచేస్తుంది. తత్ఫలితంగా ఆ విషయాలనే పరమభోగ్యంగా భావించి వాటిలోనే కూరుకొనిపోతారు జీవులు. అందుకే "అనాదిమాయ యా సుప్తః" - జీవుడు అనాది మాయచేత నిద్రావస్థలో పడియున్నాడని శాస్త్రం ఘోషిస్తుంది. "మమ మాయాదురత్యయా" - నా మాయదాటరానిది అన్నాడు కదా గీతాచార్యుడు. మాయ అనే రాత్రి చేత

జనించే నిద్రను నష్టపరచే ఔషధం లేదా? అంటే ఉన్నదన్నారు శ్రీ వేదాంత దేశిక స్వామివారు.

యతిరాజసూక్తులు - కృతులు - పాలకడలి వంటివి. క్షీరసాగరం రసనేంద్రియానికి భోగ్యమైతే శ్రీ భాష్యాది కృతులు శ్రవణేంద్రియానికి భోగ్యమైనవి. భోగ్యతలో భేదం లేదు. క్షీరసాగరంలో మందర పర్వతంతో చిలికి తీసిన అమృతం దానికంటె మించి భోగ్యమయింది. శ్రీ భాష్యాది రూపమైన పాలకడలిలో బుద్ధి అనే కవ్వాన్ని ఉంచి తర్కం అనే త్రాటితో చిలికి తీసిన సిద్ధాంతార్థ రూపమైన అమృతం పరమభోగ్యమయింది. ఈ సిద్ధాంతార్థమే సిద్ధౌషధం. అమృతమయమైన ఈ సిద్ధాంతార్థ రూపసిద్ధౌషధాన్ని మధురంగా సేవించిన సజ్జనుల మీద నిద్రను పెంచే మాయారూపమహారాత్రి ప్రభావమేమీ ఉండజాలదు.

"యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ" సర్వ ప్రాణులకు నిద్రను కలిగించే రాత్రిపూట, ఈ సిద్ధౌషధం శ్రద్ధతో సేవించిన వ్యక్తి తన ఇంద్రియ విషయాలను అణచివేసి మేల్కొని ఉంటాడు. అలాగే, భగవన్మాయా జాలమైన ఈ సంసారంలో యతిరాజ సిద్ధాంతాన్ని పాటించిన మహానుభావులు అవిద్య-అజ్ఞానంలో మునుగక, మహాజ్ఞాన, భక్తి వైరాగ్య భూషణులై ప్రకాశిస్తారు.

పూర్వశ్లోకంలో శ్రీ భాష్యకారుల సంబంధం పొందలేని కారణం వల్ల మతాంతర ప్రవర్తకుల బుద్ధి భ్రష్టమైనదన్నారు. ఈ శ్లోకంలో శ్రీ భాష్యకారుల సంబంధం పొందిన దేశికులకు కలిగిన మహా లాభాన్ని విశదీకరించారు.

మామికామతిః ఆ జన్మరాజన్వతీ పత్యాసంయమినాం :-

'నా బుద్ధి యతిరాజుచేత పుట్టినప్పటి నుంచి ఉత్తమ రాజుకలది' అన్నారు దేశికులు. 'మతిః' స్త్రీ లింగ వాచకం. కాబట్టి 'మతి'ని ఒక స్త్రీగా వ్యక్తీకరించారు. "సురాజ్ఞిదేశేరాజ న్వాన్ స్యాత్" అమరం. మతి - బుద్ధి మంచి రాజకలది (రాజన్వతీ).

"నా రాజకే జనపదే భార్యావా వర్తతేవశే" (రామాయణం) ధార్మికుడైన రాజు పాలించని దేశంలో స్త్రీలు తమభర్తల అధీనంలో ఉండరు, అని అర్థం.

రాజశాసనం చక్కగా లేని దేశంలో పురుషులు పరదారాభిలాషులై, పరస్త్రీలను ప్రలోభపరచి వారి శీలాన్ని చెరపుతారు. దుశ్శీలతకు అలవాటుపడిన మగువ తన మగని మాటను వినదు. పుట్టినింటికీ మెట్టినింటికీ – ఉభయవంశాలకూ అపకీర్తిని కలిగిస్తుంది. అలాగే, యతిపతి అనే ఉత్తమ రాజు యొక్క శాసనమే లేకుంటే, కుదృష్టులు అనే జారపురుషులు తమ సిద్ధాంతాలు అనే ప్రలోభాలచే నా బుద్ధిని చెరపి వేసేవారు. తత్ఫలితంగా భగవద్భాగవత శేషత్వానికి దూరమై బుద్ధి, చరిత్ర హీన అయ్యేది కదా! కాబట్టి "నా బుద్ధి యతిరాజుల శాసనంలో ఉండడం గొప్ప సౌభాగ్య" మంటారు దేశికులు.

నరులకు రాజులాగా యతులకు రాజు శ్రీ భాష్యకారులు.

**జగతామత్యాహిత చ్ఛేదినా :-** ప్రపంచానికి భయాన్ని తొలగించేవారు యతిరాజులు. రాజు జారచోరభయాన్ని పోగొడ్తాడు. అలాగే, యతిరాజు కుదృష్టుల వల్ల కలిగే భయాన్ని పోగొద్తాడు. "అత్యాహితం మహాభీతిః కర్మ జీవానపేక్షిచ" (అమరం) 'అత్యాహితం' అంటే మహాభయమనీ, సాహస కర్మ మనీ అర్థం. యతిరాజు ప్రబల దుష్కర్మవలన కలిగే భయంకరమైన శోకవ్యామోహాలను నివారింపజేస్తాడని సారాంశం. రాజు ప్రజలతో విడదీయరాని సంబంధంకలవాడైనందువల్ల దోషులను దండిస్తున్నా, దయాళువై ఉంటాడు. అట్లే సదాచార్యుడైనందువల్ల "స్ఖలిత్యే శాసితారం". "దీర్ఘబంధుందయాళుమ్" – అన్నట్లు శిష్య ప్రశిష్యులను అపచారంచేసినప్పుడు శాసిస్తూనే దయాళువై ప్రసన్నుడుగా ఉంటాడు. రాజవంశంలో జన్మించడం ఎంత భాగ్యమో, యతిరాజుల శిష్య ప్రశిష్యులవంశంలోనూ ఉద్భవించడం వల్ల మాకు అంతకంటె గొప్ప భాగ్యం కలిగింది. శ్రీ భాష్యకారుల ప్రబంధాలను అధ్యయనంచేసి, వారి సిద్ధాంతాలను నా బుద్ధి విస్మరించలేదు. పాతివ్రత్యధర్మాన్ని చక్కగా పాటిస్తున్నది. వస్తు స్వరూప స్వభావాలను ఉన్నవి ఉన్నట్లుగా గ్రహించే శక్తి నా మతికి కలుగడం యతిరాజుల కృపా ప్రభావమే. దాని మూలంగా ప్రతికథకుల మతాన్ని పరాస్తం చేస్తున్నది.

"అర్థోఽనర్థో మహాకోశః" - (వి.స.నా). "అర్థ్యతే ఇతి అర్థః" - ధర్మార్థకామ మోక్ష - చతుర్విధ పురుషార్థాలలో 'భగవత్సాన్నిధ్యరూపమైన మోక్షం కావాలని ముముక్షువుచే కోరబడుతాడు కాబట్టి 'అర్థ' శబ్దం భగవద్వాచకం.

**అర్థ్యా తిష్ఠతి :** (వాఙ్మనఃకాయాలు అనే) కరణత్రయసారూప్యం కలిగియున్నది దేశికుల బుద్ధి. భగవానుణ్ని ప్రతిపాదించే గ్రంథాలను పఠించడం, భగవన్మంత్రాన్ని జపించడం, భగవదారాధన చేయడం, ఇత్యాది సత్కర్మలను ఆచరిస్తూ, అర్థరూపియైన భగవానుణ్ని క్షణమైనా విడువకుండా స్మరిస్తూ, దేశికులకు కీర్తి తెచ్చింది.

ఇంత సమగ్ర శ్రేయస్సుకు మూలకారణం భగవద్రామానుజుల సంబంధం జన్మకాలం నుంచి అనువృత్తమవడమే కదా!

రూపకాతిశయోక్త్యలంకారం. శార్దూల విక్రీడితమ్.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ రామానుజాచార్య దయా విషయీ భూత వంశ జాత త్వేన స్వస్యజాత మతిశయిత త్వమా హ, అర్థ్యేతి.

జగతా మత్యాహితచ్ఛేదినా - ప్రాణినాంసత్తా నాశహేతుభూత ప్రబల దుష్క ర్మ నాశకేన; అనేన సంయమినాం పత్యాయతిరాజేన; ఆ జన్మ రాజన్వతీ - జన్మప్రభృతి సుసంరక్ష్య మాణా, కుదృష్ట్యుపప్లవానవకాశేతి యావత్; తిష్ఠతి. యత్ సారస్వత దుగ్ధసాగర సుధా సిద్ధౌ షధా స్వాదినాం - యత్సారస్వతం - యత్సూక్తిః, తదేవ దుగ్ధసాగరః, క్షీరాబ్ధిః, తస్యసుధా ప్రతిపాద్యార్థః. సైవ సిద్ధౌషధం - అమోఘమౌషధం. అజ్ఞాన వ్యాధే రపునరుద్భవతయానివర్తకత్వా దౌషధత్వం, తదాస్వాదినాం- తత్జ్ఞానవతాం- భగవన్మాయామహాయామినీ - భగవన్మాయా - అనాది ప్రకృతి సంబంధః. సైవ మహాయామినీ - దీర్ఘరాత్రిః కాళరాత్రిః, ప్రస్వాపాయ - అజ్ఞానోత్పాదనాయ, న, బోభవీతి - న సమర్థా భవతి. అనేక రాజన్వతీ అర్థ్యా తిష్ఠతీతి పూర్వత్ర సంబంధః.

**వ్యాఖ్యానాంతరమ్:-** 'సంయమినా మశేషజగతాం' ఇతిపాఠాంతరమ్. అర్థ్యేతి. జగతా మత్యాహితం - మహాభీతిం సంసారభీతించిఛినత్తీతి; సః, తేన; సంయమినాం - యతీనాం పత్యా. యతీంద్రేణ, ఆ జన్మ - జన్మారభ్య, రాజన్వతీ

- సురాజయుక్తా; మామికాఽసౌమతిః. అర్థ్యా - అర్థః - ప్రయోజనం. ప్రకృతప్రయోజనానుగుణ వాదాహ వాభిలాషిణీ తిష్ఠతీత్యర్థః. యతీంద్రసేవినా మిదంకిమాశ్చర్య మిత్యాహ, యత్సారస్వతేతి. యస్యసారస్వతం - వాక్సమూహః శ్రీ భాష్యాదిః. స ఏవ దుగ్ధసాగరః, తస్య సుధా బ్రహ్మణః జగత్కారణత్వో పాయత్వ, ప్రాప్యత్వాది తాత్పర్యమ్. సైవ సిద్ధౌషధం - రసాయన విశేషః, తదాస్వాదినాం-తదనుభవశీలానాం పుంసాం, భగవన్మాయైవ, మహాయామినీ - అతిదీర్ఘారాత్రిః. ప్రస్వాపాయ - జ్ఞాననిద్రాపాదనాయ నప్రభవతి. తాదృశస్య యతీంద్ర స్యకృపయా మమదుర్వాది విజయః కియానితి భావః.

**అన్యత్ వ్యాఖ్యానమ్ :** అర్థ్యా - యథా వ స్థితార్థాదనపేతా. సంయమినాం పత్యారాజన్వతీ - యతీంద్ర రూప సురాజయుక్తా, అత్యాహితం - ప్రతిక థకమతప్రాబల్య శంకారూప మహాభయం, సుధా - సారస్వత శ్రీ భాష్యాది ప్రతిపాద్యార్థజాతం. ఉత్తరార్ధేన సంసారనివృత్తి హేతుత్వోక్త్యా అత్యాహితచ్ఛేదినేతి పదేనాన్యత్ వక్తవ్యమ్.

నను నిరంతర భగవదనుభవ రూప భక్తిభరితయతీంద్రోపదేశ రసాస్వాద పరాణాం తాదృశ రసానుభావనేన సర్వచిత్తద్రవీకరణ చుంచు మంజు పద కదంబగుంభన ప్రావీణ్యేఽపి తచ్ఛ్రవణ మాత్రేణ కతిపయ పృథగ్వాద్యపగమేఽపి జిగీషా సంరబ్ధ కౌతస్కుత వికల్పకల్పనా కబళానామభావాత్ జయంతీత్యుక్తో లోకాభినంద్యో జయో నభవే *దిత్యాశంకాయాం శ్రీభాష్యకార శిష్య పరంపరాయాం* సర్వత్ర తత్త్వ నిర్ణయ మధురోపదేశరూపనిధి ద్వయసద్భావం వాస్తవత్వాత్ స్వీకృత్య స్వస్మిన్ సర్వమత విజయౌపయికస్య విశేషాంశ స్యాపి సద్భావ మాహ విస్తరేణ.

**67.** శుద్ధా దేశ వశం వదీకృత యతిక్షోణీశ వాణీ శత
ప్రత్యాదిష్ట బహిర్గతిః శ్రుతిశిరః ప్రాసాద మాసీదతి ।
దుగ్ధో దన్వ దపత్య సన్నిధి సదా సామోదదామోదర
శ్లక్ష్ణాలోకన దౌర్లలిత్య లలితోన్మేషా మనీషా మమ॥

**అర్థం :** శుద్ధాదేశ - బహిర్గతిః । శుద్ధ+ఆదేశ = స్వచ్ఛమైన ఉపదేశం

చేత; వశం వదీకృత = స్వాధీనం చేసుకోబడిన; యతిక్షోణీశ = యతిరాజుల యొక్క; వాణీశత = అనేక శ్రీసూక్తుల చేత; ప్రత్యాదిష్ట = నిరాకరింపబడిన; బహిర్గతిః = బాహ్యాగమనం కలిగినట్టి; దుగ్ధ+ఉదన్వత్–ఉన్మేషా, దుగ్ధ + ఉదన్వత్ = క్షీరసాగరం యొక్క; అపత్య = సంతానమైన లక్ష్మీదేవి యొక్క; సన్నిధి = సాన్నిధ్యంచేత; సదా = ఎల్లప్పుడు; స+ఆమోద = ఆనందంతో కూడిన; దామోదర = దామోదరుడైన భగవానుని యొక్క; శ్లక్ష్ణ = సౌమ్యమైన; ఆలోకన = దృష్టియందలి, దౌర్లలిత్య= ఔత్సుక్యంచేత, లలిత= నిత్యనూతనమైన; ఉన్మేషా = వికాసంకలిగినట్టి; మమ = నా యొక్క; మనీషా = బుద్ధి; శ్రుతి శిరః ప్రాసాదం = ఉపనిషద్రూపసౌధాన్ని; ఆసీదతి = చేరుతున్నది. ప్రవేశస్తున్నది.

**తాత్పర్యము** : సంప్రదాయ ప్రసిద్ధులైన సదాచార్యుల పరిశుద్ధమైన ఉపదేశం చేత స్వాయత్తమైన యతిరాజ శ్రీసూక్తుల – కృతుల – చేత నిరసింపబడిన వేదబాహ్యులు కలిగినట్టి, పాలకడలి కూతురైన లక్ష్మీదేవి సాన్నిధ్యం చేత సదానందుడైన దామోదరుని సౌమ్యదృష్టియందలి ఔత్సుక్యం చేత నూతన వికాసం గల నా బుద్ధి వేదాంత సౌధమందు ప్రవేశిస్తున్నది.

**వ్యాఖ్య** : సదాచార్యోపదేశంచేత యతిరాజ శ్రీసూక్తులను అవగాహనం చేసుకొన్న దేశికుల శేముషి, భగవత్కృపాకటాక్షంతో వేదాంతార్థాన్ని నిర్ణయంప సమర్థమైనదని వర్ణితం.

పూర్వశ్లోకంలో స్త్రీగా మానవీకరింపబడిన 'మతి' ఈ శ్లోకంలో 'మనీష'గా చెప్పబడింది. 'మతి' అన్ననూ, 'మనీష' అన్ననూ 'బుద్ధి' అని అర్థం. "బుద్ధిర్మనీషాధిషణాధీః ప్రజ్ఞా శేముషీమతిః" (అమరం). దేశికుల బుద్ధి జన్మ ప్రభృతి పరిశుద్ధమైనదని గత శ్లోకం వర్ణించింది. ఆ బుద్ధి సదాచార్యోపదేశం చేత పునీతయై సర్వంకషయైన మనీషా రూపిణి అయింది. "గురుం ప్రకాశయేత్ ధీమాన్" అన్నట్లు సుధీమణియైన దేశికస్వామి మొదట స్వాచార్యులను ప్రశంసిస్తున్నారు.

భగవద్రామానుజుల వారి శిష్యకోటిలో శ్రీమాన్ ఆత్రేయ రామానుజా చార్యులు (అప్పుళ్ళార్) ప్రసిద్ధ ఆచార్య పురుషులు. భ్రమప్రమాదాది

దోషలిప్తంకాని పరిశుద్ధప్రజ్ఞ కలవారు. శ్రీ వాది హంసాబుదాచార్యులు అనే బిరుదాంచితులు. సదాచార సంపన్నులైన ఆత్రేయ రామానుజాచార్యులు శ్రీవేదాన్త దేశికులకు ఉపదేశంచేశారు. 'వాణీశత' అనే ప్రయోగం చేత యతిరాజ శ్రీ సూక్తులు అనేక స్త్రీలుగా వ్యక్తీకరింపబడినాయి. పరిశుద్ధమైన ఆచార్యోపదేశంచేత దేశికుల బుద్ధికి ఆ స్త్రీలందరు (వశంవదీకృత) స్వాధీనలయ్యారు. ఆ స్త్రీల సహవాసం చేత దేశికుల 'మనీష' బయట ఇటూ – అటూ సంచరించకుండా స్వధర్మాచరణ లో ప్రవర్తించిందని ఆలంకారికోక్తి. "ప్రత్యాదిష్టో నిరస్తః స్యాత్" (అమరం).

గురూపదేశం చేత భగవదాజ్ఞారూపాలైన యతిరాజుల శ్రీభాష్యాది ప్రబంధాలన్నీ దేశికులకు కరతలామలకాలయ్యాయి. నరనరాలలో జీర్ణించిన శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతమందు ప్రవీణులై, కాల్పనిక సిద్ధాంతపరులైన వేదబాహ్యులనూ, వేదాలను అంగీకరిస్తూనే వేదవిరుద్ధార్థాలను కల్పించిన కుదృష్టులనూ, పరాస్తం చేసి (జయించి) వారి సిద్ధాంత మార్గాలను నిరోధించారు. మతాంతర ప్రవీణులను వాదంలో జయించగలిగే శక్తిసామర్థ్యాలు గల యతిరాజ శ్రీ సూక్తుల యందు అధికృతాధికారం కల్పించి, దేశికుల 'మనీష'ను భగవత్కటాక్ష యోగ్య అయ్యే రీతిగా తీర్చిదిద్దినది సదాచార్యుల విశుద్ధోపదేశమని సారాంశం.

"దుగ్ధోదన్వదపత్య సన్నిధి సదాసామోద దామోదర శ్లక్ష్ణాలోకన దౌర్లలిత్యలలితోన్మేషా". శ్రీశ్రియఃపతుల కటాక్షం వల్ల నా (దేశికుల) బుద్ధి వికసించింది. గర్భంలో ఉన్నప్పుడే లక్ష్మీదేవి కటాక్షించింది. పుట్టుతున్నప్పుడు లక్ష్మీనాథుడు కటాక్షించాడు. లక్ష్మీదేవి క్షీరసముద్రతనయ కదా! సప్తసముద్రాలలో శ్రేష్ఠమైన రత్నాకరం పాలసముద్రం. చాలా సంపన్నమైన పాలకడలి, తనను మథించి ఎనలేని కష్టాల పాలు చేసిన వారికి కూడా తన సర్వస్వాన్ని ధారవోసిన ఔదార్యం కలది.

**"లక్ష్మ్యా శ్రీ పురుషోత్తమో హిమరుచాగౌరీప్రియోఽలంకృతః,**
**దేవేంద్రోఽపి విమాన వారణహయ స్త్రీరత్న కల్పద్రుమైః ।**
**పీయూషైరమితై స్త్వయా దివిషదశ్చా న్యేకృతా ర్థీకృతాః**
**శ్రీమన్ క్షీరనిధే! త్వదీయ మహిమా నూనం న వాగ్గోచరః ॥"**

క్షీరసముద్ర రాజు తన కూతురైన లక్ష్మీదేవిని పురుషోత్తమునికి ఇచ్చి అతనిని సన్మానించాడు. తన తనయుడైన కళానిధిని ఇచ్చి పరమశివుని శిరస్సును అలంకరింపజేశాడు. గగనాన విహరించే ఐరావతగజాన్నీ, ఉచ్చైశ్రవమనే అశ్వాన్నీ, అప్సరస్త్రీలనూ, కల్పవృక్షాన్నీ త్రిలోకాధిపతియైన ఇంద్రునికిచ్చి బహుమానించాడు. అమృతపానం చేయించి దేవతలను కృతార్థులను జేశాడు. తనను అల్లకల్లోలంగా కష్టపెట్టిన వారిని దండించడానికి మారుగా, ప్రేమతో తన సంపత్తునంతా ఇచ్చి సమ్మానించిన పాలకడలి ఔదార్యాన్ని వర్ణించడానికి మాటలు చాలవు కదా!

ఇట్టి పాలకడలి పట్టియైన లక్ష్మి కలుముల జవరాలు. ఉదన్వచ్ఛబ్దం సముద్రార్థకం. "ఉదన్వానుదధిః సింధుః" (అమరం). సర్వసంపదధీశ్వరియైన లక్ష్మికూడా గొప్పఔదార్యం కలది. గర్భస్థదశలో లక్ష్మీదేవి కృపాదృష్టి పడినట్లైతే ఆ జీవి సర్వోత్కృష్టుడవుతాడు. "త్వయావిలోకితాః సద్యః శీలాద్యై రఖిలై ర్గుణైః కులైశ్వర్యైశ్చ యుజ్యంతే పురుషానిర్గుణాఅపి, సశ్లాఘ్యః సగుణీధన్యః సకులీనః సబుద్ధి మాన్, సశూరః సచవిక్రాంతో య స్త్వయాదేవి! వీక్షితః" శ్రీ లక్ష్మీదేవీ! నీ కృపా దృష్టి ప్రసరించిన వెంటనే గుణహీనుడైనను అతడు గుణవంతుడు, కులీనుడు, బుద్ధిమంతుడు, ఐశ్వర్యసంపన్నుడు, శూరుడు, వీరుడు, పరాక్రమ వంతుడవుతాడు" అని ప్రశంసింపబడియుంది.

పాపులను దండించకూడదనే వాత్సల్యగుణంగల జగన్మాతయైన ఆ మహాలక్ష్మి తన సన్నిధిలోనే ఉన్నందువల్ల సర్వదా ఆనందితుడైన భగవానుని కృపాదృష్టి దేశికులు జన్మించే సమయంలో తన మీద తన బుద్ధి మీద ప్రసరించింది. ఆ ప్రభావం ఇప్పుడు అనుభవానికి వస్తున్నదన్నారు దేశికులు.

**జాయ మానం హి పురుషం యం పశ్యేన్మ ధుసూదనః**
**సాత్త్విక స్సతు విజ్ఞేయః సవైమోక్షార్థ చింతకః ॥**
**పశ్యత్యేనం జాయమానం బ్రహ్మారుద్రోఽ ధవా పునః ।**
**రజసా తమసా చాస్య మానసం సమభి ప్లుతమ్ ॥** (మహాభారతం)

జన్మిస్తున్నప్పుడు శ్రీ మధుసూదన భగవానుని దృష్టిప్రసరించిన జీవి సాత్త్వికుడై, మోక్షానికి ఉపయోగపడే సత్కార్మానుష్ఠాన పరుడవుతాడు.

జన్మిస్తున్న జీవుని యందు చతుర్ముఖ బ్రహ్మయొక్క దృష్టి పడినట్లైతే, అతడు రజోగుణంచేత, శివుని దృష్టిపడినట్లైతే తమోగుణం చేత అభివ్యాప్తులై జీవిస్తారు. అని శాంతి పర్వం, మోక్షధర్మంలో, త్రిమూర్తుల దృష్టి ప్రభావంలోని భేదం వర్ణింపబడింది. లక్ష్మీనాథుని దృష్టి శ్లక్ష్ణమైనది. "శ్లక్ష్ణం ప్రియంవదే" (అమరం) శ్లక్ష్ణాలోకన మంటే, ప్రేమతో మాట్లాడుతున్నట్లు ఉండే సౌమ్య దృష్టి. భగవంతుని దృష్టి ప్రసరించడానికి ప్రబలమైన పుణ్యం చేసియుండడం కారణం కాదు. దామోదర స్వామి కృపాదృష్టి (దౌర్లలిత్యం) స్వచ్ఛంద వ్యాపారమే. సర్వేశరుని స్వేచ్ఛచేతనే విజృంభించేది. ఆయన పరమదయాళుడు. పరమభక్తులు కొట్టినా, కట్టివేసినా పడియుండే సులభుడు. తల్లి యశోద అచేతనమైన ఱోటిని త్రాటితో కట్టినట్లే, పరమచేతనుడైన చిన్న కన్నయ్య నడుమును ఆ త్రాటితోనే కట్టివేసి, ఇప్పుడెలా పరుగెత్తిపోతావో, పో! అని గద్దించింది. ఆమె చూస్తున్నంత సేపు వెక్కి వెక్కి ఏడ్చాడు. కట్టివేసిన గుర్తు ఇప్పటికీ కన్నయ్య నడుముకు భక్తులకు కనబడుతుంటుంది. దామోదరా! అంటూ భక్తులు భగవానుని సౌలభ్యగుణాన్ని స్మరిస్తుంటారు. "ఎత్తిర ముఱలినోడు" అని నమ్మాళ్వార్లు శ్రీకృష్ణుని సౌలభ్య గుణానికి నివ్వెరపడి ఆరు మాసాలు మూర్ఛపోయారట. ఒకరిని మించి మరొకరు, ఆ దివ్య దంపతులు నిర్హేతుక జాయమాన దయార్ద్ర దృష్టిని దేశికులపైన, ఆయన 'మనీష' పైన ప్రసారించడం వల్ల సదాచార్య సంపత్తి కలిగింది.

**ఈశ్వరస్య చ సౌహార్దం యదృచ్ఛా సుకృతం తథా।**
**విష్ణోః కటాక్ష మద్వేషఅభిముఖ్యం చ సాత్త్వికైః ।**
**సంభాషణం షడేతాని హ్యాచార్య ప్రాప్తిహేతవః ॥**

సదాచార్య సంబంధం పొందడానికి ఆరు కారణాలున్నాయి.

1. మొట్టమొదట జీవుల విషయంలో భగవానుడు శుభసంకల్పంచేయడం.
2. భగవత్సంకల్ప ప్రభావంచేత, తనకు తెలియకుండా, సత్కర్మలా - చరించడం.
3. ఆ సత్కర్మల నిమిత్తం ఆ భగవానుడు కృపతో కటాక్షించడం.
4. కటాక్ష ఫలితంగా జీవుల మనస్సులో ద్వేషం తొలగిపోవడం.
5. అద్వేష మూలంగా భగవంతుని వైపు అభిముఖుడవడం.

6. అభిముఖ్యం వల్ల సాత్త్వికులతో  కలసి సంభాషించడం.

క్రమంగా, సత్సంగ ప్రభావం వల్ల సదాచార్యులను పొందగలుగుతారు. భగవత్కారుణ్యం జన్మతః కలిగినందువల్ల దేశికుల మనీషకు సదాచార్యులవల్ల ఆచార్య పరంపరగా ప్రాప్తించిన పరిశుద్ధోపదేశం లభించింది.  ఆ ఉపదేశ ప్రభావం వల్ల దివ్యాజ్ఞారూపమైన శ్రీ భాష్యాది ప్రబంధాలను మనీష స్వాయత్తం చేసుకొన్నది. "అస్మద్దేశిక  సంప్రదాయరహితైరద్యాపినా లక్షితః" - భగవద్రామానుజ సంప్రదాయం లేనివారికి నేడు కూడా యతిరాజు శ్రీసూక్తులు అవగతమవడం అశక్యమే కదా! కల్లబొల్లి మాటలు చెప్పి దేశికుల మనీషను వశపరచుకోదలచిన కుదృష్టులను, ఆ మనీష స్వాధీనలైయున్న వాణీశత (స్త్రీల) మూలంగా ఉరిమితరిమి వేసింది.

రామానుజ సిద్ధాంతాన్ని పోషించే శతాధిక ప్రబంధాలను రచించి నిః స్వార్థభావంతో సేవచేసిన 'మన్మనీష'కు సముచితమైన పారితోషిక మీయదలచి శ్రీ శ్రియఃపతులు విశేషంగా కటాక్షించారు.

మమ మనీషా శ్రుతి శిరః ప్రాసాదమాసీదతి : స్వచ్ఛందంగా వెల్లి విరిసిన భగవత్కృపాకటాక్షంవల్ల నవ నవోన్మేషయైన దేశికుల మనీష (నాయిక) ఉభయ విభూతినాయకుని ప్రాసాదంలో విరాజిల్లుతున్నది. దేవమందిరానికే, రాజభవనానికే 'ప్రాసాదం' అని పేరు "ప్రాసాదో దేవభూభుజామ్" (అమరం) ఉపనిషత్తులకే శ్రుతిశిరస్సు, వేదాంతశాస్త్రం అని పేరు. ఉపనిషత్ప్రతిపాదితుడు ఉభయవిభూతినాయకుడైన  శ్రీమన్నారాయణుడు.  "ఉపనిషదర్థం ఉలూఖలేనిబద్ధమ్" - వేదాంతశాస్త్రార్థమైన భగవానుడు రోటికి కట్టబడినాడని ధ్వనించడానికే ఈ శ్లోకంలో 'సామోద దామోదర శ్లక్ష్ణాలోకనం" ప్రయుక్త మయింది.

ఒక భార్య గల పురుషునితో మరొక స్త్రీ కలియగోరడం  విడ్డూరమే కదా! అంటే, ఆళ్వారాదులు అనేక మధుర భావాలతో పరమ పురుషుని అంతరంగాన్ని రసతరంగితం చేశారు.

"దేవ్యః సహస్రం తథా". (26) పరమ పురుషునితో సంబంధమున్న వేల మహిళలను లక్ష్మీదేవి (పట్టమహిషి) తన అవయవాలుగానే కటాక్షించింది, అన్నారు శ్రీగుణరత్నకోశంలో శ్రీపరాశరభట్టర్. 'మనీష, వేదాంతసౌధంలో ప్రవేశించడం' అంటే సర్వోపనిషత్సారమైన భగవద్రామానుజ సిద్ధాంతాన్ని నిర్ధారణ చేయసమర్థమైనదని భావం.

హేతూత్ప్రేక్ష, దృష్టాంతాల సంకరం. శార్దూల విక్రీడితమ్.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ సత్సంప్రదాయ ప్రసిద్ధ సదాచార్య ప్రసాద సమాసాదిత యతీంద్రోక్తి తాత్పర్యస్య స్వస్యమతిః కృత్స్న వేదాంతార్థ నిర్ణయాయ ప్రభవతీత్యాహ, శుద్ధాదేశేత్యాదినా.

దుగ్ధోదన్వదపత్య – లలితోన్మేషా। దుగ్ధోదన్వదపత్యం – క్షీరాబ్ధి తనయా లక్ష్మీః. తస్యాః సన్నిధానాత్ సదా సామోదః – సదానందః, తస్యదామోదరస్య – హరేః, శ్లక్ష్ణాలోకనం – దయార్ద్రాలోకనం, తస్యదౌర్లలిత్యేన – స్వైర వ్యాపారేణ, అయోగ్యస్వస్మిన్నత్యంత విజృంభితత్వాత్ దౌర్లలిత్యోక్తిః. తేనలలితోన్మేషా– శ్లాఘ్యాతి శయయుక్తా, జాయమాన కటాక్షవిశేష లబ్ధ మహిమాతి శయేతి యావత్. శుద్ధాదేశ – బహిర్గతిః; శుద్ధాదేశః – సత్సంప్రదాయ సిద్ధసమీచీనోపదేశః, తేన వశంవదీ కృతాయాః సుస్పష్టీ కృతాయాః. యతిక్షోణీశ వాణ్యాః – యతీంద్రోక్తేః ఈశతయా తదర్థ నిర్ణయ సామర్థ్యేన, ప్రత్యాదిష్ట బహిర్గతిః. – నిరాకృత బహిర్వ్యాపారః; "ప్రత్యాదేశోనిరాకృతిః" ఇత్యమరః

ఏతద్రస్యతాతిరేకా దన్యత్ర నగచ్ఛతీతి యావత్. మమమనీషా శ్రుతి శిరః ప్రాసాదం – శ్రుతిశిరోరూపం – వేదాంతరూపం ప్రాసాదం రాజగృహం – "ప్రాసాదోదేవభూభుజామ్". ఇత్యమరః. ఆసీదతి – ప్రాప్నోతి. తత్కర్త్రీభవతీత్యర్థః ప్రాసాదస్థితేః రాజచిహ్నత్వాత్ శ్రుతిశిరోరాజ్ఞీభవతీతియావత్. సర్వవేదార్థ నిర్ణయాయ ప్రభవతీత్యర్థః.

68. ఆస్తాం నామ యతీంద్ర పద్ధతి జుషామాజాన శుద్ధామతి ః
తచ్చా వ్యాజ విదగ్ధ ముగ్ధ మధురం సారస్వతం శాశ్వతమ్ ।
కోవా చక్షురుదంచయే దపి పురస్సాటోపతర్కచ్ఛటా
శస్త్రా శస్త్రి విహార సంభృతరణాస్వాదేషువాదేషున ః ॥

**అర్థం** : యతి+ఇంద్ర, పద్ధతి జుషాం = యతిరాజుల సిద్ధాంతాన్ని అనుసరించిన వారి యొక్క; ఆజాన శుద్ధా = పుట్టుకనుంచి పరిశుద్ధమైన; మతిః = బుద్ధి; ఆస్తాం, నామ = ఉండుగాక, అవ్యాజ, విదగ్ధ, ముగ్ధ మధురం అవ్యాజ=కపటం లేని - స్వాభావికమైన; విదగ్ధ = అర్థ ప్రతిపాదన సమర్థమైన; ముగ్ధ = శబ్దసౌందర్యం గలిగిన; మధుర = అర్థ మాధుర్యం కలిగిన; శాశ్వతం = పరంపరగా స్థిరమైన; తత్ = వారి యొక్క ప్రసిద్ధమైన; సారస్వతం, చ = ప్రబంధ వాఙ్మయం కూడా; ఆస్తాం = ఉండుగాక; నః = మా యొక్క; పురః ముందర (ఎదుట). సాటో ప-స్వాదేషు స+ఆటోప = సంభ్రమంతో కూడిన; తర్క+ఛటా = తర్క సముదాయమనే, శస్త్రాశస్త్రి = శస్త్ర యుద్ధం యొక్క; విహార = లీలచేత; సంభృత = పూర్ణమైన; రణ+ఆస్వాదేషు = యుద్ధరసంగల; వాదేషు= వాదయుద్ధాలయందు; కః వా = ఎడవైనా; చక్షుః = కన్నును; అపి, ఉదంచయేత్ = ఎత్తి చూచునా? కన్నెత్తి చూడజాలడు.

**తాత్పర్యము** : యతిరాజ సంప్రదాయ పరులకు జన్మప్రభృతి నిర్మలమైన బుద్ధి ఉండుగాక. స్వాభావికంగా ప్రౌఢమై, శబ్ద సౌందర్యమూ, విలాసం - ప్రబంధ వాఙ్మయంకూడా అట్లుండుగాక. మా ముందు, ససంభ్రమమైన తర్క సమూహమనే ఆయుధ యుద్ధవిహారంచే కలిగిన రణాభిరుచిగల వాదాలయందు, కన్నెత్తి చూడడానికి ఎవడూ సమర్థుడు కాడు.

**వ్యాఖ్య** : యతిరాజ కృపాపాత్రుడైన దేశికస్వామి, దుర్వాదులను జయింప సమర్థుడని ప్రకటించే శ్లోకమిది.

**యతీంద్ర పద్ధతి జుషాం ఆజానశుద్ధామతిః** : శ్రీ భాష్యకారుల సంప్రదాయంలో మర్మజ్ఞులైన విద్యాంసులు - శ్రీ కూరేశ, శ్రీ కురుకేశ, శ్రీ ప్రణతార్తి హరాచార్యులు మొదలైనవారు ఎందరో ఉన్నారు. వారు జన్మించే సమయంలోనే భగవత్కృపా కటాక్షం వారి మీద ప్రసరించడం వల్ల వారి బుద్ధి

సత్త్వగుణ పూర్ణమయింది. సంశయ విపర్యయాలూ, భ్రమ ప్రమాదాలూ లేనిదై, యథార్థ జ్ఞానం కలిగియున్నందువల్ల, యతిరాజ సిద్ధాంత ప్రవర్తకుల బుద్ధి జన్మ ప్రభృతి పరిశుద్ధమై యున్నది. కొందరికి అన్యథాజ్ఞానం కొంతకాలం ఉండి, తర్వాత ఆలోచించగా యథార్థాన్ని గ్రహించే బుద్ధివంటిది కాదని భావం. సహజంగా ఉన్న వారి పరిశుద్ధమైన బుద్ధిని దుర్వాదులను ఓడించడానికి ఉపయోగించే అవసరం లేదు. దోమలను కొట్టడానికి దుడ్డుకఱ్ఱను వాడుకోనవసరం లేదు కదా!

**ఆవ్యాజ విదగ్ధముగ్ధ మధురం సారస్వతం శాశ్వతమ్:** శ్రీభాష్యాది గ్రంథాలను గురు సన్నిధిలో సేవించిన మహా విద్వాంసుల వాగ్ఝరి నిరర్గళమైనది. వారి సారస్వతం, అంటే సరస్వతీ విలాసం – వారు రచించిన ప్రబంధజాలం స్వాభావికంగా ప్రౌఢమైనది, సూక్ష్మార్థాలను ప్రతిపాదింప సమర్థమైనది. శబ్దసౌష్ఠవమూ, అర్థమాధుర్యమూ కలిగి, పఠన పాఠన ప్రక్రియతో చిరస్థాయిగా నిలచియున్నది. కాబట్టి యతీంద్రమత నిర్వాహకుల నిర్మలమైన ప్రజ్ఞనుగానీ, వారి సారస్వతాన్ని గానీ, ఇతర సంప్రదాయపరులతో శాస్త్ర వాదయుద్ధం చేస్తున్నప్పుడు, ఉపయోగింపనక్కర్లేదు. యతీంద్ర మతనిర్వాహకులే కాదు వారిని అనుసరించిన పరిణతబుద్ధుల ధాటికీ వారి వాక్ప్రవాహానికీ దుర్వాదులందరు సామూహికంగా వాదించడానికి వచ్చినా తట్టుకోలేరు కదా! కాబట్టి, ఆ మహామతుల ప్రబంధాలనూ దుర్వాదులను పరాస్తంజేయడానికి ఉపయో గింపనవసరం లేదన్నారు దేశికులు. అయితే, పరవాదులను పరాస్తం చేయడమెలా సాధ్యం? అంటే –

సాటోప తర్క చ్ఛటా శస్త్రాశస్త్రి విహార సంభృత రణాస్వాదేషు వాదేషు నః పురః అపికోవా చక్షురుదంచయేత్:– తానొక్కడే చాలునట. తన శక్తిని కూడా పూర్తిగా వినియోగించకయే, తాను దుర్వాదులతో శాస్త్ర యుద్ధంజేసి, వారిని పరాస్తం జేయడానికి సమర్థుడని దేశికులు ప్రకటిస్తున్నారు.

శాస్త్రవాదంలో విద్వద్వీర యోధులు పరస్పరం తర్కరూపమైన శస్త్ర యుద్ధం చేస్తారు. ఒకరిపైనొకరు యుక్తులను కొత్తగా ప్రయోగిస్తుంటారు. ఆయుధాలతో ప్రతి యోధులను క్షతగాత్రులను చేస్తుంటే, వీరయోధులు యుద్ధ వీరరసాన్ని

ఆస్వాదిస్తుంటారు. ప్రేక్షకులుకూడా ఉత్సాహంతో ఆ యుద్ధరసాస్వాదన వల్ల సంతోషిస్తుంటారు. శస్త్రాలతో జరిగే యుద్ధాన్ని "శస్త్రా శస్త్రి" అంటారు. అలాగే, తర్కప్రహారాలతో పరస్పరం జరిపే శాస్త్రవాద యుద్ధంలో విద్వద్వీరులు రసానుభవం చేస్తారు.

భయంకరమైన తర్క శస్త్ర ప్రహారాలతో యుద్ధంచేసే శ్రీ వేదాంతదేశికుల యెదుట సర్వశాస్త్రపారంగతులైన పరమతవాద విద్వాంసులు కూడా కన్నెత్తి చూడజాలరు కదా! ఇక సమాధానమే మిస్తారు? అని వెల్లడించారు దేశికులు.

పరమత సిద్ధాంతాలను ఖండించి, యతీంద్రమత సిద్ధాంతాన్ని ప్రవర్తింప జేయడానికి తన పాండిత్యం చాలునని తన యథార్థ స్వరూపాన్ని దేశికులు ప్రకటించడంలో శ్రీ వైష్ణవులు నిశ్చింతగా ఉండాలన్న ఉద్దేశమే ఉంది కాని తన పాండిత్య పటాటోపాన్ని చూపించాలన్న ఆశయమే లేదు.

సీతాదేవి 'వాయుదేవుడు, వైనతేయుడు, నీవు తప్ప నాల్గవవ్యక్తి ఈ లంకకు వచ్చే అవకాశమేలేనప్పుడు వానరులందరు ఇక్కడికెలా వస్తారు?' – అని అడిగితే నిస్పృష్టార్థుడైన హనుమ సీతమ్మకిచ్చిన సమాధానమిలా ఉంది.

**మద్విశిష్టాశ్చ తుల్యాశ్చ సంతి తత్రవనౌకసః ।**
**మత్తః ప్రత్యవరః కశ్చిన్నాస్తి సుగ్రీవ సన్నిధౌ ॥**
**అహంతావదిహప్రాప్తః కిం పునస్తే మహాబలాః ।**
***నహి ప్రకృష్టాః ప్రేష్యంతే, ప్రేష్యంతే హీతరేజనాః॥*** *(సుం.కాండ)*

"వానరరాజైన సుగ్రీవుని సన్నిధిలో *నాకంటె శ్రేష్ఠులూ, నాతో సమానులూ* అయిన వానరులే ఉన్నారు కాని నా కన్న నికృష్టుడైన వాడొక్కడు లేడు. నేనే ఇక్కడికి వచ్చాను. ఇక మహాబలులైన ఆ వానరుల విషయమేమి చెప్పాలి? వారు అవశ్యంగా ఇక్కడికి రాగలరు. ఉత్కృష్టుడైన వ్యక్తిని దూతగా పంపక, నికృష్టుడైన వ్యక్తినే దూతగా పంపుతారు కదా!" అని, హనుమ సీతమ్మకు ఆశ్వాసనం కల్పించడానికి పలికినట్లే, దేశికులు శ్రీ వైష్ణవులకు చింతలేకుండా చేయడానికే అలాగా పలికారు, కాని ఆత్మప్రశంస కోసం కాదు.

సుగ్రీవుని సన్నిధిలో హనుమకేస్థానమున్నదో అదే స్థానం శ్రీమద్రామానుజ సన్నిధిలో దేశికస్వామికి ఉన్నది. శ్రీరామచంద్రస్వామి సన్నిధిలో హనుమకున్న స్థానమే, భగవత్సన్నిధిలో దేశికులకున్నది. యతీంద్ర సంప్రదాయ నిర్వాహకులైన ఆచార్యుల ఆజానశుద్ధ మతినీ, ఉత్తమగ్రంథ నిర్మాణశక్తినీ, లోకోత్తర శాస్త్రార్థసామర్థ్యాన్నీ చూచి, ఉత్సాహంతో శ్రీ వైష్ణవులు రామానుజార్యదివ్యాజ్ఞను ప్రపంచంలో పలుదెసల ప్రసరింప జేయాలన్న కవి ఆశయమే కమనీయం.

రూపకానుప్రాణితమైన అర్థాపత్త్యలంకారం. 61 నుంచి 68 వరకున్న శార్దూల విక్రీడిత వృత్త శ్లోకాలలో ఇది చివరిదైనందువల్ల "సాటోపతర్కచ్ఛటా శస్త్రాశస్త్రి విహార సంభృతరణం" వృత్తానుగుణమే కదా!

**సంస్కృత వ్యాఖ్యా :** అథయతీంద్ర దయా విషయీకృతః స్వయమేవ సర్వదుర్వాది విజయాయాలమిత్యాహ, ఆస్తామితి. యతీంద్ర పద్ధతిజుషాం - యతీంద్ర మతనిర్వాహకానాం కూరాధీశ వాధూల దాశర థ్యాదీనాం; ఆజానశుద్ధా - స్వభావ పరిశుద్ధా, మతిః - బుద్ధిః; ఆస్తాం నామ. అవ్యాజ విదగ్ధ ముగ్ధమధురం- విదగ్ధం అర్థప్రతిపాదన సమర్థం, ముగ్ధం శబ్ద సౌమ్యతాది యుక్తం, మధురం అర్థమాధుర్యయుక్తం, శాశ్వతం - స్థిరం, ఏవంగుణో పేతతయా ఉత్తర కాలీనైః సర్వైరనుసంధేయం, వాద్యంతరాదూషణీయంచ, తచ్చసారస్వతం, ఆస్తాం-తిష్ఠతు. నః - అస్మాకం, సాటోపతర్కచ్ఛటా - ససంభ్రమ తర్కసమూహాః, తైః సంజాతః, శస్త్రాశస్త్రి- శస్త్రైశ్చ శస్త్రైశ్చ ఇదం యుద్ధం శస్త్రా శస్త్రి, తద్రూపో విహారః - వ్యాపారః, తేన సంభృతరణా స్వాదేషు - సంజాతయుద్ధరసేషు, కోవాచక్షురుదంచయే దపి - నేత్ర మున్మీలయే దపీత్యర్థః ప్రతివాదిన్యోఽస్మద్వాదం నిరీక్షితుం నశక్నువంతీ త్యర్థః.

**అత్రప్రభావలీ :** శ్రీభాష్యాది వేత్తారః, శ్రీ భాష్యాది శాస్త్రంచ తిష్ఠతు, కేవలం మమపురః వాదాహవే కోవిద్వాన్ చక్షురున్మీల యితుం శక్త ఇత్యాహ. ఆస్తామితి. యతీంద్రస్య పద్ధతిః - మతం, తజ్జుషాం మహతాం, ఆజానశుద్ధా - స్వతో నిర్మలా, యామతిః, సా ఆస్తాంనామ. తస్యాః దుర్వాదినో న పర్యాప్తా ఇతి భావః. తేషాం మహతాం, ఆవ్యాజ విదగ్ధముగ్ధమధురం - అవ్యాజం

యథాతథా, స్వభావత ఇత్యర్థః. విదగ్ధం - ప్రౌఢం, ముగ్ధం - లలితం, మధురం రసవత్, యత్ సారస్వతం - ప్రబంధ రూపమస్తి, తచ్చాస్తాం. తదప్యేతేషాం నిరాసే నాక్షేపణీ య ఇతి భావః. నః - కేవలమస్మాకం, పురః - పురతః; సాటోపేత్యాది - సాటోపా - ససంభ్రమా, యా తర్కచ్ఛటా - యుక్త్యుప న్యాస పరంపరా, అనుమానప్రయోగ పరంపరావా, సైవ, శస్త్రా శస్త్రి - శస్త్రైః ప్రవృత్తం యుద్ధం, తదేవ విహారః - లీలా, తేన సంపాదిత యుద్ధరసవత్సు, వాదేషు, కోవాదుర్వాదీ సకలశాస్త్రార్థ మూర్ధాభిషిక్తోఽపి కశ్చిత్, చక్షురున్మీలయేదపి - చక్షురున్మీలయితు మపిన శక్నోతి, కి ముప్రత్యుత్తరం దాతు మిత్యపి శబ్దార్థః.

**69.** **పర్యాప్తం పర్యచైషం కణ చరణ కథా మాక్షపాదం శిశిక్షే**
**మీమాంసా మాంసలాత్మా సమజనిషి ముహుః సాంఖ్య యోగౌ సమాఖ్యం।**
**ఇత్థం తైస్తై ర్యతీంద్ర త్రుటిత బహుమృషా తంత్ర కాంతారపాంథై**
**రంత ర్మోహక్షపాంధై రహహ కిమిహ న శ్చింత నీయం తనీయః ॥**

**అర్థం :** కణచరణ కథాం = కణాదుని శాస్త్రమనే కథను; పర్యాప్తం = కావలసినంత; పర్యచైషం = పరిచయం కలిగియున్నాను. ఆక్షపాదం = అక్షపాదుని శాస్త్రాన్ని; శిశిక్షే = నేర్చాను. మీమాంసా, మాంసల + ఆత్మా = మీమాంసాశాస్త్రం చేత; వృద్ధిని బొందిన మనస్సుకల వాడనై; సమజనిషి=ఉన్నాను. సాంఖ్య యోగౌ = సాంఖ్య, యోగశాస్త్రాలను; ముహుః = పదేపదే; సమాఖ్యం = అభ్యసించాను. ఇత్థం = ఈ విధంగా - ఆయాశాస్త్ర పరిజ్ఞానం కలిగియుండగా; యతీంద్ర - పాంథైః । యతీంద్ర = యతిరాజు చేత; త్రుటిత = ఖండింపబడిన; బహు = అనేక విధాలైన; మృషా తంత్ర= అబద్ధాలతో కూడిన, అర్థశూన్యశాస్త్ర రూపమైన, కాంతార = అడవులలో; పాంథై = సంచరిస్తున్న; అంతర్మోహక్షపా+అంధైః = మనస్సున, భ్రమ రూపమైన, రాత్రిచేత, గ్రుడ్డివారైన; తైః, తైః = ఆయా సంప్రదాయ వాదులతో, నః = మనకు; ఇహ=ఈ లోక మందు; తనీయః - స్వల్పమైనా; చింతనీయమ్ = గ్రహించదగిన విషయం; కిం = ఏమున్నది? అహహ = ఆశ్చర్యమేకదా!

**తాత్పర్యము :** కణాదుని వైశేషిక శాస్త్రాన్నీ, గౌతమీయ న్యాయశాస్త్రాన్నీ మీమాంసాశాస్త్రాన్నీ, సాంఖ్యయోగశాస్త్రాలనూ బాగా అభ్యసించాను. ఆయా శాస్త్ర మర్మజ్ఞత ఉండగా, శ్రీ భాష్యకారులచే ఖండింపబడిన అబద్ధ సిద్ధాంతాలు అనే అరణ్యాలలో సంచరిస్తూ, అజ్ఞానమనే చీకటి చేత అంధులైన ఆయా సిద్ధాంతవాదుల వల్ల మనం తెలుసుకోదగిన అంశం లేశమైనాలేదు కదా!

**వ్యాఖ్య :** యతిరాజ ప్రబంధాలను అభ్యసించిన వారికి వైశేషిక న్యాయాది శాస్త్రాల యందు చింతనీయాంశమేమీలేదని ప్రకటితం.

ఇతర సంప్రదాయవాదులు మా ముందు కన్నెత్తి, చూడలేనప్పుడు, ప్రత్యుత్తరం చెప్పడానికి సమర్థులెలా అవుతారని గత శ్లోకం ప్రకటించింది. ఇతర మత నిర్వాహకులందరు సకల శాస్త్ర మర్మజ్ఞులైన విద్వాంసులు. మీకు ఆయా శాస్త్ర పరిజ్ఞానం లేనందువల్ల ఇతర సిద్ధాంత వాదులను అనాదరిస్తున్నారని కలిగిన ఆక్షేపణకు సమాధానమే ఈ శ్లోకం.

ఇదువరకే, 38 & 39 శ్లోకాలలో యతిరాజులు ఆయా శాస్త్రకారులను, వారి నిరీశ్వర వాదాలనూ, కల్పిత సిద్ధాంతాలనూ ఖండించిన విషయాన్ని తెలుసుకొన్నాం కదా! ఇక్కడ శ్రీ వేదాతన్త దేశికుల సర్వశాస్త్ర నిష్ణాతృత్వమూ, రామానుజ సిద్ధాంత జ్ఞాన పూర్ణత్వమూ విశదీకరింపబడుతున్నది. శ్రీభాష్య రచన అద్భుతమైనది. బ్రహ్మసూత్రాలకు ఇతర మతనిర్వాహకులు బోధించిన అర్థాలనూ, అభిప్రాయాలనూ, పూర్ణపక్షంగా చర్చించి, తర్వాత సంశయాదులు లేకుండా వాటిని విమర్శిస్తూ విశిష్టాద్వైతం సిద్ధాంతం చేయబడింది. ఇట్టి రచనా సంవిధానం ఇతరుల భాష్యాలలో మృగ్యమనడం సత్యదూరం కాదు. పదవాక్య ప్రమాణ పారీణులైన శ్రీ వేదాంత దేశికుల వారికి సర్వశాస్త్ర వైదుష్యమే లేకపోతే, "న్యాయ సిద్ధాంజనం, న్యాయ పరిశుద్ధి, 'సేశ్వరమీమాంస, మీమాంసాపాదుక, తత్త్వముక్తాకలాపం లాంటి ఉత్తమ ఉద్గ్రంథాలను వారు రచించక పోయే వారు కదా! వారి శాస్త్ర పరిశ్రమ ఎట్టిదో ఈ శ్లోక పూర్వార్థం ప్రకటిస్తున్నది.

**కణచరణ కథాం పర్యాప్తం పర్యచైషం :** 'చర-భక్షణే' అనే ధాత్వర్థం వల్ల 'కణచరణ కథ' అంటే, కణాద మహర్షి ప్రణీతమైన వైశేషిక శాస్త్రం. 'కథ'

అనడం వల్ల ప్రమాణ రహితమై, లోక రంజన కోసం విచిత్రమైన మాటలుకలది అని సూచింపబడింది.

**పర్యచైషమ్ :** 'చిఞ్-చయనే' అనే ధాతువుకు 'పరి' అనే ఉపసర్గవల్ల 'పర్యచైషం' అనే రూపమేర్పడింది. కాణాదమనే వైశేషిక దర్శనం నాకు సంపూర్ణంగా పరిచయమున్నది అన్నారు దేశికులు.

**అక్ష పాదం శిశిక్షే:** అక్షపాదుడనే గౌతమ మహర్షి రచించిన న్యాయశాస్త్రమందు సుశిక్షితుడను. 'శిక్ష' ధాతువు యొక్క 'లిట్' ఉత్తమ పురుషైక వచన రూపం 'శిశిక్షే'. (నేర్చాను, ఇతరులకునేర్పాను').

**మీమాంసా మాంసలాత్మా :** జైమిని మహర్షిప్రణీతమైనది పూర్వ మీమాంసాశాస్త్రం. మాంసం చేత దేహం దృఢంగా ఉన్నట్లే, మీమాంసా శాస్త్రాజ్ఞానం చేత మనస్సు పుష్టిగా ఉంది, అన్నారు దేశికులు. 'సమజనిషి'. 'జని' ధాతువు యొక్క 'లుఙ్' ఉత్తమ పురుషైకవచనమ్. ఇడాగమం 'సమ్' ఉపసర్గ వల్ల 'సమజనిషి' రూపం నిష్పన్నమ్.

మీమాంసా దర్శనాభ్యాసం వల్ల నా మనస్సు పరిపక్వమైనదని అర్థం.

**సాంఖ్యయోగౌ ముహుఃసమాఖ్యమ్ :** కపిలమహర్షి ప్రణీతమైన సాంఖ్యశాస్త్రాన్నీ, చతుర్ముఖబ్రహ్మచే ప్రచారం చేయబడిన యోగశాస్త్రాన్నీ, అభ్యసించడమే కాక అనేక పర్యాయాలు ప్రవచనం కూడా చేశాను. 'సమ్' ఉపసర్గ పూర్వక 'ఖ్యా+ప్రకథనే' ధాతువుయొక్క 'లుఙ్' ఉత్తమ పురుషైక వచన రూపం 'సమాఖ్యమ్'.

సంశయం కలిగినప్పుడు శాస్త్ర చర్చ అవసరమవుతుంది. గుణదోషాలను నిర్ణయించే జ్ఞానమున్న విద్వాంసుడే శాస్త్ర వాదానికి యోగ్యుడు. పరవాదులు ఏ యే శాస్త్రాలతో చర్చిస్తే, దేశికులు ఆయా శాస్త్రాలతోనే వాదించి, గుణదోషాలను ప్రామాణికంగా నిరూపించి వారిని పరాస్తం చేయగల సమర్థుడని తాను ప్రకటించడం వల్ల శ్రీ విశిష్టాద్వైత మత సంప్రదాయపరుల చిత్తముత్తల పడకుండా, నిశ్చింతగా ఉండగలిగింది. అయినా,

యతిరాజులే వైశేషిక న్యాయ శాస్త్రాది పద్ధతులను తన ప్రబంధాలలో ఖండించారు కాబట్టి మనం చింతించనవసరంలేదన్నారు దేశికులు. ప్రమాణ శూన్యమై అబద్ధ సిద్ధాంతాలు అనే అడవుల్లో లోకవంచకులు సంచరిస్తుంటారని ఆయడవులను నరికి వేశారు శ్రీ భాష్యకారులు. అయినా, అజ్ఞానాంధకారం చేత అంధులై ఆ సిద్ధాంతాటవుల్లోనే ఇంకా సంచరిస్తూ వంచించే శాస్త్రజ్ఞుల విషయమై శాస్త్రవాదంచేయకుండా ఊరక ఉండరాదు. వారి నుంచి నేర్చుకోవలసిన అంశం కూడా ఏమీ లేదు. కాబట్టి సర్వశాస్త్ర పారంగతుడు పరమతవాదులను సులభంగా జయింపవచ్చునని నొక్కి వక్కాణించాడు కవితార్కిక కేసరి. రూపక, స్వభావోక్త్యలంకారాల సంకరం. స్రగ్ధరావృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** నను 'కోవా చక్షురుదంచయే' దితి సర్వేషాం వాది నామ వధీరణీయత్వముక్తం. పదవాక్యప్రమాణానాం వేదాంత స్యాప్యపేక్షితత్వాత్ తద్వక్తౄణాం కణాదాక్ష పాదభాట్ట ప్రభాకరాదీనా మవధీరణీయత్వాత్ కపిల ద్రుహిణ తంత్రయోరపి వేదాంత ప్రక్రియాను సారిత్వేన తయోర ప్యవధీరణీ యత్వేన తత్ తంత్రా జ్ఞానాదేవ తేషా మవధీరణీయత్వ వచన మిత్యా శంకా యామాహ, పర్యాప్తమితి.

కణచరణకథాం – (చర–భక్షణే) కణాదోక్తం వైశేషికశాస్త్రమ్. కథా శబ్దేన ప్రమాణశూన్య లోకరంజన విచిత్ర వాక్యత్వం సూచ్యతే. తత్ పర్యాప్తం – యథేష్టం, పర్యచైషమ్ – పరిచితవాన్.

'చిఞ్ – చయనే' ఇత్యస్మాద్ధాతోః పర్యుపసర్గే పర్య చైషమితి రూపమ్. అక్షపాదం – న్యాయశాస్త్రమ్. శిశిక్షే – సమ్యగభ్యస్తవాన్ – శిక్షతి ధాతోర్లిటి ఉత్తమైక వచనే శిశిక్షే ఇతి రూపమ్. మీమాంసా మాంసలాత్మా – మీమాంసా వర్ధిత మనస్కః. సమజనిషి – సంజాతః 'జని' ధాతో ర్లుఙి అచి ఇటి ఉత్తమై కవచనమ్, ఇడాసమాగమే సముపసర్గేచ సమజనిషీతి రూపమ్. సాంఖ్య యోగౌ – సాంఖ్య శాస్త్ర యోగశాస్త్రే, సమాఖ్యం – సమ్యక్ వ్యాకారిషమ్. 'ఖ్యా–ప్రకథనే', ఇత్యస్మాద్ధాతోః 'లుఙి' ఉత్తమై కవచనమ్. ఇత్థం – ఏవంసతి, తత్తచ్ఛాస్త్రమర్మ పరిజ్ఞానే సతీత్యర్థః. యతీంద్రత్రుటిత – ఖండితేషు, బహు విధమృషాభూ తార్థశూన్యశాస్త్ర రూప, కాంతారేషు – మరువనేషు, పాంథైః – సంచారిభిః,

తత్తన్మతనిర్వాహకైరితియావత్. అంతర్మోహక్షపాంధైః - అంతః - మనసి, మోహక్షపయా - భ్రమరూప రాత్ర్యా, అంధైః - యథార్థ జ్ఞానశూన్యైః. తైస్తైః - వాది భిరుక్తం. నః - అస్మాకం. యతీంద్రప్రణీత శాస్త్రాభిజ్ఞానాం అపేక్షితం. తనీయః - అల్పమపి, చింతనీయం కిం - కిమపి నాస్తీత్యర్థః - యతీంద్ర మతానుగుణ సేశ్వర మీమాంసా న్యాయ పరిశుద్ధ్యాదిభిరేవవేదాన్తోపకారకస్యసిద్ధేః శ్రుతి విరుద్ధతయా యతీంద్ర ఖండిత దేవతా యాఃశబ్ద మాత్రత్వ, అపూర్వ ఫలప్రదత్వార్థ పాద నిరర్థకత్వపాషాణవత్ మోక్షానందాః. మోక్షవాదేఽ పి జీవాత్మ జ్ఞాన హేతుకత్వాది వాదిభ్యాం షోడశ పదార్థషట్పదార్థ తత్త్వజ్ఞానమోహనత్వ పరమాణు కారణత్వ వాదానుమానికేశ్వరత్వంచాభిహితేషు అస్మాక మపేక్షితం కిమపి చింతనీయం నాస్తీత్యర్థః. సాంఖ్యయోగస్తు వేదాన్త ప్రక్రియానుసారిత్వేఽ పి తద్విరోధ బాహుళ్యాత్ అనుపాదేయత్వమేవ. ఏవమపి వేదాన్తస్య తదపేక్షాఽ స్తీతి వచన మవాచ్య మితి వదతి 'అహహ' ఇతి.

**70. గాథా తాథా గతానాంగలతి గమనికాకాపిలీ క్వాపిలీనా**
**క్షీణా కాణాద వాణీ ద్రుహిణ హరగిర స్సౌరభం నారభంతే ।**
**క్షామాకౌమారిలోక్తి ర్జగతి గురుమతం గౌరవాద్దూరవాంతం**
**కాశంకా శంకరాదే ర్భజతి యతిపతౌ భద్రవేదీంత్రివేదీమ్ ॥**

**అర్థం :** జగతి = లోకమందు; యతిపతౌ = యతిరాజులైన శ్రీమద్రామానుజులు; త్రివేదీం = (ఋగ్యజుస్సామలనే) మూడువేదాలు అనే భద్రవేదీం = మంగళ వేదికపైన; భజతి = విరాజమానులై ఉన్నప్పుడు; తాథాగతానాం = బౌద్ధుల యొక్క; గాథా = కథ; గలతి = కరిగి నశించిపోయింది. కాపిలీ = సాంఖ్యమత సంబంధమైన, గమనికా = పద్ధతి, క్వాపి (క్వ+అపి), లీనా = ఎక్కడనో దాగింది. కాణాద వాణీ = వైశేషిక మత వాక్కు; క్షీణా = సారహీనమయింది. ద్రుహిణ, హర, గిరః = హిరణ్యగర్భుని యొక్క, పశుపతి యొక్క మాటలు; సౌరభం = పరిమళాన్ని; న, ఆరభంతే = ఆరంభించవు. (నీరసమైనవి). కౌమారిల+ఉక్తిః = భాట్టమత సూక్తి; క్షామా= సన్నగిల్లింది.

గురుమతం = ప్రాభాకర మతం; గౌరవాత్ = గౌరవం నుంచి; దూర వాస్తం = దూరంగా పారవేయబడింది. శంకర + ఆదేః =శంకరాదుల గూర్చి; శంకా = (శంక) సంశయం; కా= ఏమి?

**తాత్పర్యము :** ప్రపంచంలో భగవద్రామానుజయతిరాజులు త్రివేదీ రూపమైన భద్రవేదికనధిష్ఠించి యుండగా బౌద్ధ సాంఖ్య వైశేషికమతాలు క్షీణించాయి. హిరణ్యగర్భ పాశుపత మతాలు పరమళించలేదు. భాట్ట ప్రభాకర మతాలుకృశించాయి. ఇక శంకరాదుల మతాలు క్షీణించాయంటే శంకించడం అనవసరమే.

**వ్యాఖ్య : యతి రాజులచే వేదం సంరక్షింపబడుతుండగా, ఇతర మతాలు తమంతతామే తరిగిపోయాయని వర్ణితం.**

జగతియతిపతౌ త్రివేదీం భద్రవేదీం భజతి (సతి): ప్రపంచంలో యతిరాజు త్రివేదీ రూపమైన భద్రవేదికపైన అధిష్ఠించి యుండగా; వేదమే ఉత్తమ ప్రమాణం. 1) ప్రత్యక్ష 2) అనుమాన 3) శబ్దప్రమాణాలని ప్రమాణాలు మూడు విధాలు: 1) ఇంద్రియాలచే గ్రహించదగిన పదార్థాలు ప్రత్యక్ష ప్రమాణం చేత తెలుస్తాయి. 2) ఇంద్రియాలు గ్రహించలేని పరోక్ష పదార్థాలు అనుమాన ప్రమాణం చేత తెలుసుకోబడుతాయి. ఉదా: పర్వతం మీద అటువైపున్న, పరోక్షమైన అగ్నిని, ప్రత్యక్షంగా వంటయింట్లో చూచిన అగ్ని కి సజాతీయమైనందువల్ల, అనుమాన ప్రమాణంచేత తెలుసుకోగలుగుతాం. 3) పుణ్యపాపాలు, స్వర్గనరకాలు, ఆత్మ-పరమాత్మ, ఇత్యాది అతీంద్రియ పదార్థాలను వేద స్మృత్యాది శబ్దప్రమాణం వల్లనే తెలుసుకో గలుగుతాం. "శ్రుతిఃస్మృతిర్మమైవాజ్ఞా" అన్నట్లు మంగళకరమైన వేదాన్ని భగవదాజ్ఞగా భావించి జీవించే వ్యక్తులు ప్రేయఃశ్రేయస్సులను పొందుతారు.

ఋగ్యజుస్సామాధర్వణాలని వేదాలు నాలుగయినా, అధర్వణవేదం యజుర్వేదంలో అంతర్భవించడం వల్ల, మూడు వేదాల సమాహార రూపం - త్రివేది అయింది. శ్రీ భాష్యకారులు వేదాలను పరమప్రమాణంగా స్వీకరించి వైదిక సిద్ధాంతాన్ని స్థాపించారు. రాజు తనకాధారమైన సింహాసనం మీద

కూర్చుండి న్యాయాన్ని నిర్ణయించినట్లే, యతిరాజు తనకాధారమైన త్రివేదీ రూప భద్ర వేదిక యందాసీనుడై తత్త్వ నిర్ణయం చేస్తుండగా – కలిగిన పరిణామమిలా ఉంది.

**తాథాగతానాం గాథా గలతి:** బౌద్ధుల గాథ భ్రష్టమయింది. 1) వైభాషికులు, 2) సౌత్రాంతికులు, 3) యోగాచారులు, 4) మాధ్యమికులు అని బౌద్ధులు నాలుగు విధాలుగా ఉండడం వల్ల 'తాథాగతానాం' అని బహువచనం ప్రయుక్తం. 1) వైభాషికులు 'సర్వం క్షణికం' అంటారు. ఒక్కక్షణం ఉండి, రెండవ క్షణంలో నశిస్తుంది; స్థిరంగా ఉండదంటారు. 2)) 'జ్ఞాత, జ్ఞేయం' ప్రత్యక్షం కాక, అనుమానంచేత విదితమవుతాయంటారు సౌత్రాంతికులు. 3) జ్ఞాత, జ్ఞేయం, జ్ఞాన మనే మూడింటిలో జ్ఞానం మాత్రమే సత్యం, కాని జ్ఞాత, జ్ఞేయం మిథ్య అంటారు యోగాచారులు. 4) మాధ్యమికులు 'శూన్యమేతత్త్వ' మని చెబుతారు. బౌద్ధుల కథనంలో యుక్తిగానీ, ప్రమాణం గానీ యేదీ లేనందువల్ల 'గాథ' అనబడింది. బౌద్ధ, జైన మతాలు వేద ప్రమాణాన్ని అంగీకరించవు. 'సృష్టికర్త' లేడు కాబట్టి వీరిని వేద బాహ్యులన్నారు శ్రీ భాష్యకారులు. బ్రహ్మసూత్ర ద్వితీయాధ్యాయ, ద్వితీయ పాదంలోని 'సముదాయాధికరణం'లో వైభాషిక, సౌత్రాంతిక సిద్ధాంతాలను, 'ఉలలబ్ధ్యధికరణం'లో యోగా చార సిద్ధాంతాన్ని, 'సర్వధానుప పత్త్యధికరణం'లో మాధ్యమిక సిద్ధాంతాన్ని ఖండించారు. "ఏకస్మిన్నసంభవాధికరణం"లో జైన సిద్ధాంతం ఖండింపబడింది.

**కాపిలీ గమనికా క్వాపిలీనా :** కపిల మహర్షి ప్రణీతమైన సాంఖ్యమత పద్ధతి – ప్రకృతి వల్ల సృష్టి అనే రీతి– ఎక్కడో అదృశ్యమయింది.

**కాణాదవాణీ క్షీణా :** కణాదప్రణీత వైశేషిక మతం 'పరమాణువులచేత సృష్టి' అని చెప్పడం చేత క్షీణించింది.

**ద్రుహిణ హరగిరః సౌరభం నారభంతే :** బ్రహ్మవాక్కులూ, (శివుని) పశుపతి వాక్కులూ పరిమళించడం లేదు. బ్రహ్మ వాక్కులంటే యోగశాస్త్రం. హరవాక్కులంటే పాశుపత మతం. ఈ రెండు మతాలు గాంభీర్యాన్ని పోగొట్టుకొని,

బాలవాక్కులలాగా ఆదరంలేనివయ్యాయి. యోగమతం సర్వవిధాలా జగత్కారణుడైన భగవానుణ్ని నిమిత్త కారణమాత్రుడంటుంది. స్వాభావికమైన భగవానుని సకల కల్యాణగుణాలను ఔపాధికమని పలుకుతుంది.

పాశుపత సిద్ధాంతంలో జుగుప్సాకర విషయాలున్నాయి. కపాలంలో భోజనం చేయాలి. మద్యపూర్ణకలశాన్ని స్థాపించి అందులో దేవతను పూజించాలి. "భగాసనస్థమాత్మానం జ్ఞాత్వా" భగరూపాసనంలో ఆత్మను ధ్యానించాలి. ఇలాగా అసహ్యకరమైన విషయాలు కలది కాబట్టి దేశికులు "కపర్దిమతకర్దమం" (38) అన్నారు.

ఈ మతాల ప్రవర్తకులు వేద ప్రమాణాన్ని అంగీకరిస్తూనే, తన మాటలనే వేదవాక్కులుగా భావింపజేశారు. కాబట్టి శ్రీ భాష్యకారులు "రచనానుపపత్త్యధికరణం"లో సాంఖ్య మత సిద్ధాంతాన్ని ఖండించారు. "యోగప్రత్యుక్త్యధికరణం"లో హిరణ్యగర్భప్రవర్తిత యోగ మత సిద్ధాంతాన్ని, "మహద్దీర్ఘాధికరణం"లో వైశేషిక న్యాయ సిద్ధాంతాలను, "పాశుపతాధికరణం"లో పరమశివ ప్రవర్తిత పాశుపత మత సిద్ధాంతాన్ని తర్కయుక్తులతో, ప్రామాణికంగా ఖండించారు.

**కౌమారిలోక్తిః క్షామా, గురుమతం గౌరవాత్ దూరవాంతమ్** – యతిరాజు తత్త్వ నిర్ణయాన్ని చేసే సమయాన కుమారిలభట్టు, ఇంక ప్రాభాకర గురుమత సిద్ధాంతాలు కృశించిపోయాయి. వీరిద్దరు మీమాంసాదర్శన వ్యాఖ్యాతలు. వీరు 'ఈశ్వరుణ్ని' అంగీకరించరు. వీరిద్దరు దేవతా విగ్రహాది పూజలను అంగీకరించరు. వేదాలను ఒప్పుకున్న వీరు 'అర్ధనాస్తికులు' అనబడినారు. ప్రాభాకర గురుమతం "అపూర్వమే ఫలమిస్తుంది" అనే గౌరవ దోషం కలది. తేలిక వస్తువులు విసరివేస్తే దూరంగా పోజాలవు. గురుత్వం గల వస్తువులాగా గురుమతం దూరంగా పారవేయబడింది. శ్రీ భాష్యకారులు వీరి మత సిద్ధాంతాలను 'జిజ్ఞాసాధికరణం'లోనూ, 'సమన్వయాధికరణం' లోనూ, 'దేవతాధికరణం' లోనూ ఖండించారు.

**శంకరాదేః కాశంకా :** మీమాంసా న్యాయయోగ దర్శనాలలో వేదాంత శాస్త్రానికి ఉపయోగపడే కొన్ని మంచి సిద్ధాంతాలున్నాయి. 'అది' శబ్దంచేత శ్రీ

శంకరాచార్యులే కాక భాస్కరాచార్యులు, యాదవ ప్రకాశమిశ్రులు అద్వైత మత ప్రవర్తకులని గ్రహింపదగిన వారు. ఈ ముగ్గురి మత సిద్ధాంతాలనుంచి సంగ్రహింపదగిన మంచి సిద్ధాంతమేదీ లేదు. సాంఖ్య, బౌద్ధ చార్వాక సిద్ధాంతాల సంకరం నుంచి శ్రీశంకరాచార్య సిద్ధాంతం ఏర్పడింది. జైనుల సిద్ధాంతాల ఆధారంగా భాస్కర, యాదవ ప్రకాశుల సిద్ధాన్తమేర్పడిందంటారు విజ్ఞులు. మూలభూతమైన సాంఖ్య, బౌద్ధ, జైన, యోగదార్శనికులైన గొప్ప ఆచార్యులే నిరసింపబడినప్పుడు శ్రీ శంకరాదులను గూర్చి శంకించేదేమి? స్వయం ప్రకాశుడైన పరమాత్మ అజ్ఞానంచేత ఆచ్ఛాదితుడని, అద్వైత విద్య నెరిగిన జీవుడు ఆ పరబ్రహ్మ యొక్క అజ్ఞానాన్ని తొలగిస్తాడని శ్రీ శంకరాచార్య సిద్ధాంతం. అంధకారాన్ని నశింపజేసే తేజోమయుడైన సూర్యుడు అంధకారంచే ఆచ్ఛాది తుడవడమెంత అసంభావితమో, అలాగే జీవుల అజ్ఞానాన్ని నివర్తింపజేసే జ్ఞాన స్వరూపుడైన పరబ్రహ్మ అజ్ఞానంచే ఆచ్ఛాదితుడవడం కూడా అసంభావితం. అజ్ఞానంలో కూరుకపోయిన, సర్వశక్తి సంపన్నుడైన పరబ్రహ్మ జీవులచే ఉద్ధరింపబడడమూ హాస్యాస్పదమే. అంతేకాదు, అహమర్థవినాశమే మోక్షమని ప్రతిపాదించడం వల్ల శ్రీ శంకరాచార్యుల అద్వైతం అనుపపన్నమే.

భాస్కర, యాదవ ప్రకాశుల అద్వైతంలో, జీవేశ్వరులలో భేదా భేదాలున్నాయి. కాబట్టి వీరి సిద్ధాంతం కూడా అనుపపన్నమే. భేదా భేదాలు రెండు పరస్పర విరుద్ధాలు కాబట్టి ఒక్కచోట ఉండ జాలవు కదా! అందువల్ల, శంకరాదుల అద్వైత సిద్ధాంతాన్ని నిరసించే విషయంలో శంకయెందుకు? జంఝూవాతంలో బరువైన వస్తువులే ఎగిరిపోతుంటే, దూదిపింజలను గూర్చి చెప్పేదేముంది?

భగవద్రామానుజ యతిరాజులు సర్వదార్శనిక వాదులను పరాస్తం చేసి శ్రీమద్వేదమార్గాన్ని నిష్కంటకం చేశారు.

శ్రీమత్తిరువరంగత్త ముదానార్లు రామానుశనూత్తందాదిలో "కూఱుం శమయంగళాఱుం కులైయ కువలయత్తే" (46). లోకంలో అక్రమంగా - వేద విరుద్ధార్థబోధకంగా వాదించే బాహ్యకుదృష్టిమతాలనారింటిని నిర్మూలించిన వారు శ్రీమద్రామానుజ యతిరాజులని కీర్తించారు.

"తఙ్కచ్చమణరుం శాక్కియప్పేయ్‌గళుం తాష్శడైయోన్" (99) కల్పవృక్షం లాగా ఔదార్యంగల శ్రీమద్రామానుజ దివాకరులావిర్భవించి, శ్రీ భాష్యాది శ్రీకోశకిరణాలను అంతట ప్రసరింపజేయడం వల్ల జైన, బౌద్ధ, పాశుపత కుదృష్ట్యాది దుర్మతాంధకారాలు పటాపంచలై పోయాయని స్తుతించిన పాశురాలు ఇక్కడ అనుసంధింపదగినవేకదా!

'యతిరాజసప్తతి' అనే ఈ స్తోత్రంలో ఈ డెబ్బదవ (70) శ్లోకమే చివరిది. ఇకపైన నాలుగు శ్లోకాలున్నవి. అసలు కన్నా కొసరుమిన్న కదా! సమస్త జనులకు విలక్షణమైన స్వరూపజ్ఞానాన్ని ఉపదేశించడం చేత రక్షకులైన భగవద్రామాను జయతిరాజుల కల్యాణ గుణగణాలను అను సంధించుకోవడమే తమ స్వరూపసత్తకు కారణం, అంతేకాని, తమ జ్ఞాన భక్త్యాదు లెవ్వికూడాకారణం కావని దేశికులు వినయంగా ప్రకటించిన వైఖరి గమనీయం.

జగద్గురుకీర్తన వల్ల 'ఉద్దిష్టం' అనే నాట్యాలంకారమిది. "ఉద్దిష్టం స్యాత్ పరోక్షేచ ప్రత్యక్షే చార్థకీర్తనమ్". (అమృతానందవచనం) స్రగ్ధరా వృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథ రామానుజాచార్యేత్రయీ సంరక్షకే సతి మతాంత రాణి స్వయమేవ భగ్నానిభవంతీ త్యాహ, గాథేతి. జగతి యతిపతౌ- యతిరాజే, త్రివేదీం - వేదాన్త సముదాయం, త్రయాణాం వేదానాం సమాహారః త్రివేదీ, తాం; భద్రవేదీం - భద్రాసనం, భజతి - అధితిష్ఠతి సతి; త్రివేది సంరక్షకే సతీత్యర్థః. తాథాగతానాం - సౌగతానాం, గాథా - శబ్దమాత్రం, నార్థవతీ త్యర్థః. గళతి - స్వయయేన భ్రశ్యతి.

కాపిలీ గమనికా - సాంఖ్యమతం విస్మయ సంపాదక పద్ధతిః - గమనికా మాత్రం న ప్రమాణవ దిత్యర్థః. క్వాపి లీనా - అదృశ్యాజాతా.

కాణాదవాణీ -వైశేషిక మతం, క్షీణా - క్షయం ప్రాప్తా. ద్రుహిణ హరగిరః - సేశ్వర సాంఖ్యశైవ మతే అపి, సౌరభం - పరిమళం, నారభంతే- ఆదరణీయతాం నప్రాప్నువంతీత్యర్థః. కౌమారిలోక్తిః - భాట్టమతం, క్షామా- తన్వీజాతా. అప్రామాణికాంశం హాపయిత్వా, ప్రామాణికాంశేన స్థాపితా.

ప్రాభాకరమతం గురుమతం. గౌరవాత్ – కల్పనా గౌరవాత్, దూరవాంతం – దూరతఃక్షిప్తమ్. శంకరాదేః – శంకరాదిమతస్య ఏకదేశేఽపి ప్రామాణ్య రహితస్యేత్యర్థః. కా శంకా – జీవన శంకా నాస్త్యే వే త్యర్థః.

**అత్రప్రభావలీ :** గాథేతి. యతిపతౌ, త్రివేదీం భద్రవేదీం – త్రివేదీరూపం మంగళవేదికాం, భజతి – అధిరూఢవతి, ప్రమాణత్వేన స్వీకుర్వతి సతి; తథాగతాః – బౌద్ధాః. తన్మతాను వర్తినాం గాథారూపం శాస్త్రం, యుక్తిరాహిత్యాత్. గళతి – స్రంసతే. శిథిలతామేతి. కాపిలీ గమనికా, కుత్రాప్యంతర్హితా నజ్ఞాయతే. కణాదసంబంధినీ వాణీ – శాస్త్రం, క్షీణా – పరిక్షీణా. ద్రుహిణ హరయోఃగిరః – యోగ పాశుపత తంత్రే ఇత్యర్థః. సౌరభం – గంభీరతాం, నారభంతే – బాల వాక్యవత్ న ప్రకాశంతే ఇత్యర్థః. కౌమారిలోక్తిః – భాట్టశాస్త్రం, క్షామా – క్షీణా – జగతీతి సర్వత్రానుషంజనీయమ్. గురోః – ప్రాభాకరస్య, మతం, గౌరవాత్ – అపూర్వాది కల్పనా ప్రవేశాత్ దూరవాంతం – దూరోత్సారితమ్. శంకరాదేః – శంకర భాస్కర యాదవ కుదృష్టి త్రయస్య, కాశంకా – నిరాస విషయ శంకాయా అవకాశ ఏవనాస్తి. తథాగత నిరాసనేనైవ నిరస్త త్వాదితి భావః.

అన్యచ్చ :– గాథేతి. తథాగతః – బుద్ధః, తన్మతానుసారిణః తాథాగతాః. గాథాయాః కుత్రా ప్యనుప్రవేశానర్హతయా గలతీత్యుక్తిః. ప్రకృత్యు పాదానత్వా ద్యభ్యుపగమేఽపి స్వాతంత్ర్యాభ్యుప గమాప రాధేన క్వాపిలీనేత్యుక్తిః. "యత్కించి దన్యదపి వామతమ్" ఇత్యుక్త రీత్యా భేదా దిప్రక్రియాణాం బహూనాం స్వీకారేఽప్యేక దేశవిరుద్ధతయా క్షీణేత్యుక్తిః. తదుక్తార్థలేశోఽ ప్యనాదృత ఇతివక్తుం సౌరభం నారభంత ఇత్యుక్తిః. ఏకదేశాను పాదేయతయా క్షామేత్యుక్తిః. గురుద్వేష ప్రవృత్తతయా దూరవాన్త మిత్యుక్తం. సమూలోన్మూలితాః శంకరాదయ ఇత్యాహ, కాశంకేతి. ఆది పదేన యాదవ భాస్కరౌ గ్రాహ్యౌ. అత్ర ప్రత్యక్షే గురుకీర్త నాత్ 'ఉదిష్టం' నామ నాట్యాలంకారః.

'ఉద్దిష్టంస్యాత్ పరోక్షేచ ప్రత్యక్షే చార్థకీర్తనమ్' ఇత్యమృతానందవచనాత్.

71. విష్వ గ్వ్యాపిన్యగాధే యతినృపతి యశస్సంపదేకార్ణవేఽస్మిన్
శ్రద్ధా శుద్ధావగాహైః శుభమతిభి రసౌ వేంకటేశోఽభిషిక్తః ।
ప్రజ్ఞా దౌర్జన్య గర్జత్ప్రతి కథక వచస్తూలవాతూలవృత్త్యా
సప్తత్యాసార వత్యా సమతనుత సతాం ప్రీతి మేతాం సమేతామ్॥

**అర్థం** : విష్వక్ + వ్యాపిని = అంతట వ్యాపించిన; అగాధే = చాలా గంభీరమైన, అస్మిన్ = ఈ; యతినృపతి యశః సంపత్+ఏక+అర్ణవే। యతినృపతి = యతిరాజు యొక్క యశః సంపత్ = కీర్తిసంపత్తుఅనే, ఏకార్ణవే = ఒక మహాసముద్రమందు; శ్రద్ధా శుద్ధ + అవగాహైః = శ్రద్ధచే శుద్ధస్నానం కలవారైన; శుభమతిభిః = మంచి ధిషణ గల పరమభాగవతులచే; అభిషిక్తం = అభిషేకం చేయబడిన; (తెల్పబడిన) అసౌ = ఈ, వేంకటేశః = వేంకట నాథుడనే కవి; ప్రజ్ఞా – వృత్త్యా। ప్రజ్ఞాదౌర్జన్య = ప్రజ్ఞ యొక్క దుష్టత్వం వల్ల – ప్రజ్ఞలేనందువల్ల; గర్జత్ = గర్జిస్తున్న; ప్రతికథక వచః = ప్రతివాదుల వాక్కులు అనే; తూల = దూదికి; వాతూల = మహావాయువు యొక్క; వృత్త్యా = వ్యాపారం కల్గిన; సారవత్యా = సారమైన అర్థాలు గల; సప్తత్యా= డెబ్బైశ్లోకాలున్న ఈ స్తోత్రం చేత; సతాం = సత్పురుషులకు; సమేతాం= కూడియున్న; ఏతాం = ఈ, ప్రీతిం = ప్రీతిని; సమతనుత = విస్తరింపజేసెను.

**తాత్పర్యము** : పలు దిశలు వ్యాపించిన గంభీరమైన యతిరాజుల కీర్తి సంపద్రూపమైన ఏకార్ణవ మందు శ్రద్ధా పూర్వకంగా స్నానమాచరించిన ప్రజ్ఞాధురీణులైన పరమభాగవతులచే అభిషేకింపబడిన శ్రీ వేంకటనాథకవి, దుష్టత్వం చేత గర్జిస్తున్న ప్రతిపక్షుల వాక్కులనే దూదిని తేలికగా ఎగురగొట్టే పెద్దగాలి వంటిదైన, సారవంతమైన యతిరాజ సప్తతి అనే ఈ సోత్రం చేత సజ్జనులకు సంప్రీతిని విస్తరింపజేశాడు.

**వ్యాఖ్య** : దేశికులు రచించిన ఈ స్తోత్రం సాత్త్వికులకు ప్రీతిజనకమని సుశ్లోకితం.

'సప్తతి' పూర్తియైన తర్వాత దాని మహిమను ప్రకటిస్తున్నారు దేశికులు. ఈ శ్లోకంలోని పూర్వార్థం పూర్యాచార్యుల సుబుద్ధిని ప్రశంసిస్తున్నది.

'యతినృపతి వచఃసంపత్' అని పాఠాంతరం. యతిరాజులైన శ్రీ భాష్యకారుల సూక్తి, కీర్తి శ్రీవైష్టవులకు సంపత్తు. సంపదలాగా శ్రీ భాష్యకారులవాణి, యశస్సు భోగ్యమైనది. ఆపదలో రక్షించేది కాబట్టి దాన్ని హృదయ మంజూషలో భద్రంగా కాపాడుకోదగినది.

యతిరాజుల కీర్తి, వాణి ఏకార్ణవం వంటిది. సముద్రాలన్ని కలిసి ఒక్కటైతే ఏకార్ణవం అనబడుతుంది. మహార్ణవం అగాధమై భూమండలమంత వ్యాపించి ఉంటుంది. అలాగే యతిరాజుల కీర్తి, వాణి గంభీరమైనది. సూక్తి మర్మాన్ని తెలుసుకోవడం కష్ట సాధ్యం. సూక్తివైభవం, కీర్తి సంవత్తు అర్ణవం లాగా విశ్వవ్యాప్తమైనది. మహాసముద్రస్నానం పవిత్రమైనది. సముద్రంలో ఒక్కసారి స్నానంచేస్తే అన్ని నదులలో స్నానంచేసినంత ఫలం లభిస్తుంది. అలాగే శ్రీవైష్ణవులు శ్రీ భాష్యకారుల సూక్తులను శ్రద్ధతో వింటే సత్పురుషుల చరిత్రలనూ, గ్రంథాలనూ పఠించినంత ఫలం లభిస్తుంది. పవిత్రమైన శ్రీసూక్తులను పదేపదే మననం చేయడం వల్ల బుద్ధి సంస్కరింపబడుతుంది. అసూయాది దోషాలు తొలగిపోయి శుభమతులవుతారు. ఇలాగా సుధీమణులైన ఆచార్యులు యతిరాజుల పవిత్రమైన కీర్తి, సూక్తి సంపత్తును ఇతరులకు అందజేస్తారు. ప్రావీణ్యం కలవారు ఆచార్యవైభవాన్ని తెల్పుతారు.

శ్లోకంలో నిర్దిష్ట సర్వనామ పదప్రయోగ పూర్వక శబ్దాలను మూడింటిని సూచించారు దేశికులు.

1. అస్మిన్ ఏకార్ణవే = ఈ విశాలార్ణవ మందు
2. అసౌ వేంకటేశః = ఈ వేంకటనాథకవి.
3. ఏతాం ప్రీతిమ్ = ఈ ప్రీతిని.

సాత్త్వికత్యాగ పురుషులైన ఆచార్యులు శ్రీ భాష్యకారుల సూక్తి సంపత్తనే ఏకార్ణవంలో అవగాహించి శుభమతులై, కృపాళురై యతిరాజుకీర్తివైభవాన్ని స్తుతించి కాపాడడానికి ఈ వేంకటనాథ కవిని అభిషేకించి ప్రేరేపించారని సూచింపబడినది.

ఆత్రేయ రామానుజాచార్యులు పంచాబ్ద ప్రాయుడైన దేశికులను శ్రీ భాష్యకాలక్షేపగోష్ఠికి వెంటబెట్టుకొని పోయినప్పుడా బాలుని వర్చస్సును చూచిన శ్రీ వాత్స్య వరదాచార్య స్వామి వారు ఇలా ఆశీర్వదించారు. (ఈ వరదగురువే నదామార్ అమ్మాళ్ అని ఖ్యాతిని పొందారు).

**ప్రతిష్ఠాపిత వేదాన్తః ప్రతిక్షిప్త బహిర్మతః ।**
**భూయాస్త్రై విద్యమాన్యస్త్వం భూరికల్యాణ భాజనమ్ ॥**

ఈ శ్లోకం కాలక్షేపగోష్ఠి జరిగిన కంచి వరదరాజ పెరుమాళ్ళ కోవెలలో తూర్పువరండా పై కప్పుపై నేడు కూడా చూడవచ్చును. 'అధికరణ సారావళి'లోనూ, సంకల్ప సూర్యోదయం (2 అంకం) లోనూ సుసంగతం.

"నీవు వేదాన్త స్థాపకుడవగుదువుగాక. ఇతర మతసిద్ధాంతాలను నిరసింతువుగాక. నీవు త్రివేదుల ప్రశంసను పొందెదవుగాక. నీవు శుభాస్పదుడవగుదువు గాక" అని శ్లోకార్థం.

**అసౌవేంకటేశః :-** ఈ ఆచార్యులకు వేంకటేశుడు, వేంకటనాథుడని పితృకృతనామం. "భాద్రపద మాసగత విష్ణువిమలర్క్షే వేంకట మహీధ్రపతి తీర్థదిన భూతే, ప్రాదురభవత్". శ్రీ వేంకటాచలపతియైన శ్రీనివాస భగవానుని జన్మనక్షత్రమైన పురట్టాశి శ్రవణ నక్షత్రం, ఆయన బ్రహ్మోత్సవావభృథ దినమందు అవతరించిన ఈ దివ్య శిశువుకు 'వేంకటనాథు'డని నామకరణం చేశారు. 'వేంకటేశావతారోఽ యమ్' - వేంకటేశావతారమే అని పెద్దల నిర్ణయం. తర్వాత వీరి జీవితకాలంలోనే 'ఉత్ప్రేక్షతే బుధజనైరుపపత్తి భూమ్నాఘంటా హరేః సమజనిష్ట యదాత్మనేతి" (సం.సూ) వీరిని శ్రీ వేంకటేశుని ఘంటావతారు' లని పలుకారణాల వల్ల వ్యవహరించారు.

"వేదాంత దేశిక పదం వినివేశ్య బాలం దేవః" (ద.శ.) శ్రీరంగనాథుడు ఈ ఆచార్యులకు 'వేదాన్తాచార్య' బిరుదునిచ్చాడని ఆచార్య చరిత్రలోనూ ఉంది. ఇంతేకాక, "సర్వతంత్ర, కవితార్కిక సింహ, సమస్యా సహస్రీ" ఇత్యాది బిరుదాంచితులు వీరని వీరికృతుల వల్ల తెలుస్తున్నది. "అగణి సదసి సద్భిః యః సమస్యా సహస్రీ, కవికథక మృగేంద్రః సర్వతంత్ర స్వతంత్రః".

ఈ బిరుదులను పేర్కొనక, వేంకటేశభగవానుడే తనను నిమిత్తంగా చేసుకొని ఈ కృతులను రచించాడనీ, సత్పురుషులే మంగళాశాసనం చేసి ఇలాగా తనను సిద్ధం చేశారనీ, "శుభ మతిభిరసౌ వేంకటేశోఽ భిషిక్తః" అని నామకరణ సంస్కారంచేత సంగతమైన శుభ నామమే వినయంగా పేర్కొనబడింది.

ఉత్తారార్థం రెండు విషయాలను వెల్లడిస్తున్నది.

1. జ్ఞాన దౌష్ట్యంచేత తమను తాము బుద్ధిమంతులమనుకొనే పరవాదులు గర్జిస్తుంటారు. వారి ప్రలాపాలన్నీ దూదిపింజలలాంటివి నిస్సారమైనవి. యతిరాజ సప్తతి సారవంతమైనది, ప్రచండ వాయువుతో సమానంగా పనిచేస్తుంది. ఈ స్తోత్రం చేత ప్రతిపక్షుల వాదాలన్నీ ఎగిరిపోతాయి, పరాస్తమవుతాయి.

2. సారమైన అర్థాలతో రసపూర్ణమైన ఈ స్తోత్రం సత్పురుషులకు సంప్రీతిని కలిగిస్తుంది. ఈ స్తోత్రాన్ని పఠించిన, విన్నవారి మనస్సు ఇతరత్ర చలించక దీనియందే స్థిరంగా ఉంటుంది. యతిరాజులవాగ్వైభవాన్ని స్తుతించి నందువల్ల, సత్పురుషుల అపారప్రీతికి పాత్రుడనయ్యానని కవి హృదయాన్ని ఆవిష్కరిస్తున్నది ఉత్తరార్థం.

"అంగీకృత్య సతాంప్రసత్తిమసతాం గర్వోపి నిర్వాపితః" (ర.త్ర.సా.) అన్నట్లు, పరమాచార్యుల అనుగ్రహాన్ని పొంది యతిసార్వభౌముల సూక్తి, కీర్తి వైభవాన్ని ప్రశంసించినందువల్ల, ప్రజ్ఞాదౌర్జన్యుల ఆఖర్వగర్వాన్ని నిర్వాపణ చేయడమూ, రామానుజయతిరాజ సిద్ధాంతాన్ని నిర్ధారణ చేయడమూ జరిగింది.

**ఏతాంప్రీతిమ్ :** సదాచార్యుల ఆజ్ఞనూ, ఆశయాలనూ నెరవేర్చినందువల్ల తనకంటె పూర్వులైన ఆచార్యులకూ, అనంతరీయులైన ఆచార్యులకూ అపారమైన ప్రీతిని వర్ధిల్లజేసి, దేశికులు ఆచార్యులందరి ప్రీతికి ప్రాతులైనట్లు సుశ్లోకింపబడింది.

కవి నామం ఉండడం వల్ల ఇది ముద్రాలంకారం. స్రగ్ధరావృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అధైతత్ప్రబంధస్య సర్వసత్ప్రీతి విషయతామాహ, విష్వగితి. విష్వగ్వ్యాపిని – విష్వగ్వ్యాప్తే, అగాధే – అపరిచ్ఛేద్యే, అస్మిన్యతినృపతి

యశస్సంపదేకార్ణవే - యతిరాజకీర్తి రూప ప్రళయార్ణవే, శ్రద్ధా శుద్ధావగాహైః - తత్రావణ్య సిద్ధతత్పరిజ్ఞానైః, శుభమతిభిః - జ్ఞాతృభిః, అనుగ్రహపరైరాచార్యైః

**అభిషిక్త :** ఆప్లావితః, తద్వైభవం జ్ఞాపితః, తద్వైభవజ్ఞాః ఆచార్యాః అస్యాపి తద్వైభవం జ్ఞా పయంతీత్యర్థః. అసౌవేంకటేశః; ప్రజ్ఞేత్యాది. ప్రజ్ఞాయాః దౌర్జన్యం - దుష్టత్వం, తేన గర్జతాం ప్రతికథకానాం - ప్రతివాదినాం, వచో రూపతూలానాం వాతూలవృత్యా - యతిరాజ సప్తత్యా, సతాం, ప్రీతి మేతాం - యతిరాజసప్తతిం, సమేతాం - సంగతాం, సమతనుత - విస్తృతవాన్. యతి రాజసప్తతిం శ్రవణానంతరం సతామన్యత్ర ప్రీతిర్నభవతీత్యర్థః.

**72. ఆశా మతంగజ గణా న విషహ్యా వేగాన్**
**పాదే యతిక్షితిభృతః ప్రసభం నిరుంధన్ ।**
**కార్యః కథాహవ కుతూహలిభిః పరేషాం**
**కర్ణే స ఏష కవితార్కిక సింహనాద ః ॥**

**అర్థం :** అ విషహ్యా వేగాన్ = దుర్దమమైన వేగం గల; ఆశామతం గజ గణాన్ = (పరవాదుల) ఆశలనే మదపుటేనుగుల సమూహాలను; యతిక్షితి భృతః = యతిరాజులనే పర్వతం యొక్క; పాదే = పాద ప్రదేశమందు; ప్రసభం = బలాత్కారంగా, నిరుంధన్ = నిరోధిస్తున్న; సః = ఆ, ఏషః = ఈ; కవితార్కిక సింహనాదః = కవులకూ, తార్కికులకూ, సింహంలాంటి దేశికుల యొక్క ' యతిరాజసప్తతి' అనే సింహనాదం; కథా+ఆహవ, కుతూహలిభిః = శాస్త్రవాద యుద్ధమందు ఉత్సాహంకలిగిన శ్రీ వైష్ణవులచేత; పరేషాం = పరవాదుల యొక్క; కర్ణే, కార్యః = చెవియందు వేయదగినవి.

**తాత్పర్యము :** అణచరాని, ఆపరాని వేగం గల పరవాదుల ఆశలు అనే మదగజ సమూహాలను యతిరాజుల చరణాలనే పర్వతపాదప్రవేశమందు బలాత్కారంగా నిలుచునట్లు చేయసమర్థమైనది. కవితార్కిక సింహనాదం. దేశికులు రచించిన యతిరాజసప్తతి అనే సింహనాదాన్ని వాదసమరమందు

కుతూహలంగల శ్రీవైష్ణవులు ప్రతిపక్షులకు వినిపించాలి. వారు యతిరాజుల పాదాల యందు స్థిరంగా ఉంటారు.

వ్యాఖ్య : యతిరాజ సప్తతిని విన్నంతనే ప్రతివాదులు యతిరాజుల పాదాలను ఆశ్రయిస్తారని వర్ణితం.

ఈ స్తోత్రం అందరికి లాభాన్ని సమకూర్చుతుంది. ఆశలు మదగజాల లాంటివి. మదించిన ఏనుగులు ఇటూ-అటూ స్వైరవిహారం చేస్తాయి. ఆశలు ఇంద్రియ విషయాలలో పరుగెత్తుతాయి. మదగజాల గమన వేగం ఆపరానిది. అలాగే ఆశల తీవ్రత దుర్దమం, అణచివేయడం కష్టసాధ్యం. ఏనుగులు స్నానం చేసిన వెంటనే దుమ్ము-ధూళిని పైన పోసుకుంటాయి. మంచి ఆశలు కోరికలు కూడా వాసనారూపమైన ధూళిచే మలినమవుతాయి. మదగజాల వేగాన్ని దమింపజేయడానికి యత్నించిన వ్యక్తికి హాని కలిగించి ముందుకు పోతాయి. ప్రాపంచిక భోగాల కోసం పరుగులు దీసే ఆశలను విఫలం చేయడానికి ప్రయత్నించే వ్యక్తికి, వెంటనే అవి క్రోధరూపాన్ని దాల్చి అపార నష్టాన్ని కలిగించి ముందుకు సాగుతుంటాయి. మదగజాలను వాటి స్వైరగమనం నుంచి నివర్తింపజేయడం దుష్కరమైనట్లే, మన ఆశలను విషయ భోగాల నుంచి మళ్ళించడం కూడా దుష్కరమే. మన ఆశల సంగతే ఇలాగా ఉంటే, ఇక శాస్త్రవాదకలహంలో మేమే జయిస్తామని ఆర్భాటం చేసే ఇతర సిద్ధాంతపరుల ఆశలు అనబడే మతంగజాల సంగతి చెప్పవలసిందేముంటుంది?

మదగజాలను సింహనాదమే ఆపగలుగుతుంది. దేశికులకు కవితార్కిక సింహమనే బిరుదు ఉంది. ఆ సింహగర్జనమే యతిరాజ సప్తతి.

సింహగర్జన వినగానే మతంగజాలు స్వేచ్ఛగా తిరుగడం మాని, భయంతో పర్వతపాదప్రదేశమందు నిశ్చలంగా ఉంటాయి. 'క్షితిభృత్' శబ్దానికి రాజు, పర్వతం అనీ అర్థద్వయం. పర్వత పాదప్రదేశమంటే పెద్దగుట్ట క్రింద ఉండే చిన్న చిన్న కొండలని అర్థం. భగవద్రామానుజులు యతులకు రాజు. కాబట్టి "పాదేయతి క్షితిభృతః ప్రసభం నిరుంధన్" అనబడింది.

సింహనాదం చెవిసోకగానే మత్తేభాలు భయపడి క్షితిభృత్పాద మందు స్థిరంగా నిలిచినట్లే, 'యతిరాజ సప్తతి' స్తోత్రం విన్నంతనే మన ఆశలు విషయాలలో సంచరించక, యథార్థజ్ఞానం కలిగి, యతిరాజ పాదాబ్జాలను ఆశ్రయించి స్థిరంగా ఉంటాయి.

శ్రీ యామునాచార్యుల వారు స్తోత్రరత్నాన్ని రచించారు. శాస్త్రాధ్యయనం చేస్తున్న రామానుజుల వారి చెవిలో పడేరీతిగా, (వారు వినేరీతిగా) ఆ స్తోత్ర రత్నాన్ని చదువాలని యామున మునులు తమ శిష్యుణ్ని ఆదేశించారు. ఆ రామానుజాచార్యులు ఆ స్తోత్ర రత్నంలోని కొన్ని శ్లోకాలను వినగానే వారికి యాథాత్మ్య జ్ఞానం కలిగి, భక్తి ప్రపత్తులు స్థిరపడ్డాయనీ, తచ్ఛ్రవణ ఫలమే వారి జగదాచార్యత్వ పూర్తికి దోహదపడిందనీ విజ్ఞులంటారు.

అలాగే దేశికులవారు యతిరాజసప్తతిని ప్రతివ్యక్తి వినేరీతిగా అనుసంధానం చేయాలని (ఈ శ్లోకంతో) బోధించారు. పరవాదులతో శాస్త్రార్థ రూపమైన యుద్ధం చేయడానికి ఉత్సహించే విద్వాంసులైన శ్రీ వైష్ణవ వీరులు సింహనాదం లాంటి ఈ స్తోత్రాన్ని ప్రతివాదులకు అవశ్యకంగా వినిపించాలి. తత్ఫలితంగా పరవాదుల దర్పం నశిస్తుంది. యథార్థజ్ఞానం కలుగుతుంది. వారు యతిరాజుల చరణరాజీవాలను ఆశ్రయించి ధన్యులవుతారు. శ్రీ వైష్ణవులు వాద యుద్ధంలో జయలక్ష్మిని పొందుతారు. ఇది ఫలశ్రుతి.

రూపకాలంకారంతో కూడిన దృష్టాంతం. వసన్తతిలకావృత్తం.

**సంస్కృత వ్యాఖ్యా :** అథయతీంద్ర చరణారవింద ప్రావణ్యాతి శయ జనక యతిరాజ సప్తతి శ్రవణ మాత్రేణ పరవాదినః సర్వేనిరస్తా భవంతీ త్యాహ, ఆశేతి.

ఆశా మతంగజగణాన్ – ఆశారూప మతంగజ సమూహాన్, అవిషహ్యావే గాన్ – అనివర్త్యవేగాన్, ప్రసభం – బలాత్కృత్య, యతిక్షితిభృతః – యతిరాజస్య, పాదే, నిరుంధన్ – ప్రవర్తయన్, స ఏషః కవితార్కిక సింహనాదః – కవితార్కికసింహస్య యతి రాజ సప్తత్యాఖ్యః ప్రబంధః, కథా హవకుతూహలిభిః

- వాద రూపయుద్ధకుతూహలిభిః, పరేషాం - ప్రతివాదినాం, కర్ణేకార్యః - కర్ణేశ్రావయితవ్యః, ఏతచ్ఛ్రవణమాత్రేణ సర్వేభగ్నాభవంతీ భావః. సింహనాదేహి గజాస్త్రస్తా గిరిపాదేషు చ సజ్జంత ఇతి చ స్ఫురతి.

**73. ఉపశమిత కుదృష్టి విప్లవానాం**
**ఉపనిష దా ముపచార దీపికేయమ్ ।**
**కబళిత భగవ ద్విభూతి యుగ్మాం**
**దిశతు మతిం యతిరాజ సప్తతిర్నః ॥**

**అర్థం :** ఉపశమిత కుదృష్టి విప్లవానాం = శాంతింపబడిన మతాంతరుల (వలన జరిగే) ఉపద్రవాలు గల; ఉపనిషదాం = ఉపనిషత్తులకు; ఉపచారదీపికా = మంగళదీపికయైన ; ఇయం = ఈ, యతిరాజసప్తతిః = స్తోత్రం ; నః = మనకు; కబళిత భగవత్ + విభూతి యుగ్మాం = అనుభవింప జేయబడే భగవంతుని ఉభయ విభూతులుగల; మతిం = బుద్ధిని; దిశతు = ఇచ్చుగాక.

**తాత్పర్యము :** ఇతర సిద్ధాంతపరుల వలన కలిగిన విప్లవాలు నశింప జేయబడిన తర్వాత ఉపనిషత్తులకు ఉపచారార్థ మెత్తబడిన దీపం వంటి యతిరాజ సప్తతి అనే ఈ స్తోత్రం పఠించే మనకు భగవానుని నిత్యవిభూతినీ, లీలా విభూతినీ అనుభవించే బుద్ధిని ఇచ్చుగాక.

**వ్యాఖ్య :** ఈ స్తోత్రం యొక్క అధ్యేతలకు కలిగే ఫలాన్ని వివరించే శ్లోకం.

శ్రుతి శిరస్సులు ఉపనిషత్తులు. “తుంగై రకృత్రి మగిరః స్వయ ముత్త మాంగైః, యం సర్వగంధ ఇతి సాదర ముద్వహంతి” (గోదాస్తుతి) ‘ఉపనిషత్’ శబ్దం మహతీ వాచకం. మహిళలు సాధారణంగా పూజింపదగినవారు. ఉపనిష ద్వాక్యాలు అపౌరుషేయాలు. ఉపనిషత్తులు ఉన్నతాలైన తమ తలలపైన సర్వగంధుడని సర్వేశ్వరుణ్ని సాదరంగా ఎత్తుకొన్నాయి. తత్ఫలితంగా, ఉపనిష ద్దివ్యకాంతలకు ఆపాదమస్తకం ఆవరించిన దివ్యజ్ఞాన గంధం ప్రపంచమంతట ప్రసరిస్తున్నది.

మతాంతరులు తమ సిద్ధాంతాలను బలపరచడం కోసం ఉపనిషద్దివ్య మహిళలను ఈడ్చుకొని పోయి, తమ కిష్టమైన అర్థాలను వాటికి పులిమి చాలా నష్టం కలిగించినందువల్ల భయంతో గజగజలాడే స్థితి కలిగింది. భగవద్రా మానుజులు ఉపనిషత్తులకు యథావస్థిత అర్థాలను బోధించి వాటికి కలిగిన వెరపుజ్వరాన్ని శమింపజేసి స్వస్థతను కలిగించారు. ఆపదలనుంచి రక్షింపబడిన ఉపనిషత్తులను అభినందించడానికి ఎత్తిపట్టిన దీపమే ఈ 'యతిరాజ సప్తతి' ప్రబంధం. షోడశోపచారాలలో దీప సందర్శనం ప్రముఖమైనది. దీపం తాను ప్రకాశిస్తూ, స్వేతర పదార్థాలను ప్రకాశింపజేస్తుంది. ఉపచారమంటే సేవ, 'యతిరాజ సప్తతి' కుదృష్టి ఖండన రూపంగా ఉన్నా, అది మంగళ దీపమే. చీకటిని తొలగించడానికి చేబట్టిన దీపం కాదిది.

సూర్యుడు ఉదయించిన తర్వాత చీకటి తొలగిపోయినా, దిన సమయాన జరిగే భగవదుత్సవంలో ఉపచారం కోసమెత్తిన కరదీపిక వంటిది ఈ స్తోత్ర ప్రబంధం. రామానుజులవారే పరవాదులను పరాస్తం చేసి ఉపనిషత్తులకు స్వాస్థ్యాన్ని చేకూర్చారు. కాబట్టి విద్వాంసులకు ఈ ప్రబంధం ఉపనిషత్తులకు ఉపచారార్థమై చేబట్టే మంగళదీపతుల్యంగా సిద్ధిస్తుంది.

కబళిత భగవద్విభూతి యుగ్మాం మతిం నః దిశతు : ఉపచార దీపికా ఫలమేమి; అంటే, భగవత్సేవలో – ఆరాధించే సమయంలో – భక్తుడు భగవానునికి దీప ప్రకాశాన్ని కలిగిస్తాడు. భగవానుడు సుప్రసన్నుడవుతాడు.

"యే యథా మాం ప్ర పద్యంతే, తాంస్తథైవ భజామ్యహమ్". అని భగవానుడు గీసిన నియమరేఖ ఉంది కదా! మనమెలా భగవానుని భజిస్తే, ఆయన అలాగే మనను భజిస్తాడు. మనం దీపప్రకాశాన్ని కలిగిస్తే, భగవానుడు మనకు జ్ఞాన ప్రకాశాన్ని కలిగిస్తాడు.

కుదృష్టుల విప్లవం వల్ల ఖిన్నులైన, ఉపనిషద్రూపంగా ఉన్న దేవేరులకు యతిరాజసప్తతి అనే మంగళ దీపమెత్తి సేవ చేస్తే, ప్రసన్నులైన ఆ దేవేరులు జ్ఞాన ప్రకాశాన్ని కలిగిస్తారు. ఉపనిషత్జ్ఞాన ప్రకాశం సామాన్యమైనది కాదు. అది స్వరూప రూపగుణ విగ్రహయుక్తుడైన భగవానుణ్ని, ఆయనకు క్రీడగా

ఉన్న ఈ ప్రపంచాన్నీ (లీలా విభూతినీ), భోగంగా ఉన్న ఆ వైకుంఠాన్నీ (నిత్యవిభూతినీ), భక్తుని వశం చేయగలుగుతుంది. ఈ స్తోత్రప్రబంధాన్ని అనుసంధానం చేసే వ్యక్తులకు ఉభయ విభూతులను కబళించే యోగ్యత కలుగుతుంది. సర్వార్థాలు గోచరిస్తాయి. జ్ఞాన విష యప్రార్థన కమనీయమైనది.

**తత్పాదభక్తి జ్ఞానాభ్యాం ఫలమన్యత్క దాచన।**
**న యాచేత్ ప్రణతో నిత్యం యాచనా న్న శ్యతి ధ్రువమ్ ॥**

'భగవద్విషయమై భక్తి జ్ఞానాలు కలుగాలి' అని ప్రపన్నుడు నిత్యం ప్రార్థించాలి. వేరే ఫలం కావాలని కోరితే మాత్రం హాని కలుగుతుందని శాస్త్రం బోధిస్తుంది. కాబట్టి, మనం స్వరూపాను రూపమైన సర్వార్థగోచరమయ్యే మతిని ప్రసాదించాలని ప్రార్థించాలి.

"భవతు మమ పరస్మిన్ శేముషీభక్తి రూపా" అని భగవద్రామానుజులే ప్రార్థించారు. వారి సంప్రదాయానుయాయులు' యతిరాజ సప్తతి'ని పఠించిననూ, విన్ననూ అట్టి ఫలాన్నే పొందగలుగుతారు. ఫలశ్రుతి ఇది. లుప్తోపమ. పుష్పితాగ్రా వృత్తం. (విషమం)

**సంస్కృత వ్యాఖ్యా :** అథైతత్ ప్రబంధ మధ్యేతౄణాం ఫలమాహ, ఉపశ మితేతి. ఉపశమిత కుదృష్టి విప్లవానాం = ప్రశమిత కుదృష్ట్యు పద్రవానాం, అపార్థకర్షణో పప్లవ రహితానాం, ఉపనిషదాం - వేదాన్తానాం, ఉపచారదీపికా - మంగళదీపికా, మంగళ స్యాతిశయ రూపత్వాత్ ఉపనిషత్ ప్రతిష్ఠాపకా తిశయావహత్వాదు పనిషదామ ప్యతి శయావ హత్వమ్, ఏవం విధా, ఇయం యతిరాజసప్తతిః, నః - స్వాను సంధాతౄణా మస్మాకం, కబళిత భగవద్విభూతి యుగ్మాం - అనాయాస సమ్యగ్విషయీకృత భగవల్లీలా విభూతి నిత్య విభూతి యుగళాం, మతిం - ప్రజ్ఞాం, దిశతు.

74. కరతలామలకీ కృతసత్పథాః
శ్రుతి వతం సిత సూనృత సూక్తయః ।
దివస తారక యంతి సమత్సరాన్
యతి పురందర సప్తతి సాదరా ః ॥

**అర్థం** : యతి పురందర సప్తతి సాదరాః = 'యతిరాజ సప్తతి' అనే ఈ స్తోత్రమందు ఆదరం కలవారు; కరతల+ఆమలకీకృత సత్పథాః = అరచేతిలోని ఉసిరిక కాయవలె చేయబడిన సన్మార్గం / నక్షత్ర మార్గం (ఆకాశం) కలవారై; శ్రుతి వతంసిత సూనృత సూక్తయః= కర్ణభూషితాలైన సత్యవాక్కులు/వేదభూషిత సత్ప్రమాణోక్తులు కలవారై; సమత్సరాన్ = అసూయగల జనులను; దివస తారకయంతి = పగటిచుక్కలుగా చేస్తారు.

**తాత్పర్యము** : 'యతిరాజసప్తతి'ని శ్రద్ధతో చదివేవారు సత్పథమందు సంచరిస్తారు. శ్రీ భాష్యాదిగ్రంథాలను కర్ణభూషణంగా కలవారై, మాత్సర్యం గల ప్రతివాదులను పగటి చుక్కలలాగా ప్రకాశ హీనులను చేస్తారు; తిరస్కార పాత్రులుగా జేస్తారు.

**వ్యాఖ్య : ఈ స్తోత్రాన్ని అనుసంధానం చేసేవారి ప్రభావం వర్ణితం.** యతులకు పురందరుడు అంటే ఇంద్రుడు - రాజు - అని అర్థం. "పురుహూతః పురందరః" (అమరం). యతీంద్రుల వైభవాన్ని కీర్తించేది ఈ స్తోత్రం. దీనిలో డెబ్బై శ్లోకాలున్నాయి కాబట్టి 'సప్తతి' అనబడింది. ఆ పైన ఉన్న నాలుగు శ్లోకాలు స్తోత్ర ప్రభావాన్ని కీర్తిస్తున్నాయి. యతీంద్రులైన భగవద్రామానుజులు లక్ష్మీనాథుడు మొదల్కొని గురుపరంపరగా ప్రాప్తించిన విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని శ్రీ భాష్యాది గ్రంథాలలో ప్రతిపాదించారు. ఈ సిద్ధాంతాన్ని ప్రచారం చేయడానికి దేశంలో (74) పీఠాలను స్థాపించి, శ్రీ భాష్యకారులు తమ శిష్యులైన డెబ్బైనల్గురు మహా విద్వాంసులను సింహాసనాధిపతులను చేశారు. ఈ కారణంగా, దేశికులు ఈ స్తోత్రంలో మొత్తం డెబ్బైనాలుగు శ్లోకాలను రచించారని గమనింపబడుతున్నది. 'యతిరాజ సప్తతి' ని శ్రద్ధతో పఠించే వారు కరతలామలకంగా అంటే సంపూర్ణంగా సంప్రదాయాన్ని తెలుసుకొన్నవారవుతారు. సన్మార్గమందే ప్రవర్తిస్తుంటారు. 'సత్ పథం' అంటే సన్మార్గమనీ, నక్షత్ర మార్గమనీ అర్థం.

**కరతలామలకీ కృత సత్పథాః :** ఈ స్తోత్రాన్ని అనుసంధానం చేసే వారికి నక్షత్రమార్గమైన ఆకాశం, అరచేతిలో ఉన్న ఉసిరికాయ అధీనంలో ఉన్నట్లే, సంపూర్ణంగా తమ వశమవుతుంది. సంపూర్ణ ఆకాశమందు సూర్యకిరణాలు వ్యాపిస్తాయి. సూర్యకిరణాలతో సమానులై అజ్ఞానమనే అంధకారాన్ని తొలగించి జగత్తులో జ్ఞానమనే వెలుగును వ్యాపింపజేస్తారని ధ్వని. సూర్యకిరణాలవల్ల సుదినమై జగజ్జీవనం చక్కగా సాగుతుంది. అలాగే సూర్యకిరణాల వంటి సన్మార్గుల వల్ల లోకం ఉజ్జీవిస్తుందని భావం.

**శ్రుతివతం సిత సూనృత సూక్తయః:** వేదవాణి సర్వజనులకు ప్రియమైనది, హితకరమైనది. సూర్యుడు త్రయీమయుడు, కిరణాలద్వారా సూర్యుడు వేదవాణిని ప్రచారంచేయగా లోకులు విని దాన్ని తమ చెవులకు భూషణంగా ధరిస్తారు. సకల జనులకు కర్ణభూషణంగా ఉండే వేదవాణి సూర్యకిరణాల అధీనమై ఉంది. అలాగే సన్మార్గులైన శ్రీ వైష్ణవులు ప్రియమై, హితకరమైన, వేదాలకు అలంకారంగా ఉన్న సూక్తులను ప్రచారం చేయడం వల్ల లోకులు వాటిని శ్రుతిభూషణంగా చేసుకొంటారు. కాబట్టి శ్రీ సూక్తులు శ్రీ వైష్ణవుల అధీనమై ఉన్నాయి. శ్రీ వైష్ణవులు శ్రీ భాష్యాది దివ్య సూక్తులను కర్ణభూషణంగా అలంకరించుకొంటారు.

సూర్యకిరణాలు వేదవాణిని ఇతరుల చెవుల వరకు చేరుస్తూ తారాపథంలో తారలున్న స్థలం వరకు చేరి తమ ప్రకాశాన్ని వ్యాపింప జేసినప్పుడు వాటికాంతి యొక్క అధిక్యంవల్ల మిలమిల మెరిసే తారల కాంతి – ప్రకాశం – సన్నగిల్లుతుంది. ఆ విధంగానే శ్రీవైష్ణవులు అంతట శ్రీ భాష్యాది సూక్తులను ప్రవచనం చేస్తూంటే పరవాదులున్న స్థలం వరకు ఆ సూక్తులు చేరి పోయి తమ ప్రకాశాన్ని వ్యాపింపజేయగా, తారలవలె పరవాదులూ, పెద్ద పెద్ద గ్రహాల రీతిగా వారి ఆచార్యులు కూడా ప్రకాశహీనులవుతారు. "సమత్సరాన్ దివస తారకయంతి" – అసూయా పరులై ద్వేషించే ప్రతివాదులను పగటి చుక్కలుగా చేస్తారు.

శ్రీ వేదాన్త దేశికాచార్యస్వామి సూర్యసముడు. ఆయన శిష్యులు సూర్యకిరణాలతో సమానులు. కిరణాలు సూర్యుని నుంచి ప్రకాశాన్ని పొంది

తారాపథమంతటా వ్యాపింపజేస్తాయి. అట్లే శిష్యులు తమ ఆచార్యులైన దేశికాచార్యస్వామి నుంచి యతిరాజ సప్తతి' రూపమైన దివ్యప్రకాశాన్ని గ్రహించి ప్రతివాదులున్నచోట అంతటా వ్యాపింపజేస్తారు. చుక్కలు, గ్రహాలు చీకటి రాత్రిలోనే ప్రకాశిస్తాయి. దినమందు ప్రకాశించవు. అజ్ఞానాంధకారం ఆవరించిన ప్రదేశంలోనే తప్ప, యతిరాజ సప్తతి రూపమైన సూర్యకిరణ ప్రకాశం ముందు – ఎదుట – ప్రతివాదులు, వారి ఆచార్యులు తేజోహీనులై అణగిపోతారు. అహో! 'యతిరాజ సప్తతి' స్తోత్రాన్ని చదివిన వారికి ఇంతటి ప్రభావం కదా! ఉపమా రూపకాలంకారాలున్న ఈ శ్లోకం 'ద్రుతవిలంబితవృత్తం'.

**సంస్కృత వ్యాఖ్యా :** అథైతత్ ప్రబంధాధ్యేతౄణాం వైభవమాహ, కరేతి. యతిపురందర సప్తతి సాదరాః – యతిపురందర సప్తతిం – యతీంద్ర సప్తతిం శ్రద్ధా పూర్వకమనుసందధానాః; కరతలామలకీకృత సత్పథాః – సుస్పష్ట సన్మార్గాః; శ్రుతివతం సిత సూనృత సూక్తయః – శ్రుత్యలంకారభూతసప్రమాణోక్తి యుక్తాః సంతః; స మత్సరాన్ – యతివరసిద్ధాంతార్థ విరుద్ధార్థ ప్రలాపినః ; ప్రతివాదినః ; దివసతారక యంతి – దివానక్షత్రీ కుర్వంతి. తిరస్కుర్వం తీత్యర్థః.

**శ్రీశ్రీనివాస కృపయా ప్రాప్తత్రయ్యంత భాష్యతత్త్వేన ।**
**రామానుజేన విదుషా వ్యాఖ్యా యతిరాజ సప్తతేర్విహితా॥**

ఇతి శ్రీరామానుజాచార్య విరచితా యతిరాజ సప్తతి వ్యాఖ్యా సంపూర్ణా.

**కవితార్కిక సింహాయ కల్యాణ గుణశాలినే ।**
**శ్రీమతే వేంకటేశాయ వేదాన్త గురవే నమః ॥**

ఇది శ్రీమాలోల నృసింహస్వామి కటాక్షపాత్ర, హరితసగోత్ర, శ్రీమాన్ కారంచేటి తిరుమల మనోహరాచార్య ప్రథమ పుత్ర, వేంకట రాఘవాచార్య విరచిత ఆంధ్ర 'చంద్రికా' వ్యాఖ్యా సమేత శ్రీమద్వేదాన్తదేశి కాను గృహీత **"యతిరాజ సప్తతి"**.

# ఆర్థిక సహకారం



## మాదాడి కృష్ణారెడ్డి-సులోచన

శ్రీ రామానుజ దివ్య పూర్ణ కృపయా స్వాచార్య నిష్ఠాపరౌ
సత్కార్యేషు సహాయకౌ నయవిదౌ శేషత్వరూపశ్రియౌ ।
కృష్ణారెడ్డి సులోచనాఖ్య విదితౌ దాంపత్య సౌఖ్యాన్వితౌ
వర్ధేతాం యతిరాజసప్తతి కృతే ర్వ్యాఖ్యా ప్రకాశార్థదౌ ॥



శ్రీ శోభన్ కృత్

## శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులు

జననం : విభవ పుష్య శుక్ల ద్వాదశి,
22 జనవరి 1929

జననీ జనకులు : తిరుమల వెంకటమ్మ గారు,
తిరుమల మనోహరాచార్యులు గారు

స్వగ్రామం : నారాయణపురం,
ఎల్లారెడ్డిపేట మండలం,
కరీంనగర్ జిల్లా, ఆంధ్రప్రదేశ్.

వృత్తి : విశ్రాంతాంధ్రోపన్యాసకులు

ప్రవృత్తి : పురాణ ప్రబంధ కాలక్షేపం; దైవమానుషయాజ్ఞికం; గ్రంథరచన,
"శ్రీ నృసింహప్రియ" (Hyd.) Joint Editor

**రచనలు :**

1. మాఘ కావ్య వైభవం - యువభారతి ప్రచురణ - 1983
2. (దేశికుల) 'గోదాస్తుతి' కి పరిమళ వ్యాఖ్య - 1987
3. భగవద్విషయం ఈడు అవతారిక (తమిళానికి) ఆంధ్రానువాదం - 1989
4. భగవద్ధ్యానసోపానం - మనోరమావ్యాఖ్యానం - 1989
5. శ్రీమద్రామానుజులు - వర్ణాశ్రమధర్మములు 1992 (శ్రీ.రా.కీ.కౌ. భాగం 12, గుంటూరు)
6. పాదుకా సహస్రమ్ - రమణీయాంధ్ర టీకా తాత్పర్య వ్యాఖ్యాసహితం భాగం 1 - 1996
7. గరుడ దండకమ్ - సుషమాంధ్ర టీకా తాత్పర్య వ్యాఖ్యాసహితం - 1997
8. ఆళ్వారులు - భక్తిప్రపత్తి మార్గములు - 1997 (భక్తినివేదన - స్వర్ణోత్సవ సంచిక)
9. పాదుకా సహస్రమ్ - రమణీయాంధ్ర వ్యాఖ్య, భాగం 2 - 1998
10. పాదుకా సహస్రమ్ - రమణీయాంధ్ర వ్యాఖ్య, భాగం 3 - 1999
11. పాదుకా సహస్రమ్ - రమణీయాంధ్ర వ్యాఖ్య, భాగం 4 - 2000
12. శ్రీ నారాయణ శతకం, రాఘవీయ వ్యాఖ్యాన సహితం - 2002
13. దివ్యప్రబంధ త్రయి - సాంద్ర టీకా తాత్పర్య వివరణం - 2002
14. పాదుకా సహస్రమ్ - రమణీయాంధ్ర వ్యాఖ్య, భాగం 5 - 2003
15. ద్రవిడోపనిషత్తాత్పర్య రత్నావళి - ప్రకాశికా వ్యాఖ్య (ప్రథమ శతకం) - 2003
16. శ్రీ సుదర్శనాష్టకమ్ - జ్వాలా వ్యాఖ్యాసహితం - 2004

---

*గ్రంథాల ప్రాప్తిస్థానం :*
శ్రీమాలోల గ్రంథమాల, శ్రీ అహోబిల మఠం,
డి.డి. కాలనీ, హైదరాబాదు - 500 013. ఫోన్ : 2742 3043